శ్రీరస్తు

# శ్రీ పట్టాభి రామాయణము.

—*—

## [ ప్రథమాశ్వాసము ]

శ్రీ రంజిల్లగ వామభాగమున శ్రీసీతా మహాదేవి శ్రీం । గారంబై భరతాది సోదరులు సంకాశింప వాతాత్మజుం । డారాధింపగ లోకబాంధవ జుడున్ హస్తంబులం జేర్పగా । నార్తిన్ భక్తుల బ్రోచు రామనృపతిన్ ధ్యానింతు నశ్రాంతమున్ ॥చ॥ తగ గిరిజార్ధదేహమును దాల్పగ రోషము జెంది గంగము । జగములు ముంపజేయ నతిసాహసవృత్తి భరించి మాళి న । మ్మగువను గట్టినట్టి సురమాన్యు నగణ్యు శరణ్యు నాది ప న్నగమణిభూషు శంకరు మనంబున నిత్యము బూజ సేసెదన్ ॥మ॥ మతి బుద్ధ్యంద్రియ చిత్త భేదములు నిర్మాణంబులై యందు సం । కరమై తోచితదాత్మ జన్మకృత సంస్కారాను బంధంబులై । సరియై స్త్రీపురుషాది రూపముల సంసారాబ్ధిలో ముంపనే । ర్పరియైనట్టి సరస్వతీ ధవుని సద్భక్తి న్నుతింతున్ మదిన్ ॥మ॥ రతి ప్రాణేశుని మాత శోభనములన్ రంజిల్లు విఖ్యాత యశా । శ్రిత దారిద్ర్య నఘాత శుభ్రవిలసత్ క్షీరాబ్ధి సంజాత సం । తతదైత్యారి సమేత శ్రీమహిత నిత్యానంద సిణ్ణేత సం । స్తుత లోకత్రయ పూత యైన సిరి నెంతున్ భక్తి నెల్లప్పుడున్ ॥మ॥ ఘన తీగాలక శోభితాననము లోకస్తుత్య సంశీలమున్ । మునిబృందారక మోదము న్విమలమా మూర్తి న్ప్రకాశంబు సా । ధన సంగీత కళాప్రవీణ సుఖదాత్మ నిత్యసాహిత్య బో । ధన మంత్రేశ్వరి వాణి సద్గుణమణిం ధ్యానింతు నశ్రాంతమున్ ॥ చ॥ కనక కనద్విభూషణనికాయము చెల్వలరార నంకుశం । బును శర చాపఖడ్గములు బూని పరాశిరు నాత్మకారణం । బునను వహించి పంచహిత భూతి సమన్విత కార్యరూపయై । ఘనత వహించు శాంకరి సుఖంబులనిచ్చు నభీష్టమీవుతన్ ॥

ఇవ్విధంబున నిష్టదేవతా నమస్కృతియును మహాకవి పురస్కృతియును గుకవి తిరస్కృతియునుం గావించి మదీయ వంశంబభివర్ణించెద ॥

సీ॥ త్రిగుణుండు భాస్కర దేవోపదేశమై యతిశయంబై యొప్పు నాదిశాఖ । కాత్యాయన మహార్షి కారణంబై సకలాగమాంచిత మైన యాదిశాఖ । సూర్యాభి ముఖుడై శోధించి రుక్తి యనుభవ వేద్యమౌ నాదిశాఖ । దివ్యమై మునిగణ సేవ్యమై భవ్యమై యమరవర్ణిత మైన యాదిశాఖ । వరయాశ స్సాంద్రుడగు

ఘట్టువంశ తేజుఁడైన వేంకటకృష్ణయయనగనొప్పు మంత్రిసుతుఁడగు రాఘవా మాత్యమణికి నమిరె శ్రీ వెంకటాఖ్యుఁడతులగుణుఁడు ॥సీ॥ భ్రమరాంబికాలబ్ధ భాసిత మృదు నవ్య కవితా రసజ్ఞత గాంచినాఁడ। సంస్కృతాంధ్ర విచార సార కల్పిత పద్య గద్య చమత్కృతి గలిగి నాఁడ। తాళాది రాగ సందర్భ నాటక వేష జాతీయ విధములు సల్పినాఁడ। మాఘప్రబంధ నిర్మాణ ధౌరేయత విద్వత్సభాస్థలి వెలసినాఁడ। లాలి తాకార మోహ లక్ష్మీలలామ। యార్జితానంద రాజ యోగాంకముద్ర। కలితుఁడను ఘట్టురామ సత్కవివరుఁడు। ఘనత కెక్కెను పదపద్య కల్పనముల ॥క॥ వేదాంత వేద్యమయునకు। నాదాంతర్గత వినోద నలినాక్షునకున్। వేదనుత పాదయుగునకు। నాదేవున కక్షరునకు నవ్యక్తునకున్॥

షష్ఠ్యంతములు.

క॥ త్రిగుణ గుణ సాక్షిభూతికి। జగదా రాధ్యునకు బ్రకృతి సంయుక్తునకున్ అగణిత తేజోమయునకు। సగుణాక్షర కల్పితునకు జలజాక్షునకున్ ॥క॥ నిర్వేదం నిరభిమానికి। బర్వేందు శరీరవర్ణ భాసితునకునున్। సర్వేంద్రియ యాకవర్తికి। సర్వేశున కర్కవంశ జలధి విధునకున్॥ క॥ కారణునకు బహుభవభయ। దూరునకున్ దైత్యహరణ దోర్బలునకును। తారయశ స్సాంద్రునకున్। నారాయణ భానువంశ నర నాథునకునున్ ॥క॥ ధర్మునకు నిత్య నిరుపమ। నిర్మలునకు వేద వేద్య నిర్గుణునకుడు। మర్మ విభేదికి మణిమయ। భర్మాంచిత మకుటునకును భయదూరునకున్ ॥క॥ రామునకున్ జలదనిభ। శ్యాముసకు విశాల శౌర్య సంకాశునకున్। భూమిజా సహితునకును। నామాతుర మంత్రిరామ ధరనాథునకున్॥

వ॥ నానేర్చువిధంబుగా రచియించి, సమర్పించి, పట్టాభిరామాయణంబు అను మహాకావ్యంబునకు కథాక్రమం బెట్టిదనిన, శ్రీమన్నారాయణుండగు శ్రీరామచంద్రుఁడు యొక్కనాఁడు హంసతూలికాతల్పంబున శయనించి యొక్క కలగనెను. అందు సౌమిత్రి నందనుండగు లక్ష్మణుండు దండకాటడవికి వైదేహిం దోడ్కొని పోయి విడిచివచ్చిన విధంబుగా రాముండు స్వప్నంబుగాంచి భయాత్ముండై నిజగురుండగు వసిష్ఠునకు నెఱిఁగించుటయు మునివచనప్రకారంబుగా శాంతికొరకు గోభూహిరణ్యాది దానంబులు సేయుటయు నంతనొక్కనాడు రాఘవుండు సౌధాంత

రంబున సీతామహాదేవితో సరససల్లాపంబు లాడుచుండ మునికన్యలతో గ్రీడింపగోరి జనకాత్మజ వరంబడుగుటయు మహోద్యానంబున రాముండు కేళికాసదనంబు విడిచి యాస్థానంబునకు జనుదెంచుటయు భయాత్ములై మంత్రిసామంత పురోహితా ప్తవర్గంబులు సందర్శించుటయు రాఘవుండు గుప్తచారులంజూచి సీతాదేవిపై నిందేలేమి యని యడుగుటయు వారలు రజకాధములు వల్కిన వచనంబులు విన్నవించుటయు దద్వాక్యంబులు విని రామచంద్రుండు సొమ్మసిల్లి భరతలక్ష్మణ శత్రుఘ్నులం బిలిపించి వైదేహిని వాల్మీకాశ్రమంబున విడువ సుమిత్రానందనుబంపుటయు సీతాలక్ష్మణ విలాపంబును సుమిత్రానందనుం డయోధ్యానగరంబున కరుదెంచుట యు దివ్యజ్ఞానంబుచే వాల్మీకిమహర్షి సీతాగమనంబు దెలిసి తత్సముఖంబు నకు వచ్చి దుఃఖోపశమనంబు గావించి నిజాశ్రమంబునకుం దోడ్కొని వచ్చి పోషించుటయు కుశలవుల జన్మప్రకారంబును నశ్వమేధారంభం బును నవ హయంబునకై చతురంగబల సమేతుండై శత్రుఘ్నుండు రావణాసురుని సంహరింప వెడలుటయు వాల్మీకాశ్రమంబున సంతుష్టాంతరంగులు ఐయున్న కుశలవ కుమారులు పల్లకీ వినోదానందచిత్తులయి వరవశత్వంబున శ్రీమద్రామాయణ కథాసూచనంబు సేయుటయు రామాయణ మహాత్మ్యంబును నవనహయనిరోధంబును శత్రుఘ్నుండు మధుపురంబునకు జని గజతురగస్యందన సమూహంబుతో నిఖిల రాక్షసులజంపి నవనహయంబుంగొనుటయు నాహారార్థియై కాననాంతరంబున సంచరించు లవణాసురుని శత్రుఘ్నుండు తుంచుటయు దత్పురంబు నాక్రమించి శత్రుఘ్నుండు శ్రీరామ సందర్శన కుతూహలుండై సాకేతపట్టణంబునకుం జనుదెంచుటయు నశ్వమేధంబునకు దీక్షవహించుటయు సుగ్రీవ విభీషణాంజనేయాంగద మహావీరు లేతెంచుటయు నంత హయంబుం గొని శత్రుఘ్నుండు నిఖిల క్షోణీతలంబు తిరిగి జయంబుగొనుటయు గంగాతీరంబున లవకుమారుండు హయరత్నంబు బంధించుటయు ననేక సైన్యంబుల సంహరించుటయు శత్రుఘ్నుండు నారాయణాస్త్రంబున లవకుమారుని బద్ధవేయుటయు దద్వృత్తాంతంబు మునికుమారుల చేత విని సీతామహాదేవి శోకించుటయు గాననాంతరంబునుండి కుశకుమారుండు ఫలంబులం గొనివచ్చి దుఃఖించు తల్లినిం గాంచి యూరడించుటయు కుశుండు తల్లిచే దివ్యాయుధంబులు గొని సమరంబున శత్రుఘ్నుని మూర్ఛనొందించుటయు నంగుళీరత్నంబున లవకుమారుని బ్రతికించుటయు హతశేషులయోధ్యానగర మార్గంబుబట్టి చని, శత్రుఘ్నునివిధంబు దెల్పుటయు బిదప ననేకబలసమన్వితుండై లక్ష్మణుండరుగుదెంచి ఘోరయుద్ధంబొనర్చ

సొమ్మసిల్లుటయు నంత ననేకదేశాధీశులతో భరతుండువచ్చి సమరంబున పోరుటయు శోక రోష దందహ్యమానసుండగుచు రాఘవుండు సుగ్రీవ విభీషణ దనుజ వానర సమూహంబు గొలువ రథారోహణుండయి వచ్చి సుతులంజూచుటయు బ్రేమాతిశయంబున విస్మితుండగుటయు బ్రహ్మాది దేవేంద్రాదులు ప్రసన్నులగుటయు వాల్మీకమహర్షి చనుదెంచుటయు సీతా మాహాత్మ్యంబున రథగజతురంగ సమన్వితులయి లక్ష్మణశత్రుఘ్నులును దనుజ వానరులును పునర్జీవితులగుటయు శ్రీరామచంద్ర నరేంద్రుండు సతి సుతాప్త సోదర సహితుండయి హయమేధంబు సేయుటయుంగల పట్టాభిరామాయణంబను మహాకావ్యంబునకు గధాభ్యుదయం బెట్టిదనిన.

## కథాప్రారంభము

సీ॥ దశరథమేదినీధవ తనూజుండయి తపసిజన్నముగాంచి ధర్మమమర। హరుని కోదండంబు నవలీలగ్రహించి ప్రేమతోసీతను బెండ్లియాడి। భార్గవరాముని భజియించిజనకుని యనుమతి గాననమునకునరిగి। ఖరదూషణాదుల ఖండించి మారీచు బరిమార్చిసీతను పంక్తికంఠు। డెత్తికొని పోవ వెదకుచు నేగియేగి। భానునందనుమైత్రిచే బరగిసీత। లంకలోనుంట యెరిగి నిశ్శంకకపుల। చేతసేతువుగట్టించి చెలువుమెరసి। యఖిలనిర్జర బృందమ్ము లభినుతింప॥ వ॥ శ్రీరామచంద్రుండు లంకపయినివిడిసి మంత్రి సుతాప్తవర్గంబుతో దశకంఠునిర్జించి విభీషణునకు శాశ్వతముగా లంకాధిపత్యం బొసంగిన నట్టిశుభముహూర్తంబున విభీషణమహిషియగు సరమ మొదలుగాగల పుణ్యాంగనలు వైదేహికిమంగళాభిషేకంబులు గావించి వస్త్రాభరణ కుసుమగంధాదులనలంకరించి యద్దేవిని రత్నమయశిబికారోహణంబుగావించి శ్రీరామసన్నిధానంబునకుందెచ్చిన నామె నిర్దోషియని రాముండెఱింగియు లోకనిందలదలంచి యాదరునెఱుంగ నగ్నిప్రవేశంబు సేయుమన నింద్రాదిదేవతలు గీర్తింపసుగ్రీవాదికపిసమూహంబులు వెఱగంద విభీషణాది రాక్షస సమూహంబులు గనుంగొన దందహ్యమాన మహాభీలకోలాహలజ్వాలాకరాళంబుల నిడికొని వీతిహోత్రుండు ప్రసన్నుండయి సీత నిర్దోషిగాన నీదేవిం బరిగ్రహింపుమని రామునొడంబరచి యంతర్హితుండయ్యె నంత సీతాసమేతుండయి శ్రీరాఘవేంద్రుండు దివ్య

స్వరూపుండగు దశరథమేదినీధవుం బ్రీతిశుభ క్రీర్త్యాశ్వకంబుగా బూజించి తదనుమతి నయోధ్యానగరాభిముఖుండయి పోవనుద్యోగించి విభీషణ సుగ్రీవాది మహామహులంజూచి శ్రీయయనన్మానంబు గావింపుడన వల్లె యని ॥ఉ॥ రావణసోదరుండు నవరత్నమయంబగు పుష్పకంబునం। భావి తలీల దెచ్చినను భానుసుతాంగద మారుతాత్మజు। ల్సేవలుసేయ నిర్జరులు సేయగ సన్నుతులెన్న సన్మహ। ల్పావనపుణ్యమూర్తి నరపాలుడు పాలుడుహర్షితాత్ముడై॥

అయోధ్యానగరాభిగమనము.

వ॥ సీతాలక్ష్మణసమేతంబు గాబుష్పకారోహంబు గావించి ॥గీ॥ భానుసూనుండు తక్కిన ప్లవగవరుల। భీమ దేహాన్వితుండు విభీషణుండు। సకల రక్షస్సమూహంబు సందడిగల। దేవదుందుభినినదముల్దిశలుమ్రోయ ॥సీ॥ జాంబవంతుడు మారుత్సంభవుండు నిరుభాగంబులందు వెంబడిని గొలువ। గజుడు గవాక్షుండు గంధమాదనుల నీలాంగదులు ముందు నిలిచిరాగ। శతబలి కుముదుండు శరభసుషేణులు వినయవిధేయులై వినుతి సేయ। దారుండు ఋషభుండు దధిముఖమైందులు నట్టహాసస్ఫూర్తినను సరించ। గుపితులై పోరి దనుజులు గూలినట్టి। స్థలములును వారినామముల్ ధైర్యములను। జకజెప్పి చూపుచు సంభ్రమమున। నుదధితీరంబు జేరెరఘూద్వహుండు। ఉ॥ అవనిజ కంటివా విపులమైనది సేతువుదీని వానరు। ల్పవనజ వాలినందను బు భానుజనీలసుషేణ కేసరుల్। గవగజగంధమాధనులుగట్టిరిగట్టిగలంక దాకనీ। భువియిరంగదా బగపిపుంగవుడేపుకనాంజ

బ్రహ్మహత్యరావణరూపంబున రాముని నిరోధించుట.

నేయుడుక్॥ చ॥ అనివివరి పకన్నులకు నచ్చుత మెప్పగ రత్నదీధితు। ల్కనక కిరీటముల్పదియుగల్గి నిశాటుడు రావణుండుతా। ఘనభుజవింశుడై తమర కంఠకుడడ్డమువచ్చినిల్వగా। గనుగొని చోద్యమంది మదికల్పితరోష దవానలంబునక్॥ చ॥ భారిపోరి బుష్పకంబు నటుపోవక నిల్పెనుదక్షిణంబభూ। వరుడుని దేమి రావణుడువచ్చెను ద్రుంచితినంచునుంటి నా। తరమిక కాదు మాయలకు దాగెనొ వచ్చినవాడు పుట్టెనో। తెరువిక నేదియంచుమది దీనతనొంది మహాగ్రహంబునక్॥ వ॥ రామచంద్రుండు సుగ్రీవులని గనుంగొని యిట్లనియె॥ ఉ॥ భానుజరిక్ష రావణుని బంధు సుతాప్తులతోడ ద్రుంచిస। న్మానముతో విభీషణుని బట్టముగట్టితి నేమిచోద్యమో। దానవభర్తయెట్లొ దాగెనొ యిప్పుడుతోవకడ్డమై। పూనెను జూడుపుష్పకము పోవకయున్నదియేమి హేతువో॥ వ॥ అనిడోలాయమానసుండై॥ చ॥ కలుగుచునున్న రాఘవుని గాంచివిభీషణు డేగుదెంచిలో। దలదిమహాత్మ

రావణుడు ధాతకు నాలవవాడు మిక్కిలిన్। బలుకగ నేల బ్రాహ్మణుడు పా
పము రావణరూపమౌచు భూ। స్థలి కరుదెంచి నిల్చె నిక సందియమేల మునీం
ద్రవందితా॥ ఉ॥ నీవు చరాచరంబులకు నేతవుగావున లోకమందు నీ। సేవలు చే
సి నిర్జరులు స్వీకృతవైభవులైరి యింక నీ। భావముతో విరించిని గృపాయతవృ
త్తి భజింపవచ్చి యా దేవుడు దెల్పు నీభయము దీరగ నొక్క యుపాయమంచున్॥

బ్రహ్మదేవుండు శ్రీరామునకుం బ్రత్యక్షమగుట.

౧౯ చ॥ తెలిపిన బుష్పకంబుపయి దిగ్గన భూమికి డిగ్గి భక్తితో। నిలిచి చతుర్ము
ఖుండలపనీరజగర్భుడు రాజహంసపై। వెలసి సరస్వతీభ్రమర వేణిని గూడి ము
నీంద్రచంద్రముల్ గొలువగ వచ్చె రామనృపకుంజరు జేరగ నమ్ముదంబునన్ ॥వ॥
వచ్చి ప్రసన్నుండై రామచంద్రునకు బ్రహ్మదేవుండిట్లనియె॥ సీ॥ పరమేశు నిర్జ
రశరిపాల నానంద వేదాంత వేద్య వివేకశీల। మూడు మూర్తుల కాదిమూ
ర్తివై నిరుపమ నిర్వేద్యుడై నీవె నిత్యుడవగుచు। బరతంత్రు త్రిలోక భయని
వారణమొంచి యక్షరాక్షరములసాక్షి వగుచు। వర్ణత్రయాది మవర్ణమై త
త్త్వమై భవ్యమై వెలిగెడి పరమపురుష। నిన్ను నీమాయ దెలియగా నెన్న దగ
మె। సత్యచారిత్ర రవికోటి సదృశగాత్ర। ప్రణుతజనదుఃఖ పరిహర భవవి
దూర। రఘుకులాంబుధి చంద్ర శ్రీరామచంద్ర॥ ఉ॥ దేశము కాలముల్
నతమె దేహములట్టిదె నీటిబుగ్గలై। భాసిలుచుండు కర్మకృతిపాకశుభాశు
భవృద్ధిబొందగా। నాశలు పట్టియుండు మతియజ్ఞులు నిన్ను క్షరాక్షరుండుగా।
జేసి తలంకనొప్పుదురె సేవితభక్తఫల ప్రదాయకా॥ చ॥ ధ పసుపుత్రమి
త్రవనితాలయ వాంఛలు గోర్చుయించుచున్। మనుగుచు దేలుచుండుదు
రు మూఢులు నేర్చిన విద్యలున్ వృథా। తనువులు త్యజానని ముదంబున నా
శల బొద్దుపుత్తురే। నినుగొనియాడలేను గద నీరజనేత్ర రమామనోహ
రా॥ చ॥ అనిన రఘూత్తముండు తనయాత్మ విచారణ జేసి బ్రహ్మతో। విన
యములాడి రావణుడు భీకరణాంగణమందు దెబ్బెనా। తనిబలుమాయచే న
వలదా గెనో చోద్యముగాగ గండ్లకుం। గనుపడుచున్నవాడిపుడు కారణ
మాత్మదలంచి చెప్పవే॥ సీ॥ కనకరత్నప్రభా కలితకిరీటము ల్దశశిరంబుల
యందు దాల్చువాడు। ఆజానుబాహాల నప్పళించిన హేమమయమైన కే
యూరమణులవాడు। గంధపుష్పాన్విత కందముల్గల వాడు సకలశాస్త్రాస్త్ర
సంచయము వాడు। అతిఘోర గాత్రంబు ననుసరించిన దివ్య చేలంబుగలవా
డు సిద్ధమైన। రథముపై జేకదనవిరాజితముగ। ధనువు సంధించి బాణము
లార్చి నిలిచె। విల్లుగైకొందు నా పీనివివర మెల్ల। దెల్పుమన బ్రహ్మదేవుండు
తెల్పబూనె॥ ఉ॥ దేవపుల స్త్యవంశజుడు ధీరుడు బ్రాహ్మణవృత్తి లేక దు।
ర్భావము చేబరాంగనల బాధలొనర్చుచు గ్రొధితాత్ముడై। దేవుల బోరు

చుండుపర దేశనివాసుల బట్టికొట్టిబలిం । రావడి చేయుంచుడు ఘనరాక్షస
కృత్యము బొందిదుష్టుడై॥ వ॥ తన్నిమిత్తంబున ననేక దేశాంతఃకరణచిత్తుం
డవై వైకుంఠనాథుండవైన నీవు ప్రభున్నుండవై॥ చ॥ రఘుకులరాముడై బలి
మి రాక్షసనాథుని ద్రుంచినావు భూ । ధవులెరుగంగ బ్రాహ్మణుడుదీరదు
దోషము లెట్టివారికిన్ । భవుప్రతిష్ఠసేయగను బాపమువాయును భోగ
మబ్బుశ్రీ । శివుని మంత్రంబు సురసేవ్యముగాదె నరేంద్రచంద్రమా॥
క॥ అని తెల్పి బ్రహ్మవిశ్వానిని । చనినిజలోకంబునకును జనపతియపుడే।
హనుమంతు బిలిచి దయతో । గనుగొనియిట్లనియె మదిని గళగళపడు

రాముండు హనుమంతు గాశికిబంపుట.

చుకా॥ ఉ॥ జానకిజూచిరమ్మనగసత్వసమేతుండవై యనుజ్ఞనుం । బూనిధరా
తలంబుననుభూరిపరాక్రమమొప్పధీరుడై । మానితవార్ధిదాటిఘనమత్సర
మొప్పగ లంకజొచ్చిపె । న్పానికవీథులన్నిటిని పొందగగాల్చిన మారు
తాత్మజా॥ చ॥ కనుగొని మోదమంది జనకాత్మజగా దలపోసి మ్రొక్కి
యో । వనజదళాయతాక్షి యికభావములోవల భేదమేలయా । మనవు
లజుండు సేమమనిమానినికెల్ల నెఱుంగజెప్పియా। వనితహృదంతమంతయు
ను వారకనాకు నెఱుంగజెప్పవే॥ చ॥ తనువుసరక్తపూరముల ధారలుగా
రగ లక్ష్మణుండు మూ । ర్ఛనొలయజూచి కన్నులను రౌద్రతనెఱ్ఱగజేసి
కోటియో । జనములదాటిసంజీవిని జయ్యనగైకొని వచ్చిలక్ష్మణుం । గ
ని బ్రతికించినట్టియుపకారము జేయవె మారుతాత్మజా॥ ఉ॥ కాశికిబోయి
లింగమును గైకొని రావలె బ్రహ్మదేవుకుం। జేసిన లగ్నముల్ వెలయ జె
ప్పెద జాము కటైన మించకన్ । భాసిత పార్వతీధవుగృపాకర మూర్తిని
నిల్వజేసినన్ । వాసియెలర్పగా భయనివారణమౌగద మారుతాత్మజా॥
చ॥ అనిన మహాప్రసాదమని యప్పుడె యంజలిజేసి వాలముం। బెనయగ
బెంచిలేచి మదభీషణ రూపముతోడ దిక్కులం । గనుచుహుటాహుటిం
జనియెగాశికి నందున విశ్వనాథునిన్ । వినుతులొనర్చియంత గపివీరుడున

రాఘవుండు శివలింగ ప్రతిష్ఠచేయుట

ర్మదజేర నాటికిన్॥ ఉ॥ అందున లింగ మొక్కటి రయంబున జక్కగనెత్తి
నెత్తిపై। బొందికచేసి నిల్పుకొని భూమిపయింజనుదేర రాముడున్ ।
ముందుముహూర్తమో లగ్నమనిముచ్చట నచ్చటసైకతంబుచే। బొందికచేసి ని
ల్పెనతి భూరిప్రభావము గల్గులింగమున్॥ చ॥ తరణికులాబ్ధిచంద్రుడు వి
ధానముతోడను జిత్తమందు నోం హరహరయంచు నర్ఘ్యమిడి యాసన
మున్ బహురూపదీపము । ల్మరువక నిచ్చి మానమున మంత్రముచెప్పు
చు బిల్వపత్రములన్ । విరులు ధరింపజేసి పరమేశ్వరు గూర్చినుతించి ప్రా

క్కుచుఁ॥ ఉ॥ శంకరనిన్నునుం దెలియఁజాలక భేదముచేసి యాత్మలో।
మంకువహించి దుర్మతులుపాపసమృద్ధిని బొందుచుండరే। సొంకముభ
క్తితో చరణపూజలు చేసెడివారి ముక్తిని।శ్శంకతగాఁగనూర్పుదయఁజూప్య
నబన్నగరాజభూషణా॥ వ॥ అని వినుతించెదదనంతరంబు॥ చ॥అవనిజలేచి వ
చ్చిపతియందున భక్తిచెలంగపార్వతీ। భవునకు మ్రొక్కి సైకతముభాసు
రమొప్పగ దీర్చిస్కందునిఁ। సవర్ణతోడ పూజలుసల్పియథావిధి ధూ
పదీపముల్। అవిరళభక్తితోనొసగి యాత్మను బ్రస్తుతిచేయుచుండగఁ॥
వ॥ తదవసరంబున నర్మదాతీరనివాసంబున లింగంబొకటిఁ గైకొని నియ
మితకాలం బతిశయించెనని భయకంపితదేహుండగుచుమనోజవంబున వచ్చి
సైకతాకారలింగంబు బ్రతిష్ఠచేసి యభిషేకంబుగావించియున్న సమయం
బున వచ్చిసీతాసమేతుండగు శ్రీరామచంద్రునిం గనుంగొని ప్రణమిల్లి మా
రుతాత్మజుం డిట్లనియె॥ శా॥ దేవా కాశికిఁబోయి యీశ్వరునినే దీవ్రంబు
గా దెస్తినే। భావంబెంచితివో యిదర్థమనుచుఁ భావింపవో నేనునీ। సే
వాయోగ్యుఁడగానొ సైకతముతో శిలంబుగా లింగమున్। గావింపం బని
యేమి దీనికొకటింగావింపు శిక్షుంబునన్॥ చ॥ కనలి మహావిషాదమున
గద్గదకంఠముతోడ నంజనీ। తనయుఁడటాడ రామవసుధాధిప చంద్రుఁడు కౌ
గిలించినా। యనుజుఁడు నీవుకొక్కటియ యర్థముగానిది లేదుపల్కినా।
మనమున వేళయందొగిని మాధవునిల్పి ప్రతిష్ఠచేసితిన్॥ ఉ॥ లింగముపె
ట్టు తొల్లిటిది లేదనిపింపుమనంబునఁగోనను। పొంగుమునిశ్చయంబనిన భూ
రిపరాక్రమ సత్వవృత్తితో। సంగముబెంచియూచి యదియుంగొ రసాతల
మందు నెంచియూ। యిగితమెంచలేక మదినేమిదలంచితి దుర్విచారతన్॥
వ॥ అనిన శ్రీరాముఁ డిట్లనియె॥ చ॥ దశరథరాజనందన విధాతకునైన దరంబె
యూచగా। శశిధరుఁడింద్రుఁడుం దెలియఁజాలరు నీమహనీయశక్తినే। బశు
సమబుద్ధిగావున గృపారసముంచవె మత్తహస్తితో। వశకముపొరునాదు
రభిమానముగాదు సురేంద్రవందితా॥ వ॥ అనిన నాంజనేయునకు దశరథ
నందనుం డిట్లనియె॥

### హనుమంతుడు లింగంబు బ్రతిష్ఠించుట.

ఉ॥ మారుతి చంద్రశేఖరునిమించి మహార్తమునందు నిల్పనీ।
పేరిటనొప్ప భూజనులు భేదముసేయక ముందుపూజవి। స్తారముగాఁగఁజే
యుదురు శాశ్వతమా సుకృతంబుగల్గునీ। తీరమునందు నిల్పుమని తెల్పిన
మారుతి సంతసంబునన్। మ॥ చనిభూతేశునినిల్పి యర్చనలు సాష్టాంగం
బులుం జేసివే। జననాథాగ్రణి చేరె రామవిభుండున్సంతుష్టుఁడై గంధమా।
దనసుగ్రీవ విభీషణాదులను సందర్శించి యీసేతు। బంధనముంజూచిన

వారికిన్ సుఖముగాన్ ధర్మంబు జేయుచుంటన్ ॥శా॥ ప్రాద్ధాదులు బ్రహ్మ
హాత్యలు మహాపాతకంబులు బ్రాయునీ । తీరంబందువసించి రేవిమరలం దీ
ర్ఘావగాహంబుచే । ధారాళంబగు సర్వభోగము కరస్థంబై మహారోగము ।
త్సైరంజాలదు భూజనంబులకు వేచేయుచుబుణ్యాంబులున్॥ వ॥ అని యను
గ్రహించి సీత లక్ష్మణ సమేతంబుగా ననర్ఘ్యరత్న ప్రకాశంబగు పుష్ప
కంబుమీాద వేంచేయ నిజకులప్లవగ ముఖ్యులుతేని బ్రహ్మాండ భాండంబులు
చిటిలిపడ వివిధధ్వానంబు లొనర్చుచు సింహనాదంబులు సేయుచురాగ
వినతాంగద మైందద్వివిదులు నిజసైన్యసమేతులై నలు లనడువ బుష్పకోపరి
పార్శ్వంబులయందు వివిధరత్న దగద్ధగాయమాన స్యందనంబుపై శ్రీరా
మాంతః కరణప్రాప్తాలంకార పట్టాభిషేకముదిత చిత్తుండగుచు విభీషణుం
డసుదేర మహాభయంకరాకార కాయంబులుగల నిశాచర బృందంబులు
నిజశతాంగ మాతంగతురంగదు రంగసింహశరభశార్దూలవాహనులై పరుసుగ
దాకుంతతోమర చక్రభిండివాల కోదండాద్యాయుధంబులు ధరించికొలువ
మెండుకొనికళంబులుతండోపతండంబులై పరివేష్టింపవిశదముక్తారత్ననిబద్ధమ
ఖచిత హేమస్తంభోజ్జ్వల మరకతాలంకృత తోరణవిరాజిత రథంబుపై కపి
కులాధీశ్వరుడగు సుగ్రీవుండుత్సహించి నడువ సేతుబంధనిర్మాణ దక్షుండగు
నలుండుసఖులదనుజాంతకుండగు హనుమంతుడును సమీపంబున విమానప్ర
గ్రహంబు వించుచునడువరఘువంశజలధి చంద్రుండగుశ్రీరాముభద్రుండు సీతాము

శ్రీరాముండు సీతకుం దాను వెదకిన వృత్తాంతంబు చెప్పుట.

ఖావలోకనంబు సేయుచునిట్లనియె॥ సీ॥ జనకజనిను శాసి సౌమిత్రియును నేను
వెదకుచువచ్చియీావిపినమందు । బక్షివల్లభునకుబరలోకక్రియ దీర్చి శబరికోరి
కెల్ల చక్కబఱచి । పంపాకాన వల్లవచ్ఛాయాతలంబున బవళించియుండ
నీ పవన సుతుడు । అరుదెంచి నాదు వృత్తాంతంబు గనియు వినిపోయి
కపికుల విభునిమాకు । సఖ్యమొనరించె వాలిని సంహరించియతనిసామ్రా
జ్య లక్ష్మికి నర్హుడయిన । భానుసుతునకు గపిరాజ్య పట్టమపుడు ! కట్టితిని
గంటె కిష్కింధగమలనేత్రి॥ వ॥ అనినసీతామహాదేవి మహోల్లాసంబున
శ్రీరామచంద్రుని జూచి యిట్లనియె॥ క॥ తారానారీమణియని । పౌరులు
వల్కుచురు చూడవలెనని మదిలో । గోరిక లుప్పొంగెడినా । వారిజదళ
నేత్రబిల్వ బంపుము వేగన్॥ అనినవిని, ఉ॥ భానుజుజూచి రామనరపాలుడు
వల్కెను సీత కోరితినీ । మానిని జూడగోరినది మానుగ బిల్వగ బంపుమం
చువే । నానతినివ్వ నెంతయును హర్షము తోజలజాప్తజుండు (శ్రీ) । మాని
తుడైన యంగదకుమారుని బంపెను దారదెచ్చుటన్॥ వ॥ అతండునతిత్వరిత
గమనంబున సాల రసాలకింశుకాశోక పున్నాగ తమాలహింతాల జంబు

## సుగ్రీవుండు వనుదనంగనుండు తారంబిల్వవచ్చుట.

జంభీర సింధూక మంజుళ హింజులా వకుళ సరళ చందనపిచు మందమందా రతిందుక మాకంద కందరాళ సాల్వశాల పల్లవిత పుష్పిత ఫలిత సల్లిలిత వివిధ నికుంజపుంజ వనా నందకరంబును రత్నసౌధాంతర స్ఫటిక వాటికా మౌక్తికాలంకృత వేదికాభిరామంబును నగు కిష్కింధాపురంబునం గపి కుల రాజ్యలక్ష్మి స్వరూపిణియగు తారాదేవిం గని యంగద కుమారుం డతి భక్తి ప్రీతిపూర్వకంబుగా నభివందనంబులు గావించిన॥ ఉ॥ మొ్రొ క్కిన నందరుంగదిసి మార్కొని దీవచలిచ్చి రాఘవుం। డెక్కడ నున్న వాడు। దనుజేంద్రుని రావణుసైన్య యుక్తునిన్। సుక్కడగించినాడె రవిసూనుడు లెస్సగనున్నవాడెగా। యక్కమలాక్షి సీత మనుజాధిపు గూడి సుఖంచియున్నదే॥ వ॥ అనిన నంగద కుమారుం డిట్లనియె. సీ॥ జన యిత్రిలక్ష్మణ సహితుడై సుగ్రీవ హనుమదాదులుపోయి యపుడు మాల్య వంతంబుపై నున్న వసుధీశునకు మొ్రొక్కి యను గుణ్యుడై మన యర్క సుతుడు। కపులనుపంపె నల్దిశలకు మారుతియును నేను గొందఱు నొకర నరిగి। దక్షిణంబున వనధరణీధరంబుల వెతకి కాననమున వెతల నొంది। తిరిగి సంపాతిచెప్పగా దెలిసి మారు। తాత్మజున్డప్పు డమ్బుధిదాటిలంక। జొచ్చి పురవీధు లన్నిట జిచ్చువెట్టిజనకజను జూచివచ్చెను సంభ్రమమున చ॥ అతని మహాకరాక్రమము నద్భుత మన్దుచువచ్చి లంకలో। క్షితిసుత లెస్స నున్నయది సిద్ధము రత్నము మీకుగాన్కగా। మతినిదలంచి యిచ్చెనని మారుతి మేమును మొ్రొక్కనిల్వభూ। పతిహరిపించి మెచ్చెమన భానుజు డంతట గార్య మెంచుచున్॥ ఉ॥ సేతువు గట్టిపోయె గపిసేనల తోడను లంకకోటపై। గోతులు నెక్కి సౌధములు కూలగదన్ని కవాట రత్నసం పాత నికేతనంబులను భగ్నముసేసి నిశాచరోగ్రతేజులై। ఘాతలుచేసి త త్పురము గాల్చిరి దైత్యులు తల్లడిల్లగన్॥ సీ॥ ధూమ్రాక్ష యూపాక్షదు ర్దభౌదుల ద్రుంచి భద్రాసురుని నేల పాలుసేసి। కుంభ నికుంభుల గుంభ కర్ణుని నతికాయు మహాకాయు గలంగజంపి। యింద్రజిత్తుని నిజహితుల తో సమయిన్చిదశకంఠు నిర్జించి గయచెలంగ। లక్ష్మణసహితుడై లంకాధి పత్యంబు ప్రియముతో నొసగి విభీషణునకు। భూతనూ జనుగూడి సం పూర్ణ చంద్రుని। పగిది బుష్పకమెక్కి సంభ్రమము మెఱయ। సకల నిర్జర

## తార సీతకడకు వచ్చుట.

గణములు సన్నుతింప। గదలివచ్చెను రాముడు కపియుతుండై॥ క॥ జన కజ నినుజూచెదనని వినయంబుగజల్కె రామవిభునకు సుగ్రీవునియా

నతిసే తెంచితి । జననీ రమ్మనగ దార సంతోషముసన్॥ క॥ పసగలపల్లకి
లోపల । గుసుమాయుధ దంతియనగ గూర్చుండగన। ద్దెసలను గపిసైన్యం
బులు। ముసురుకొనం బ్లవగచంద్రముఖు లిరుగడలన్॥ సీ॥ తారహార పటీర
ధవళాభ్ర శుభ్రము ల్గాడిబడ ముత్యాల గొడుగులమర । బరిశుద్ధ స్ఫటిక
సత్ప్రపాణరుచినిభ రమణీయమగు చామరములు వీవ । ఘన వజ్ర భూషణ
కలితహారంబులు కమనీయ వక్షభాగమున మెఱయ । సాహనీయ సుం
గారవల్లి కాం కుసుమములు వేణిభరంబున వేడుకలర। రఘుకులాంబుధిచంద్రుగు
డౌ రామభద్రుదు। కార్యకరణున్న సుగ్రీవవర్యుకీర్తి। కాంతి మోహనసదా రశృం
గారహార । ఘనగుణాకారక్షీరసాగరవిహార॥ అరుగుదెంచి॥ చ॥ కినకవిచిత్ర
రత్నపరికల్పితభూషణవస్త్రమాల్యములన్। జనకజరాములక్ష్మణుల సన్నిధినిల్పి
నమస్కరించి యో । వనజదళాయతాక్ష ముని వందిత దుష్టవినాశనార్థమై ।
జననము నొందినావు సురసన్నుత శ్రీహరిగావవే ననున్॥ చ॥ జనకజపీవుపావ
నివి సత్యము శ్రీసతివౌదువమ్మయో । మసకొనియాడ నేర్తును మహాంబుధి
క న్యకనీమహాత్మ్యమున్। మునిసురయక్ష కింపురుష ఋఖ్యులకైనను వేద్యమా
నుభూజనులనెంతవారునినుసన్నుతియింపన్నన్ను మొక్కెదన్॥ క॥మనమును
క్షీరాంబుధిలో।జనియించినారమక్క చెల్లెలవరిసై।కనికరముదోచి యిరువురు
ఘనపుష్పంబెక్కి నడువ గాకుస్థుండున్॥ సీతాదేవిం జూచి యిట్లనియెన్॥ సీ॥
ముదితజూడ వెఋష్యమూకాద్రిపంపాసరోవర బును మునిస్థావరములు।ఖర
దూషణాదుల ఖండించి యిక్కడపై డిజింకయుబట్టుకడిన తావు।అదె పర్ణశాల
యో యంబుజనళ నేత్రి గోదావరీతీరమందు చిత్ర॥ఫలభరితంబులు పలుపు
ర మదగర్వఘోరాసురుల నేలగూల్చినాము।చిత్రకూటాద్రి యిదెచూడు
చిగురుబోడి । భరతశత్రుఘ్నులాత్మలో భయమునొంది । వచ్చి ప్రార్థింప
గాలేదె పట్టమునకు। నదె భరద్వాజుడను మానియాశ్రమంబు॥ ఉ॥ జాన
కికంటివా స్ఫటికచారు మణీమయ గోపురంబులన్ । మానిత కుంభముల్గ
గనమండలచుంబిత రత్నదీపితుల్యాభరుకులాది కాన్పృవ ప్రభావప్రసాదము
లంగణంబుశ్రీ । మానిత వైభవాస్పదము మంచి దయోధ్యకు మొక్కు

శ్రీరాముండు భరద్వాజాశ్రమంబు బ్రవేశించుట.

కోమలీ॥ వ॥ అనుచునివ్విధంబునంజనుదేర మహర్షి యగు భరద్వాజుండు
తెలిసి విమలమతులగు శిష్యులంబనిచిన శ్రీరామచంద్రుడును సీతాలక్ష్మణ
సమేతంబుగా దదాశ్రమంబు బ్రవేశించి నమస్కారంబులుగావించిన నుచి
తాసనంబుల నుండ నియమించి మునీంద్రుం డిట్లనియె। సీ॥ భార్గవేశనీశౌర్య
సాహసంబులనెంచ దరమానె జూడ విధాతకైన। హరువిల్లు విఱచుచో
యనుజున్నతో గూడి దండకాటవి యందు దైత్యపతుల । హరియించుచో

వాలినడచి సుగ్రీవునిపట్టంబుగట్టుచో ప్లవగవరుల। గూడిసేతువుగట్టి కుం
భినీతలమున దైత్యులజెండాడి దనుజవిభుని। కూల్చుచో దేవ గణములు
కూడిజూచె। నప్పుడె లంకాధిపట్టంబునసురకొసగి। దేవితోగూడి దివ్య
లు దేజరిల్ల। వచ్చితిరి మాదు భాగ్యంబు వసుమతీశ॥ చ॥ విమలతరప్రభా
వమున విష్ణునివాసముగాగ సౌధముల్। గమకమునైన వేదికలు కాంచన
దీపితమైన గేహముల్। సమమగుచంద్రకాంతమణిశాలలురమ్యములై స
కుడ్యముల్। నచురిక చేసె రాఘవుడు నద్భుతమొంద మునీంద్రుడెంతయున్
సీ॥ భూమిజతో గూడి భూపేవిదోడ్కొని నగరిని నిలిపెను నళిన హితుని।
సుతుదారతో మహా శూలలతో నొక భవనమందుంచె సంభ్రమముతోడ
రావణానుజుడయిన రాక్షసాధీశుని కనక హర్మ్యము నందు ఘనతనుంచె।
నంగదభల్లూక హనుమదాదులకును విమలగేహమ్ములు విడిదిజూపె। భక్ష్య
భోజ్యంబులును లేహ్య పానీయములు। మేలుకలివంటకంబులు మృదుల
పక్వ। ఫలములును నేతిబూరెలు పాలుపెరుగు। నుంచివిందొనరించెను
నిమిషమునను॥ చ॥ కనక మహాంబరంబులును గంధము మాలికలాదిసొమ్ము

రాముడు హనుమంతు నయోధ్యకు బంపుట.

లున్। జనకజ కిచ్చి తారకును స్వర్ణకటంబులు రత్నహారముల్। వినుతి
నొనర్చి యిచ్చి కపివీరుల నెల్లను నాదరించుచున్। ముదమున మోద
మంద రఘుమాన్యునితోడ మునీంద్రు డిట్లనున్॥ చ॥ భరతుడు తల్లులాప్తు
లును బంధులరాజ్యము మాని మౌనియై। గురుతుగ నున్నవాడు మది
గోరి దవాగ్నినిజొత్తునంచు నే। ర్పరచినవాడు నేమవునొ పంపుము శీఘ్ర
ముగాగ నొక్కనిన్। బుధము కైన మొంచిదని భూపతి మారుతి జూచి
యిట్లనున్॥ శా॥నందిగ్రామము జేరి తత్పురమహీనాథుండు నెచ్చోయనో।
బందంబంతయు దెల్పి సోదరులు నాశైలంబుపైనుందురో। యందైయుం
దురొ కాంచి క్షేమములతో హర్షంబు గావి పుపో। ముందేమారుతి యుం
చు బల్కనతడు నామోదంబుతో మ్రొక్కుచున్॥

వ॥ వచ్చుచున్న సమయంబున నచ్చోట॥ సీ॥ భరతుడప్పుడు వగం
బడునాలుగేడులు నిండెరాముండెందు నిలచినాడొ। మాయావులసురుల
మాయలదగిలెనో విపిన మధ్యంబుల దపసియగుచు। నెందు బోయెనొ నా
మనమొల్లెటుంగ వచ్చు ననిమేషపూరి యత్నుడగుచు। శత్రుఘ్ను
గనుగొని సాకేతపురికిని రాజువైయుండు నే రాముదలంచి।వహ్నిజొచ్చెదని
కబొరిణవాయువులను। నిలుపగూడదు జగమెల్ల నీరసంబు। గాంగదోచె
ను శ్రీరామ గతియెగాని।యెందుకతి మతిలోన నే నొల్లననుచు॥ చ॥ భరతుం
డువల్కె నిట్లనియె, కట్టణమేలను సంపదేలయా। కరిహయసైన్యరత్నముల

కాంక్షలు నేటికి రామభద్రుఁడే తిరుగ రాఁడో యేమయిరో తీవ్రమహానల
మధ్యమంబునన్ । జేరవలెఁగాని దేహములుమోచుట నీచముగాదె సో
దరా॥ వ॥ అనిభరతుండు॥ ఉ॥ తమ్మునికౌఁగలించుకొని తల్లడమందుచుఁ
గండ్లనశ్రువుల్ । గ్రమ్మఁగ రామలక్ష్మణులు కామినిదోడ్కొనిపోయి కా
నలో। నెమ్మనిలెంగనొందిరొ యశోకనిపులెంపున జిక్కియుందురో। యి
మ్మహినెంచిచూడ ననియిద్దరుశోకపయోబ్ధి దేలుచున్॥ ఉ॥ రాముడు స
త్యసంధుడు విరాజితతేజుఁడు రాఘవేంద్రుఁడో । భూమిజయేమియై చనెనొ
భూరిపరాక్రమశాలి లక్ష్మణుం । డేమిగన్నవాఁడొ మనుజేంద్రులు నం
గనధైర్యశీలురై। ప్రేమముచేతనావలికి జొచ్చిరొ యేగుహలందు నుందురో॥
వ॥ అనితలంచి॥ చ॥ గుహుఁబురస్కరించుకొనకుండలమేర్పడఁజేసియందు
లో। దహనుడుతీవ్రమై వెలుగఁదామునదిజలపూతదేహులై। విహితములైన
దానములు వేగమె సద్విజకోటికిచ్చి యీ। యిహసుఖవర్జులై కముక నిచ్చఁ
దలంచుచునున్న యత్తరిన్॥ చ॥ కనఁగొని మారుతాత్మజుడు కల్పితధూ
మ మహానల ఋభూ । వని కలమెల్లఁగప్ప నతి వాయుజవంబున వచ్చుచు
న్నహో। జనపతి రామలక్ష్మణులు చక్కఁగ వచ్చిరి నిల్చిచూడుమీ । వన
ములు మానినాఁకను పావకమందున దూఁకనేటికిన్॥ వ॥ అని కూయు

### హనుమంతుడు భరతునిగాంచుట.

చువచ్చి చేరి దండప్రణామంబులు సేసి నిలుచున్న పవనపుత్రునిం గౌఁగ
లించుకొని భరతుండిట్లనియె॥ మ॥ పరమాప్తుండవు ప్రాణరక్షకుడవై
పవిత్రాత్ముఁడవైనావు భూ । వరుఁడౌ రాఘవుఁ డెందువచ్చె నిజమా భాషించితే
చూచితే। మఱి తీవ్రానలమందు నాత్మతనుని యామైత్రకార్యంబుఁ జేసెదో ।
తెలియగల్గ స్వివరింపు రామవిభుఁ డేదేశంబులోనుండెనో॥ అని॥ అతనికివస్త్ర
మాల్యము లనంతధనంబులు భూషణంబులు । న్నుతతరణమైన నాగములు వే
డుకతో ధవళాశ్వయూధము ల్మతికమ్మైన రత్నములు మంచిదుకూలముల్లి
చ్చి ప్రేమతో। నతని బురస్కరించుకొని యాదరణాతిశయంబు సేయఁగన్
చ॥ భరతునిజూచి వాయుజుఁడు భానుజనీల విభీషణాదులుం । గరమనురక్తి
తోఁ గొలువ గామినిఁ దోడ్కొని వచ్చి ముందుగా। వరముని యాశ్రమంబునకు
వచ్చెనునిన్నసమస్తభూజనుల్ । హరుషమునొందవచ్చునిట కాత్మదలంపు
ముదిశ్చయంబుగాన్॥ గీ॥ పవనపుత్రుఁడ సుగ్రీవుమంత్రివరుఁడ। రాజసాం
తకుఁడైన శ్రీరాముబంట। నంజనాదేవి మాతల్లియై చెలంగు । క్షేమములుచెప్ప
వచ్చితి క్షితివరేణ్య॥ క॥ అనవిత్తగించి భరతుడు । మనమున మోదించి రా
మమహీపతి యేయే। వనములు తిరిగెనొ యేయే। పనులను గావించెదెలియ
బల్కుమహాత్మా॥ చ॥ అతఁ డెటువంటివాఁడొ మఱియాతని తమ్ముఁడు నెట్టి

వాఁడో భూ। నుతచెలువంబదెట్టిదియొ చోద్యముజూచితివా యదార్థమా।
మతిహరుషింపరామవిభు మానితక్షేమము సెప్పినావు సం। గతిగలుగంగ
బొత్రితుపు జగంబులలోన బ్రసిద్ధవృత్తిగాన్॥ వ॥ అనిన హనుమంతుడిట్లను

హనుమంతుడు భరతునకు రామవృత్తాంతంబు జెప్పుట.

సె॥ గీ॥ పాకశాసనంగి మీకుసంభ మమునీలు। విభుడుసౌమిత్రిసీతయు
విపినసీమందు దపసివరులకు నభయదానములొసంగి। యసురశిక్షకుడై వ
చ్చి యవనియందు॥ సీ॥ పంచవటీతీర భాగంబునను నొప్పు పర్ణశాలయొన
ర్చి భాసురముగ। బంట్లకై సౌమిత్రి పరగెంచిసూర్యుని ఖడ్గంబుచేత రక్క
సుని దునిమి। కదలగానెఱిగి రాక్షసి శూర్పణఖ రోషవభీణంబున వచ్చి దా
పహరుని। మోహింపనే మిత్రిము గోపమున లేచి యంగహీనము జేసియా
నుపబోయి। ఖరునికిఁ జెప్ప విక్రమకలితధైర్య। వీరవరులను పదునాల్గు వేల
రథుల। గదసి సాగరమునకంపకరులగుచు। వచ్చుచుండగ రఘువరవల్ల
భుండు॥ వ॥ ఆసహాయంబున లక్ష్మణుగాంగొని॥ ఉ॥ తమ్ముడనై శ్రమున్దొ
లియదారాగ నివచ్చెను మిన్నుమన్నునే। కమ్మగ సీతతో జనుము కానన
సీమకు రక్షణార్థమై। యిమ్మహిమీద నిల్పెదను నిమ్మశరమ్ములు ప్రైగ్ర
వృత్తితో। బొమ్మనివిల్లు చేకొని విభుండుడు నిల్చెను యుద్ధభూస్థలిన్॥ చ॥
అతని మహోగ్రకాంతికి ననంతధనుర్ధరులైన రాక్షసుల్ మదిలోనెది సూ
ర్యుడొకొ మాధవుడోయని శంకించుచున్। చతురత ధ్వముల్ డపసాగగ
గొందఱు శూలహస్తులయి। జతనము సేసి కప్పుకొన జాపశరంబులు పట్టి రాము
డున్॥ సీ॥ ప్రళయాగ్నికణములు కడిరీతిగ శస్త్రవర్షములు గురిపించి వజ్ర
కవచ। ములదించి తూణీరములు ద్రుంచి తోమరగదలు తుత్తుమురులుగాగ
మొత్తి। రథములచె డాడి రథికులబరిమార్చి సూతేంగ హయములవాదమ
డంచి। సమరభీషణమై సాయకంబులచేత ఖరదూషణాదుల గదిసిమూ
డుఘడియ లేపో విక్రమౌర్యవనజ। వీరులనువారలను జంపి వేడ్కనుండె।
నంతసీతానతిని గొంచు నరిగిపార్శ్వ। తాత్మ్యుడై లక్ష్మణుండును తన్ను గొలిచె॥
వ॥ తదనంతరంబ శూర్పణఖ॥ ఉ॥ లంకకుబోయి రామవిభు లావును జానకి
రూపు జెప్పని। శ్శంకత లేచి రావణుడు స్వర్ణవిభాసితమైన యిట్టిని। పాం
కము చేసి కంపగను భూసుతగోరిక తీర్చునంచునా। పంకజమిత్రవంశజుడు పా
ణిధరాయుధ భాసమానుడై॥ క॥ బెడిదముగ వెడలి చూడవిని। విడిపడి మృ
గము పుడు పోవ వెనకలి వెలిగా। నడుగులు పెట్టుచు దనుజాని। బన్నైచినసి
తయంచు బడెనదియూ వెసన్ వ॥ ఆమాటవిని సీత యిట్లనియె॥ ఉ॥ వింటి
వో లేదో వాక్యములు వేగమె లక్ష్మణపోయి రాముని। న్వెంటనె తోడి
తెమ్మనిన విస్మయమానసుడయ్యు గానలుం। గంటక భూరిశైలములుగాం

చుచుఁబోవఁగ జంతితాళ్మరై యై। యింటఁగిగాఁగసీత యటులుండఁగ రావణు డేగుదెంచి౯॥ సీ॥ దశశిరంబులవాని దర్శించి జలజాక్షి భయమందిమూర్ఛతో పడఁగఁజూచి। రథముపై నిడకొని రావణుండరుగఁగా బత్తింపు శ్రీశద్ధము వడినఁజంపి। భూరిభయాత్మయై పురములునగరముల్ జలనిధి దాటినిశ్చయముతోడ। లంకలోనికిఁబోయిలంకిణిఁబిలిపించి వెలతుకనొకచోట నిలువఁబనిచి। యు౦డెనిట రామచంద్రుండు నుగ్రదైత్యుఁజంపివచ్చుచు నెదురలక్ష్మణునిఁగాంచి। యేటికరుదెంచితనఁజెప్పనేర్పఁడంగ। దేవికోవంబులక్ష్మణ దేవుడపుడు॥ క॥ తనపర్ణశాలలోపల। గనుఁబాఱఁచి గానలేక కళవళపడుచు౯। భ్రమనొంది నేలమూర్ఛిలి। తమకము గాపుకొనిలేచి తత్తరపడుచు౯॥ ఉ॥ ఓజలజాక్షి నీవిచట నుండక పోయితి చర్మమిప్పుడే। తేజముతోడ దెచ్చితిని దీని బరిగ్రహియింపవేటికే। రాజసమేలనే లలనరాముడుగాఁని దోఁచియున్నదో। మోజుదలచి రావెయొక ముచ్చటదెల్పవె ప్రాణవల్లభా॥ సీ॥ నినుబాసి నిమిషంబు నిలువనేరండని తెలియదా నాతోడఁబలుకరాదె। యె

శ్రీరామచంద్రుఁడు సీత గానక పరితపించుట.

క్కడఁబోయిన నెదురుగావత్తువు రా కేలయున్నావు రాజగంధి। యేలోకమునకును నేగితెపోనియ్య నాలోకమేనాకునబ్జనేత్రి। పువ్వులుగోయఁబోతివో వంచించిదానురుడుగైకొని యరిగెనే పొ।కోరిగోదావరీమహాతీరమందు। పోలతుకలఁగూడి క్రీడకుఁబోయినావా। నన్ను భ్రమియింపనెచటనున్నావో సీత। రావె యనిలేచి పిలచుచు రాఘవుండు॥ చ॥ తరుణిరో నీవులేనిది వృథాయయితోఁచెడి భూమియేల రా। పురములు నేల రత్నమయ భూషణచేలములెల్లనేలబం।గరుబిగిరాజహంసమణి కాంచికలాప విలాసమధ్య మం।దరదరహాస హాస్యవిబుధామర వందిత భూతనూభవా॥ సీ॥ ఆననాతిశయంబు నబ్జరాశికినిచ్చి తాల్మితోఁగమనంబు దంతికిచ్చి। భావింపమోవిబింబఫలంబునకునిచ్చి యలసత నెఱికురులళులకిచ్చి। కమనీయమగుకరకౌశలశ్రీము లతతాతులకునొసగి సుధారసంబు। పలుకుచిల్కలకిడి తళుకైనచెక్కులు నిల్వుటద్దములందునిలిపి నీవు। నెంపఁబోయితోఁపల్కు పూర్ణేదువదన। రఘుకులంబున జనియించి రామనామమమరఁగాంతారసీమను నతివ నొప్పఁగించి పోయినజగతిలో గెలిగాదె॥ వ॥ అనియివ్విధంబున బ్రహ్మణ్య తేజుండగు శ్రీరాఘవేంద్రుఁడు సీతావియోగవిరహ డోలాయమాన మానసుండై లక్ష్మణుండును దానును వెదకుచు మహాపర్వతారణ్యదేశంబు లతిక్రమించిపోవుచు॥ సీ॥ సంపూర్ణకిరణుఁడై చండభాస్కరులీలనున్నాడులక్ష్మణయుగదవృత్తి। సాంద్రపర్ణవిశాలశాఖాన్వితంబులౌ స్థిరతరుచ్ఛాయల జేర్చినిలుపు। మన్నభానుండేత దనితలంబగనొనెబొంకము

గా రాత్రిపొద్దుగలదె । వలనొప్పగా బాలపాత్రింబు గలిగిన వాడవు నీ
డనిభ్రమింగిదోచె। నధిప యాదిత్యుడైనను నతడు శుష్క । మూర్తి నైయుండు
వలె లోనమృగము పొందె । నసగవినిశితఖడ్గ శాపపూర్ణయుక్తిరిట సర్వ । సద్గు
ణోపేత గురుసుత జనకజాత॥ వ॥ అనిచెప్పిదుఃఖించుచు॥ చ॥ అనుజుడుగా

శ్రీరామచంద్రుండు ఋష్యమూకగిరి కడకు వచ్చుట.

ల్వ రాఘవుడు వచ్చుచు శోకదావాగ్ని గాలుచున్। జనిపిదపన్ మతంగముని
శాలలుదాటి ఫలప్రసూనముల్ । దనరగబ్రహ్మదేవుండు ముదంబున నీర
ముబోసి సాకెనో।యనగ రసాలభూరుహా మునల్లన జేరిరి రామలక్ష్మణుల్॥
వ॥ అప్పుడు నారింజూచి సుగ్రీవుండు। సీ॥ శరశరాసనహస్తులు కరములధరించి
వచ్చినఋషులో భూవరులో వీరు। వాలియనుజ్ఞను వసియించియుండిన మోహ
నముండగఋష్యమూకమునను । వారినెఱింగిరా వాయుసుతాయన నా
గాతయంచునే నరుగుదెంచి । దశరథాత్మజులకు దండముల్ గావించి యెం
దుండివచ్చితి రెవరుమీరు । శోభితాకారులయినట్టి సురలొనరులొ।దేవకే
సరి పుత్రుండ మనుజవర్య॥ వ॥ అనిన శ్రీరాము ననుమతంబున॥ సీ॥
లక్ష్మణుం డిట్లను లలితమూ సాకేతపురి వరధీశుని పుత్రవరుడు । రవివంశ
తేజుండు రాముండు తనతండ్రి సత్యంబునిలువ భూజాతతోడ। బంచవటీతీ
ర ప్రాంతంబుసందుండ గలుషాత్మకుడు దేవకంటకుండు । మమ్మునుపవం
చించి మగువనెత్తుకపోవ వచ్చిమతంగుని వలనదెలిసి । భానుసుత సఖ్య
భావము ల్భావమందు । దలచియున్నాడము నినుజూడ ధైర్యశక్తి । విక్రమం
బులుగలిగెను విమలమతివి । యతనికిని మాకుసఖ్యంబు లమరజేయు॥ వ॥
అనిన నేనును॥ క॥ కమలాసనుండు చెప్పిన । క్రమమున నీభూషణములు
గనపడెమాకు । విమలాత్ములార దూతను । సమరంబులగోలు
చుచుండు సాహసమవారన్॥ వ॥ అని నేనప్పుడు ముక్కి. భాను

సుగ్రీవుండు రామునితో స్నేహించుట.

జునితో నాద్యంతము దెల్పింవే । దన లింకేలను సీతలంపు నొదవన్
దైవంబు శ్రీరాముడై। చనుదెంచెన్ ననిచెప్పి పిల్చుకొని విశ్వాసంబుబుట్టిం
చి భూ। జననాథుంగొనిరాగ భానుసుతుడున్ సాష్టాంగము ల్సేయుచున్॥
మ॥ జననాథోత్తమనిన్నుజూడకలిగెన్ సామ్రాజ్యముల్వచ్చెనా । తనువు
న్నీదనియంచు ధైర్యమునసీతాదేవినిందెత్తు భూ । జనముల్మెచ్చగ సప్త
సాగరముల్ స్వాధీనమైయుండు నే । పురసైన్యములు పెక్కుగాకలవు
కోపోదగ్రులై వానరుల్॥ సీ॥ అని సఖ్యముగ గొంతయాడి కిష్కింధకువ
చ్చిసుగ్రీవుని వాలితోడ । సమరంబుసేయగా సంధించి దివ్యాస్త్ర మేసి

వాలినిగూల్చి యెల్లరాజ్యభారంబు సుగ్రీవుపాలుగానొనరించి కపులసం
ఖ్యలతోడ గదలిపోయి। దిక్కు-నకొకలతో ధీరోత్తములబంప నేనుదక్షిణ
దిశకేగి నేను। నిచ్చ జలనిధి దాటియు జొచ్చిలంక। శంకలేకను లంఖిణి
జంపి రాత్రి। నగరమెల్లను శోధించి నలినముఖికి। క్షేమములు దెల్పి
ముద్రికం జేతగొంచు॥ ఉ॥ క్షేమము జెప్పలేని వనపీడకు రక్షకులైన రాక్ష
స। స్తోమము జేరి యార్చుచును జుట్టినదల్పగ ముష్టిదెబ్బచే। సావజ
ఘోటకాయుధ విశారదశత్రుల నుగ్గుజేసిబ। ల్విడుముతోడ లంక పురవీ
ధుల నార్చుచు నున్నయత్తతిన్॥ గీ॥ మేఘనాథుండు బ్రహ్మాస్త్రమేయ
మూర్ఛ। గతినిబడియున్న సంధించికరిసరోష। కలితుడైపట్టి రావణుకడను
నిలుప। నసురనాథుండు రావణుండాగ్రహమున॥

హనుమంతుండు రావణునిం దూలనాడుట.

ఉ॥ వానర దేవదానవులపార పరాక్రమమందు భీతులై। కోనలు
వట్టినారు జనకోటియు లక్ష్యములేదు మత్తుడై। కానకవచ్చినాడ విటగా
ర్యములేమి యొనర్చుదువు నీ। మానముగాతు జెప్పుమన మన్నన క్రోధ
దవాగ్ని దేలుచున్॥ మ॥ వినరా రావణ దుష్టచిత్తుడ వివేకంబేల లేదా
యెరా। జనమాన్యుండు సురేంద్రరక్షకుడు నీస్వాంతంబులో దోచకన్।
జననిం దేవగునో యిదర్మమగునా సైరింతువా నిల్తువా। జనగా ద్రోవ యి
కేదిరా శిరములం జెండాడు గాండంబులన్॥ మ॥ అవురా రావణ యింక
మీదవినుమా యాడంబరంబేల భూ। ధవుడౌ రాముని బంట వాయుజుడను
ద్ధామ ప్రతాపాగ్నిచే। భువిలో దుర్మదకపోడు నీశిరములన్భోగంబు సం
తోషమున్। జనసామర్థ్యము మ్రిగ్గుగర్వమడచున్ సత్యంబురా రావణా॥
ఉ॥ శివకోదండము ద్రుంచి దైత్యవరులన్ శిక్షించుచునుర్విపై। రవిచంద్రా
దులు చూడ వాలినణచెన్ రాజ్యంబు సుగ్రీవునిన్। ధవునిం జేసెను వచ్చు వానరు
లతోడం డెత్తి నీలంకపై। భువిలో జొచ్చిన మిన్ను బ్రాకినను నాభూభర్త పో
వచ్చునే॥ చ॥ అనిన మహోగ్రరౌద్రమున నాదను జెందు ద్రిదు మంత్రికోతి నిదు
నిమెడ పీడుగర్వమున ద్రోచిన వన్నియు జెప్పెమిన్నకే। వినవలెనేల పుచ్చుమును
వేగమె గాల్చి పురంబులోపలన్। ఘనముగ ద్రిప్పుడన్నలయ కాలుగరీతిగ లేచి
రాక్షసుల్॥ వ॥ లేచి హనుమంతు వాలంబునకుం దైలపటంబులు చుట్టియనలం
బు దరికొల్పిన॥ సీ॥ కార్చిచ్చుతగులగా గర్జించి బంధముల్ విదళించికొని మహావీర
వరులదునిమి సౌధములపై దుమికి కోటలు దన్ని కనకనిర్మితరత్నఖచితమైన।
హర్మ్యంబులను గాల్చి యరదముల్ విదళించి విద్రుమస్తంభముల్ విఱిచివైచి।
యగ్ధరాసుల చూరలని చల్లి ప్రాసాద నివహంబులను ద్రొబ్బి నివురుచేసి। క
లితరత్నంబులైకొని కపులగూడి। వచ్చి రఘుపతి గని మ్రొక్కి వారిజాక్షి। సు

సుఖముగానున్నదన భానుసుతునితోడ। వార్ధికడకేగె రఘువంశవర్ధనుండు॥ గీ॥ రావణానుజుండు రాక్షసాధిపుచేతం। ద్రోయంబడుచు భూరిదుఃఖియునను। శరణటంచు వేడ సంరక్షణముచేసి। కట్టెదనుజరాజ్య పట్టమపుడు॥ ఉ॥ వారధిగట్టి లంకవయి వా రులార్వగ ఘోరరాక్షసుల్। వారణఘోటకాయుత విభాసిత రథ్యములందజేయుబై। చేరిరణంబునందున వశీకృత తేజములొప్ప దైత్యులం। బోరిహతంబు సేయగను భూవర పంక్తిముఖుండు ధీరుండై॥ చ॥ జగడముచేసి రావణుడు సైన్యసమేతముగాగ నప్పుడే। జగతినిగూలె నంత దనుజాధిపుతమ్ముని రాజ్యలక్ష్మికిం। దగునని నిల్పి భానుసుత దానవభర్తలు గొల్వవచ్చెనీ। తెగువదలంపసేల యని తెల్పంగం గైకసుతుండు ప్రీతితోన్॥ వ। సంతుష్టాంతరంగుండై శత్రుఘ్నునకు నిట్లనియె॥ ఉ॥ నీవు పురంబుజొచ్చి సువినీతుల మంత్రులబిల్చిశీఘ్రగా। ద్రోవలు చక్కబెట్టుమని తోరణవంక్తులుగట్టి సేనకుం। దావుల సెర్పరించి ధనధాన్యసమృద్ధులుజేసి శీఘ్రమే॥ రావలెనంచు బల్కగను రాజసమొప్పనతండు వేగమే॥ సీ॥ సాకేతపురిజొచ్చి సౌధాగ్రమణిమయ కలశంబులనునెత్తి కాంచనాతి। శయనికేతనములు చలువచప్పరములు విమలమాల్యాంచి విద్రుమముల। బోదెలుసంధించి పూర్ణచంద్రికలందురం గవల్లికలొప్పరచిత హేదు। పాత్రసాదలతుల విభాసితంబుగజేసి రంభాదులనునిల్పి రాజమంత్రి। వరులహయగజర థములవారితముగ పటహదుందుభి నినదము ల్వ్రబలసకల। జనులసందడి గైకొని సంభ్రమమున। నన్నకును మ్రొక్కి యొగ్గియు నాయితంబు॥ వ॥ లయ్యోగని విన్నవించినం

భరతుడు రామునెదుర్కొనుట.

గ్రన్థ॥ చ॥ భరతుడుపైనమై సకల బంధుజనంబులు మంత్రులొప్పలున్। హరిగజ రథ్యముల్నడువ నంబుధులేకములైన రీతిగా దొరలు బురోహితుల్ భటులు దోయజనేత్రులు నిండిభేరిభూ। ధరముగలంగ సైన్యము లపారముగా జరు దెంచుచుండగాన్॥ సీ॥ అఖిలలోకాధీశు లరదముల్ప్రకటించి ముందు యోజనములు మూడునిండ। మహనీయభద్రశ్రీమత్తేభయూధము ల్పర్వతాకారమై ప్రబలిరాంగ। దురగముల్కదలించి పరదారుపట్టిన కరవాలముద్గర గదలబూని। నడువగా బహుకేతనములు విస్ఫుట మొప్ప నందలంబులుకొన్ని యరుగుదేర। గీతవాద్యాదినృత్యము ప్రీతిచేయు। బాలికామణులొకవంక బలసిరాగ। సమరవిక్రమ భటులెల్ల సందడింప। వందిగణమెచ్చరికసేయ వచ్చెనతడు॥ ఉ॥రాముని పాదకంబులు విరాజిత మొప్పగ దెచ్చి పూజచే సేమముచేసి రామువికొనినిల్పిశిరంబునం బాదచారియై। భూమిపయింజనంగ ఘనభూషణ

కాంతులుగుల్క బాలిక । ల్బామరతేయఁగ్రిక్కిరిసి సైన్యముఁగొల్వఁగఁబో
వ నచ్చటన్॥ ఉ॥ వచ్చెను రాఘవుండు మణిభాసి పుష్పకమెక్కి నాత్మ
లో । మెచ్చవిభీషణాదులును మేలని భానుజ నీలవానరుల్ । హెచ్చరికల్గ
గంబలుక హేతువ్రమంచి దటంచుగొందఱున్ । ముచ్చటలాడఁగా బ్లవగ
ముఖ్యులు నిక్కుచు నిల్చిచూడఁగన్॥ సీ॥ కుముదుఁడు తారుఁడు కో
టిసంఖ్యలుగొల్వ విభవసాంద్రంబుగా వెడలిరాఁగ । గంధమాధనుఁడు నం
గదమహాఖ్యుఁడనంత కపులతో నడుమనుదగిలిరాఁగ । బనసుండు శతబలి
ప్లవగముఖ్యులు నూఱుకోట్లబలంబుతో కొలచిరాఁగ । జాంబవంతుఁడు లక్ష
సాహస్రిసంఖ్యలు భల్లూకములతోడ బలసిరాఁగ । గజుఁడు గవయుం
డు ఋషభుఁడు కరముశౌర్య । సాహసులు వెంబడింపగా సత్వమమర ।
లక్ష్మణుడు సేవజేయ నీలాభ్రవేణి । రమణితోఁగూడి చనుదెంచె రాఘ
వుండు॥ చ॥ అదె బహుసైన్యసంఘములు హాటకరత్న పతాకదీధి
తుల్ । అదె గజబృంహితంబులు నటంచును ఘోటక సైన్యఘోష
ముల్ । అదె చతురంగనిర్ఘటము లంచిత మొప్పఁగ దూర్యనాదముల్ ।
అదె భరతుండటంచుఁ గపులందఱు పల్కుచువచ్చుచుండఁగన్॥ వ॥ ఇచ్చ
ట భరతునకు మారుతాత్మజుం డిట్లనియె॥ ఉ॥ కంటివె నీవు యా సుమణి
కాంచన పుష్పకమధ్యమందు భూ । కంటకుఁడైన రావణుని గయ్యములోఁ
దెగటార్చి నిర్జరుల్ । మింటలు నిల్చి చూడఁ గపివీరులు మోదమునొంద
సీతచే । యంటిన నిత్యవర్ధనుని నాగమవేద్యుని రామభద్రునిన్॥ వ॥ తద
వసరంబున దేవగణంబులు దివినుండి కల్పద్రుమానేక సౌరభనవపుష్పస
ముదయంబు గురియింప రంభాద్యప్సరసలు నృత్యంబులుసలుప మహాస
ముద్రంబులు పొంగిన తెఱంగున వానరసమూహంబులా నిశాతంబులు
నిండి వెల్లువలై రాఁగ విభీషణాది నిశాచర బృందంబులు గ్రమ్మఁకొని సా
కేతపుర సైనికులు విపులరథ మహోగ్ర గాత్ర మత్తమాతంగ గంధవా
హ గమన తురగాధ్యారూఢులై మొనఁగొని నానావిధభజనభాషణకో
లాహల కలకలశబ్ద ధ్వానంబులమర నిటలతటఘటితాంజలిపుటులునై, భ
రతశత్రుఘ్నులు హనుమత్సమేతులై చనుదేర రత్నమయవిమానంబు గ
గనతలమార్గముననుండి మెల్ల మెల్లన మహావైభవంబుతో పృథ్వీతలంబున
కువచ్చి నిలువ నలనీలగజగంధమాదనులు మార్గానుసరణిగా బరాబరు
లు సేయ విభీషణ సుగ్రీవాంగదులు సన్నిహితస్థానంబుల నిలిచి వినోదిం
ప దారాదిపుణ్యసతీలలామంబులు జనకజాసహితులై నిలువంబడ భూరి
భేరీరవంబులు నిండుకొని ప్రచండంబుగా మ్రోయ బాలపల్లవ జటాకలా
పభూషణ పరమేశ్వరసద్మశవిగ్రహాండమును నాజానుబాహులతావిభూత

శతకోటికందర్ప సౌందర్యవిరాజితుండును మందస్మిత వదనారవింద కందళితుండును నాకర్ణాంతవిశాలలోచనుండును నగణ్యతేజో విలసనుండును బ్రహ్మ శ్వేద వినుత పావన పదయుగళుండును మహాపురుషుండునునగు శ్రీరామ చంద్రునింగనుంగొని భయభక్తిపూర్వకంబుగాఁ దత్పాదసరోరుహంబులకు భరతశత్రుఘ్నులు పునఃపునః ప్రణామంబు లాచరించి పరమపావనియగు సీతాదేవికిఁబ్రణమిల్లి యతిగౌరవంబున సౌమిత్రింగరంబుల నెత్తికౌఁగలించి సుగ్రీవ విభీషణాదులకు వినయోపచారంబులు సమర్పించి యానందసమ గ్రభాషలాడుచు నందిగ్రామపురంబు ప్రవేశించి.

## శ్రీరామచంద్రుఁడు నందిగ్రామంబున నిలుచుట.

సీ॥ భరితాదినిర్మిత పాత్రిభవ వరరత్న సదనంబునను రామ చంద్రుఁ డొరు నిలిచి సుగ్రీవ నీలాంగదాదులు కమనీయులై వెన్ను గదిసియుండ। లంకాధినాథుండు లక్ష్మణుండును భక్తి జేఁ బ్రక్కనిల్వ మారుతాత్మ । జుండుముందరనుండ శోభితుండై జాంబ వంతుండుగజుఁడును బ్లవగవరులు । హెచ్చరింపఁగ జాకిరీతవుగలిగి । తారకొలువంగ దనుజులుద్దండవృత్తిఁ దవిలిసేవింప నెతయు ధర్మకీర్తి । సాంద్రుడై యొప్పె శ్రీరామ చంద్రుఁ డచట॥ గీ॥ పావనంబైన నవరత్న పాదుకలను। దెచ్చి సముఖంబుననునిల్పి దేవ రాజ్య। భారమువహించియీదివ్య పాదుకలను । గొనుమటంచును మ్రొక్కి భరతుఁడు వినయమమర॥ క॥ మనతండ్రియైన దశరథ । జనపతి వరమెల్ల జెల్లె సత్యాత్మకయా । ఘనరాజ్య భారమెల్లను । గొనుము ధరావరులు సురలు గోరినుతింపన్॥ గీ॥ చిత్రకూటాఖ్య పర్వతసీమయందు। నేను బ్రార్థింప బహునాలుగేండ్లు తండ్రి । శాశ్వపద్ధతి తిరుగాడివచ్చి రాజ్య భార మందెదవంటి భూపాలతిలక॥ చ॥ వరమునొసంగుమీ జడను వల్కలము ల్దగదింకరత్నభా । సురకటకాంగదంబులు బ్రిసూనములుం గనకాంబరం బులున్ । నరులలరంగదాల్చు జననాయక యాశ్రితభక్తరక్షసం । గరప రిపూర్ణధైర్య జనకాధిపనందన ప్రాణవల్లభా॥ చ॥ అనినానొకింతసేపు తన యాత్మనుయోచనజేసిమంచిదే యనిన వసిష్ఠసన్మునులు నచ్చుటహోమము లాచరించుచుం । ద రసహస్రధేనుయుతదానములున్విధిపూర్వకంబుగా । గొనకొని చేసిరచ్చటను కోవిదులెల్లను సంతసిల్లగన్॥ వ॥ తదనంతరంబ యందుగొందఱు నేర్పరులు శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులుధరి యించిన జటాకలాపంబులు దిద్దు లువాయగోరంజేరి సుముహూర్తంబున॥ సీ॥ లావణ్యశృంగార లలనామణిశ్రేణి మంగళంబులు పాడ మహితమైనఁ। పంచమహావాద్య భరితమొప్పారగాసంభ్రమింగితైలము ల్పరగనంటి । యంటినపిమ్మట నటకోదకంబుల స్నానముల్గావించి చంద్రశాలి । పటములు

నవరత్న భాసితకేయూర మకుటము ల్మకరకతమణులుదివ్య।పతకములురత్న
సరిపెణ ల్వజ్రమయము । లమరముత్యాలహారము లతిశయిల్ల । గంధక
స్తూరి కర్పూరగంధులగుచు । జనకజనుగూడిశ్రీరామ చంద్రుఁడొప్పె॥
వ॥ ఆసమయంబున నతండు॥ గీ॥ పుష్పకమునకు వినతుఁడైపోయి యిం
ద్రి । సఖుని జేరుము నేనును స్మరణసేయ । నందునాలస్యముండక నాత్మ
ణమున । వచ్చిపోవలెనని జెప్పి పంపెనంత॥ సీ॥ శకటషోడశయుత శతకోటి
కింకిణీ ఘనవినాదంబులు గ్రిందుకొనఁగ । బరిపూర్ణజవసత్వ తురగములి

## శ్రీరాముం డయోధ్య కరుగుట.

రుదెస శతసంఖ్యలమరగా వితతమునను । గనకనిర్మితరత్న కలశసహస్ర
ములొప్పెదట గేసరిరూపములుసహింప । పగడాలపట్టెల నిగనిగనీలాల
లలితవరూధము లలకుణముగ । దెచ్చి సారధినిలుపగ దేవతోడ । గూడిర
ధమెక్కి వేంచేయ కోటిసూర్య । కాంతులుప్పొంగ కపికోటికదిసిసదువ ।
రాముడరుదెంచె నిజనగరమునకపుడు॥ క॥ ఛత్త్రంబు బట్టభరతుడు । శ
త్రుఘ్నుఁడు లక్ష్మణుండు చామరమేయ । స్నేత్రోత్సవమున కపికుల ।
ధాత్రీధవులనుసరింప దరలుచునుండెన్॥ వ॥ ఇవ్విధంబున సాకేతపట్టణస
మానీత రథగజాశ్వ సందోహంబులు పూర్వోత్తర సముద్రంబులై ముం
దుగాబరతేర శ్రీరామపదధ్యానపారీణుండైన నిషధాధీశ్వరుండగు గుహు
నింబురసరించుకొని ధనుర్ధరులై షోడశసహస్రంబులంగూడి చనుదేర
భానుజ నల నీలసుషేణ కుముద గంధమాదన పనస దధిముఖాంగద హ
నుమదాదులు క్రిల నఖదంష్ట్రా వాలాభీల రోమభీమానల నేత్రభుజబల
యుతులై యిరుపార్శ్వంబులం గ్రిందుకొనపరిఘ గదాశూలచక్ర తోమర
భిండివాలపరశు కరవాలాయుధధరులై యఖండవిక్రమ కలితతేజులగు ని
శాచర సముదయంబుగూడి విపుల తేజోవిరాజిత హేమస్యందనారోహ
ణంబొనర్చి నిజమంత్రిసమేతంబుగా విభీషణాదులు వెంబడింప శ్వేతపీతనీ
లవర్ణాశయ విశదమాణిక్య కలిత ఛత్రధ్వజ విరాజితంబుగా రోదసీకుహ
రభేదనంబుగా దుందుభిధ్వానంబులు చెలంగ నహల్యాశాపవిమోచన త్రి
పురహరమండిత కోదండఖండితదోర్దండ బలప్రవర్ధనావంశతి భుజబలస
మన్విత దశకంఠదుర్దమగర్వనిగ్రహణ పరాక్రమోపార్జిత కార్తవీర్యార్జు
న సమరవిజయ భార్గవరామవిపుల పరాక్రమారణ్య కుఠారాపితృవాక్య
పరిపాలనాతిశయసుశీలా చతుర్దశ సహస్రస్యందనఖర దూషణత్రిశిరనిజశర
నిమిషభంజన మహాబలసమన్వితా వాలిసంహరణా ప్లవగాది సుగ్రీవరాజ్య
ఫలప్రదాయకా సేతుబంధనాతిశయ మహావీరావేశ ప్రకాశ సపుత్రమి
త్రదశకంఠ లుంఠనప్రతాప యశోవిరాజిత విభీషణలంకారాజ్యప్రదాయ

కాప్రసన్నవిగ్రహా యనియనేకవిధంబుల గీర్తించుచు వారలుముందుగా
కొందఱు చనుదేర మొందగమునంబున నికుంజపుంజ లతానంతఫలపుష్ప
శోభిత సరయూనదీతీరోత్తరభాగ విశ్వకర్మనిర్మిత ధగద్ధగాయమాన గో
పురప్రాకారఘోర పరిఘాభీలమణిగణ కవాటతోరణ హేమసౌధాగ్రప్ర
శస్తరత్న ప్రతిఫలితచిత్రితప్రతిమాలంకార రమానందకరంబునగు న
యోధ్యానగర ప్రవేశంబుగావించి॥ ఉ॥ అచ్చటి రత్న సౌధములు నంబర
చుంబితగోపురాగ్రముల్ । అచ్చటిసాలభంజికలు హాటకచిహ్నితమైన గే
హముల్ । అచ్చటి చంద్రకాంతమణులందు ప్రసిద్ధములైనభీతులున్ ।
అచ్చటిచిత్రవేదికలు నాపురవీధులు జూచి యేగుచున్॥ సీ॥ ఎక్కడజూ
చిననింద్రనీలప్రభాకలితగేహముల సంకాశములును । సందడిగొనగ
న్న హెచ్చులౌచంపక సహకారమల్లికా సంభ్రమములు । నెచ్చటనిలిచిన
హెచ్చైననవరత్న ఖచితమౌప్రాసాద కలశములును । నేపథులీక్షింప హిత
వృత్తిలక్ష్మికి నాటపట్టగుహేమ హర్మ్యములును । వెలుగు వజ్రాలతలు
పులువిద్రుమముల । బోదెలుప్పొంగ మణిగణభూషణము । గాంచనాంచిత
కలశములక్కళలుదేర । వారలుచూచి సంతోషవార్ధిదేలి॥ వ॥ తద్రా
జమార్గంబుల ననుసరించివచ్చుచున్న సమయంబున॥ మ॥ పురకాంతామ
ణులెల్లభోగమున సంపూర్ణాతిసౌజన్యతా । సురసౌందర్య వయోవిశేష
ములచే శోభిల్లహేమాన్వితాం । బరరత్నాంచిత భూషణావళుల భాస్వ
ద్విగ్రహాకారులై । హరుషంబందుచు దివ్యసౌధములపై నాత్మల్లగన్నిల్వ
గన్॥ సీ॥ మదనమోహనవిభు మంత్రశక్తులో రాజహంసలోనవకుసుమా

పురస్త్రీలు శ్రీరామప్రముఖులజూచి వర్ణించుట.

స్త్రీతతులో । రేఖమించినచంద్ర రేఖలో యపర జీ బొమ్మలో చందనభూ
రుహములో । రంజితంబగురత్న రాసులో కర్పూర దీప్తులో శంభాది దేవస
తులో । కమనీయమగుజీవ కళలో కిరంబులో యష్టదిక్పాల కానందసఖు
లో । యనగ దత్పురకామిను లధికభక్తి । జారుమౌక్తిక రాసులుస్వర్ణపా
త్రిలందు గైకొని యున్నతహర్మ్యములను । నెక్కినిలుచుండి సేసలదిక్క
జూడ॥ చ॥ కనుగొనవేలనాంగి శుభనాముడు వాడెవసన్న రామభూ । జన
పతిపట్టాభిషిక్తమున సర్వసమృద్ధివహించి లంకలో । ఘనబల శౌర్యధైర్య
జయకారణ రాక్షసనాశనుండుస । జ్జనపరిపాలుశీలు బహు సైన్యసమే
తుని జూడవే చెలీ॥ క॥ వనచరులు నూటముప్పది । ఘనసంఖ్యలు గొల్వ
ముందుకదలెడివాడే । యినసుతునిమంత్రి కుముదుడు । కనుగొనవే పవను
డిదిగో కమలదళాక్షీ॥ సీ॥ అర్బుదసంఖ్యలు నతిశయమైరాగ గంభీరుడైన
ఘనగదుడువాడె । దశలక్షమర్కట దళముతోకగా నతడుజ్యోతిర్ము

ఖుఁడతివకన వె । పద్మమహాపద్మ భల్లూకములగూడి వచ్చెఁగదే జాంబవం
తుఁడితఁడె । ప్లవగవల్లభులు నేబదిలక్షలమరఁగా గంధమాదనుఁడొప్పె కంబు
కంఠి । నూరులక్షలవానర వీరవరుల । జేరివచ్చెడువాఁడు సుషేణుఁడదిగొ । శ
తబలినిజూడు వెనుకను సైన్యమైతె । నేలయీనినచందాననిలిచెలలన॥ చ॥
నరసుతుఁడైన రామ నరనాథుని చిత్తము సంతసిల్లఁ సం । గరజయశీలుఁడై ప్లవ
గ శారణరాజ్య విభూతి చెంది । ముందరగపికోట్లసంఖ్యలు ముదంబునఁగొల్వ
గవచ్చె మన్న భూ । వరుని ప్రతాపభాస్కరుని భానుజుఁ గంటివె కోమలీమణీ॥
మ॥ సపాదంబులనిల్పి రౌద్రమున సాక్షాద్వీరరుద్రాకృతిన్ ॥ ధరణీగర్భము
చంచలింపగ వడిం దానబ్ధిలంఘించి యా । సురలుం జూడఁగ రాక్షసాధిపు మ
హాశూలాయుధోపేతులన్ । శిరముల్ ద్రుంచిన మారుతాత్మజుని సచ్ఛీలా
న్వితుం జూడవే॥ చ॥ రమణియుఁ గాఁగ లక్ష్మి రఘురాముఁడు విష్ణువు వైరమే
ల యీ । రమణిని నిక్కమటన్నవిని రావణుఁడాగ్రహవృత్తి దన్న నా । క్రమము
నుఁజింతతోఁ పతిని గాంచి వచించియు రామభద్రుచే । సమరిన పట్టముం గొనిన
నార్యు విభీషణుఁ జూడు భామినీ॥ సీ॥ ఆహారనిద్రాదు లయిన సుఖంబులు
మాని రాముని వెంట మహదరణ్య । భూములు గనుఁగొంచు భూరిశిక్రియశక్తి
చాపాయుధంబులు సంగ్రహించి । యతికాయు గర్వాంధమడచి మాయావి
వేగా యింద్రజిత్తుని ద్రుంచి రౌద్రముగను । కంపనాకంపన క్రౌర్యులదును
మాడి దనుజవాధుల నెల్ల దునిమి కీర్తి । సాంద్రుఁడై వచ్చె నిర్జరుల్ సన్నుతింప ।
గనకమయమైన దేహసంకాశమలర । గనకమకుటాంగదంబులు గళలు దేర
జేర జేరినలక్ష్మణవీరు జూడు॥ క॥ పదునాలుగేఁడులడవిని । గదలక తపమాచ
రించి ఘనమమరంగా । ముదమొప్పఁ జూడు భరతుని । సదయుఁడు శత్రుఘ్ను
డదిగో జలజాతముఖి॥ చ॥ సురముని పోషుఁడై దైత్యకులశూర శిరోహరణైక
దక్షభా । సురశరచాపధారణుని సూర్యకులాభరణున్ దయాబ్ధి సుందర
ముఖచంద్రభాను శుభధాము యశోవిభవాభిరాము భూ । వరు రఘురామభ
ద్రుని శివాది సురస్తుతుఁ జూడు భామినీ॥ సీ॥ అఖిలాటవులయందు నాహార
ములు మాని తపము చేసిన నిట్లు సఫలమాయె । సమధిక జ్ఞానవిచారతత్వము
చేత శోభిల్ల నిట్టులు చూడనగునె । పంచాగ్ని కీలల బరితృప్తులై సదా నిలిచి
ననీరీతి గలుగనౌనె । కాసారజలమధ్యగతులైన మనసుచే వీక్షింపనీలాగు వె
లయనౌనె । యేమిపుణ్యంబొ చూడఁగా భూమిమీఁద । నసగ కౌసల్యసుకృత
మే మనగవచ్చు । సకలసైన్యసమేతుని సౌమ్యచంద్ర । ముఖుని కనుఁగొనవే
లేచి ముద్దుగుమ్మ॥ సీ॥ హరువిల్లు ఖండించి యవనిజఁ గైకొని వెలసెను నీమ
హీవిభుఁడుగాదె । జమదగ్నిసుతు రాము సమరంబులో గెల్చి భాసిల్లె నీమ
హీపతి యితఁడుగాదె । తండ్రిసత్యము నెంచి తపసియై కానలో విహరించె నీమహామ

హుడుగాదె । వాలినినొక్కకోల గూలిచినుగ్రీవు బట్టంబుగట్టినప్రభునుగాదె
పుత్రమిత్రాదిబాంధవ భూరిసైన్య । సహితముగబంక్తికంఠుని సంహరించి।
జానకీదేవితోఁగూడెసాంద్రవిభవ। రథముపయిజూఁడు రాముని రాజవదన॥ ఉ॥
మానినిచంద్రబింబ మననమానముఖాంబుజమందునెన్నగా । మీనవిశాలనే
త్రిమలుమేలుగగిల్లడ సౌరునూరు।సన్మానముతాభిపాన్న తెగుమధ్యమును
న్నవిభాసహాసయా । జానకిచూడవేసకల సౌఖ్యములోడ గథాంతరంబు
నన్॥ సీ॥ మగువమోహముచేత గగనకేశునిదివ్య ధనువు త్రుణంబుగాఁద
నిమిచె । జలజాక్షికొఱకు వేచనిపై డిజింకను విపినాంతరంబుల వెదకిచం
పె । వెలదివేదనచేత విశిఖాగ్రమునకును శిలిపెసముద్రంబు నీళ్ళలమెఱుగ
లలనకైరోషించి లంకభస్మముజేసి యసురాధిపతినేల నణచివేగ।సీతిజేకొ
నికపురెల్లసేవజేయ । దేవదుందుభినినదముల్దిశల మ్రోయు । గరుడగంధర్వ
నిర్జరగణముదివ్య । పుష్పవర్షంబుగురియించి పొగడగాను॥ ఉ॥ వాసిగ
సేనచల్లగ నవారిగ నశ్వములెక్కికొందఱు । న్భాసురదివ్యఛత్రములు ప
ట్టుచుగొందరు సందడింప ను । ల్లాసముతోడగొందరు విలాసరథంబులు

## శ్రీరామచంద్రుడు నగరము ప్రవేశించుట.

చేరివేడుక । న్వాసియొనర్పమత్తమద వారణసంగము లెక్కికొందరున్॥
వ॥ కొలువ నివ్విధంబున సాంకేతపురాధీశ్వరుండగు శ్రీరామభద్రుండు
సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న సుగ్రీవసుషేణ గజ గవయగంధమాదనాం
గదనల నీల హనుమత్సమేతంబుగా ప్రభావిభాసిత కనకరథనిర్మిత మహా
కవాటదేశంబుల నష్టాదశాంతరంబులంగడచి తదుపరిస్థానంబుల శ్రీమ
ద్రామాయణానుసార చిత్రిత్ప్రకారలక్షణంబులు వీక్షించుచురంభాస్తం
భాలంకృత తోరణ విరాజిత సౌధాంతరాళచంద్రకాంతామణి ప్రభాప్ర
కాశమార్గంబుల సంచరించుచు బరిఘాభీలప్రాకార ఘోరగమహోన్నతా
కార గోపురస్థానంబు లతిక్రమించుచు నెడనెడగదలు కొను శుకశారికా
కులంబు దురితతిమిరక్షహార ప్రభావరామనామంబులు హెచ్చరింప నుత
సిల్లుచు మృగమదచర్చిత వేదికాలంకారవిలసిత ముక్తాఫల చిత్రరంగ
వల్లికల ప్రకాశంబులు చూచుచు దొలంగకమనోహరాంగనల మిసిమిపట్టు
జాళువా జరిబుటుసాని చీరకుచ్చులుజార మణిఖచితస్వర్ణతాటంక ప్రభలిం
బిసాళించురవికలుప్పొంగ పిక్కటిల్లుచుంగుచకుంభాగ్రంబుల ధగద్ధగాయ
మాన రత్నావళులుబొఱయ పరిమళమిళిత వికసితమందార మల్లికాకు
సుమదామంబులు వేణీభరంబులుగడలుకొని సుగంధంబులునింప కనకమ
యపాత్రంబుల నీరాంజనంబులుదెచ్చి నిహాళులీయ దివ్యరత్నాలంకృతసిం
హద్వారంబుగాంచి నమస్కరించి రథగజాశ్వంబులుడిగి పరిశుద్ధ సువర్ణ

మయు కవాటవాటంబులు పంచశతసంఘంబులు గడచి యంతఃపురసమీపసన్నిధియందు గోమేధిక పుష్యరాగ మరకత వజ్రమణిమయ విభాసితవిస్తీర్ణ సౌధాంతరంబున సీతాలక్ష్మణ సమేతంబుగా శ్రీరామచంద్రుఁడు ప్రవేశించి నిలచినం దత్సైన్యంబులు పట్టణ ప్రాకార గోపుర మంటపాంగణంబులు నిండి తండోపతండంబులై మహావర్ణంబు లుప్పొంగిన తెఱంగున భూభాగాంతరాళంబులు ఘూర్ణిల్ల దిక్కరిభికుంభంబులకుం దార్కొని సరయూనదీతీర పరిపక్వఫలపుష్ప వనవిరాజితంబుగా గ్రిక్కిరిసి పంచసహస్రయోజనోన్నతంబై నిలిచి సింహనాదము చెలంగ వాగ్విలసిత లక్షణంబుగల వందిమాగధులు కైవారంబు సేయ పేరోలగంబున నిండుకొలువై యుండి యాసమయంబున భరతశత్రుఘ్నులఁ జూచి రామచంద్రుఁడు సుగ్రీవ విభీషణాది వీరులకు నివాసస్థానంబుల నేర్పరుపుఁడని సెలవిచ్చెను॥ సీ॥ మరకతమణిమయ మందిరంబులుచంద్రశాలలు। ప్రాకార సౌధములును। హాటకసద్గోపురాంచితనవరత్న కలశము ల్ప్రాసాదనిలయములును। సహకార జంభీరచందనఖర్జూర ఫలపుష్పశోభిత వనతలములు। స్ఫటికసోపానము ల్చంద్రకాంతోపల కల్పితభిత్తులు గలిగినట్టి। నగరులోనరించిదోడ్కొనినలినహితుని। సతునిగజగంధమాదనపతుల దనుజ। పతిని సౌధాగ్రసీమలభరతుడపుడు। చేర్చిప్రియభాషణంబుల చెలువమలర॥ వ॥ తదనంతరంబ రాఘవుండు పితృవియోగజనిత శోకాక్రాంతమానసుండగుచు సీతాలక్ష్మణసమేతంబుగా గొన్నికక్ష్యాంతరంబులు గడచి సంతతానందకరంబగు నంతఃపురంబుప్రవేశించి॥ సీ॥ ఘనమరాళము లేని కాసారముంబోలె రాజహీనంబైన రాత్రివోలె। మణిరహితంబైనమంచిపెట్టియరీతి కువలయంబులు లేనికొలనుభాతి। వాగ్దేవియును లేని వచనభాగమువోలె బోసగభక్తియు లేని పూజగతిని। నుపకారములు లేక యున్నసంపదవోలె దనరశాంతివిహీన తపముకరణి। వర్జితంబుగఁగళ లేని వయసువోలె। సలరుదీపంబు లేనిగృహంబుగతిని। దశరథుడు లేని యుజ్జ్వలద్వారరక్షి। సుందరానందకరమైన మందిరంబు॥ వ॥ కని తన్మందిరాంతరంబునందు॥ క॥ రవిరశ్మి వలనవాడిన। పద్మవిమలలతవోలె జలదమాలికలోను న్నవిచంద్రకళతెఱంగును। గవిసినధూమమగుదీప కళికచెలువునన్॥ వ॥ ఉన్న దశరథమహారాజు మహిషియగు కౌసల్యాదేవిని మాతృవాత్సల్యంబునం బొడగాంచిభక్తిపూర్వకంబుగా దండప్రణామంబులాచరించిన॥ క॥ నెరపేదపెన్నిధాసము। కరమరుదుగఁ జూచినట్లుకనుగొనివత్సా। శరణాగతసంరక్షణ। స్థిరమతిసద్గుణవిహార శ్రీరఘువీరా॥ ఉ॥ ఎంతతపంబు సేసితినొ యెంతటిపుణ్యము లాచరిస్తినో। యెంతటివారికబ్బు జగదీశసురేంద్రవంద్య శ్రీ। యంతవ

సంతసత్యపరిపాలన పావనజూడఁగ ల్గెనా । స్వాంతములోని చింతలికఁ జాం
తి వహించెను భానువంశజా॥ సీ॥ రవివంశసంభూత రామనీవిక్రమ గుణ
ములెన్నియటంచు గణుసేతు । పిఁకులబదు నాల్గువేలరథ్యుల నొక్కనిని
మంబులోదుమ్రించినిల్వవశమె । సాగరంబు లనిజసాయ కాగ్రమునందు ము

కౌసల్య రాఘవాదుల నగ్గించుట.

త్యంబుపగిదిగా మునయనగునె । యినజుని జేపట్టి యింద్రజు దెగటార్చి వెల
సి సీత కిదలపనవునె । వర్ణితంబుగ గాసారవనములోన । కమలముల్ద్రెంచు
మహహస్తికరణి సకల । బంధువులతోడ రావణు బలములడచు । భూరిసాహ
సవృత్తులు పొగడదరమె॥ వ॥ అనిసీతనవలోకించి ప్రేమావేశంబునఁగౌఁగ
లించి యిట్లనియె॥ క॥ జనకునకుసుతవు దశరథ । జనపతికోడలవు రాము
పతివాదువునీ । ఘనమెన్నదర మెనిర్జర । వనజభవాములకునైన వారిజనేత్రీ॥ చ॥
వనజభవాదులాదిగను వానరరాక్షసకోటులుచూడఁగా । మినమినరత్నహార
ములు మేన జెలంగగ రత్నమాలికల్ । ఘనకభరీభరంబు సమకల్పితమొప్ప
గ హంసవాత్రితముల్ । గనుపడురీతి పావక శిఖాగ్రసుశీలవృగావె జానకీ॥ వ॥
అనిలక్ష్మణునుద్దేశించి॥ చ॥ మదిని విచారమంద కనుమానముసేయక నన్న
తోడసం । పదలనుమాని క్రూరమృగభావ వనాంతరమందు నిద్రచే । వద
యకభక్తుఁ బల్విడిచి దాచెడుసోదరుఁడెందుగల్గునో । సదయగుణానుసంత్రబు
ధసన్నుత లక్ష్మణకీర్తివర్ధనా॥ శా॥ నిద్రాహారములుమాని సేవకుఁడవై ని
త్యంబు సంతుష్టిగా । క్షౌద్రంబుల్లలవృద్ధిగేనాసగి రోషాభీలజాజ్వల్యతన్ ।
రుద్రాకారత బూని శస్త్రధర వద్మాప్రుండు చిత్తోగ్రుడై । రౌద్రోద్రిక్తసు
లదైత్యులన్ దునుముచున్ రంజిల్లవాలక్ష్మణా॥ వ॥ అనియనునయించిది
వించినం గౌసల్యవీడ్కొని యనంతరంబ సీతారామలక్ష్మణులు క్రమంబు
నగ్గైకేయి సుమిత్రామహాదేవుల భక్తిప్రియపూర్వకంబుగా నభివందనా
ర్చనంబులుచేసి హితగోష్ఠిందవిలి సుఖాసీనులై యున్న నచ్చటభరతశత్రు
ఘ్నులు పట్టాభిషేకసంతోషాతిశయంబున సుమంత్రాది మంత్రివరులం
జూచియిట్లనిరి॥ సీ॥ కనకనిర్మితమైన కలశములోకలశ భాసిల్లఁగాఁ బొ చి
పన్నెపట్టు । పుట్టముల్దశలక్ష భూరిదానములకు స్వర్ణరాసులు నుత్తసాముద
ములు । దశసహస్రంబులు ధవళాశ్వచయములు విమలధేనులుపదివేలసంఖ్య ।
లావణ్యశృంగార లలనామణులు నొక్కశతగుణకంబులు స్వర్ణరత్న । పట్ట
ములు నుత్తమాశ్వంబు భద్రదంతి । చామరంబులు స్వచ్ఛహాసమా
క్తికములు చిత్రాసనంబులు గంధమాల్య । భూషణంబులు దెప్పింపబూ
నుడిపుడె॥ సీ॥ విపణిమార్గంబులు విభవాస్పదంబుగా గలిగ తోరణములు
గట్టబనుపు । సకలదేశాధీశ జనపాలకుల నెదుర్కొనిగృహంబులయందు

గూర్పబనుపు। కదళికా స్తంభము ల్కనకసౌధములందు విలసిల్ల నెడనెడని లుపజనుపు। రాజమార్గంబుల రాజితంబుగ మేలు కట్టెలెల్లడలను గట్టఁబను పు। చప్పరములునన్న సత్రింబునుపూర్తి। చేసిరాజనులు విచిత్రపుష్ప। ఫలవిశేషములును గలధౌతచేలము। ల్పగ్రహింపబంపు సంభ్రమమున॥ చ॥ ఇనజునిజూచి యిట్లులను నిప్పుడె వానరసైన్యపాలురం। బనిచినమ స్తతీర్థ ములవారథులన్నిటిలోని తోయము। ల్పనివదిస్వర్ణపాత్రిలను బట్టుకరావ లెంచు జెప్పిపొమ్మని గురువౌ వసిష్ఠ ఋషియాజ్ఞ విధంబుగ సంఘటించు చున్॥ చ॥ మంగళవాద్యము ల్దరపారముగా జెలగంగ దుందుభు। ల్మ్రొంగు సరోదసీకుహర కల్పము పెల్లగిలంగ దిక్కులన్। నంగతిగాసమ స్తనృపసై న్యము చక్కగవచ్చిరవ్వుడు। పొంగగ రాజమార్గములు బూజితమైతన రారనంతటన్॥ చ॥ భరతుఁడు తేజమొదుచుసభానుజ నీలువిభీషణులన్ల

భరతుండు సర్వసన్నాహంబు గావించి అన్న కెఱిగించుట.

స॥ గ్గురుని బుస్కరించుకొని కొన్నికవాటములొప్పదాటి సుందరమల రంగ రాఘవసుభాశిరుసన్నిధి జొచ్చిభక్తితో। గరములు జేర్చిమ్రొక్కి ఘ నకార్యము లాత్మదలంచి యిట్లనున్॥ సీ॥ దేవేశ భవ్యన్నదేశాధిపతులును జనకకేకయముఖ్య మనుజవిభులు పురమలు జొచ్చిరిపూర్తిగాధనరాసులు నురత్నరాసులు నొప్పెనమరి। హయసామజాంధోళికాన్వితవస్తువు ల్పరి మితంబైనది ధరణిజేశ। సాగరోదకమును సంగ్రహింపగ గపినాథులు పోయిరి నాల్గుదిశల। నఖిలఋషిమండలంబులు నరుగుదెంచె। సీతతోగూడి పట్టాభిషేక విభవ। సకలసామ్రాజ్యధౌరేయ చక్రవర్తి। గావలయుదేవ మనవినగాదలంపు॥ వ॥ అనిన వినిసంతుష్టాంతరంగుడై శ్రీరామభద్రుండు వసిష్ఠవామదేవభరత కౌసల్యాద్యనుమతంబున నంగీకరించి సీతాసమేతం బుగాఁ గృతాభిషేకుండై దివ్యాంబర కనకమకుటాంగద రత్నభూషణసమ న్వితుండగుచు ననేక గోభూహిరణ్య కన్యాదానంబుల విప్రులకు సంతు ష్టిగావించి సుముహూర్తంబున శచీసమేతుండగు పాకశాసను కరిదిగివ్యాం తఃపురంబు వెడలి రథారోహణంబు గావించిన॥ సీ॥ భూచక్రిగొడుగులం బూనివానర వీరవర్యులు నడిచిరి వైభవముగ। విమలాతపత్రము ల్వేలసం

రాఘవుండునగరు వెడలివచ్చుట.

ఖ్యలు రాగ నాలపట్టంబులునతిశ యిల్ల। భూషణాశారులు పూర్ణేందువిక సలు నిలిచిచినృత్యంబులు నిర్వహింప। పటహదుందుభి ధ్వనుల్బ్రహ్మాండ భాండంబు వగిలినట్టుగఁదోచె ప్రజలకపుడు। ముందు వెనుకను జనుచేర ముపముతోడ। హనుమదాంగద నీలనలార్కజాదు। లపుడు చిత్తంబుగా భాగనమరవిభుడు। వెంబడింపగ రఘుపతి వెడలెనగరు॥ వ॥ ఇవ్విధంబున

శతకోటిభాస్కర ప్రభావిభాసిత గాత్రాంతర హాటకాంచిత విశుద్ధపీత కౌశేయవాసుండును మకరకుండలవిచిత్రతర నానారత్నద్యుతిభరగండ స్థలుండును మందస్మితచంద్రికా కలితకలా పరిపూర్ణ చంద్రవదనానంద కందళిత ఘుమఘుమాయమాన పరిమళమిళిత మృగమద రేఖవిరాజి తుండును బరిష్కృతకనక మకుటాంగద ప్రభావిభాసభుజాంతర సమస్త కుండును బ్రహ్మణ్యదేవుండునగు శ్రీరాఘవేంద్రుడు మందగమనంబున మందరనిర్మితరత్నోపల ధగద్ధగాయమాన సలలితహేమ సౌధాంతర ప్రవర్తితదుకూలాంబర చోంగణక గంధధూపమృగమదభాషాధీశ నుల సుజ హరిచందన కర్దమాది విచిత్రోచిత మంగళద్రవ్య సంగ్రహప్రకాశమాన విద్రుమస్తంభకలిత కాంచనసంభాలంకృత ప్రసూనమాలికావిలసిత స్థానంబును రుక్మరత్నపుష్యరాగో పరివజ్రవైడూర్య పద్మరాగసంఘటిత వివిధ సింహాకార రాజ్యలక్ష్మీవిలసితంబును మాంధాతుపురుకుత్స పురూరవరఘు హరిశ్చంద్ర నలదశరధ మహారాజాది యోగ్యపరిపాలన భద్రసింహాసనంబులకు లలితోపచార పుణ్యాహవాచనలస్వస్తిమంగళాష్టక నిగమాచార సంపన్నులైయున్న రఘువరుండు రథంబుడిగ్గి యాస్థాన కోంటపంబు ప్రవేశించు సమయ బున గరుడ గంధర్వ సిద్ధ కిన్నర కింపురుషాది నిర్జరసందోహంబులు పట్టాభిషేక సంభ్రమాయత్తచిత్తులై గగనాంతరంబున గొలువై దేవ దుందుభులు మ్రోయించి ప్రసూన వర్షంబులు గురియించుచు భృగుచ్యవన పరాశరాత్రేయ కాత్యాయనవసిష్ట వామదేవపులస్త్యకశ్య పాగస్త్యమైత్రేయ విశ్వామిత్రరుచికాగ్ని హరాద్గల్య కణ్వదేవశ్రవణ ఋష్యశృంగ పర్వత నారద మతంగ మంకణాంగీరస శతానంద మౌందపాల ప్రముఖులైన మహర్షులుశిష్యప్రశిష్యసమేతులై పరివేష్టింప చోళనేపాళ మళయాళ బంగాళ ద్రావిడదర్భ కర్ణాటలాట మరాట మత్స్యకాశ్మీర కొంకణకొంకణ కురుకుంతలాది వివిధదేశాధీశులు పుత్రమిత్రకళత్రానుగుణ్యులయియుండుగరలు గొని వచ్చినిటలతటఘటితకరపుటులయి సకల దురితతిమిర మార్తాండుడగు రామునినామంబులు గీర్తించుచు పునఃపునః ప్రణామంబులాచరించి గ్రిక్కిరిసి మెండుకొని దళంబులు తండోపతండంబులయిగములుప గౌస్తుభచేలాంచిత నిగనిగకంచుక విభాసిత కుచకుంభోగ్ర రత్నమౌక్తిక హారంబులు మెఱయ మదనమోహన ప్రసూనసాయకనివహంబుల తెఱంగున మిసిమిగల పసిండిపట్టుల బుష్పాంకిత ధూపకర్పూరతాంబూల సుగంధగంధఖర్జూర గదళీకా నారికేళ నవీన వస్త్రంబులుగైకొని జగన్మోహనాకారు లయి పుణ్యసతీలలామంబులువసుదేర నుత్కంఠాతిశయంబున లావణ్యవిభ్రమసంప్రాప్త శృంగారవార

స్త్రీజనంబులేక తాళవల్లకి మృదంగ సుషిరకాంస్యాదిచతుర్విధ వాద్యసా
ధనంబుల జౌశితి నృత్యవివిధగమనంబుల గడలుకొన భూసురాశీర్వాదం
బులు సెలంగ వయోవిలాస పద్యగద్య రచనా చమత్కారంబుల వంది
మాగధుల జయజయ ధ్వానంబులు చెలంగ భరతాదిసోదరులును సుగ్రీ
వాదికపులును విభీషణాది రాక్షసులును జనక కేకయాది బంధువర్గంబు
లును సుమంత్రాదిమంత్రివరులును బరివేష్టింప జగజ్జేగీయమాన మహా
సామ్రాజ్య ధౌరేయధురంధరుండై జానకీ సమేతంబుగా బహిర్మంటపం
బుం బ్రవేశించిన॥ఉ॥ నాకమునందు దేవకులనాథుడు భూరియశో ప్ర
తాపుడై । పాకబలమైపులోమజ విభాసిత మొప్పగ వైజయంతముం । గై
కొనియుండుకీతి జకాత్మజతో మణిసౌధమందుభూ । లోకులు గొల్వశ్రీ
రఘుకులోద్భవుడటు వచ్చియుండగా॥క॥ సింహాసనంబురఘుకుల। సిం
శ్రీరాముడు సింహాసనాసీనుండగుట
హముపొడగాంచి మ్రొక్కి సేవజనెనే । బ్రహ్మాదులు తను బొగడగ ।
గహ్వరియుప్పొంగ బుధుల గణకులతోడన్॥చ॥ హరి యుదయాది చే
రుగతి నరకకులోద్భవుడంత గార్యపీ । వర దుహితా సమేతముగ వర్ణితమై
తనరారు గద్దెపై । ఘటకలశోద్భవాది మునికోట్లుశుభంబులు పల్కరాఘ
వే । శ్వరుడు తదాసనంబునను సమ్మతితో వసియించి యుండగాన్ ॥సీ॥
కలశసంభవబుషి గణములు నొకదెస మొనసి యాశీర్వాదములు ఘటిం
ప । పవసజ నీలాంగదాదులు నొకవంక గనకపీఠంబులం గదిసియుండ ।
దానవపతిముహాదైత్యులు నొకవంక గన్నులపండువు గాగజూడ । జనక
బాంధవమిత్ర సచివులునొకమెడ మణిమయాసనముల ఘనములొంద ।
సకల దేశాధినాథులు సన్నుతింప । దేవదుందుభి నినదము ల్దిశలునిండ ।
సురలుమునులును హర్షింప శోభితముగ । గొల్వుగూర్చుండె రఘువంశ
కుంజరుండు॥ గీ॥ భరతుడావేళ ఛత్రంబుఁ బట్టినిలిచె । నింద్రదిఙ్వైరిశ
త్రుఘ్ను డిష్టముగను । సుభటుదిక్కుల వేంచేసి విభవమలర । చామరం
బులువీవగా సంభ్రమమున ॥వ॥ తత్క్షణంబ॥ సీ॥ పూర్వసాగరజల పూ
ర్ణకుంభముగొని ద్వివిదుడువచ్చెను దీవ్రముగను । దక్షిణాంబుధి వారి ద
గగైకొనినలుండు వచ్చిచేరెను మహావైభవమునఁ । బశ్చిమార్ణవతోయ
పాత్రగయకొని జాంబవంతుడువచ్చె సంభ్రమముతోడ।ను త్తరదిక్కుమ
హోదధితీర్థంబు గొనివచ్చె బవమాన తనయుడపుడు । మొక్కి కలశో
దకంబును మధుమహిత । వేదికలయందు క్రమముగావించి నిలిపి । నిట
లతటిగటిలా స్తపుటులునైనిలిచియున్న । గురునియనుమతిగొనిమునికోటి
యపుడు॥ చ॥ పూజలుచేసి దివ్యజలపూరితకుంభములె త్తివేదముల్ । శ్రే

జముతో బలింపదివిదేవతలందఱు సంతసిల్లగా। రాజితకీర్తియైన రఘురాము నికి న్నభిషేకమప్పుడే। రాజులుజాడఁజేరిరి సురాసురసంఘము సంతసి ల్లఁగన్॥ చ॥ కనకవిభాస పట్టమును గట్టిరి ఫాలమునందుభూరిభా। జనప తికిన్విశాలరుచి సొందుగ్రీవము న్వభలతుణాంక శ్రీ। జనకజ ప్రాణనాథునికి సద్గుణమూర్తికి నైన తేయువా। హనునకు నిర్జరేంద్రియున కంఘ్రిసరో రుహ సత్యశాలికిన్॥ సీ॥ వామాంకమునను వైభవమైన భూజాత దీపిత పార్వతీదేవిగాఁగ। సప్తకాంచనరత్న దళితమహాపట్టంబు రేఖమించిన చం ద్రరేఖగాగ। బూర్ణాభిషేకధారాసలిలంబులు కమనీయమగు వియద్గం గగాగ। నరగసంభవ సుషేణాదులౌ వానర ఘనసైన్యముల్ ప్రమథగణ ముఁగాఁగ। బవనపుత్రుండు నాదిగా బ్రిబలరత్న। భరితమైనట్టిసొమ్ము లు ఫణులుగాఁగ। వామదేవస్వరూపుడై రామవిభుడు। గణన కెక్క ను నావేళ జనులుపొగడ॥ చ॥ అపుడు సురేంద్రుడంపె ఘనహాటక కంకణ మౌక్తికంబులుం। దపనీభంబులౌమణులు దాపుకిరీటము దివ్యహారము ల్। నుపమగఁజాతములు నుత్పలముల్గొనివచ్చి భక్తితో। సఫలము లౌయెనంచు నృపుసన్నిధినిల్పి నమస్కరింపగాన్॥ చ॥ అదిధరియించిరా ఘువుఁడు నవ్వైమాతలిబీతిచేసి సమ్మదమణిభూషణంబులు సమంచిత వస్త్రములిచ్చి బంపెను। వ్మదినిజెలంగుచున్న తగుమాటిమాటికి సన్న తించుచున్। గదిసెపురందరున్ దగిన కానుక లిచ్చినలమ పెపుడున్॥ సీ॥ క్రముకేందుచంపక కాంచనపల్లవకరాస్య నాసికాకాయవోష్ఠ। మ ధుకకుంభోత్పల మాతంగ కేసరి కచపయోధర నేత్రగమనమధ్య। రంభా లతాకుంద రాజీవనతచాప జఘనబాహుకాంత చలనభ్రుకుటి। తారసైక తబింబ సారవిస్ఫుటసుమ నఖనితంబాగడ నమ్రివచన। గంధసంభృత సువిలాస కనకరత్న। భరితభూషణమౌ సభామంటపమున। రాజ్యల క్ష్మిసమాన్విత రమణియగుచు। సీతవిలసిల్లె పట్టాభిషేకవేళ॥ వ॥ ఇవ్వి ధంబున బ్రహ్మేంద్రామరవందిత విమలవికచసరోరుహ చరణయుగళుం డును రఘువంశపయఃపారావార రాకాసుధాకరుండునునగు శ్రీరాఘవేం ద్రుండు కరుణాకటాక్ష వీక్షణాలంకార ముఖచంద్ర చంద్రికాహాస విల సన మధురవచన రచనాధురంధరుండై తప్తకాంచన విచిత్రాంబర వివిధ రత్నోజ్జ్వల మకుటాంగద కేయూరహార కుసుమతాంబూలాదు లొసంగి కపికుల సింహాసనాధీశ్వరుండైన సుగ్రీవాంగదకుమారులకు బ్రియంబున నలంకరణంబుగావించి కర్పూర తుషారహీర ముక్తావళినికరంబులును ర త్నకటక మకుటాదులును దుకూలంబులును సవినయపూర్వకంబుగా లం కాధిపతియగు విభీషణునకొసంగి శతయుష్టకావలయంబులను హేమాం

బలంబులునువచ్చి గజగవయగంధమాదన దధిముఖులను బరితృప్తిబొందిం
చి ప్రతిభాస గుచ్ఛగుచ్ఛార్ధమణిఖచితోర్మి కాదులు నలనీల కేసరిప్రము
ఖులను సపరిమితంబుగానిచ్చి గోమేధిక పద్మరాగ మేఖలాభరణంబులు
కుముద జ్యోతిర్ముఖ జాంబవత్సుషేణ మైందద్వివిదులకునిచ్చి సమస్త వన
చరసమూహంబులకు ననురాగంబున శిర బులవాలురుమంజి ముత్యాల కీ
లుకుళ్ళాయిలును కరంబులకు మణికంకణంబులును గళంబులకు వజ్రాల
హారంబులును బితంకనలసుభ్రవర్ణంబులుగలదుకూలంబులనొసంగి యంగ
వంగకళింగ వివిధదేశాధీశ్వరులకు నూతన రత్నాభరణాంబరంబులు సమ
ర్పించి ప్రార్థితదయాళుండగుచు పవననందనుని సన్నిహితస్థానంబున గూ
ర్చుండనియోగించి నిజకరకమలస్పర్శగావించుచు ధగద్ధగితమణిగణ నిర్మిత
వలయంబులను విమలతార హారాదిభూషణాంబర ప్రసూనమాలికలను
నిజపాణితలంబునంగయికొని యతనికి నలంకరణంబుగావించి కసూమతాం
బూల గంధంబులొసంగి పిమ్మట ద్యుతిధరిత రత్నహారంబొక్కటి సీతా
మహాదేవి కిచ్చిన॥ ఉ॥ మారుతిమీది తొల్లి యభిమానముచే సరసీరుహాక్షి
తృశ్యం। గారముగల్గుహారమును గైకొని రమ్మనికంఠమందునా। హారము
వైవగానతఁడు నంజలిచేసి నుతించి వాలముం జేరిచినృత్యముల్సలిపి చి
త్తములో ముదమందుచుండగా॥ చ॥ దినమణివంశభూషణుఁడు తేజము
నొందిన భూషణంబులుం। గనకవిచిత్రచేలములుఁ గంధమునుంచి ప్రసూన
మాలిక। ల్జనకునికిచ్చిబంధుజన సన్నిధిగేకయరాజునట్లనే। తనిపి సమ
స్త వానరబుధాప్తజనంబుల నాదరించుచున్॥ వ॥ తదనంతరంబ॥ ఉ॥
భోజనశాలజేరి కపిముఖ్యులతో స్వజనాప్తవర్గ భూ। రాజులతో విభీషణవి
రాజిత మంత్రులతోడఁ బీటపై। రాజకులాభిసోము డభిరాముఁడు రా
ముఁడు చేరియుండఁగా। దేజములొప్ప భామినులు దెచ్చిరి దివ్యపదార్థశాఖ
ముల్॥ మ॥ పరమాన్నంబులు పాయసాన్నములు బల్భక్ష్యంబులొనిడ్డెన। ల్ఫ
లసంఘంబులు సూపము ల్వడలు నింపైనట్టిపచ్చళ్ళు। నిర్మలహాలో యు
ను నెయ్యిమంచిదధియు న్బొబ్బట్లు చారూరుగా। యలతో నించిరి మత్త
హస్తి సిభయానల్ప్రేమవర్ధిల్లగన్॥ గీ। భరతలక్ష్మణ శత్రుఘ్ను పవనపుత్ర।
సకలబాంధవ కపికోటి సహితుడగుచు। భూసుతనుగూడి రాముఁడు
భోజనంబు। సేసిమణిహేమమంటప వాసియగుచు॥ ఉ॥ భానుజుఁజూచి
పల్కె జనపాలుఁడు బంధుసుతాదివర్గము। ల్మానిని మదీయకార్యములె
మానస సంతసిలంచి లంకపై। బూనిసమస్తదైత్యులను బోరిమహాశో
గ్రితవృత్తిలోడనీ। మానిని దెచ్చినట్టి ఘనమందినమూర్తులుగారె యుండ
రున్॥ ఉ॥ బంధువులైనమీరు బలవర్గములై నను మీరెగాకయే। చంద

మున్నైనచూడ బురసౌధతలంబులుచేరి రాజ్యమును। బొందిరి సుతా త్రమం త్రిజన భోగలమున్వసియించి బొందిరి॥ రెండవవచ్చుచుండవలె నిచ్చట కిం దగు(ప్రస్తుతంబులక॥ చ॥ పఠనగోపురంబులైన నిజపట్టణదుర్గములందు శత్రువు। లమ్మది ముదమంద జెందుదురు మంత్రులునందలిజారు చోరులం। బ్రతికితిమంచునుండుదురు పాపము రాజులకెందు పుణ్యము। గ్గతమ పో వు సంకరముగా జను జంతువు లెన్ని భంగులక॥ చ॥ అనిన విభీషణు డు మ ఱియర్కజ నీలసుషేణుడంజనా। తనయులు గుండె ఝల్లుమనిద గ్గనుం దూచులేచి రామనీ। విశ్వాసము సద్గుణంబు దయ పెంపును సొంపునునిం పుమాటలుక। ఘనమును నేస్తపాలు కు గల్గును శాశ్వతధర్మవర్ధనా॥ సీ॥ నీదయచేఁగదా నిజసైన్యసందోహ పతులయివచ్చుట పరమపురుష। నీమహాత్త్వముచేత నిజవధూసహితులై యుండుటనది కాదె బూరిశౌర్య నీదర్శనంబుచే నిండినభుజశక్తి వర్ణితంబయ్యెను వసుమతీశ। నీకటాక్షము చేత నిశ్చయంబుగరత్న సింహాసనాసీన సిరులుగలిగె॥ భరతు లక్ష్మణశత్రు ఘ్న బంధుసమితి। సకలనిర్జరదర్శనసంభ్రమములు। తశరగలిగెను నిత్యస త్యప్రశస్త॥ రఘుకులాంబుధిచంద్ర శ్రీరామచంద్ర॥ అని॥ చ॥ గమనము లయినజూచి కనకాత్మజ తారకు ప్రీతితోడుత। వ్విమలసు రత్నహారములు వేడుకచేలములిచ్చి గంధము। ల్సుమము లలంకరించి ఘనసూత్రుం గౌగిటఁజేర్చెనిపుతో। రమణినిఁ జెల్వొలర్పఁ గపిరాజులు మొక్కిరి మోదితాత్ములయి॥ వ॥ మఱియును భానుజ నీల సుషేణ హనుమదంగద గజగంధ మాదన విభీషణాది మహావీరులు రఘువంశ వర్ధనుండగుశ్రీరామ భద్రునకు భక్తిపూర్వకంబుగా ననేక సాష్టాంగ నమస్కారంబులు గావించి భరతలక్ష్మణ శత్రుఘ్నులకు నమ్రులయి జనక కేకయరాజపుత్రి తులకు వినయోపచారంబులు సమర్పించి దశరథ మహారాజ మహి షులయిన కౌసల్యాసుమిత్రా కైకేయీ మహాదేవులచే నూతన రత్నా భరణ బహుమాన పురస్కృతులయి రఘుకుల సింహాసనంబునకు వంద నార్చనంబులు గావించి గిథారోహణంబుఁజేసి శతయోజన విస్తీర్ణంబుగా నిలిచి వానర సైన్యంబులు జయజయ ధ్వానంబుల శ్రీరామునిం గీర్తిం చుచు వాలాభీల నేత్రాగ్నిసల తేజులయి సింహనాదములఁ జెల్లార్చుచు వెంబడించు దైత్యసంఘములు విభీషణుంజేరి కొలువ భేరీనినదంబులు ప్రచండముగా రోదసీకుహరంబుభేదిల్ల సదయులయి భరత లక్ష్మణ శ త్రుఘ్నులు కొంతదూరము ప్రియోపచారంబువల్కి పనుప సంతోష భ రితాంతరంగులయి ప్లవగదనుజపతులు తమతమపురంబులు ప్రవేశించి శ్రీ రామభద్రునిందలంచుచు పునర్దర్శనంబుగోరుచు నిజసతీసుతాది సహితు

లయి ప్రాపితసుఖభోగముల ననుభవించుచు సుఖంబుగా వెలసియుండిరం
తః. క॥ తరుణార్కవంశ ధరణీ । ధరణీసుతప్రియ హృదయ దర్శితముఖ
సుః। దరహాసవిపులకార్ముక। ధరకపాదురితహరణ దశరథ రామా॥ మాలినీ
వృత్తము॥ సరసిజనిభ నేత్రా చారుసీతాకళత్రా। నిరుపమ జయశీలా నిర్మ
లాహారజాలా। తరణికులవతంసా దర్శితానందభాసా। భరితగుణసముద్రా పా
హిమాం రామచంద్రా॥

గద్య॥ ఇది శ్రీ శుద్ధమరాంబికా నిజమనోల్లాస కరుణాకటాక్షవీ
క్షణాలంకార సరసామృత కవిత్వతత్త్వాతిశయానంద భరితసాంఖ్యతార
కామనస్క శ్రీరాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ఘట్టువంశ
పయఃపారావార సుధాకర కాశ్యపగోత్ర కాత్యాయనసూత్ర శ్రీ వేంకటా
ర్యపుత్ర లలితపాండిత్య వేంకటరామకృష్ణ ప్రణీతంబయిన శ్రీ పట్టాభిరా
మాయణంబను మహాకావ్యంబునందు,

ప్రథమాశ్వాసము, సంపూర్ణము.



శ్రీరస్తు.

# శ్రీ పట్టాభిరామాయణము

## ద్వితీయాశ్వాసము



శ్రీమహితహృత్కమలకర। ధామాజీమూత దేహ దళితాసురసం। స్తో
మా భాస్కరకులయబ్ధి। రామా కోదండకర విరాజిత రామా॥ గీ॥ అవధరిం
పుము సుగ్రీవ హనుమ నీల। పనస గజగంధమాధన పతులు చనిన। వెను
క శుభవృత్తి విలసిల్ల విభవసకల। రాజధౌరేయుడై యుండె రఘువుండు॥
సీ॥ భూరుహంబులు పుష్పభూషణంబు వహించె నఖిల ధేనువులు చన్ను విసిపితికె।
వసుమతి ఫలసస్య వర్ధితంబై యొప్పె బాసె చోరోపద్రవంబు లచట। కన
కైరి పుత్రదుఃఖములు తల్లులు దండ్రు లతివల వైధవ్య మంతదొలగె। దారి
ద్ర్యదుఃఖము ల్దరిగెను జనులకు నెలమూడు వానలు వెలయగురిసె। నిర్మ
లంబైన దోయముల్నిండె నదులు। బాసగ ధాన్యము పోకకుం బుట్టెడమ్మె।
బుప్పరసవృద్ధులై తోచె భూములందు। రమ్యమయి యొప్పె రాఘవరాజ్య
మందు॥ చ॥ మలినులు లేరు రోగకృశమానుష దేహులు లేరు దీనులా। నె
లవున లేరు కుత్సితమునిండి మహాగ్రహవృత్తిలక్షణం। బలరినవారు లేరచట

నాశ్రితులందున లేరు కీర్తితో। వెలయని వారు లేరు రఘువీరుని రాజ్యము
లోన జూడఁగన్॥ ఉ॥ అంగజు గోమలాంగము లిఖాటక భూమములిప్పుడనకి
లురే। యొందఁజు దానధర్మ ప్రతు లాత్మవిశాల విలాసమూర్తులే; । అంద
జు మంత్రతంత్ర జపహూర్ణనిజోచిత కార్యతంత్రులే। యొందఁజు శంబరాహి
తసహించిత గాత్రులై యెందు జూడఁగన్॥ ఉ॥ కామసమాన రూపశుభ కా
ము సమీక విరోధ రాజన స్తోముని వారివాహనపు శోభితు దీనశరణ్యర
క్షణో। ద్దామపరాక్రమాకలితు ధర్మపవిత్రను సత్యసంధు శ్రీ। రాముగ
టాక్షవీక్షణ విరాజిత మానవులుల్లసిల్లగన్॥ ఉ॥ ధ్యానసమాధి యోగ ని
జధర్మములిం చుకగ్గ సేని సు। జ్ఞానవిశిష్టులై ప్రమద కల్పితులై దురుగాన
బ్రిహ్మమే। పూనితదాకృతింగలిగి భూరితరంబుగ నొప్పియుండు గూమాన
వులన్ సుఖార్ణవ సమాహిత తేజముఁ బొందకుండునే॥ క॥ జనపములపరిపా
లించుచు। ననుజులు నిజసేవకగ్రవ్యాలై విలసిల్లన్। జనకజనుగూడి రాఘవు। జన
పాలుడు వెలసె విభవసాంద్రుఁడగుచున్॥ క॥ హేమంతమనుసరించెను।
భూమానిని గప్పుకొన్నమును శోయనగా। జేమంతులపుడు పూచెను। సో
మార్కుల విశదకాంతిశోభిత మమరన్॥ సీ॥ ముదితల ముఖపద్మములచూ
చుటే కాని మదిని నమ్మరు చందమామ కాంతి। కిసలయముంద హాసము చెంత
నే కాని నిలువరు పండువెన్నెలల బైట। నెలతుకకుచదుర్గములు చేరు
కాని తలకరు ఘనపర్వతంబులెల్ల రమణులమధురాధరములాను కాని గా
న సేయరు పానకంబు గ్రోల। సతుల మహానీయ నాభికాసరసులందు। దేలు
టే కాని కాసార తీరలోల। మానినుల నమ్మ యూర్పులే గాని సురటి గాలిగా
నీయరధిపు లక్కాలమునను॥ మ॥ మిహిరాంశుండచు భూజుడంతమదిలో
మెండోడిదండెత్తిభూ। గుహశైలాంతర భూరిపట్టములపై గుప్పుంగఁగంప
బుచే బహుళంబై నిజపాత్రివల్లభులపై పైఁబొందిసౌధంబులే। గుహలైదాం
గిరనంగశీతమహిమ గ్రోంచెనా నాటికిన్॥ చ॥ లతలు విభూతిజదె శుభల
క్షణమొయ్యెను భూరుహంబులున్। మతికిని మోదమయ్యె నవమల్లెలుపూ
చెను గింశుకంబులున్। జతనములయ్యె దేంట్లు మధుసాంద్రములై ప్రివ

## వసంతకాల వర్ణనము.

హించె శాఖలు। న్నతిశయమయ్యె జైత్రికమునంతట సంతస వైభవంబుగన్॥
శా॥ తారల్పాంతన హేమసారమ్ముగను దండింకఁ గ్రోధాత్ములై। ధా
రాళంబుగ శంబరారిశరము ల్దాటించి తెప్పింపభూ। భారంబెల్లను నిండెనో
యనగ సంభావించినా వాలతా। గారంబై నవపల్లవాబ్దములు సంకాశంబు
లై యొప్పగన్॥ మ॥ తనుకుంబ్రోదియొనర్చె భూతరుణి ప్రీతిం జాలఁ దత్త
న్వికి। న్విమలంబౌ పరిభాస భూషణములే వెద్దొందగా జేసినే। మమ్ముగైకొం

దుమటంచు పాదపములుఁ భ్రాంతిల్ల వల్లీవమే। తమపై బుష్పితమర్యొ సాంగమున నిత్యానంద సంశీలతఁ॥ వ॥ అట్టివనంత సమయంబున॥ ఉ॥జానకిఁగూడి రామజలజాప్తకులుండు సమృద్ధిఁజెందియు। ద్యానము జేరిపావన వితానతలంబుల మల్లికాలతా। సూనవిశేషముల్గనుచు సౌఖ్యముసోలుచు గుచ్ఛభక్తిసం। ధానములైన చంపకవిధానములం బరితృప్తినొందుచుఁ॥ వ॥ ఇవ్విధంబున సారహింతాలతమాలరసాల నారికేళాశోక ఖర్జూర కదంబనింబ చందనకుచుమంద మందారవట కుటజపాటలీవకుళ నానా మహీరుహశోభిశ్రియ శాఖాశాఖాశాఖావిలాసిత లతానందపరిమళి కుసుమ నికరంబులుఁగడలుకొని కర్పూరపుటరటులముందరఁ బరిపక్వజంభీర తరుసముదయ బులుండాసి నిలిచిన ద్రాక్షమందిళ్ళనోరసి యేలకితీగెలపెనగి లవంగలుంగ నారంగవృక్షోపరి పార్శ్వంబులందేజరిల్లిసురపొన్నలుగ్రమ్మికొల్లగన్నెరులనోరసి పారుపన్నీరు కాలువలపైదిన్నెలుఁగుదువేరుచప్పరంబుజేరి వట్టివేళ్ళ సైకతవేదికలంగూడి పరిభ్రమించు లేతయరటులనోరగు దొంతులఁజేమంతులంగలసి మొలసిన నందివర్ధనంబుల పొంతవింతలగు కదంబసౌగంధిక తరుబృందబంధుర బంధూకద్రుమంబులకు గ్రిక్కిరిసిపేరుగలపారిజాతంబుల చేరువనుద్రాక్ష వల్లికలచప్పరంబులకునింపు పెంపారు నాగవల్లీదళముల వనంబులందరి కేతకీక్రముక సంపూరిత విద్రుమ పత్రతిసందోహంబులడాసి చెలరేగినపొదరిండ్లదండ నివురుకొని ముత్తంబులైనమిరియంపుదీగెలవిరవుగొని సరసిజాకరంబులదిన్నెల విరిజాజులపై వ్రాలి శుకకీకనికరంబుల ననుసరించి చరించు నీలకంఠంబుల సమూహాత పుష్పపరాగాచ్ఛాదిత పులినతలంబులనింగికి నెగయు విహంగసంఘంబుల కుబెడంగుచూపి మకరందంబుగ్రోలి మధుకరఝంకరణంబులకుం బెదరి తిరుగుహరిణపోతంబుల నెదుర్కొని యపరిమితంబులగు దుప్పులుచప్పుడులు చేయుచు నప్పళింపగ చమరీసమూహంబుల దూరంబునం గనుంగొని పరిభృతసంభృతంబులండాసివిహరించుచక్రవాకంబులంబోలె హరిణపోతంబులనినదంబులందోలంగికమలంబులపైనెక్కి గమకించుమరాళంబులుగలిగి పల్లవవికసిత కుసుమఫలభరితంబగు కేళికావనాంతరప్రదేశంబున॥

## శ్రీ సీతారాములుద్యానవనంబున విహరించుట.

సీ॥ సాంద్రమహాసీలతా సౌకర్యమెల్లను చూచితివేమొయో సుందరాంగి। పుష్పసమృద్ధిచే బొదలెడియిండ్లపైగాంతించి యున్నావె కంబుకంఠి। సహకారభూరుహ చారూరుఫలము లిచ్చుటనునపేక్ష పుచంచలాక్షి। శాఖోన్నతవిశాల సాలవృక్షశ్రేణి నిర్మితంబులునిదే నీలవేణి। పులినతలచిత్రవేదికా విలసనమును। గదళికాపూరకర్పూర గంధములును। మం

జాతరగోస్తనీకాయ సూనములను। దలచితివో లేదో యీవేళ తలిరుబోణి॥
చ॥ తరువుల మల్లికాకుసుమ ధామములున్నవి నిక్కి చక్కగాఁ। గరములు
చాచి గైకొనుము గ్రక్కున నవ్విధి వైనసంతలో। మరుగయిపోవు సిగ్గు సఖి
మంచిది నీవనదంటిపంక్తికిన్। సరియగు నామదేభకుల సన్నిభ యానకురం
గలోచనా॥ చ॥ అమరిన వేణిజూచియు మహోర్భటితోడను ఝూంకరించు
చున్॥ భ్రమరసమూహ మెల్లమధుపానముసైనుదిలేకయుప్పుడే। భ్రమత
లకెక్కి బుత్రిహిత బాంధవపౌత్రులుగూడి వేడ్కతో। దమకులమైనవా
రోయటని తప్పకవచ్చెగొ భామినీమణీ। చ॥ కొలకులయందు నీడలనుగోరి త
పంబులు చేసి యింపుతో। నెలసిన రోజనుల్దినుచు వేసవి సేర్పుదలంగి లజ్జ
లో। కలజిలుగొంద హంసలు నెపంబున నిచ్చట నిన్ను గాంచిలో। జలములు
చేరుచున్నయవి చారుసరోరుహ పత్రిలోచనా॥ సీ॥ కన్నులజూడవు కన్నె
రోయవి యేమి తిప్పారించెనే తలిరుబోణి। చిదిమి వైచితివి యీచిగురు
జొంపములపై మనసు హాటిదేల మత్స్యకంటి। సహకారఫలముల జతను
గైకొని విసరి వైచితి వేలనే విమలనేత్రి। బొండుమల్లెల జేర బోవక సురపొన్న
గదిసితివది యేల కమలగంధి। తెల్లచేమతిపువ్వులు మల్లెవిరులు। గోసివడి
నించితివి యేల కుసుమధామ। ములనుగబరీభరంబుపై నిలిపియుంద। బత్తు
పాతంబు కలది యేర్పరుపనగునె॥ సీ॥ గజనిమ్మపండ్లు చక్కగ గోసి తెచ్చెద
గుచములంటగనిమ్మ కుసుమగంధి। పచ్చవిద్రుమములు గ్రుచ్చిచూపెదఁ
గాని పెదవినొక్కంగనీవె బిసరుహాక్షి। మృదులతాతతులెల్ల వెదకి కైకొ
నివత్తుఁ గనులఁ దేలింపవే కంబుకంఠి। నీలోత్పలంబులు నెరుంచి యిచ్చె
దఁ గనులఁ దేలింపవే కమలపాణి। యనుచు దరహాసవదనుడై యచటనచ
ట నిలుచుచును మందపవనుండు గలసిరాగ। మదనుడెదిరించి నిజపుష్ప
మార్గణములఁ జలుకు చూపంగ సీతను జూచి విభుడు॥ చ॥ తమకము మిం
చివచ్చె నికదాళిగజాలనె కౌగిలించిభో। గముగలుగంగ ముందొసగి శాపు
గమైపొదరిండ్లకుండవే। గముగవిమర్శగారవికె వైపుచెలంగగ చేసియింపు
తో। సమరతులందునీ మదికి సమ్మతిగా విహరింపు జానకీ॥ చ॥ కడుభరమైన మో
హామిది గైకొన నేర్పువహించి పైటపై। గడలుకొనంగ హారములు కంపితమై
తనరారుకొప్పులో। ముడిచిన సూనమాలికల పుప్పొడిరాలగ నాకు బుక్కట।
స్విడెమునొసంగి క్రీడలకు వేడుకలుంచవె జీవితేశ్వరీ॥ చ॥ మనసిజబారికోర్వ
ఘనమా యనుమానము లేలయొక్కటై। పెనగవె మోవిపానకము ప్రీతి
వహిల్లగనిచ్చి యంతలో। జనువుకలచి ముందొసగి జౌసితితులసౌఖ్య
దంతయు। లొనమయగనొక్క సొమ్మసిల ముచ్చటలాడుకురావె కోమలీ॥
వ॥ అనియివ్విధంబున వైదేహికిం జతురోపాయంబుల మానోల్లాసంబు గా

వించుచు నిరంతర కామోపభోగంబుల సంతుష్టాంతరంగుండై జలకేళీ వినోదంబులదగిలి పొద్దుపుచ్చుచు ననేక శృంగారవన నగవిహారంబులు సలుపుచు మహానీయ రత్నోజ్జ్వలధగద్ధగాయమాన కనక సౌధాంతరమ్ములు శయ్యాసనంబులుంగూడి నిజరాజ ధర్మగుణగణ పరిశీలత్వంబున సర్వసహాధిపత్యంబు నంగీకరించి సుఖ ముండెనంత॥ క॥ జనకజకు ప్రథమ గర్భం। బునుసంభవమయ్యె కళలు పూర్ణంబగుచున్। ఘనశ్రవణ చతు

## జానకీదేవి గర్భంబు ధరించుట.

పాదం। బునను వెలసెవృద్ధి లుగ పూర్ణాణికి॥ గీ॥ కనకమయమగుపాజుల కమ్మలందు। దాపితంబైనమి రాలధవళరుచులు। గలిసెనోయనదాలువు ఘనముగల్గి। తెల్లనాయెను పుడమిభూదేవిసుతకు॥ చ॥ ఘుమఘుమవాసనల్దనర గుప్పినకస్తురిరేఖయందెలో। చెమటగరంగిప్రాచిదిగ జారెనునాలితాంగికప్పుడే। కమలమలయ్యె చన్మొనలు గన్పడెనైల్యము శోభితంబుగా। గమనముమందమయ్యె జనకాత్మజకుం గృశమయ్యె దేహముల్॥ సీ॥ బలిసెనుబాగారు బడలికల్జనియించ భారమాయెనుకద భాగములును। బాండురంబైతోచె గండస్థలంబులు మధురవస్తువులందు మనసుపుట్టె। కడుముగన్పడజొచ్చె నానాటికినిరుచి విడిచెను కర్పూర విడెములందు। గళలువృద్ధిగముఖ కమలంబుపయిజేరె సేరనాయెనువిరిశయ్యలందు। మృత్తికనుగోరసాగెను మృదులపక్వ। భక్ష్యములవాంఛ గయికొనె పాలుమాలి। కేయును సంపూర్ణమై రతిక్రీడలందు। సిగ్గుచెన్నొందెనై దేహి చిత్తమందు॥ చ॥ అవనిజగర్భమాయెనని యత్తలు సంతసమందరాముభూ। ధవుడునుమోదమంద భరతాదులు బంధువులుల్లసిల్లియా। నవసరసీరుహాక్షికిని నాలుగుమాసములై పిమ్మటన్। సవరణపువ్వమున్మదువసమ్మతి నెంచుచునున్న యత్తఱిన్॥ చ॥ తనప్రియురాలునైనవనితా

## శ్రీరాముడు సీత నెడబాసినట్లు కలగనుట.

మణిసీతను లక్ష్మణుండునై। త్కనకరథంబుపై నిలిపి కన్నులబొమ్మముల వ్వళింపుచుం। జనిచనిజాహ్నవీతటము సన్నిధి యందునజేర్చి నట్లుగా। గనికలకాంచెరాఘవుడు గ్రక్కునభీతిలిచింతనొందుచున్॥ చ॥ తగనలుకంది యిటకనేటు తాళుదునాయని విస్మితాత్ముడై।మగువనుబాసితే యొడల బ్రాణములుండునె యీశ్వరాజ్ఞయే। వగవుఘటిల్లజేయునొ సమాగతకార్యములేతెలంగులో। తగువగునా యిదేమొయని దైన్యతనొందుచులేచిరాముడున్॥ వ॥ మఱియు నొక్క రునింజీరి గురుండగు వసిష్ఠమహామునిదోడ్కొనిరమ్మనిపంపిన వల్లెయనివాడును శీఘ్రగమనంబున మహాముని యాశ్రమంబుం బ్రవేశించి తద్వర్తమానంబు లెఱింగించిన నతం

౩౨
ప భవిష్యదర్థంబు దెలిసి శిష్యసమేతంబుగా జనుదెంచిన॥ క॥ మునివరు డువచ్చి నాడని దలవరులుచు దెల్ప రామధరణీశుడు తా। వినయమున మ్రొక్కి భక్తిని। గనకాసనమందు మునిని కనుగొని పల్కెన్ ॥క॥ జలజాక్షి నిచటను చక। పలుదెఱగుల లక్ష్మణుండు భాగీరథిభూ। తలమునను నిలిపినాడని। కలగంటిని యింక నేమి గతి మునినాథా॥ చ॥ అనిన నాకింత సేపు తనయా త్మనుయోచనచేసి తాపసు డనియె మహాత్మ రాఘవకలయందును గల్గినలక్ష ణంబున్। మనసువిచారమైనరగు కించిదియైనను గాని శాంతులీ। వన మానజేయు తప్పలను దీరి శుభంబులు పొందు జెప్పెదన్॥ సీ॥ ఇదిగాక జన కుని నిచటికి బిలిపించి వలయు వైదేహికిని లిచ్చె నైను। నెలలు పుష్పంబులు నింపగా వలె శుక్ల పక్షంబు గనుభృగు వాసరమున। బరిణ కారీతు లేర్పరచి సీమంతంబు సనుసరింపగవలె నతులరత్న। చకితహాటకదివ్య సదనం బుశాస్త్రజ్ఞు లయిన శిల్పులచేత సమరచేయ। వలయు వహ్ని వేదికా వ స్త్రశతుల। గలశములు పంచశతములు గజములారు। పాడి మొదవులు పదివేలు వాహనములు। దశశతంబులు దెప్పగు దానములకు॥ వ॥ అని చెప్పిన రాఘవేంద్రుడు॥ క॥ ముని సెలవురీతి లక్ష్మణు। ననుజన్మునికని యె నీవు నవనీధవుడా। జనకమహీపతి దోడ్కొని। చనుదెమ్మి హితాప్త బంధు జనములతోడన్॥చ॥ పలికిన లక్ష్మణానుజుడు పైనముగైకొని మ్రొక్కి భేరులు। జెగణతాంగ మెక్కి ఘనసేనలు వెంబడి రాగ మేదినీ। తలముల తిక్రమించి నిజధర్మపరుండయి భోగభాగ్యముల్। గలిగిన తన్మమాపతిని గన్గొనివందన మాచరించినన్॥ క॥ ఆదరణ పామరజనకుడు। మోదంబు

జనకుండు రాఘవాదులక్షేమంబు శత్రుఘ్ను నడుగుట.

నగౌగిలించి ముదితుండై సం। వాదంబులాడి రాఘవ। సోదరుతో జెలిమి గలిగి శోభితుడయ్యెన్॥ వ॥ ఉచితాసనంబున గూర్చుండబెట్టి జనక మహీపాలుం డిట్లనియె॥ సీ॥ ధశరథమేదినీ ధవునిపట్టపుదేవి కౌసల్యసుఖము నుగల్గినదియె। రఘుపతితోడ ఘోరాటవులకు నిజపుత్రుబంపినయా సు మిత్రిశుభమె। విపులకీర్తుల రామవిభు గబోధింప దలచిన కేకయ తనయ మేలె। పావకంబులువ్రాని భద్రాసనంబుపై జేర్చినభాగతుండు సేమకర మె। ఘోరదుర్వారవిక్రమ భూరిధైర్య। సాహసులబట్టి చెండాడి శరశరా సే। నములుధరియించియామేఘనాథుడదర। సమర మొనరించు లక్ష్మణ స్వామి సుఖమె॥ సీ॥ హరుని కోదండంబు నవలీలగాదుంచు రమణీయు డైన యారాజుగలడు। భార్గవరాముని భంజించి జనకాజ్ఞ గైకొని వెడలనే ఘనుడు గలడు। ఖరదూషణాదుల ఖండించియింద్రుజు హీరత్వమణచనే వి భుడుగలడు। సాగరోదకములు సాయకాగ్నిముఖవ భరియింపజేయు నే

వ్రిభువుగలడు । గరుడగంధర్వసిద్ధర గణములలరశరశరాసనపాణియై సమ
రరంగ । నిపుణుడై లేచి దశకంఠు నిగ్రహించి । యెలయు దశరథరామ
భూవిభుడుసుఖుడు॥ సీ॥ పూతత్రిలోక దేవముని పూజితపాద సరోజయాత్మ
త్మభూ । మాత గుణత్రయైక జనమూగకల్పిత మంత్రతంత్రసం । ఘాత
తపస్యారూపహిత కారణకార్యవిలోకమానసీ । మాతసమస్త నేత బుధసేవి
తయై ముఖ్యమై చెలంగునే॥ వ॥ అని వేర్వేరడిగిన వారివారి యోగక్షే
మాతిశయంబుల దెల్పి జనకమహీపాలుడకు శతుఘ్నుం డిట్లనియె॥ క॥
సీతాదేవికిసుమతి । వ్రాతంబులు నిండవలసి వచ్చియుహితసం । ఘాతము
లు బంధువర్గము । ప్రీతివహిల్లంగజాము విచ్చేయకగున్॥ వ॥ అనిచెప్పిన
ను॥ అశేడానందముబొదివి బంధువులతో నాందోళికాశ్రేణితో । సు
తసామంతబుధాప్తసంఘములతో శుండాలసైన్యంబుతో । నుతశృంగార
మనోహరాంగనలతో నూత్నాశ్వయూధంబుతో । జతమారథ్యసమృద్ధి
తోడ జనకాత్మానాథుడే తేరగన్॥ క॥ సాకేతపురీతలములు । జోకలుగా
వించి మంచిమాతదళంబు । ల్లోకులుగట్టి వీధులు । శేఖరమణిమరంగశిల్ప
శిష్ప్రాఢిన్॥ సీ॥ చంద్రకాంతోపలచకితమాబట్టలుకనకనిర్మిత చంద్రకాం
తమణులు । కమనీయతరభిత్తికాలంకృతంబులుచారువిద్రుమలతాస్తంభము
లును। మరకతవైడూర్యమయమై యిటికలువజ్రకవాటవిభాసితములు। స్ప
టికనిర్మితచిత్రసోపానతలములు పచ్చలుదాపుగవాక్షతతులు। నాణిముత్యా
పుమ్రుగ్గులయురుగులమర। మహితశృంగారముగనూత్నమందిరములు। శాస్త్ర
రీతిని జెన్నొందుసౌధములును । భూషణంబైనసాకేతపురముగాంచి॥ క॥ రథ
మదిగి మెంగసాలన్ । పదిదాటగరామవిభుడు ప్రత్యక్షుంబై । పదములకు
మ్రొక్కి తోడ్కొని । సదనంబుననిల్ప జనకధాత్రీపతివల్కెన్॥ సీ॥ ఆత్మ
మాయాన్వితుండై సలసిల్లుచుగారణ మహదహం కారనాథ । గుణరూప
నిజవృత్తి గణవిశిష్టుడవయి పానోద్భవమహాలీలలందు । తేజస్వివయి
యెల్లదేహాంతరంబుల వ్యాపకుండై నిరూపాధికత్వ । మునుబొందిబోధమై
మోహరాగక్రియా రహితాద్యతీతమైంచిహిని వెలిగి । బోధనిహతుండవౌ
దువు పొగడరాక । నిగమ సంచారవైభవసిద్ధ రేంద్ర । సత్యచారిత్ర రవికు
లజలజమిత్రరమ్యగుణసాంద్ర రఘుకులరామచంద్ర॥ సీ॥ జలనిధులునుధరా
స్థలినల్లమునుగకవసియించు నెవ్వాని భయమువలన । బవనుండుపర్వతో
త్పాటనల్నేయక విలసిల్లునెవ్వాని విక్రమమున । దరుణార్కుడును భూమి
దహనంబనిశంబు సలుపుడు నెవ్వాని సాహసమున । జ్వలితాగ్ని మహో
త్కటుండ జగమెల్లగాల్చక యణగునునెవ్వాని యాగ్రహమున । నట్టినీకును
నాసుత నర్పినిచ్చి । నాడనాభాగ్యమేమందు నళినసేత్ర । సత్యచారిత్ర

రవికోటి సదృశగాత్ర । రాజదేవేంద్ర రఘుకులరామచంద్ర॥ క॥ ఆసిరవి
కులతేజునిని । ద్విసయోచిత మమరఁబొగడి వేగమెసీతా । పనితానము
ఖంబునుగ। న్గానికౌసల్యాదిసుతుల కోరికలొందవ౯॥ వ॥ అచ్చట యుండె

ముత్తైదువలు సీతకలంకరించుట.

నంత బుణ్యాంగనాజనంబులు సీతాదేవి సీమంత కుతూహలయత్త చి
త్తులయి॥ క॥ శుభలగ్నమందుసామజ । నిభయానలు నివహమయ్యునిగా
మోదితభూ । విభవంబుగనాసీతకు । నభిషేక మొనర్పఁపిలచి హర్షితను
తులై॥ గీ॥ తలకు సంపంగి తైలంబు గలకునంటి। కురులు చిక్కులు
సడలించి కూర్చి కసపు పరిమళంబులు నలుగులు బాహుహస్త । చరణ
ముల బెట్టి బాడిరి జలజముఖులు॥ సీ॥ స్నానంబుగావించి సరిగంచుగల
మంచి చేలంబుకుచ్చులు జేర్చికట్టి । చనుకట్టుపైవడి చక్కనివన్నెలు కలి
గిన నవకంచుకంబుతొడిగి । జడనల్లిజాజులు సన్నమొల్లలుమొల్ల బంతు
లు మందారపారిజాత । ములుచుట్టి కస్తూరితిలకంబు చేదిద్ది చిత్రించిమకరిక
ల్చెక్కులందు। గనులగాటుకసోగలు గాగదీర్చి। యగరుగంధంబు మెడకును
నలదిదృష్టి । చుక్కనుయుంగిద్ది మొగములో సొబగుకనుల । తేటనడమంద
మయ్యె వైదేహికపుడు॥ సీ॥ మగరాలతళుకులనిగనిగ చిల్కులతాపినపగ
డాలదండలందు । జెనగుచు తెపునరుల్చితిహారంబుల మణిహారములును
తామనువుగాను। బొందించిపాపట బొట్టిరుగడ చంద్రసూర్యులనిలిపిసితకు
ధ్ధరల్నె । ఖచితమాజమికీలు గమ్మలుగొలుసులు ముత్యాల కెంపులము
కురయును । జంపులా మంచిమురుగులు నింపుగాను । బవిరెలునుదెచ్చి
నవరత్నబాటిబందు । సూదిదండలతా మొతుల్వాలజనక । జాతకుధరిం
పనిచ్చిరి చంద్రముఖులు॥ సీ॥ అపరంజి యడ్డిగలనుసరించినజాతి ముత్యా
లకట్టిడ ముద్దుటుంగ । రములుమోహాలమాల రత్నదేవళములు నరిప
ణ కుతికంట్లుచంద్రరేఖ కుప్పెరేఖయు జడకుచ్చులు వెలలేనివుంగిగ
చౌకట్లు మొలకుబసిడి । గంటలుపచ్చల కరకంకణంబులు హస్తకడెం
బులుసిస్తుమీర । గనుశిరోమణి గజ్జలు కనకసూసు । రములుమెట్టెలు
పాదమూలములసకల । భూషణంబుల నవయవంబులకునిచ్చి। శేఖర మొన
ర్చిరావేళ జిగురుబోండ్లు॥ వ॥ తదనంతరంబు॥ మ॥ బంధువు లాశ్రితు ల్నెచె
లులుబోరులు మంత్రులు తమ్ములాప్తుల౯ । మందర సందడింపనిగమో
దితమంత్రము లుచ్చరించుచుం। గొందరు భూసురోత్తములుగూడఁగ రాఘ
వసార్వభౌముడ౯ । మందిరమందుజేరె మహిమాన్వితుడై సురరాజుకైవ
డి౯॥ శా॥ భూరాజాంగనవిమ్రమాధరుల సొంపొప్పంగ బాలింద్లపై । హా
రంబు ల్నసింపాడ బాహులతలం దద్దంబు చెన్నొందనుం । దారోదంచితసిల

వేణులు పదద్వంద్వంబుపై జారఁ శృంగారాకారములొప్ప భూమిసుతకుం
గైదండలిడేర్చుచుఙ్॥ మ॥ జరతావన్నెయచీర పాదములపై జారఁ గస్తూరిం
గారవై ఖయ్యాకంచుకముం జెలంగ మణిసంకాశంబైనహారావళుల్ । ల్మె
రయం బయ్యెదలోనవేణికటిపై మిన్నాడ తాంబూలపా। తెరయుఙ్ ఘుమ్మ
నలోకమోహయగు వైహీదేవుంతనై తేరగ॥ చ॥ చనుపేరం బుచార
కాంగనలు నిచ్చాభక్తితో భేదరీముల్ । ఘనమా చెక్కుపలాలవట్టు
ములు లోకశ్రేణిమోదింపగా । వెనుకకుముం దరబట్టు జామరములు
న్వేయంగ దాపైభవంబునకో భామలు పాదవిపర్యసిత లోవ ర సేమబు
నఙ్॥ చ॥ తెలుపై యొప్పు కపోలవైభవముతో దేఖైన కెమ్మోవితో। బల
మొప్పారిన జానుదేశములతో బాహల్లతాకాంతితో। గళలుం దేరసుధాక

## సీతా సీమంతమహోత్సవము.

రాననముతో గంధేభయానంబుతో । జళుకైకాంచన సౌధభాగమున సీ
తాభామవిచ్చేసియుఙ్॥ క॥ పసిమిగలబాహులతతో। శశివదనము కోటిసూ
ర్య సంకాశముతో। దశరథునిపెద్దకోడలు । విశదంబుగరామచంద్రు వెను
కనుపిలిచెఙ్॥ మ॥ వరపీఠంబున దద్వధూవరుల నేమంబొప్పగాజేర్చి భూ।
సురవర్యుల్గురు వా వసిష్ఠమునియుఙ్ శోభిల్ల వేదంబులుం। బరిపాటించుచు
లాజ దూర్వాఘృత సంపన్నంబైన పాత్రాళి నే। ర్పరులై వేది లందునుంచి
శుభ మొప్పారంగ శీలాత్ములై॥ ఉ॥ నాలుగుమూల లేర్పఱచి నాలుగు
వేదికలందు నిండగా। మేలగుహోమకుంభములమీదను నిర్మలతోయకుం
భము। ల్బాలననలంకరించి గలశంబులునాలుగు వేలహోమమా। పాలికెలుం
చి పావకునిభక్తిగ గైకొని కార్యతంత్రులై॥ సీ॥ స్వస్తిపుణ్యాహవాచన
మునను నొనరించి విభవమొప్పారంగ శుభదముగను । హవనంబు గావించి
హాటకమయమైన కలశముల్వృషభముల్కపిలవర్ణ। ములుగల్గుధేను సమూ
హంబు నవవస్త్రచయములు భూసురసంఘములకు । నర్పించి యగ్రహార
ములాక్షణంబున దత్తంబుచేసి మహోత్తమాశ్య । వర్ణితముగాగ నొన
రంగవైభవమున। సకలరాజన్యబాంధవ సహితుడగుచు। జనకజనుగూడి రా
ఘువస్వామి వెలసె। బద్మజాధిక సురవరు ల్బ్రణుతిసేయ॥ గీ॥ భూరిభేరీరవం
బులు భోరుకొనగ। వర్ణితంబుగమంగళవాద్యభేద। ములుచెలంగగనర్తన
ములకువారి। భామినులు మొత్తమైయొప్ప భాసురముగ॥ గీ॥ వెలదిధమ్మి
ల్లమునకును విమలసూత। మామరగాజుట్టి పరిమళమైనకుసుమ। మాల్యము
లునించిశాస్త్రసమ్మతిగనాగ। మౌక్తికముగట్టనిచ్చిరి మదిముదమున॥ వ॥
అట్టి సీతాసీమంతవివాహకాలంబున॥ చ॥ తురగములైదువేలు మదతో
యవిభాస మహోన్నతంబులౌ। కరులునుమూడువేలు నవకాంచనచేలము

లారువేలు సుందరులుసహస్రసంఖ్య సుమదామములాదిగ నిచ్చిప్రీతిగ్రీకిం। గరుణదలంచిజూచి జనకాధిపుడప్పుడు వల్కెజెచ్చెరన్॥ చ॥ అలికులనీల వేణి జగదంబవు దృష్టికిగార్యకారణం। బులకును గస్త్రవైభవము నొందగ బ్రహ్మయురుద్రముఖ్యులుం। దెలియగలేరు నీమహిమ దీనశరణ్యవె లోక మాతనా। కులముగబుట్టినావు కృపకోటులు సన్నుతిసేయ నిత్యమున్॥ చ॥ తపములు నెన్నిచేసితినొ దానములెన్ని తలంచియిస్తినో। జపములు నెన్నిస ల్పితినొ సద్వ్రతయాగములెన్ని చేస్తినో। సఫలముగా మదీయకులజాతవు నైతివిలోకమందు నా। తపములుపండెనమ్మ జగదంబవుగావె త్రిలోకసుం దరీ॥ చ॥ నినుదలంపనోపుదురు నిర్జరులైనను నిర్వికల్పనా। ధవరులైన ఘోరవనతాపసులైనను వృద్ధులైనయో। జననిభవత్కటాక్షమునచాలబ్రి సిద్ధముగ్గభాగ్యమై। ననుగడతేర్పుమమ్మ జననంబునుబొందక సేయుమీ శ్వరీ॥ క॥ అని భగవతియగుసీతా। వనితనునుతియించి భానువంశ్యుడుపను పుం। దనచతురంగబలంబులు। చనుదేరగ ముదముజేరె జనకుడుకడిమిన్॥ క॥ కాకుత్స్థుడులోకంబులు। నేకంబుగనేలుచుండి హితమతితోడా। నేకాం తసౌధభాగము। జేకొనియొకనాడు రాజశేఖరుడుండెన్॥ అప్పుడు॥ సీ॥ క ళలుదేరెడుచంద్రకావిపావడమీద సరిగెపట్టులచీరె సవరగట్టి। వెలిప ట్టురవికలోపల గబ్బిగుబ్బలముత్యాలసరులు ల్లసురుకొనగ। గొప్పవ ల్లజయందు గుప్పిన సురపొన్న బంతులునెడనెడ బెమలింప। దాటంకము లయందు దాపిన నవరత్నకాంతులు చెక్కుల గదలుకొనగ। మురిపెము మె రంగ దిలకంబుమెఱచుపైట। తొలగగజ్జెలు పదముల గలసిమ్రోయ। పల్ల వించి తమల్లన దల్లడిల్ల। గుసుమతల్పంబుజేరెను గోమలాంగి॥ చ॥ కరము లుచేర్చిమ్రొక్కి తమకంబున జెక్కులునొక్కి యింపుగా। సరసములాడి। నే ర్పుకొనసాగగ గౌగిటగుర్చిచ్చిబాళిము। మ్మరముగలంగ నిబ్బరపుమాటలు తేటలసోలి యంతలో। గరుణమెలర్పగ్గ జనకాత్మజరాముని సన్నుతించు చున్॥ చ॥ తమకముమించెరామ యెటుతాళుదు సూనశరుండునింతలో। గ మకము సేయుచున్నిలిచె గౌగిటజేర్పకపోయితేని వి। భ్రమమునుజెందు మోహమెడబాపగజాలనుబిల్కతేజిచం। దముకనుగొంటివావిహితధర్మము గాదికనూరకుండుటల్॥ చ॥ విడెముమర్చియిచ్చి నిజవేణిపదంబులనంచరం పగా। దొడగినకంచుకంబు జనుదోయిఘనంబయిదోపజెమ్మటల్వో। దలజెవు ర్పబొమపులనొక్కటిగాజెనవైచి కచ్చలో। ముడిసడలించి తాలువులుము ద్దులుగైకొని మాటిమాటికిన్॥ సీ॥ భావజకేళినిబడలితివియధర పానకంబు నుగ్రోలుపరమపురుష। విరహాగ్నికాకను వెతలుపొందగనేల కుచశైత్యోప యిజేరు కోమలాంగి। మోహసాగరమందు మునిగితేలంగనేల కరవల్లికలు

గొను కమలనయన। చతురోక్తులలసట జతనమా యెనో కమ్మనిట్టూర్పుగ
యికొమ్మ నిగమవేద్య। యనుచు సీతామహాదేవి యర్కవంశ। సంభవుం
డైన శ్రీరామచంద్రుతోడ। గూడి రతికేళి దేలుచు నీడులేని। వైభవంబున నొ
కమాట పల్కె నపుడు చ॥ వనజదళాయతాక్షి యొక వాంఛ దలంచితి
జాహ్నవీతటి। వనమున సంచరించి మునిపత్నులతో విహరించి వత్తునా।
మనవిని జిత్తగింపు మనుమానము సేయక సెల్వొసంగవే। యనిన రఘూ
ద్వహుండు మదియందు న ఝల్లని తల్లడిల్లుచున్॥ చ॥ కలగనినట్టిరీతి జన
కాత్మజ గోరె నికేమి సేతునా। తలలిఖితంబు జూచెద యథార్థముగా బర
మేష్ఠి తొల్లి యే। కలుషము నెంత జేసితినొ కామితభోగము లంద లేకయా।
జలజదళాక్షి కానన విశాలతలంబులు గోరనేటికిన్॥ చ॥ తొలి వదునాలు
గేండ్లు ఘనదుర్గమహీరుహవల్లి కంటకం। బులవికరీత ఘోర మృగముఖ్య
మహాటవులందు తుత్రిపా। సలవగమెట్టి యాతనలు చాలనలేక లతాంగి
యిప్పుడా! తలమలు గోర నేల యిక దైవ మెట్టిదో యెంచి చూడగన్॥
చ॥ మనమున ఖేదమందుచును మాటిమాటికి విస్మితాత్ముడై। జనకజ
నీదు కోర్కె గొన సాగగ జేయుదు రేపు ప్రొద్దని। న్నజాగిగూర్చి వంపెద
ను నాత్మ తలంపు సిద్ధమంచు గా। దని నుడివిన్న పుత్తునె యథార్థము
గా నెపుడైన కోమలీ॥ చ॥ వదనము జేర్చి ముద్దుగొని వాతెరలాని విలా
స మొప్పగా। జెదరక కొప్పు దువ్వి మనసిచ్చి కవుంగిట జేర్చి యేతుదల్లొ
దలును లేస మోహమున మున్గుచు సీతను గుస్తరించి లో। సదనము నందు ని
ల్పి జలజాప్తకులుం డరుదెంచె గ్రిక్కునన్॥ చ॥ అడవము గిడెంబొని

### శ్రీరామచంద్రుం డర్ధరాత్రంబున సభ కరుదెంచుట.

యొక డంచకు వచ్చెను నంతలోనలో। గడకలు దాటి చద్రితమకంబున గం
చుకులెల్ల గుప్పులై। విడివడి వెంబడింప రణవీరులు హెచ్చరికంచు గొ
ల్వంగా। నడవలు దాటి రామనరనాథుండు పోవగ జూచి భీతులై॥ సీ॥ జన
కతి యీనిశాసమయంబునను నిద్ర తొలగివచ్చుట కేమితోచినదియొ।
యెంత కార్యములకు నిలువెళ్ళి యీరాత్రి రావలె రఘుపతి భావమేమొ।
కమనీయ సౌధభాగము లందు వైదేహి ముచ్చటల్వీడనాడి వచ్చుటేమొ।
బ్రహ్మాది సురలెల్ల వచ్చినారనినను లక్ష్యమెంచునె యేమిలక్షణంబొ। యను
చు దవ్వారికులు లేచి యరుగుదేర। ద్వారపాలకులును మది దల్లడిల్ల।
వచ్చి నిలుచుండె గావలివారు భయము। నొంది కరవాలహస్తులయి ముందు
రాగ॥ ఉ॥ వేకువ ఝాములాయెనని వేదనబొందుచు గామినీమణు। లోక
కలు వైపుచేసికొని కొప్పున నుంచిన సూనమాలికల్। జోకగ దిద్దితంబుర
లు సొంపుగ మీటి ప్రభాతరాగముల్। మూకలు గట్టిపాడ బుధముఖ్యులు

నదియొగుడుతు । పరమపావనుఁడౌట బదధూళిచేరాతి సతివగావించితి వ
దియొగుడుతు । శాంతవంతుఁడౌట సామ్రాజ్యములుమాని యడవికిఁ జరు
దెంచి తదియొగుడుతు । ఘనవిక్రముండౌట దనుజేంద్రుడనకను నెదిరించి
బరిమార్చి తదియొగుడుతు । ధర్మవర్తనుండటనుచు దపసివరుల । కభయ
ములనిచ్చి రక్షించు నదియొగుడుతు । విపుల బలవంతుఁడనుటను విశిఖము
నను । నబ్ధిజలమెల్ల నిలిపిన యదియొగుడుతు॥ శా॥ నీనామోచ్చరణం బొ
నర్చుటలచే నిర్మూలమౌపాపము । శ్రీనాథుండవు సర్వలోకములకుం దే
వుండవై స్రష్టవై । నానాజంతు సమూహరక్షకుడవై నారాయణుండౌ
దువౌ । గానన్నిఁ గొక దోషములలుగువా కారుణ్య సంధాయకా॥ శా॥
లీలా మానుషదేహధారివై మహాలీలాత్మకీర్తింపగా । జాలన్ లేదురమేశభో
గిశయనా సామ్రాజ్యమున్ ల్వేడుక । లీలలోనే వెలుఁగొందు సత్వగుణుడై ని
ర్వేద్యుడై నిత్యుడై । పాలింపంగలవాడ వౌదువు పరబ్రహ్మ స్వరూపుం
డవై॥ చ॥ అని మొదలైతె కాని జనులందఱు నెవ్వరు నిందితంబుగానని యా
డువారు లేరు మఱియుల్లపలుపల్కిన పల్కులింకనే । వినుకొని విన్నవింతు
భవదాజ్ఞకు భీతివహించి భూమిలో । వినినవిచిత్తగింపు రఘువీరసుధాకర
సన్నిధాననా॥ చ॥ పురరజకుండు నీచుడుసు భూరిమదాంధుఁడు పాపక

## చారులు రజకునిమాటలు విన్నవించుట.

ర్ముడౌ । తురు డొకనాడు చేలములు తోచినవన్నియుమూటగట్టి సం । బ
రమున రేవుఁజేరి జలభాగములంగల మైలతీసి వే । గిరముగ నింటికేగి త
నకాంతను రమ్మనిజీరి యిట్లనున్॥ మ॥ అవునే యాపరిధానము ల్బయ
మునన్ హస్తంబులో నెత్తవే । జనతోనేగవె । యింట్లనొద్దకును వోజ
న్నీకు మొండామొనే । నపులాటల్ యిదిగాదుపోవె ఘనత స్వతంత్రంబు ల
ర్పింపవే । కవళంబుల్గొనిరావె గ్రక్కునను లోకశ్రేణిచే భామినీ గీ॥ గ
రితవినవె నాల్గుగడియలకును దావు । చేరకున్నశాంతి నేయగలను । అని
స రోషగించి యతివయు గొణుగుచు । గోకలెల్లమూపు గూర్చివెడలె॥
చ॥ సదనములందు దూరుచును చాకలిసాని దుకూలసంఘముల్ । ముది
తల చేతికిచ్చుచును ముచ్చటలాడుచు బొద్దుపుచ్చుచు । న్నదుకకయున్న
చీరఁ కునొప్పుచు రేపనియొత్తు జెప్పుచు । న్నదగకయర్ధరాత్రితనదైనగృహం
బున కేగనాతడున్॥ చ॥ ముఖము మొగిజేవురింప గడుమోహము లేక మహో
గ్రచిత్తుడై । వికటుడునైయిదేమెయె దభీతిదలంపకమి డగాంద్రతో । సుకమని
కామకేకిని బొక్కగబోయితో కానియుంచు గొం । చకమెడబట్టి త్రోచి
వనితాయిలు జొచ్చెదవేని దుంచెదన్॥ గీ॥ అని నదియిల్లువిడిచియునా
గ్రహమున । బొక్కుచున్ వెక్కి యేడ్చుచు బుట్టినట్టి । యిల్లుఁజొచ్చిన

సమరములు సేయవచ్చిరో సత్వముమర। దేవతలువచ్చినారొకో దిశలునిం
డి। సాగరముదాటివచ్చెనో చంద్రధరుడు। నలిగనో లేక యిది యేమి
యనగవచ్చు॥ ఉ॥ కోటలకెక్కి పైవళిము గూడుచునున్నవి ఘోటకంబు
లుం। దాటుచునుండెవీథులకు ధైర్యములొప్పగ నాగుచుండె క। ర్ణా
టకపెకు దేశ నరనాథులువచ్చిరి భూరిసైన్యము। లోటుల కొద్దివాకిటను
గూడుచున్నవి యేమిహేతువో॥ చ॥ సమరరథంబులద్దె మొగసాలకు
మూడర జేరియుండచే। గమగమనంబుచుంగలిగి గంధమదేభము లొప్పి
యుండె। ఖేదమున శరాసనంబులను దాల్చిమహారథవీరవర్యులుం। గుములు
గగట్టినారు నృపకోటులు నేటికి గావియు దురో॥ చ॥ శరములుచాపము
ల్గదలు చక్రములు న్ముసలాయుధంబులుం॥ బరిఘలు పట్టివచ్చిరి యపా
ర పరాక్రములైనవారు పి। ర్వరవరవాహిసీపతుల భంగము సేయగలంగె
నంచు భీకరముగవచ్చెసేనజయ కాహళినాదము మ్రోసెదిక్కు లక॥ వ॥ అం

## శ్రీరాముడు లోకాపవాదంబు తమ్ములకెఱింగించుట.

తదూర బునభరతాదులురఘువల్లభునిం గాంచి॥ సీ॥రవిముఖంబె కానిరాకేం
దుబింబంబుగాదు నెమ్మోము శృంగారమెన్న। జ్వలితాగ్నియే కానిచల్లగానిజ
భక్తకరుణాకటాక్ష సంగతులుగావు। వీరరసంబుచేవిభవమందెడుగానితతన
వనీతసంగతముగాదు। ప్రళయాగ్నిరుద్రునివలె మండుటయెగాని కమనీయ
రామవిగ్రహముగాదు॥అనుచుభరతాదులునువచ్చియంఘ్రికమల। ములకు
బ్రణమిల్లి కరపద్మముకుళులగుచు।నిలచియుండినతమ్ములనెనరుదోప।జూచు
చునుబల్కెరఘువంశశోభితుండు॥ క॥ ఇనవంశులయినరాజులు।జనమాన్యులు
సత్యకీర్తి సాంద్రులు సుగుణుల్। ఘనమానధనులు సంగర। జనితబలా
ధికులు పాకశాసనతుల్యుల్॥ సీ॥ రఘుకులస్థులు భగీరథుడు హరిశ్చంద్రు
నలపురుకుత్స భూనాథవరులు। సత్యవ్రతాచార సద్ధర్మములవృద్ధి బొం
దుదురెపుడు విభూతిగలిగి। దశరథమేదినీధవు గర్భమునబుట్టి యపకీర్తి
బొందంగనౌనెమనకు। హీనవృత్తిగభూమి యేలుటకన్నుదెలసికాననములు
దిరుగమేలు।సీతపావనియనివాచిచిత్తమందు। దోచియుండిననిందలు దో
చుకతన। నిలువగూడదు నెంతయు నెనరులేక। నడుపగలకార్యములుమీరు
నడుపవలయు॥ ఉ॥తమ్ములునైనమీరెనిరతరంబుగమంత్రులునై। మీరెరా
జ్యమ్ములునైనమీరెబలసైన్యములైననుమీరెరత్నము। లొమ్ములునైనమీ
రెప్రియశోభిత బంధవులయినమీరెకా। ర్యమ్ములు మీరకారె రఘురాజు
లకీర్తులుచూచి నిల్పరే॥ ఉ॥ ఏమనసేలదేవ కృతమిట్టులనుండగగాదు సీ
తపై। నేమములేక నిందలను నిల్పిరిమంచిది యింకమీదటక్। భామిని
గూడియుండనుగృహారన ముంచితినేని లోకులుం। గామియటంచు

బల్కుదురు కావున నీయపకీర్తి మాన్పవే॥ వ॥ అని యాగ్రహయుతమానస మాన
సుండైన॥ చ॥ భరతుడు మ్రొక్కి యిట్లనియె బావనసీత మహాత్మ్య రామ

## భరతుండు రామునకు సమాధానంబు చెప్పుట.

సీ। తెలియగనిదేమి పావని వేదిని జల్లగ నేయ నిగ్గగు । ల్పైమ వలిపత్రి తా
మణియు భాగ్యవతి యనిబిల్వలేనెము । స్మరచితివేమొ నేడు మనమునా
నము చిత్తము సోకనేటికిక॥ సీ॥ జనకుమానస్థైర్యమట్టి జనకసుతరావ చరిత్రి
వర్తికిబాత్రి జలరుహాక్షి । ధరవన్నె గాంచిన దశరథ నందనీ ధన్యులు పద్దకోడలుత
లిరుబోణి । రావణాంతకుడైన రఘురాము పట్టపుదేవి భాగ్యరేఖల దీపి
తాంగి।మంత్రాదిదేవత యంత్రతంత్రశ్రీ వగ్గి తను లోకమాత సీతాలలామ।
యనగ యజ్ఞులు తెలియక నాడినట్టి । మాటలను నెన్నదగునె సమానస
మున । నిఖిల జగతికిమాతకు నింద యనగ । నెట్లు సీతాధవానిని నెన్న
దరమె॥ సీ॥ మనతండ్రి దశరథ జనపాలకుడు సీత కోడలుగా సురవరుల
తోడ । వచ్చి పావని రమావనిత జగన్మాత యనిసి జాత్మనెంతెంగి యాభిను
తించి । నీవు కోడలవౌటనే పుణ్యహేతుకనై స్వర్గభోగంబులు సంఘటించె।
నర్కవంశమునకు నధిక తేజముగల్గె సకల సౌభాగ్యము ల్సంఘటించె ।
ననుచు వచియింపగాలేదె యమరవరులు । పూలు గురియింపవప్పుడు
భూమిజాత । గొనుచు దహనుండు సన్నిధిగూర్చి సీత । లోకపావని
యనలేదె లోకమందు॥ సీ॥ అవనిజ పెండ్లియైనది నుండి దశరథభూ
భర్త జనక భూపాలుడనుచు । పత్తలమర్యాద లందు వంచనలేక కరుణి
చుచును మహాగౌరవమున । మమ్ము బుత్రులమాడ్కి మన్నించి మముబలు
తెఱగుల రక్షించు దీనపోష । సకలజీవాధార సంభృతంబగు రామాత్మాని
క బ్రహ్మమే తలచుచుండు । నిత్యకల్యాణిపైదయ యనిత్ప్ర వృక్ష్ర్త । జనులు
పల్కిన యజ్ఞానసంశయములు । విడువగావలె భేదంబు నుడువనగునె ।
తమకు దెలియగరానిదెందైన గలదె॥ వ॥ అని చెప్పి యనంతరంబ॥ చ॥ వి
నవిని లక్ష్మణుండు మహదాగ్రహరోషజవానలంబులో । గనులను నిప్పు

## లక్ష్మణుండాగ్రహించుట

లుం గురియ ఖడ్గము గైకొని భూమిజాతపై । ననుకొనుసట్టి దుర్జనుల నం
దఱ బీచమడంచి వత్తు నీదినమున నంచు పల్కగను ధీరతతో ననుజన్ము డిట్ల
నుఁ॥ ఉ॥ దోషము లేదు తప్పింకవలె దోచక తల్లిని నిందసేయుదు । రాక్ష
షకు నీవశంకరుని వైభవ రాజసభాగ్రమందుని । ద్రోషిణి సీతపై నుయిల
దోపగబల్కితె యూరకున్న సం । తోషముకల్గనా యిదిగొ ధూర్జటి
నైనను దాకకుందునే॥ క॥ మనుజేశు డపుడె యనుజుల । గనుగొని లో
కాపవాద కారణమిదియుఁ । జనకజను విడువమేలగు । మును మామాకార

ములు విడిచి వచ్చెడిమార్గ్గకా. క॥ పురజనవార్తలు నిలుపక । దరమూనే తనుమనోని దర్పంబానే । తరుణార్క వంశవిధములు । గురుతెలిసియు సీతమైత్రి గోరగనగునే॥ ఉ॥ సీతయు సాధ్వియంచు మనచిత్తమునందును తోచుగట్టిగా । ధాతలిఖింపగా నొంసట దైవగతైనది యింకమీదటం । బ్రీతియొకింత చేయుదునె భేదముబొందెను భూతలంబు కా । ఖ్యాతులు గోరుచుండ జనకాత్మజ మోహము నెంచ నేటికిన్॥ క॥ మానుము రోషావేశము । మీనాక్షిని విడిచిపుచ్చు మేలనితోచెన్ । మానంబు లేక బ్రతికిన । గానలబడియుండు గూటకైవడిగాదే॥ గీ॥ బ్రతుకవలయునొవల బ్రాణంబు లుండిన । దానసుకృతకీర్తి ధర్మమార్గ । విశరణముల యందు వెలయగా నటులేక । పోవువాడె యధమ పురుషుడనగ॥ గీ॥ బ్రతుకుల స్థిరములు భార్యాదులును బుత్రి । మిత్రగణము ఋణమువృత్తియనిజము । గాగదెలసి మోహ గమనమార్జిపక । యుండునట్టివాడె యుత్తముండు చ॥ మదిదలపోసిసీత యభిమానమమానితి నిశ్చయంబుగా । గడిసినదైవ సంఘటన గైకొనకున్నను బోనెయంతలో । దుద మొదలేని ప్రేమయెటు తోచును తోచిననేమియైననా । హృదయము శైలముందనరునూహలు జేయగనేల యిప్పుడున్॥ గీ॥ భరతశత్రుఘ్నులా వేళ భావమెల్ల । దెలిసి భర్తకునేడు వైదేహిమీాక । గరుణ లేదాయె జండభాస్కరుని మా

రాముడు సీతను వనంబునవిడువ లక్ష్మణుని నియమించుట.

టిక । దోచుచున్నాడనును కొంతతొలగియున్న॥ చ॥ తగదని లక్ష్మణుండు బెసిదంబుగ జేరగబోయి యాక్మలో । వగపులుమూసి రాము నరనాథుడు శోకదవాగ్ని గాగ్రిగా । దగవుగబోవగా దగదు ధైర్యముతోగను గొంకు నంచు బోం । దుగవ్యసనంబుతో నిలువ దమ్మునితోడను రాఘవుడనున్॥ శా॥ అన్నా లక్ష్మణ దైవయత్నములకు న్నాయాసమై యున్నటో । దన్నా బ్రహ్మకునైన బూర్వకృతము ల్దప్పింపగా వచ్చునా । విన్నావా సుఖదుఃఖముల్ క్రమములయి పీడించు దేహంబులో । నున్నంతం బరమాత్మయేలయిపుడీ యుగ్రప్రసంగంబులున్॥ చ॥ కరవాలంబునుపట్టి నన్నునిపుడే ఖండింపులేకున్నసీ । ధరణీకన్యను వెంటబెట్టుకొని సత్యంబొప్పభాగీరథీ । వరతీరంబునవిల్చి రమ్మ కలుషవ్రాతంబులుం బొందుచుం । ధరణింగాంచుట చేతకీర్తిగలదే ధైర్యంబువర్ధిల్లగాన్॥ వ॥ ఇదియునుంగాక॥ క॥ మనసారనిన్నగంగా । వనతలములు సంచరించి వాల్మీకమహా । మునియాశ్రమమ్మజూచెద । ననినది భూజాతయదియె యనుమతిగాగన్॥ గీ॥ తెలియబడనికకృత్యము దేవికిపుడె । దివ్యరథమందునిడుకొని ధీరవృత్తి । వెడలిగంగానదీతీర విపినమందు । నిలిపిరావలె నన్నుగావలసి

సీవు॥ చ॥ అనినశిరంబువ చుకొని యనుశ్రీలునిండగ కన్నులందు నే | జన లయ బొంది లక్ష్మణుడు దైవమునుం దగదూరి కోర్వరుక్ | ఘనముగ నె క్కవచ్చి జనకాత్మజసన్నిధి జేరి మ్రొక్కి యా | జననిరఘూద్వహుండనిపె జక్కగజక్క ము గోరుకొనగ॥ వ॥ అనిన సీతామహాదేవి తెలియక సంతు ష్టాంతరంగయై లక్ష్మణా రఘువంశవర్ధనుండగు శ్రీరామభద్రుండు మదీయ స్నేహంబంగీకరించినే గోరినచందంబున సెలవిచ్చి పంపెనేయనుచు ముని కన్యలకుండగు వివిధాంబర రత్నభూషణ భక్ష్యసముదాయంబులు సంగ్ర హించి జాళువానిద్దంపు కమ్మికంబుంగు తెలి గు బురుసాని చీరధరియించి నిగ్గుతరుగక బెగ్గడిలుకంచుకంబుదొడిగి నిటల తలఘటిత మృగమదతిల కంబు విలసితంబుగావించి ప్రసూనమాలికా నికరంబులు మత్ప్రసన్నిభ నిజనీలవేణీతలంబునం జుట్టి కాంచననిర్మిత రత్నఖచితాభరణంబులుగీల్కొ ల్పి మనోల్లాసితవదనయై నిజమందిర ప్రదేశంబువిడిచివచ్చి కరమపావని

## సీత గంగాతటవనంబున కరిగెదనని కౌసల్య నడుగుట.

యగు కౌసల్యాదేవి కిట్లనియె॥ గీ॥ సకలదురితాదిజహ్నునీసలిలతీర | మందు మునికన్నియలగూడి యుండదలచి | రఘుపతిని హెచ్చరించితి రాత్రి నేడు| సెలవుదయచేసి లక్ష్మణుని సలరఁబంపె॥ గీ॥ తాము ననుమతియొసగినదర లిపరమ | భాగిరథిజూచివచ్చెద భావమందు | జేరియున్నది యుంకోర్కెచి న్నపుచ్చ | వలయునదిగాదటనిసీత పలుకుచుండ॥ వ॥ కోడలింజూచి కౌస ల్యాదేవి యిట్లనియె॥ ఉ॥ జానకి చంద్రశాలలును సౌధతలంబులు హేమ గేహముల్ | పూనినరత్నవేదికలు బుష్పఫలాన్వితమైనతోటలుక్| మాని మహోగ్ర కంటక విభాసితపర్వత కాననంబులో | మానిని సంచరించుట లు మంచిదియై సుఖమై చెల్లునే॥ ఉ॥ తక్కువలేదు భాగ్యములు తమ్ము లతో రఘుభర్త యెప్పుడు | న్నక్కరగల్గియుండు జనులందరకుక్ దొరసా నివౌదువే | ఇక్కగపూర్ణగర్భమును సాభవమైనది వేళగాదుయే | దిక్కు కుబోవనౌనె యిదితేజముగాదని బుజ్జగించుచుక్॥ చ॥ జనకజ పోయి కా నన విశాలతలంబులు శైలదేశము | ల్పెనగొని యెండచేనొదిగి భీషణమై మృగకోటికూడగా | జనిచని తోయముల్దెలియ జాలక దప్పివహిల్లతర్లి యా | వనములసంచరింతునను భావములో దలపోయనేటికిక్॥ గీ॥ సద్గు ణంబులరాశివి సాధ్వివౌదు | గోడలౌటకు మేకుతో గూర్చితోల్లిహరి నిబూజించి యుంటివా యఖిలలోక | మాతవైయొప్పి విలసిల్లుసీతనీవె| తు॥ గుణరూపంబును యౌవనంబుదగు నాపుణ్యంబు భాగ్యంబునో | జనసీనీకును రామభద్రునకునే చందంబులన్నాకశే | ఘనమైయుండగ కాముశాసి యిపుడా కాంతార భాగంబులో | మునికన్యల్గన వేళయానె

యిదియేమోదంబులొ జానకీ॥ చ॥ అనిన నొకింత సేపునకు నంజలిజేసి ప్రియంబుదోపగా। వి. వలెనమ్మ నామనవి వేడుకతోడుత జాహ్నవీతటీ। వనములజూచిపొద్దుగని వచ్చెదనంచు క్షణంబునిల్వ మి। మనసువిధంబుగా నడువ మంచిదిగాదె జగద్ధితంబుగాన్॥ క॥ సెలవిచ్చినపుడె పోవరె। నిలిచిన బొమ్మనునోయనదొ నిమిషములోన్। జలతీరమరసివచ్చెద। సెలవాయని లేచివచ్చి జలజాక్షియునున్॥ పౌరులు సీతంజూచి చింతించుట.

వ॥ పవననిభజవ తురంగంబులంబూన్చిన కనకరథంబుపై గూర్చుండిన వైదేహి గావెనుకలినై ధనుర్ధరుండగు సుమిత్రానందనుండు నిలిచి యుండ జగ్గంపులు మొగ్గనూకుచుముంగలినై సుమంత్రుడు రథంబుజిత్రగతుల నడిపించుచుం బోవ దత్పురజనులు గుంపులయి రాత్రి సవసవలుగాబుట్టిన మాటలిప్పుడు యథార్థమాయెననువారును మనయోపుణ్యాత్ములు కొంచెంబులో మునిగినవారుగారు జగన్మాతపై నిందలు గల్గి యరణ్యంబునుం బొందింప సగునా యనువారును వారిగతులు పరమేశ్వరుండెఱింగి చూడవలెననువారును వారలేరీతుల బోదురో కాని బంగారువంటి కాపురంబునకు భంగంబులాయెననువారును శ్రీరామభద్రుండు సీతామహాత్మ్యంబు దెలిసియుండియు సజ్జులపలుకులు ప్రధానంబుగా నిందచూలాలింగానసంబునకుబనుపవచ్చునాయనువారును రామచంద్రుడేమిసేయు రఘువంశవర్తనంబుదెలిసి లోకాపవాదకార్పణ్యంబునసీతామోహంబు విడనాడెననువారును భరతశత్రుఘ్నులయిననిపుణ్యవతికి నడ్డపడరైరిగదాయనువారును జన్మాంతరప్రారబ్ధ భోగవశంబులు దేవతులకైనం ద్రోయందరమానాయనువారును జనకజలక్ష్మిస్వరూపంబుగాని యితరంబు గాదనువారును నీమె యెచ్చట ప్రవేశించిన నచ్చట భోగభాగ్యంబులు గలిగియుండవాయనువారును నీ సుమిత్రానందనుడింత సాహసకృత్యంబంగీకరించి తోడ్కొనిపోవచ్చునా యనువారును నితండేమి వచ్చు రామాజ్ఞ యుల్లంఘింప బరమేష్ఠికైనం దరంబగునాయనువారును నైనను రఘువల్లభుండు సీతామోహానురాగంబు మానియుండునా మరలబిలిపించుననువారును నివ్విధంబున సౌధాంతర ప్రాకారగోపురవేదికాస్థలంబులనిలిచి పలుకుచుండం బురంబు వెడలి రథంబరుగుచున్న సమయంబున॥ గీ॥ సారథినిజూచి లక్ష్మణస్వామిపలికె। నశ్వలక్షణధర్మంబు లన్నితెలిసి। పయనమును మందమైనది భాగిరథికి। నేగ్గియటదేరు నిలుపుము వేగనీవు॥ గీ॥ తురగములు చూచెనేమని తోలుపట్టు। ఖగ్గములు నశ్వగాజేసి పయినదట్టి। పదమనం గనువాయువు పగిదిగదలె। ద్రోవకడ్డంబు శకునము దోచినపుడు॥ సీ॥ పాల్గరుడులు కుడిభాగము జేరెను జముడుగ బెనుమార్గ నరణులందు। పాము

డ్డమైవచ్చె బైడిగంటలుగూసె ఘోరము గాధ్వజమ్ముపై గ్రద్దలాడె। నుడి గాలిరథమును జుట్టెను నక్కలు బహువిధంబులగూసె బిట్టుపగలు। భూ తములార్చెను భూతలంబదరెను శౌవులపో తోకురమ్యోజి త్తమందు। వం శయముప్పొట్టె జాహ్నవీస్థలమునందు। సున్న మునికన్నియల నిక నెన్న నైన। చూచెదనునింక లక్ష్మణాశుభముగాదు నూరికిని బోయి వచ్చుట యుచితమనుచు॥

సీత దుశ్శకునంబుల గాంచి వ్యసనపడుట.

చ॥ దశరథపుత్రవర్యుఁడు దాపసపోషణ సత్యశాలికి। స్వంచయ శోవిశాలునకు భీషణకార్ముకహస్తధారికి। శశినిభవక్త్రభానుసికి సద్గ ణలక్ష్మణ సానుభూతికిం। దశముఖవైరికి న్శుభవిదాయకమై విలసిల్లగా నగుక్॥ సీ॥ దండకారణ్యంబు దర్శించియెవ్వాడు ఖరదూషణాది రాక్షసు లదునిమె। శరశరాసనములు ధరియించి యెవ్వాడు మాయామృగము జీచు మదమడంచె। బలవిక్రముఁడని దలపకయెవ్వాడు వాలినిన్నొకకోల గూల నేసె। శతయోజనంబులు జలరాశిసేతువు గట్టించెనెవ్వాడు కపులచేత। సవ్విభీషణుపైదయ ననుసరించు। రామభద్రుండు కరుణార్ద్రరక్షకుఁడు। ప్రజలుగోనియాక సాకేతపట్టణంబు। గోరియేలును నాచంద్రతారకము గ॥ మ॥ అనుచుం జానకి కొంతదవ్వరుగుచున్నాయాసమై లక్ష్మణుం। గ నియన్నా మొగమేలవాడినది నిశ్చంబైనదిం దెల్పు నీ। కనులంగారుచు న్నశ్రులు శృంగారంబులుక్ లేక యీ। దినమందు న్విపరీతమేమొ యిదియుం దెల్పన్నశీఘ్రంబునన్॥ సీ॥ మేఘనాథుడులొల్లి నాగపాశంబుల బధించునాడు నీపాటిలేదు। కఠినవిగ్రహుడతికాయతో యుద్ధంబు చేసిననాడు నీరీతిలేదు। యఖిలాటవులయందు నధికతి వెంబడి తిరిగిన నాడు నీ తెరగులేదు। సమరోగ్రరావణు శక్తినీవక్షంబు నాటిననాడు నీపాటిలేదు। దుర్నిమిత్తంబు లిప్పుడు తోచినదియు। దెలియబలుకవె నా మది దిగులుదీర। గ్రమ్ముకొన్నవి యశ్రులు కన్నులందు। నన్నులక్ష్మణ యిదియేమి యవగుణంబొ॥ చ॥ సమరమొనర్పగా రిపులసన్నిధి నిల్వగ లేకవచ్చితో। భ్రమతవహించిజూచి పరభామలమీదను వాంఛజెందితో। యమరుల శత్రులంచు నపహాస్యముగా విడనాడివచ్చితో। విమల యశోవిహార రఘువీరునియందలి భక్తిమానితో॥ క॥ నినుజూచినంతనుం డితము। మనమున దిగులాయె నేమి మర్మము నాతో। వినుపింపవలయు నిం కను। వనతలములు చాలు మరలవచ్చుట శుభమా॥ చ॥ పరజతులెల్ల దల్లులని భావనసేతువు బుద్ధిమంతుడై। గురుజన బాంధవాది మునికోటులబ్రోతువు సత్యవృత్తితో। శరణనువారిగాచుదువు సంగరమందు

రోధిరాజులం। బారిగొని వచ్చుచుండుదువు పుట్టినహేతువు లేమిలక్ష్మణా॥
వ॥ అని యనేకవిధంబుల సంశయించుచున్న యెడల బట్టణ పర్వత వనగ్రా
మనదీశైలంబు లతిక్రమించి రథం బతిత్వరితగమనంబున నడిపి పరిశ్రాంతతరం
గిదభంగురభంగ మంగళసంగయగు గంగానదీతటంబు జేరి కృతస్నాతులై ధౌ
తాంబరంబులు ధరియించి రథసారథుల నటనిలిపి యిరువురు నావపై గూర్చుం
డి విమల నదీతటం బతిక్రమించి శరభ సింహశార్దూల వరాహ ప్లవగ
గజ ఖడ్గ లులాయ బిడాలకురంగ రోహిణీ గోపర్ణదివాంధ కంకచటక
కృకర పరభృత శుకశారికా క్రౌంచ బక చక్రవాక శరభ ఖద్యోత వ
డ్పాద మయూర విహంగ పతంగ సకల మృగపక్షిసంకుల కోలాహల మ
హీరుహ శాఖశాఖోప లతాకుసుమ ఫలభరితంబగు మహారణ్యంబు జొచ్చి
సీతామహాదేవి సౌమిత్రిగనుంగొని యిట్లనియె॥ సీ। విను మహీరుహలతా
విపినాంతరముగాని పల్లవ ఫలపుష్ప వనముగాదు। శరభసింహమదేభ
శార్దూలములుగాని మౌనిగాత్రసయులం గానరాదు। సాంద్రమైయాతప
జ్వాలలయినదిగాని ఘనసహోమధూమమ్ములు గానరాదు। విహగసంకులనాద
భీమణంబులెగాని వేదమంత్రంబులు వినగరాదు। కఠినదుర్ధర్శకంటక శార
ణంబు। గానీ నడజోడు మార్గంబు గానరాదు। దాశరధి బాసినట్టి దుస్తర
పుపాప। కర్మరాలికి నదియేల కాంచకును॥ వ॥ అనియిట్లు ప్రాగి ధరాత
నూజ మదిలో నాయాసముం బొందనా। వనదేశంబున జేర్చి లక్ష్మణుం
డు సంభావించి మాయమ్మ కా। దనకన్నన్ను శపింపవమ్మ యిదియేధ
ర్మంబులో భూమిలో। ననివేరీతుల మొర్లిక్ యేడ్చుచును హాహానాదముల్

### లక్ష్మణుండు సీతకు రామాజ్ఞ యెఱింగించుట.

సేయుచున్॥ మ॥ కలుషాత్మంచునులోంచి రామవిభుడీ కాంతార మ
ధ్యంబులో ।పటికిం దోడ్కొని పోయి యుంచుమనె నమ్మా మిమ్ము శీఘ్రం
బుగా। ఒలుకంగాకయువృద్ధిజెంది లుపముల్పల్కంగ సాంగత్యముం। దోల
గందోసెను నింక నేమిగతి నిర్దోషాంగివై యుండినన్॥ వ॥ అనిన నావలు
కు లాలకించి॥ మ॥ శరమైతాకి లతాంగిసొమ్మసిలి నిశ్వాసంబులం బుచ్చు
చున్।మ్మరిద దల్లిగజాంగ గొప్పవదలయు స్నేమైలెరత్నావళుల్।బ్బరువై బెగ్గ
డిలంగ రజ్జుదరన్ బాహాలతాకాంతితో ధరపైమూర్ఛిలియున్న లక్ష్మణు
డు సంతాపంబు చెన్నొందగాన్॥ క॥ అడుగులుతడబడ దేహము। గడగడవడకం
గ నీరుకనుగవలందున్। సుడిదడికొనదుష్పటిచే॥ నిడికొని మతివిసరివిసంనిర్విణ్ణు
ఘ్నుండై॥ వ॥ మనంబున నాలోకింత తడవు విచారించి లక్ష్మణుండిట్లనియె॥ గీ॥ సమ
రజయుడైన రాముని చరణయుగళ। భక్తిగలవాడనైన నను పకజాక్షి। మేలుకో
నవలెనదియెల్ల మిథ్యలైన। భూమిమీదను దామ్మృతి బొందవలెను॥ వ॥ అనియి

దించి దండించెనానిమిత్తంబుగాదె। యిట్టిరాముఁడునన్నునీనట్టడవిని। డించి
రమ్మనిన్ను బుత్తెంచగానం। దీర్చితివియన్నకోర్కెలు దీటుగలదె।
పొమ్ముతమ్ముఁడ సాకేతపురమునకును॥ చ॥ జలజదళాక్షుఁ నీలమణిసన్నిభ
గాత్రు యశోవిశాలు। నిర్మలశతకోటిభాస్కర సముజ్వలతేజు విశాలవ
క్షు। భూతలవిభు లోకరక్షుశుభదాము దయాకరురామభద్రు। నేదల
చుచునుందు జిత్తమునఁదప్పక జీవిగలంతకాలముఁ॥ చ॥ మునుదశకంద
రుండు గొనిపోయెసముద్రముదాటి లంకకో। వనమునసుంచ రాఘవుఁడు
వచ్చును దైత్యహతంబుజేయుచే। కొనునని శోచియుండె నటుగోరక నా
శలు నేమియున్నవో। మనసిటులైన వెన్క నభిమానములెందుకు గల్గుల
క్ష్మణా॥ చ॥ మరచెనుదా రఘూద్వహుఁడు మంచిదినేటికి బూర్ణగర్భమై।

సీత రామచంద్రునిం దూరుట.

గిరిమృగ వృక్షదేశముల క్రిందుగనొంటిగనుండుటాయెనే। తెరువులు పట్టి
పోదునా విదేహమహీశపు పెద్దకూతునై। యిరవున లేకబోయెనిక
నెట్లుభరింతును నేమి సేయుదుఁ॥ చ॥ సమయము జూచిచూచి ఘన
సాహస కృత్యములెంచి కానలో। గమనముచేయజేసె నిజగర్భముగల్గిన
వేళ యెట్టిదో। మమతలునింతయేల యభిమానము దేహముమీద నుం
తునా। యమరిన కాపురంబునకు హానియిదేగద భూతలంబునఁ॥ చ॥ప
రిణయ మాటనుండి యెడబాసిన దాననుగాను రాముఁడుఁ। యెఱుఁగడొ
నామనస్సుయిది యేమివిచిత్రములాయె నేడు నీ। పురజనులాడగా నిజము
బొందునె పొందినగానియేమియూ। తెరగునగాదె యీవెనుకదీనతబొమ్మ
నరాదె కానకుఁ॥ చ॥ మనసున సత్యభామను వివాహములాడగ గోరి
యుండుఁ। మునసియిదేలనంచు ననబోదున యీయపవాదదోషము।
ల్పెనగొనజేసి రచ్చలనుపేరులనెత్తి మహోగ్రవృత్తితో। వనములదోసి
రమ్మనగ వచ్చితివే యిదినీకు సమ్మతే॥ మ॥ అన్న ప్రతిజ్ఞదీర్చితివియుబ్బను
కీర్తులుశాశ్వతంబుగా। దిన్నగనూరుబేరుపరదేశిని నేనెటులయిన నేమియూ।
యన్నయు మీరు హేమమయమాంచితరత్నతలంబు జేరివే। యున్నసుజా
లు నచ్చటనెయుండుడురాముని యాజ్ఞపెంపుఁ॥ క॥ మీతో సంభాషణ
కిక। నేతీరునగలుగు నాకునెన్నాళ్ళకును। యో। సీతాయని రఘురాముఁడు।
ప్రీతివహిల్లగజేర బిలుచునొతండ్రీ॥ సీ॥ అనుకూలదాంపత్య మనిసమ్మి
యుంటిని వరబుద్ధిమినునని యెఱుఁగనయితి। దశరథాత్మజుడును ధవుఁడాయె

సీతాదేవి తన్నుదా నిందించుకొనుట.

ననియుంటి దుర్దశవచ్చుటతోపనైతి। రాముని సామ్రాజ్యరమణి నేనని
యుంటి గల్లనైననీగతిగాననైతి। నినకులపావని యనియెదరనియుంటి గను

టవర్తనములు గాననైతి। బ్రహ్మరుద్రాదిసురలెల్ల బ్రస్తుతింప। సగిరిహారీతుండు ప్రత్యక్షమగుచు నిలిచి। దేవి శ్రావణి గానుమని సాక్షిచిన్నట్టి। పలుకులెల్లను జనులకు దెలియలేదె॥ చ॥ ఒకరన సేలపుణ్యా మిటుగా లిసిన గిలుచుండ రాముడున్। ముఖమును నోర జేసికొని మోహాముహాసె సీది కనేలతో। చకపలురీతి పల్కి నిని జక్కగనాథవు డెల్లకాలమున్। సుఖయుగనుండ గావలెను సోదరబాంధవులుల్లసిల్లగన్॥ సీ॥ అన్న లక్ష్మణయిట్టి క్రోశమున నిన్ను నేమంటినో యది యెల్లమరచి। దయయుంచు రామునకాజ్ఞనొప్పింప నెవరికి వశమౌను నాకర్మఫలములిటులు। నున్నదియా దేహ మందు సౌర్యంతంబు ధవుడె దైవంబని తలచుచుండు। మీరె నా కసుదిక్కు వేరెవ్వరును లేరు పొమ్ము సాకేతపురమ్మునకును। మగ్గురత్తలకును మ్రొక్కితినని చెప్పు మాచటి బంధువులను నడిగితినను। నేను మ్రొక్కినట్లు నీవె పతికి మ్రొక్కి యొక్కయింతకూర్మియుంచుమనుచు॥ వ॥ ఇదియొకటిగాన్॥

## సీత లక్ష్మణునితో రామాదులకుం గొన్నివార్తలు చెప్పిపుచ్చుట.

చ॥ వదలితి వాదయా సమ భావములోపల ప్రాణనాథనీ। వదన సరసీరుహంబు లెడవాయను జిత్తమునందు గల్గెనే। విధమని నారొయా విధముప్రీతిగగా నదేశమందు నే। గదలక నిల్చినాననుము కాలమునచ్చెడి దాక యిక్కడన్॥ చ॥ మునుగాధేయుని వెంటనంటి జన్మమునోర్చెదిల్లి భూలోకముధనువుందుంపగ దండ్రి మెచ్చియపుడే దానంబుగా జేసెనా। తనువుననేకు మునగ్ని సాక్షిగను సీతా నిన్ను ఛాయంగలే। నన లేదాయను మ్రొక్కినాన నుము యన్నా యేమినే జేయుదున్॥ చ॥ ననువిడనాడితే యెవనగునాకు గతేమిదయాసముద్రినా। మనసు సెలంగి కాననమహీరుహ కంటకఘోర భీమమై। పెనుగొను వీధిలో నిలుప బ్రీతి చెలంగెనొ యేమిసేతు గా। దసిగనుడి వారులేరు భవదాజ్ఞకు నిగ్రహ శక్తియుక్తిన్॥ గీ॥ భరత శత్రుఘ్నులను జూచి భావమందు। భూరిదయనుంచుమనెనను పొమ్ము సీత। నఖిలసుభగములు వర్ధిల్లునను దినంబు। నన్ను మరువక యుండుమా యన్నయనిన॥ చ॥ అని మొలుగెత్తి లక్ష్మణుడు హాయని యేడ్చుచు దల్లి నిన్ను భూ। జ వరహితాంబునైన

## లక్ష్మణుడు సీతాస్థితికి వగచుట.

మృగసంఘసమాహిత ఘోరభీమమా। వనమున నిల్పి వేగ బురిమార్గము నేగతి బట్టిపోదు నా తనువిదియేల యొండెడయుని తత్పదకంజము చేర్చి మ్రొక్కుచున్॥ సీ॥ వరతలంబులు పూర్ణవైభవానందిత భవనంబులా సీత బగమసాధ్వి। ఘోరాటవులయందు జేరిన మృగములు క్రోడికాలలసీత దోయజాక్షి। పాషాణకంటక మార్గతలంబులు సోపానమార్గమున సిద్ధ రాంగి। యళికీరపికనికరారావనాదంబు మంగళవాద్యమా మాతసీత। దగినపా

దరింజ్లు నీకును బ్రాసవాగమె। కొడమసింగంబులెల్లను గొలుచువారె మం
చిరాయంచబలములు మంత్రివరులె। కలికియందంద యాగపాపహగహామం
దు॥ శా॥ రామాధీశ్వరు భార్యవై సుకృతివై రాజ్యంబుచున్నాని ని। స్సీ
మాట్కస్వసియింపజేసె విధియున్నీమాయకేమందునీ। నామ్యర్ధంబులు
దోచియుండుప్రకృతిన్ సాన్నిధ్యవైధీరవై। యీమాట్కం డలపోసి చె
ప్పుడరమా యింద్రాదిబృందంబులున్॥ మ॥ వ భూమిన్సినుసిల్పిపోవలసె
నేపాపంబులుంబొందెనీ। దినమించునగను లక్ష్మీలాలన దిలో ధీరత్వము
ల్మానివే। దనరెట్టింపగ జానకీశుభకరీ ధర్మాంగి శ్రీరామచం। ద్రునికా
రుణ్యమె యీవిధంబనురె నిర్దోషాంగివైయుండియున్॥ చ॥ సతులును సే
వజేయ మణిచారువిలాసిత సౌధమందుభూ। పతి పరుషించ రాజ్యపరిపా
లనలక్ష్మిగనొప్పియుంటిగా। మతిజగులొంద శైలగృహ మార్గతలంబులచే
రబ్రిహ్మనే। గతిలిఖియించె నీనుదుటఁగల్గనె యీయపవాదదోషముల్॥
క॥ అనివెతలఁజెంది పొరలుచు। జనగాల్లాడకను ధేనుచనుగుడుపును
బొం। దినవత్సమురీతిని మతి। మానుసుందరగాడ్రమిక్కి మఱియిట్లనియెన్॥ ఉ॥
భూచరులార సిద్ధమునిపుంగవులార ఖగేంద్రులారయో। ఖేచరులారయక్ష
సురకిన్నరులార ఫణీంద్రులార ని। ర్దోషిణిజానకీసతియు నున్నదిశైలవనాం
తరంబులం। గాచి కటాక్షముంచవలెఁ గాలముకష్టము నీవెచెప్పుడున్॥

## లక్ష్మణుం డయోధ్యకు వెడలుట.

వ॥ అనిపునఃపునః ప్రణామంబులాచరించియున్న మరందిని వి యపూర్వ
కంబుగా గారవించి యయోధ్యాపురంబునకు పోయివచ్చెదవేయని కన్నీ
రున్నీరుగా జెక్కుటద్దంబులపై దొరగ దొల్లి యే మిధునంబుల నెడబా
పగానాకీదురవస్థ ప్రాప్తంబయ్యెనో లక్ష్మణాయని సాక్కువడికన్నదామర
లువిప్పితప్పక చూచుచు హాయని వెక్కివెక్కి యేడ్చుచు ధూళిధూసరితాం
గియై యేభమ్మిల్లభాగంబునం జెర్చికట్టిన తెల్లవిరజాజిమల్లెలు జలజలరాల దల్ల
డిల్లుచు బల్లవాధరి సుమిత్రానందను ముఖంబుతప్పక చూచి యింతసేపుం
డినంగాని నీవు సాకేతపురంబు చేరవలయువాడవుగాని యిటనుండువాడవు
గావు నా జన్మాంతర ప్రారబ్ధానుభవంబునకు మీరలేమిసేయుదురు నీవు
పోయిరమ్మి శుభంబులుపొందుమనిన దల్లినీవల్ల భూసన్నిధికింజని విపినాం
తరంబున మిమ్మెడించి నాప్రాణసంరక్షణంబు చేసికొనివచ్చితినని యేవి
ధంబునవిన్నవింతు గౌసల్యాసుమిత్రాకైకేయీమహాదేవుల సన్నిధానంబు
చేరి యెబ్బంగి భాషింతు భరతశత్రుఘ్న హనుమత్సుషేణ గజగంధమా
దనమైంద ద్వివిధకేసరిదధిముఖ పనసాంగద కుముద ఋక్షేశ్వరదనుజే
శ్వర సుగ్రీవాది సమధీరుల ముఖంబు నేవిధంబునం జూతునని సీతాచర

ణకమలయుగళంబు డెందంబునం బొంగ పరచి యెట్టకేలకు ధైర్యంబు నవ
లంబించి మరల యభివందనంబొనర్చి తిరిగితిరిగి చూచుచు గంగాతరంగిణి
దాటి రథంబుపయిం గూర్చుండి పురంబున కరుగుచుండె నంతనిట॥ సీ॥ స
డవగా లేచట్టి నలినాక్షి యడవిలో విలపించి విలపించి వేదనమున । ధ

## సీతవనంబున విలపించుట.

మ్మిల్లమును విప్పి తారహారంబులు విసరివైచియు నేలమీఁద ద్రెళ్లి । హా
నాథ హానాథ హా జీవితేశ్వరా మరచితివా నీకు మైత్రిలేన । ఘోరా
టవులయందు నేరీతి విహరింతు దిక్కెవ్వరే నాకు దీనరక్ష । యనుచు వెం
ధూళిలో బడి యుంగ మెదర । సోలి కూర్చుండి దిక్కులు చూచిచూచి। చెక్కి
టనుఁ జేర్చి కొనగోరు చింతలోఁ దవ్వ। దనువు పైనాశవిడనాడె తలిరుబోఁణి॥
చ॥ వెలవెలపాటునొంది తుది వేదనఁ బొందుచు మూర్ఛరీతిగా। నిలుచుచు
నేలపైఁబడుచు నిండిన యశ్రులు నేలరాల్చుచుం। దొలఁగుచు గంగలోప
లను దూకుదు నాతను వేల యొంటిగా । నిలుపను శక్యమా తరుల నీడల
నే గతి బ్రొద్దుపుచ్చుదున్॥ ఉ॥ ఎక్కడఁ బోదు నేదిదరి యెవ్వరు దిక్కు
మహోగ్రవృత్తితో । నెక్కడ వ్రాసె బ్రహ్మ తుది యేదివరంబుల త్రోవ
యేదియే । దిక్కనఁ బోదు నెవ్వరికి దెల్పుదు నా హితమాచరించువా ।
రెక్కడనున్నవారలిది యేటి తలంపులు సేయుదున్॥ గీ॥ భాగిరథి
ఘోరదురితార్థివర మసాధ్వి । విపినములయందు నీరాత్రి వెడలు పెట్టు ।
కలుపుకొనవలె నీలోనఁ గరుణతోడ । లేచిరావమ్మ యనిమహా యోచన
లను॥ ఉ॥ కన్నుల నీరు చెక్కులను గాల్వలు గట్టగుచాగ్రసీమపై । నున్న
సువర్ణహారములు నూగుచునుండఁగ నేమీఁదిపై । దిక్కఁగదేరి లేచి యెది
దేశము లేదరి చేరియుందునే। నెన్నడు పుట్టి దుఃఖములు నిల్చికనుంగొన లేను
దీనతన్॥ మ॥ తపలో దాచలపోసి రెండుగడియల్ ధ్యానించియుంకేమినా।
తను వెబ్బంగి భరింతు నెంతుమదిలో దాహంబు నెట్లోర్తు నీ। వనవాసంబుల
నేలగోరితిని నా భావంబు కిందాయెనే । జనముల్గానని కొండరాళ్ళగసిలో
సైరింతు నన్నాళ్ళకున్॥ గీ॥ తల్లిభూదేవి నీగర్భ తలమునందుఁ । బుట్టిలే
పట్టినిందలు పుట్టనగునె । నాకు బ్రత్యక్షమైవచ్చి నన్ను నీలోఁ । గలుపుకొన
వమ్మ యిప్పుడే గహనమునను॥ క॥ బహుతెరగుల బహువిధముల । బహు
రీతుల వేడ్చియపుడు వర్ణవధ్వనితో । గహనములయం దుఖీతిలి విహరించు
చునున్న వేళ వేడుకలొదవన్॥ శా॥ ఆవాల్మీకిఋషీశ్వరుండు మదిసాం

## వాల్మీకిమునీంద్ర సమాగమనము.

దించి పుష్పార్థియై । సేవాయోగ్యులు గొల్వ వెన్ను జడలుం జీరాడ రుద్రా
క్షలుం । బ్రావీణ్యంబున భూతిపూత మెడల న్భాసిల్ల యోగాత్ముఁడై ।

పే వేగంబున కానసాంతరముల న్వీక్షించుచు న్వచ్చుచున్॥ ఆసమయం
బున॥ గీ॥ పంజనేత్రియరణ్యరోదన మొనర్చు। చున్న దదియేమొ యెవ్వరో
శోభితాంగి। దేవభామిని గాబోలు దేవిలక్ష్మి। యో భవానియొ భారతి
యోతలంప॥ క॥ వనదేవతయో చూడఁగ। జననాథుని ప్రాణసతియొ
చంద్రునిసతియో। జనులెవరు లేక యొంటిగఁ జనుదెంచి విలాపమేల
జరించెనొకో॥ చ॥ అవితన యోగమార్గమున నాతెఱఁగెల్ల నెఱింగి
యాత్మలో। జనకజ రాముభార్యయని చేరగవచ్చి లతాంగి నేలపై। బెనఁ
గొని నేల శోకమున భీతిపహిల్లఁగ నేలగల్గియే। దినముల దత్ఫలాఫలము
తేజము నొందక బాసిపోవు నే॥ గీ॥ ఎట్టికులమున జనియించి యెంతవారి। చెట్ట
బట్టిన బహుభాగ్య సంభ్రమములు। పొందియుండిన సంప్రాప్త భూరి
కష్ట। ఫలములనుభవమగుగాక దొలఁగనౌనె॥ మ॥ అనవాల్మీకి మహర్షి గా
దెలిసి యా యబ్జాక్షి కుక్షిబుతో। గనులన్నిండిన బాష్పము ల్చెదరగా
గాశేయముం జారగా। ధనధమ్మిల్ల ప్రసూనమాలికలు చేతం జక్కగా
జేర్చియో। మునినాథాయని మ్రొక్కి లేచి వెతలంబొంద న్మహాదీనతన్॥
చ॥ దశదిశలందు సత్యజయ ధర్మగుణాన్వితుడైనయట్టి యా। దశరథ రాజు
కోడలను ధర్మముగా మిథిలేశుపుత్రికన్। విశదయశుండు రామరఘు
వీరుని పట్టపుదేవినయ్య య। దృశమునకగ్గలైనారడిక దేహముపై నభి
మాన మేటికిన్॥ వ॥ అనిప్రలాపించుచున్న సీతామహాదేవిని నూరార్చి

వాల్మీకిజానకీదేవి నూరార్చుట.

వాల్మీకిమహర్షి మరలనిట్లనియె॥ ఉ॥ నీవుపతివ్రతామణివి నీయుదరంబున
నున్న బాలురు। బావనులైనవారు జనపాలురు సంగరశౌర్యధీరులై।
పోవగనున్నవారు జయమొప్పను దప్పక మంగళంబులో। దేవియిదేల
నేలబడి దేర్చెదురా సుకుమారగాత్రివై॥ చ॥ జనకమహీధవుండు బుధ
సన్నుతుడై ప్రియమారబూజలున్। ఘనముగ జేయుచుండు నిదిగాక
సహోదరధర్మవృత్తిచే। కొనదగియుండు పండుమణి కోరికె మంచిది
పుట్టినింటలో। గనియెదవంచుసత్కరుణ గల్గవహిల్లితి వెల్లభంగులన్॥
చ॥ తొలఁగక లేచిరమ్మి యిదె తోయము లక్షుపయుందు జల్లు భూ। తల
ముల ధూళిబాపు విరిదండలు చేర్చుము కొప్పునొప్పుగా। నిలుపుము హేమ
దివ్య మణిహేమసరంబులు నెత్తికట్టుమే। తలపులునుంచవల్వదిక దైవ
కృతంబులు పాయనేర్చునే॥ గీ॥ కాన దశరథమేదినీకాంతు పెద్ద। కోడలవు
భూతనూజవు ఘోరవీర। రాక్షసాంతకుడైన శ్రీరాము భార్య। దేవతవు
గా వెభయమేల భావమందు॥ వ॥ అనిసీతాదేవి దీనాలాపంబుల మహా
త్మా లేని యపవాదదోషం జే మోపుకొనిబ్రదుకుట యుచితంబుగాదు

నే సీతరాతలంబున బ్రాణసంరక్షణంబుచేసికొని యేమిభాగ్యం బనుభ వింపఁగలదాననని వాల్మీకిమహర్షి యిట్లనియె॥ గీ॥ తల్లిదుఃఖంబు లేల నీవల్లభుండు। కరుణవప్పుడు యిది పూర్ణగర్భమగుట। తెగువచేసిన దో షంబు దేవియాది। శ్రీపతి యనియెన్ని సూత్మయందు॥ వ॥ అనినవైదేహి యిట్లనియె। ఉ॥ త్యాగముసేయఁగా సమయ ధర్మముగాదనినారు మీరలీ। యోగముగల్గువారలిక నుందురు మెచ్చట నైనగానినా। కేఁగిటిచేసిచూపె దరు యేసుభవల్సత దంద్రిప్రీతితో। భోగపిశాచఘూకనలి భూరుహ భూముల నేకో-టిక॥

వాల్మీకిమహర్షి సీతను దనయాశ్రమమునకు గొనిపోవుట.

క॥ అనివి పించుచునుండినఁ। జనకజనూరార్చి వెంటజను దెమ్మనియా। ము నివసమెల్లజూపుచు। దనవనికిసవచ్చినిలిచ ధర్మాత్ముండై॥ సీ॥ స్నిగ్ధయం బుగమంచి పర్ణశాలలయందు దేవినిఁటనిల్పితేజమలరఁ। జెలువంబుగా నా రచీరెలు రెండెత్తి కట్టగానిచ్చిసంకాశ మొసఁగ। పరిమెళనవసూన ఫలము లుఁదేనె లాహారంబులుగనిచ్చి యాదరించి। మునికన్యలనుజూచి మునివల్ల భుండనుఁ బరమపావని జగన్మాతసీత। పుణ్యవశమున మనవన భూములకు నుఁ వచ్చి దిగానబూజింప వలయుమీర। లిచట నెడబాసిపోవక యీమె మంత్ర। దేవతాంగ యనిమరి దెలియవలయు॥ చ॥ తిగజలకంబులార్చి నవ ధౌతవిశేషములైన చేలములన్నిగువకుగ్గుహేమమణిమండిత దివ్యవిభూష ణావళు। ల్బగనుధరింపఁజేసి మృదుఫాలముపై మృగనాభిరేఖ పొందుగ లిఖియించివేడ్క మదితోటిలగాఁగయిసేసి యంతటన్॥ చ॥ బహువిధ భక్ష్యభోజ్యములు పాయసముల్కలవంటకంబులు। న్వివి తముగానమర్చి కొనిసింధువులు సేయుచు బ్రీతిమీరఁగా। సహజమబొందగాను ఘనసార సుగంధము పూలహారము। ల్బహుళముగానొసంగుచును బావనసేవలు సేయుచుండగన్॥ క॥ మునియాజ్ఞవిధముగాగను। మునికన్యలు మనము నెంత పుణ్యాత్ములమో। జనకజ సీతాభగవతి। చనుదెంచెనునిత్యసేవ సలుపగగలిగెన్॥ క॥ అనుచును మజీభయభక్తుల। జనయిత్రికిపోషశోప చారంబులచే। మానసునకుమోద మెుప్పగ। మునికన్యలుం శతసహస్రములు గొల్వంగన్। వ॥ సీతాదేవియట్లు వాల్మీకాశ్రమంబున నుండెనంత నిచ్చ

లక్ష్మణుండు రథంబెక్కి యరుగుచు జింతించుట.

టి॥ గీ॥ అంతలక్ష్మణుండావేళ నరదమెక్కి। వచ్చిభాగీరదీతీరప్రాంతమున ను। నిలిచియారాత్రివేకువ నిద్రలేచి। స్నానసంధ్యాదికృత్యముల్ సలిపి వేగ॥ సీ॥ రథముపైనెక్కి సారథినిగనుంగొని దేవిని కాంతారదేశమందు। బోనాడిసాకేత పురమునకేరీతి బోదును శ్రీరామ భూపుమొగము। దర్శిం

చుచేలాగు తల్లులకీగతి నేఁటివరింతు నేమిసేతు। నీచజాతులు సెంత
యోచనజేసిరి సూర్యవంశ మింక నడుగనౌనా। యేమియైననుగాని నేనింక
దనువు। ఖడ్గమునబట్టి త్రుంతునుగాని యుంచటి। గంగలోపలఁజొత్తునుగాని
భూరి। గ్రీవముల నెక్కవడుదును గాక నేను॥ వ॥ అని మహావ్యసనావేశం
బునుం బొందె॥ ఉ॥ ధానవివేకశూన్యులయి ధర్మముగైకొనలేక వారిసేనీ
వారితనిల్చునా ధరణిభాగము పెల్లగిలంగ జేతునా। సీతకునీవిధంబగుట
చెల్వముగాదలపోసినా జయా। రీతులు యుద్ధమధ్యమున రేపితిగింతుమహా
ద్భుతంబుగన్॥ చ॥ పురుమని మస్తకంబు తునుమాడెను రాముడటంచు
నెంచియా। తనిబలవిక్రమంబులకు ధైర్యము చాలక యుద్ధమందుదా। గని
భయమంది భూతనయ పొందును గోకము సీతానను। స్ననిపిఁగివింకచూచె
దవు యంబుధులేక ముచేసి వచ్చెదన్॥ చ॥ అరయగబోయి యంబుధుల
నన్నిటిసిగూడగ జేసివత్తునా। దెకప్పులు వట్టిదేవ పురదేశములన్నియు నుగ్గుసే
తునా। చెరవకసూర్యచంద్రులను వీనులసంకరమంద జేతునా। మఱిమఱి
చూడుమింకశుభమానిని నైయిటుపుట్టవచ్చునా॥ చ॥ జనకజలోల్లిపోవ
జలజాక్షికి మిత్రము వాలిద్రుంచి యా। యినసుతునేలి సాగరము నేర్పుగ
బంధనఁజేసి లంకపై। వనచరులార్చిబోయి సురవైరిని రావణుద్రుంపలేదె
యా। దినమున దేవతాధిపుల తేజము మాపగలేకయుండునే॥ క॥ ఈసాహ
సంబుచేసిన। వేసరి దేవతలు నజుడు వేంచేసిమనో। ల్లాసముజెందఁచుసీతను।
భాసురముగ దెచ్చి పరమపావనియంచురే॥ వ॥ అని మహారోష భీమణానల

లక్ష్మణుండు కుపితుండై బ్రహ్మాస్త్రప్రయోగంబొనర్ప
గమకింప సారథియగు సుమంత్రుండు వారించుట.

ప్రజ్వలితనేత్రుండై సారథితో బ్రహ్మాస్త్రంబు బ్రయోగించెద॥ మ॥ అని
కోదండముబట్టినిల్వ దిశలున్నల్లాడె నక్షత్రము। ల్వేసవీధింబడి రాలె మేరు
వడకెన్ భేదిల్లె బాతాళముల్। యిచంద్రాదులు తొట్రువడప్పిరపుడేయిం
ద్రాదులింకేమి తో। మనుచుంబోయిరి మేఘసంఘ మురిమె న్నంబోధులు
పొంగగన్॥ క॥ విడివడిన గంధనాగము। వడువునగంపించి దుమికి బాణా
సనముం। గుడిమొడము చేసి బాణము। విడువగమదిదలచుచున్న వేదనపరు
డై॥ ఉ॥ సారథిలేచి లక్ష్మణుని సత్పదకంజములాశ్రయించి యాధీరగుణం
బుగైకొనంగ దిక్కులుభీతిలె నిండభూమిపై। దారలురాలె దేవతలు తాపు
లుదప్పిరి కోపమేలయా। వ్వారును నేమిసేయుదరు పావనినోమిననోము
చొప్పునన్॥ ఉ॥ దేహముబొందగా సుఖముదేజము దుఃఖముగల్గు దుల్ల్య
మై। మోహముతో సతీసుతుల ముచ్చటహెచ్చనితోచి దగ్ధులై। యూహా
లుపొందుచుండుదురు యుర్విని శాశ్వతమెంచగూడదీ। సాహసమేల పూర్వ

కృత సంభవజన్మఫలంబు లుండునే॥ శా॥ ఏయే కాలములందు నీశ్వరుఁడు నే
యేరీతివర్తించునో యేయేజన్మము లెత్తఁగావలయునో యేయేమిపాత్రింప
నో। యేయేభూములనుండఁగావలయునో యేస్త్రీలుమోహింతురో। యే
యేభాగ్యములార్జితంబులగునో యేహేతు లెట్లుండునో॥ సీ॥ హరిహైన హరు

## సారథిపూర్వవృత్తాంతంబు లక్ష్మణుని కెఱింగించుట.

హైన నజ్జగద్భంధుండైన నినవంశులైనను నెవ్వరైన। నెక్కడకేగిన నిలలోన
దూరిన మిన్నుబ్రాకిన భూమి మీదఁజనిన। సాగరంబులు దూరి జరిగిన బ్రా
రబ్ధ కర్మంబు దొలగదు కఠినముగుచు। వెంబడిని యనుభవింపక తీరదు భూరి
దుఃఖములచేఁ బొగలనేల। మున్ను మీతండ్రి రథముపై మోహరించి। నేను
సారథ్యకృత్యంబు నిర్వహింప। వేగ సాకేతపురమును వెడలి మాని। వనము
లకుఁ బోయి యవ్వసిష్ఠునకు మ్రొక్కి॥ గీ॥ వనమునను యుండఁ దూర్వాసము
నివరేణ్యు। డచటికే తెంచియుండుట నాత్మఁ దెలిసి। యంజలియొనర్చి సిద్ధమౌ చు
న్ననాసనముల। నిచ్చికూర్చుండు మనిమును లిట్టులనిరి॥ చ॥ రాజనృసింహవి
భుడవు రాజితవిక్రమశక్తియుక్తితో। దేహము బొందుచుండుదువు దీనద
యాకరవచ్చినావు మా। పూజలుఁ వృద్ధిఁబొందెగుణభూషణ మాయెడనింత
ప్రేమతో। భోజనమాచరింపుమని భూరి తపోమహిమాను గుణ్యులై॥ గీ॥
కామధేనువునా వేళ నాత్మఁదలఁప। బాయసాన్నంబు బాదము పప్పు మంచి।
పిండివంటలు దియ్యని పెరుగుమధుర। ఫలములిడి తృప్తి చేసిన బార్థివుం
డు॥ గీ॥ చేరిభుజియించి దూర్వాసశేఖరుండు। వామదేవ వసిష్ఠుల వద్దనిలి
చి। మ్రొక్కి కూర్చుండి యమ్మునిపుంగవులకు। నవసరముతెంగి యొక మాట
యాలిమొనపుడు॥ సీ॥ మేదినీశుల పెల్ల మించి యేలితి సౌఖ్యసౌఖ్యముల్ప్రా
లంగలిగె। పవనముల్పేసితి స్వర్గాధిపునిగూర్చి యాహవంబున గూల్చితిసుర
వరుల। నరువదివేలేండ్లు పరగ నేలితి ధర ముసలినైతిని మునిముఖ్యులార।
యినవంశమునని కేరీతి వర్థిల్లుబుత్రులు నాకికబుట్టగలరో। కలుగరో యే
మిసుకృత కర్మఫలము। మీరు మహనీయమూర్తులు మీదనేమి। గతు
లుగల్పించెదరు నాకు గార్యసరణు। లేతెఱంగున వర్తిల్లునే విధంబొ॥ మ॥ అ
న దూర్వాసమహాఋషీశ్వరుఁడు నాత్మానందుఁడై యిట్లనుం। జనపాలుఁడ
వు సత్యశాలివి మహాసంగ్రామధైర్యుండవున్। యినవంశుఁడవు నీకు ద
శుఁ డగునే యేమైన లోకేశ్వరుం। డనఘుండనయ్యు డాదివిష్ణుఁడిపుడే యా
నందుఁడై పుట్టెడిన్॥ గీ। ఆదిశేషాహి లక్ష్మణుండై జనించు। శంఖచక్రంబు
భరతశత్రుఘ్నులగుచు। నామహాలక్ష్మి సీతయై యవతరించు। నింతబుద్ధ్యాం
డవని నిన్ను నెంచదరమె॥ గీ॥ అనిన దశరథుఁ డావేళ నభినుతించి। స్వామి యు
త్తమ విధంబున జగతిబాడము। అమిత బలపరాక్రమంబుల నాతఁడెన్ని। యెండ్లు

నిలయేలుచుండునో యేవిధంబొ॥ గీ॥ అనుచుదమ్మునిను వృత్తాంతమడుగదల తు। వారిశుభవైభవంబులు వారిఘనము। వారిగుణములు బలములువారి యశము। వారిమహిమలు దయచేసివల్కవలయు॥ వ॥ అనిదశరథుండడు గుటకు సంతసిల్లి వామదేవవశిష్టులసన్నిధిని దూర్వాసమహామునీంద్రుం డిట్లనియె॥ సీ॥ రఘువంశమునకు గారణమూర్తియై పరబ్రహ్మంబు రాముడైపరిబలుడగుచు। దాటకినిబరిమార్చి తపసియాగముగాచి వరమేశు చాపంబు భగ్నపఱచి। సీతవివాహంబు చేత సంతోషించి యనుజుల పెండ్లిండ్లననుసరించి। భార్గవరాములి భంజించిరావణదనుజాధినాథుల ద రమిద్రుంచి। బ్రహ్మరుద్రాదులకు బ్రియమమర్చు। కార్యములు ని ర్వహించుచు శౌర్యముమర। శతములొరించు హయమేధసవనములును। సుతులుగల్గును రిద్దగుశుభము గాను॥

## దూర్వాసుండు భవిష్యద్వృత్తాంబు దశరథునికి దెల్పుట.

వ॥ ఇవ్విధంబునం బదునొండువేలసంవత్సరంబులు సర్వంసహాధి పత్యంబునంగీకరించి ధర్మసత్యపరాయణపరివర్ధుండై నిత్యమంగళుండై యనవరతమహాలక్ష్మీ శ్రీసన్నపారిజాతుండై సుఖంబుననుండియు సీతావియో గంబునంబరితపించుచు సహస్రసంవత్సరంబులు వియోగదుఃఖంబుననుభ వించుచు నాసమయంబున యముండు బ్రహ్మయనుమతిని విప్రవేషధ రుండైవచ్చిన వర్తమానంబుదెలిసి రఘునందనుడర్ఘ్యపాద్యాది విధులం బూజించి యుచితాసనంబునం గూర్చుండనియోగించిద ధర్ముండుస్తోత్రం బులుచేసి దేవరహస్యంబులుకొన్నిగలవు నీవుగాకపరులువినందగరు తత్స మయంబున రుద్రునినైనం దిరస్కరించు విక్రముండగువాని ద్వారదేశం బుననిలుపుమనిపలికిన రాముండులక్ష్మణునియోగించిన దదాజ్ఞానుసరణిగా నున్న తత్సమయంబున శ్రీరాముంజూచి యముండునమస్కరించి దేవా మీరు సకలాత్మకుండైన శ్రీమన్నారాయణమూర్తులరు. దేవహితార్థంబు ధరణీతలంబునబుట్టి మహాసాహసకార్యంబొనర్చితిరి మీరునియమించినప దునొకండువేల సంవత్సరములునిండె జనకజయగు మహాలక్ష్మివైకుంఠ నగరంబుచేరి మిమ్ములబిలుపింప నాజ్ఞాపించిన బ్రహ్మాదులునన్నుబంపిరనిన సంతోషించి దివ్యయోగంబున దాను శ్రీమన్నారాయణమూర్తి యగుట యెఱింగి మంచిదని యిష్టాలాపంబులాడు సమయంబున ధూర్జటిసముం డును దూర్వాసనాముండ నగు నేనట కరుదెంచి లక్ష్మణునిం గాంచి మహాతపంబుచేసి రామదర్శనార్థం బరుగుదెంచినవాడ మారాక యె రింగింపుము నీవు నమస్కరింప సమయంబు కాదంటివేని వంశక్షయం బుగా శపింతుననిన దననిమిత్తంబట్టి బెడందరానేల యని యూరకున్న

జేసనంతరంబు పురంబు ప్రవేశించి యంత రాముండు నర్ఘ్యపాద్యాదివిధులం
బూజించిన నేను సంతుష్టుండనై విజేచ్ఛంజనుడు యముం డంతర్ధాన
నంబు చేసిన పిమ్మట శ్రీరాముండును లక్ష్మణుంజూచి మదీయాజ్ఞోల్లంఘ
నంబు జేసితివాడ విందుండవలదన లక్ష్మణుండు విషాదంబునొందుచు సర
యూనదీతీరభాగంబు జేరి జ్ఞానసమాధి యుక్తుండై సహస్రముఖ ఫణిగణాల
తుండై శేషాదిశయంబునొంది వైకుంఠంబునకుం జను దివసత్రయం
బునకు శ్రీరామచంద్రుండు సాకేతపట్టణంబు దక్షిణోత్తరభాగంబులుగా
విభాగించి తనసుతులకిచ్చి తక్కిన వారలు కరరాజులనదళ్ళి చేకొనిన నగ
రంబులకు వారిసుతుల నభిషిక్తులంజేసి పిమ్మట భరతశత్రుఘ్న సమా
హితుండై సుగ్రీవాదికపులంగూడి సరయూనదిం జొచ్చి సకలవైభవా
నంద బృందారకబృంద సేవితుండై వైకుంఠనగర సౌధాంతర శేషశ
య్యాకల్పితరమావినోదుండై బ్రహ్మాండనాయకుండై యుండగలండని
న దశరథుండు పరమానందుండై ఋషులకిట్లనియె॥ సీ॥ అఖిలలోకేశ్వరుం
డాద్యంతశూన్యుండు సచ్చిదానందుండు సత్వగుణుడు। వేదాంతవేద్యుం
డు విహగేంద్రగమనుండు హాటకాంబరధరు డచ్యుతుండు। రవివంశము
నను శ్రీరాముడై జనియించి బలవిక్రమంబుల వెలసియుండి। సత్యవర్ధను
డయి సద్గుణాభరణుడై త్రిజగంబులకు మహాదేవుడగుచు। జగజ్జనుబాసి
వైకుంఠమ్ముజరుప నేల। యేమికారణమగుటను యేవిధంబొ। యీవలరఘు
రాముడెన్నాళ్ళనవనియందు దేజయుతుండయియుండును దెలుపవలయు॥

విష్ణుం డసురాదులతోఁ బోరుట.

చ॥ అనిబహురీతుల బలికి యాత్మసుదంబున విన్నవింపంగా। విని
మునివల్లభుండనియె విష్ణుచిమాయల నెన్నశక్యమా। వనజభవాదులైన
సురవర్యులనైనను నెవ్వరైననే। మనిమొడివారులేరు వివిధాత్మకుడై విహ
రించునంతటన్॥ మ॥ తనమాయాసతితోడజికీర్గుణుడై తానయ్యలో
కంబులుం। దనలో వెల్గుచునిత్య సత్యగుణుడై దైత్యోగ్రసంగ్రామభే। ద
నుండై యుండు బరాత్పరుండు నిత దేశావ్యోం దాంగాకసా। ధనసంతో
ష రమావినోదుండగుచుం దాందాల్చు మోహంబులున్॥ వ॥ కావున మహ
నీయమూర్తియగు వైకుంఠనాథుండొకనాడును దర్శనపాంచజన్య
కౌమోదకీనందక కౌస్తుభంబులధరించి శ్రీవత్సవనమాలాలంకృతవక్షస్థలుం
డును కటకాంగదకేయూర కిరీట కుండలోర్మికాది భూషణస్థగిత మణిగ
ణ ప్రకాశగాత్రుండును గరుడవాహనారూఢుండును నై పరశుఖడ్గ
కవాల శూల చక్ర భిండివాల తోమర నాగకుంత ముసల శరశరాసన పా
ణులై యింద్రాదిబృందారక బృందంబులు సంగ్రామధీరులై రథగజతురగా

రూఢులై వెంటనంటినడువనరిగి మహానలమహాజ్వాలాభీలరోషులై భీషణ
దంష్ట్రారక్తదోషు కాలనాభ మహానాభాదులగు రక్కసులతో మహా
ఘోరయుద్ధం బొనర్చుచుండి రప్పుడు సురాసురులొండొరుల పైన రథం
బుదోలి గజంబులపై గజంబులు పోహరింప జేసి తురగంబులపై తురం
గంబులడీకొల్పిన విచ్ఛిన్నధవళాతపత్రధ్వజ చామరంబులును విభిన్నశర
శరాసనసముదయంబులును విశీర్ణఖండలాంగదాది భూషణంబులును వి
ఖండితోరుపదజంఘశిరః కటితలహృదయ కరకంఠనాసికాంసులును నిరు
గడలంగలిగి సంగరరంగంబు భయావహంబైయలరె నంత విష్ణువుచేత మా
లి సుమాలి ముఖులగు మొనగాండ్రు హతులగుటయు జెంగి రక్కసులు దిక్కు
దిక్కులకుం బాఱి కొందఱు లంకకుం జనిరి కొందఱు రసాతలం
బు జేరిరి కొందఱు సముద్రంబునం మునింగిరి కొందఱు హిమాచల మంద
రాచలాది పర్వతంబుల మార్గంబులు వట్టిచని భృగుమహర్షి యాశ్ర
మంబునకేగి యాతని భార్య మఱుగుం జేరిరంత వారలనెంబడించి బృందా
రక బృందంబు తరిమికొని భృగుపత్నింగాంచి యారాక్షసుల విడు
విడుమని చుట్టుముట్టిన మహాకోపావేశంబున దేవ బృందముతో
నా భృగుపత్ని యిట్లనియె॥ చ॥ తగునే యుద్ధమునందు నోడిభ
యులై దైత్యోత్తము లోవగా । బగయింకేలను పాగుమావన

## విష్ణుండు భృగుమహర్షి భార్యం జంపుట.

ములోం బట్టంగమీకెట్టులో । తెగవింకేలను జాలు పొండిదిగో నేదృష్టిం
చి మీ భస్మమై । జగతీగర్భములోన బొందెదరు మీ శస్త్రాస్త్రము
ల్గాల్పనా॥ చ॥ అనభయమంది దేవతలు నచ్చట నిల్వగలేక విష్ణువుం ।
గనుంగొని శేషతల్ప భృగు కామిని దానవులందు ప్రీతిగా । వెనుకనుజే
ర్చియుండి ఘనవిక్రమ సాహసకృత్యమెక్కడం। బనిగొనరాదు కేవలతపః
పరిపూర్ణములై చెలంగగాన్॥ అనిన విని। చ॥ కనులనునిప్పులుంజెదర గద్గద
కంఠముతో మహోగ్రుడై । చనిజనసంఘవర్జితము చక్రముద్రిప్పియు వేగ
మైవగా । వనజదళాక్షికంఠమును భంగమునైనది చూచి ప్రీతితో । దనుజు
లు నేలపై బడిరి తర్గిరి కొండఱు చింతితాత్ములై॥ వ॥ తత్సమయంబున॥ గీ॥
భృగుమహాఋషి కాననభూములందు। దపములనుసల్పి వెనుకమధ్యాహ్న
మైనం । దావునకువచ్చి తనసతిధరణిమీంద। ద్రెళ్ళియుండుట గనుంగొని

## భృగుముని విష్ణువునకు శాపంబిచ్చి యనుగ్రహించుట.

దీనుడగుచు॥ చ॥ ఇదియుమహాపవాదమని యెంచక స్త్రీవధ జేసినట్టి వాం
డిది మొదలైతపించుచును నింతిని నావలె బాసి ఖిన్నుడై । సదనమునందు
జేరు నని శాపమునిచ్చిన గేశవుండు నా। పదకు భయంబునొంది సురవర్గ

ముత్తో జయదెందిబయిల్లనుకా॥ చ॥ శరణుమనీశ రాక్షసులు జాపగ జ క్రియుబంద నద్దమై చొరబడనిలలామమయి సోకిశరీ ముం బాసె నింక నే। తెరవుననిర్వహింతు నిదితీపను దేవ రమానినోదుసై। తరుగకయిున్న వాడ శుభదంబున దప్పు క్షమింపు గావలె॥ అని భృగుండి ట్లని యె॥ ఉ॥ దేవజగన్నివాస రణధీర శుభాకర భక్తరక్షయో। పావనగాత్ర దీనజనపాలన యెంచకరోషగించి యీ। స్త్రీవధమెట్లొనర్చితివి సేవితనిత్య ఫలప్రదాయకా। యీవిధమామె శాపమిదియోగతి గైకొనిచేయకుండు నో॥ క॥ అయినను నిప్పుడునీకీ। భయములుచొరరాదు లక్ష్మిపాయదుని న్నుకా। జయమమర రామనామము ప్రియమమరిన వేళలందు బెనగొనుచుండుకా॥ క॥ అనఘపుడు నేనువింటిని। మనమున నిదినిల్పుదైవ మార్గముతెపుడే। దినమున నేకియదోచునొ। మనవశమా యజునిపశము మహనీయంబై॥ అని చెప్పెనావలికథ యెట్టిదని॥ చ॥ నిరుపమనిత్య సత్వగుణ నిర్ణయ భాస్కరకోటితుల్య సుం। దరదరగహాస హాస్యభుజ తాండవ దైత్యమహాంధకార భా। స్కరసుర సేవితాంఘ్రిహితకారణ రూప శివాంతరంగసం। గరశరచాపహస్త జనకాత్మజ వల్లభ రామభూవరా॥ మాలినీవృత్తము॥ నిరుపమగుణశీలా నిత్యసర్వేద్యలోలా। కరతలగదదండా కాండకాండప్రచండా। సురపతినుతపాదా సుందరాకార రూపా। పరమగుణనముద్రా పాహిమాంరామభద్రా॥

గద్య॥ ఇది శ్రీమద్భ్రమరాంబికా నిజమనోల్లాస కరుణాకటాక్ష వీక్షణా లంకార సరసామృతకవిత్వత త్వాతిశయానందభరిత సాంఖ్యతారకామనస్క శ్రీరాజయోగ సామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ఘట్టువంశ వయఃపారావార సుధాకర కాశ్యపగోత్రకాత్యాయన సూత్ర శ్రీవేంకటార్యపుత్ర లలిత పాండిత్య వెంకటరామకృష్ణ ప్రణీతంబైన శ్రీ పట్టాభిరామాయణంబను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము



శ్రీరస్తు.

# శ్రీ పట్టాభిరామాయణము

## తృతీయాశ్వాసము

---

శ్రీజానకీమనోహర । భూజనబృందారకాది బృందారకభూ । రా
జాదిరాజవందిత । రాజీవదళాక్షరామ రామనరేంద్రా॥ గీ॥ అవధరింపుము
సారథియపుడుచేరి । దేవదుఃఖంబుమాను వైదేహికేమి । భయముపుట్టి
దు వాల్మీకివచ్చినవము । చేర్చిరక్షించు మునిసతుల్సేవ చేయ॥ క॥ అని
జనకరీతులబలికిన । గనుగవబాష్పములుగాఁ గలవరమమర । స్వామి
లక్ష్మణుఁడు నప్పుడు । కనకరథ బందునిలిచి గమనోన్ముఖుఁడై॥ క॥ తల
వంచి ముసుగునైకొని । వెలవెలఁబోవుచును మదినివేదన లమరం । దొల
గుచు జనమార్గంబులు । తలగుచు బట్టణము జేరె దత్పురజనముల్॥ మా॥
వనజాక్షీ రథమైతెవచ్చెనిదిగో భావి పవైదేహియా । యనమాతేరినిగాన
మొందుజననో కారుణ్యహీనుండునై । వనదేశంబుననిల్పెనో రజకుదుర్వా
క్యంబులెంతాయెఁ గా । దనుచుం జెప్పెడివారులేరు మఱియీయూరాటమె
ట్లాయునో॥ సీ॥ మనయూరిపుణ్యాత్మ లనినమాటలచేత సీతామహాదేవి
సేరెవనము । ననవిని రఘుపతి యాత్మలోభయమంది నిడుమూలాలినినిగ్ర
హింప । వచ్చునాతల్లులు వచ్చియామర్యాద కాదనరైరిగా సోదరులును ।
సర్వాత్మయిదియేటి సంగతిభూజాత చిత్తంబుదెలియదా చిత్తమందు ।
ననుచుబలుకఁగ వెఱచిరోయైనగాని । పరమపావనిసీతాభవాని యనకాల
క్ష్మణుండెంత సాహసలక్షణంబు । బూనికాంతార భూరుహభూములందు ।
నిలిపిరావచ్చెనా తనెలవునకును॥ ఉ॥ నిండినకాపురంబునకు నీచులు
యోచనజేసిసీతపై । గొండెములాడ సత్యయుత ఘోరవనాంతరమందు
భీతియై । యుండగనాయెకష్టముల కోర్వకనేమి తపించుచున్నదో । పిండి
నగర్భమైసుఖముబాసి మహాపదఁజెంద నేటికిన్॥ చ॥ జలరుహనేత్రియీశ
నకసౌధతలంబులు పుష్యరాగసం । కలితకవాటవేదికలుఁ గల్పితమౌక్తి
క హాటకకూటముల్ । విలసితనూత్నతల్పములు వేదికలన్నియుమాని కా
నలో । నిలిచెనునేడు భూతనయ సేమము లేమనవచ్చు గోమలీ॥ ఉ॥ ఏగ
తిజేరునోనలువ యాపధమెన్నఁడు చూచియుందుమా । బాగుగకాపు
రంబు నెడబాపిరి యూరిమహాత్ములెల్లయీ । భోగమురామభద్రునకు
పొందగవచ్చునె యేమిసేతుమో । కాగలకార్యమింక నెటుగల్గునో దైవవి

ధానమెట్టిదో॥ ఉ॥ మంత్రులునైనఁగాని యొకమాటయు దేమనరా దెయూ
రకే। తంత్రిమయంబన్ని భూతనయ తాలిమిమేలిమి యిట్టియుంపరిక్।
మంత్రము జేసినారు యిదిమర్మ మెుకర్మమ దేల శైలభూ। తంత్రమహోరగా
దిమృగ దారుణకాననములు మాన్పరైరిగా॥ చ॥ సగమపవిత్రపతివ్రతోత్తమ విభా
సితగాత్రి సరోజనేత్రి సే। ఖర జనక క్షమాతనయ గానసీమల ద్రోవదప్పి
యే। తెరవులబట్టెనో యకట తీరని శోక దవాగ్నిచేతభూ। వరుఁడెటులో
ర్పునెంతటికి బాపిరియో పిశి పాపకర్ములై॥ ఉ॥ ఏవిధమౌనొ చూడవలెనే
మిపురాకృతకర్మనిష్కళీ। దేవిని బాసి రాఘవుడు ధీరతవృత్తి నున్న
వాఁడె యూ। భావము నెవ్విధంబగునొ బంధువులాప్తులునైనగాని యో దే
వ యిది దేవికార్యమదిరా దేవతలైనను విఘ్నవింకరో॥ క॥ అనిపురజనములు

## సౌమిత్రి శ్రీరాముని యంతఃపురమున కరుగుట.

నివ్వెఱ। ముంబల్కగ లక్ష్మణుడు మునుంగిలి జనులం। గనుఁగొనక నేలచూ
చుచు। జనిచనిరథమ చటడిగ్గి సంరంభముతోన్॥ వ॥ వివిధ రత్నోజ్జ్వల
త్కవాటదేశాంతర విచిత్రవిద్రుమస్తంభాలంకృత తోరణవిరాజితంబును
జాదసగంధబంధుర కస్తూరికాలంకృత సౌధాంతర వయోవిలాససీమంతినీ
మందార కుసుమానంద కందళితలతాంతర ఘుమఘుమాయమానంబు
ను సకలమానినీమానితాకార హారకర్పూరతుషార పటీరఖ్యాతికానంత తే
జోవిరాజమాన ప్రభాసితప్రతిమాన్విత విపులద్వారంబులగడచి యంత్య
పురాంచితఖచిత రత్నప్రభాపిశేషంబులంగడచుకొనియున్న మందిరాభ్యం
తరంబున మృదులతర హంసతూలికాతల్పంబున దేహంబు జేర్చిపొరలుచు
నిట్టూర్పులునిగుడించుచు సీతామోహసాగరంబున నీదుచు బ్రహ్మాండ
యంబై యేకీభూతంబులైన తెలుగున చిత్తకల్పంబున విరహానలమహోన
లంబై తదీయసీతా హృదయ కుచనిటలతటకపోలాధరకలకంఠనాసాహాస
భాసలావణ్య సౌరభ్యసద్గుణంబులం దలపోయుచు విలపించుచు దనలో
దానాశ్చర్యచిత్తుండై చిత్తజాయత్త పరవశత్వంబుం బొంది యున్న శ్రీరా
ము సన్నిధానంబునకరిగి యవసరంబు వేచి మొగసాలంగాంచియున్న భర
తాది మంత్రిసామంతసమూహంబులం డాసి గృహాంతరంబునకరిగి శ్రీరామ
పాదారవిందంబులకుం బ్రణమిల్లి లక్ష్మణుం డిట్లనియె॥ సీ॥ అన్న వైదేహి నిఃరథం

## లక్ష్మణుండు సీతను వనంబున నిడిచిన వృత్తాంతం బెఱింగించుట.

బుపై జేర్చిసారథి యుతుండనై జాగిగాగి। గంగానదీతీరకాంతారమధ్యంబు
చూచి భీతిల్లెను సుందరాంగి యంతట నీరీతులన్ని యేర్పడఁ జేయ దేహంబు పైమ
హో తెగువబూని। భూషణంబులు నేలబుచ్చి ముద్దిగ బట భూమిపై పడిపడిపొర
లిపొరలి। ధూళిధూసరితయై లేచి దుఃఖమునను। నన్ను రక్షించిమీ యన్న నగరి జే

గీ॥ భక్తిగలుగంగ రామభూపాలునకును। జేరి మ్రొక్కితిననుమని చెప్పినొకటి॥
ఉ॥ నామదిఁ జూచియుండిజననాయక యింతలు సేయవచ్చునా। నోమిననోము
భాగ్యము వినోదము లేమని చెప్పవచ్చునా। మోమున వ్రాసె నేయజుడు
ముచ్చటజెందెను జీవితేశ యీ। భూమిని నిందలందలప బూనితి నాయన
జానకీపతీ॥ చ॥ పరిణయవేళలందునఁ గృపారసతంతు్రిడవయ్యునెల్లరు। న్న
రులు నరాధిపుల్ మునులు నాకనివాసులు బంధువర్గముల్ లక్కరువహిల్లఁ
గాను జనకాత్మజ నిన్ను నెల్లకాలము। మనువఁబోత్రియుసన్న యభిమా
నము లెన్నము రామ భూవరా॥ క॥ జలరుహనేత్రి దుఃఖములు దాటద
రంబులుగావు భూమిపై। వెలవెలపోవుచొందుబహు వేదనఁబొందుచు మూ
ర్ఛజెందుగా॥ నలఁదిరుగాడు రామ నరనాయక యంచు దలంచు నత్తలం।
బిలుచును సొమ్మసిల్లు మదిభీనతిహీల్లు పమందు నెవ్వడున్॥ చ॥ అనిన ర
ఘూద్వహుండు తనయాత్మ మహావ్యసనంబు జెదఁగా। గనులను నశ్రుబిం
దువులు గారఁగ నాజలజాక్షి నిపయి। ననవలిదోషముల్లపకారణమై
విడనాడ నారమె నాతనువుఁ ప్రాణముల్నిలిపి తాళగజాలను బ్రహ్మదేవు
డే। దినమున నేమి వ్రాసె నెఱుదీరును నీవిపరీత దుఃఖముల్॥ చ॥ నిలువవు
నాకు నెట్టెదుర నిండిన మోహముచేత ప్రేమతో। బలుకులు చెప్పుచుండు
దువు పాదయుగంబుల జేర్చు హస్తము। ల్చిలుపఁగ మోహమొందుదువు నే
రములెంచగ వచ్చుఁదొల్లి నే। గలిపిన పూజమంచిదని సన్నుతి సేతువు జీవితే
శ్వరీ॥ వ॥ అని ప్రకంపితహృదయుఁ కలుషుఁడై రఘువల్లభుండు నిశ్చేష్టితుం
డై విభ్రమాయత్తచిత్తంబున వైదేహి యందు మోహపరవశతం జెంది
భ్రాంతులుడిగి రాజ్యపరిపర్తిత కార్యంబులం బాసక్తివిడిచి నిద్రాహారవ
స్త్రగంధమాల్యాలంకృత భూషణాది వస్తుగ్రహణంబులుమాని వైరాగ్యభో
గానంద సంప్రాప్తహృదయుండై మౌనంబుగైకొని జనంబులతో భాషిం

### సీత వాల్మీకాశ్రమంబునఁ బుత్రద్వయంబు గనుట.

పకుండెనంత॥ క॥ ఇనకులుఁడు నిర్వేదంబున। దినములుజరుపంగనచట దిశ
లు చెలంగన్। జనకజనవమాసంబులు। ఘనమాట రెుఱంగి మానికాంతా
జనముల్॥ సీ॥ కురులునున్నగదువ్వి కొప్పుచక్కగబెట్టి పసుపుతీర్థంబులు
పైనజల్లి। భూరిరత్నోజ్జ్వల భూషణంబులబెట్టి జిలుగువన్నెలపట్టు చీరగట్టి
గంధమాల్యంబులు నిందుముఖికలంది వివిధఫలంబుల విందొనర్చి। సకలోప
చారము ల్సంఘటించుచు మునిభామలు సేవింప భాసురముగ। వచ్చి వాల్మీ
కి నిత్యంబు బహుపురాణ। కథలువినిపింపఁగొంత దుఃఖంబు మఱచి। సకల
విభవాభిరాముడై సంతసమున। నీరజాక్షికి దొమ్మిది నెలలునిండె॥ క॥ దివి
నుండి దేవదుందుభి। రవములు మొఱయంగసూనరాసులు గురియం। బవనుడు

చల్లఁ జీవఁగ । భువికన్యక ర్రాత్రిగనెను బుత్రద్వయమున్ ॥ క॥ కనఁగాఁ బుణ్యా
లలాములు । నిసచంద్రుల మాడ్కి నెలఁగు నిద్దరుసుతులం । గనినది భాగ్యవ
తీయని । తనయులకును సీతృపోసి దయచెన్నొందన్ ॥ క॥ వనితలు కొంద
రుగ్రగతిఁ జనఁ । జనివాల్మీకులకు మొక్కి సంతోషముతో । వనజాక్షి పుత్రు
లిరువురఁ । గనెఁ దియని విన్నవింపఁ గరుణాన్వితుఁడై । గీ॥ వచ్చి సుతులఁ జూచి
మెంచి లగ్నంబు గని । జలములార్చి మృదులశయ్యలందు । నిలిపి కుశలవాఖ్య ని
యమంబు గావించి । జాతకర్మహోమ సరణులఁ దీర । క॥ మదిదినముపురుడు
దీరిన । ముదితలు జలకంబులార్చి మృగమదము పుడే వదనముల దీర్చి సొమ్ము
లు । కదియఁగ గుసుమములుదురును గారవమమరన్ ॥ చ॥ కుడుములు పా
యసాన్నమును గూరలు దీయనిచారు లిడ్డెన । ల్వడలును నేతిబూరెలును
మంచిఫలంబులుఁ బానకంబులు । న్వడి [illegible] లోష్ణ్య [illegible] ప్పాలును లడ్డుగలుం
గలమానభేదము । ల్గడలుకొనంగ మానిహితకాంతలు తట్టలు పట్టి వేడుకన్ ॥
చ॥ చనుదేర న్మునికోట్లు శిష్యులు మహాసంతోషులై వంక్తులై । ఘన [illegible]
ప్పారఁగ భోజనంబులచటం గావించి వాల్మీకియున్ । వినుతుల్సేయుచు వేద
ముల్చదువుచున్ వేగంబె తాంబూలము । గ్గొని [illegible] తాశిషలిచ్చియంత
మదిలో గూడంగ మోదంబునన్ । వ॥ మఱియును । క॥ కుశలత్వమునను నె
ప్పుడు । గుశలవులును వృద్ధిఁబొంద గూడిరి చూడన్ । దిశలెల్ల దేజల్లఁగ విశ
ద యశస్సాంద్రులగుచు వెలయుచునుండన్ ॥ క॥ పుడమి పయి లేచి నిలఁబడి ।
తడబడు నడుగులు దుబెట్టఁ దలచిరి ఫలము । ల్వడి నిండఁగట్టి వ్వుచు । నడబిరి వ
నతలమునందు నానాటికిన్ ॥ క॥ చౌలోపనయన కర్మము । నవరణఁ గానిం

## జానకీసుతులగు కుశలవులు విద్యగఱచుట.

చి వేదశాస్త్రములెల్లన్ । సవరణతోడం జదివిరి । భువిప ము వాల్మీకి దెల్పఁ
పూజితులగుచున్ ॥ గీ॥ అలయథర్వణవిద్యలు నభ్యసించి । శరశరాసనకవ
చము ల్సంగ్రహించి । ఘనత తోమరకరవాల గదలఁబూని । యఖిలశస్త్రా
స్త్రవేత్తలై యతిశయిల్లి ॥ సీ॥ ఆగ్నేయశరముల యాకర్షమెఱిఁగి మేఘ
బాణంబుల మేలు దెలిసి । బ్రహ్మాస్త్రవిధములు బాగుగా గ్రహియించి చక్ర
బాణంబులు జతనపఱిచి । వరుణసాయకముల వైపులన్నియు నెంచి శక్తిసా
మర్థ్యంబు జతనపఱిచి । శూలాయుధంబుల సూక్ష్మములార్జించి విశిఖస్వ
భావ వివేకమునరి । సమరతలస్థైర్య విక్రమ సాహసముల । గజరథాశ్వ
పదాతి సంకలితవీర । వరుల బరిమార్చి పోరాడు తెఱగు లెఱిఁగి । కుశలవ
కుమారులచ్చటఁ గుశలమునను । శా॥ శ్రీరామాయణమాదికావ్యము
మహాసేవ్యంబు పాపఘ్నసం । సారోత్తారము మోక్షసాధకము విశ్వాసం
బున నెన్నెనిపి । స్స్వరాశక్తిదలంచి చెప్ప నదియున్ ॥ సాధించి వీణాముఖం । దా

కం జేరిచి పాడినారదుని శిక్షానందభాశీలురై। సీ॥ సత్యసదాచార సద్గు
ణంబుల రామచంద్రునితోసరి సేయవచ్చు। విపులబాహాటోపవిక్రమంబు
లఁ బినతండ్రిలక్ష్మణురీతిఁ దలఁపఁవచ్చు। మర్యాదయుతమాన మార్గంబుల
న్నియు భరతునివలె నని పలుకవచ్చు।శస్త్రాస్త్రకేతన సేనమార్యంబుల
శత్రుఘ్నుడనినుతి సేయవచ్చు। గనుచుబెంపొంది దినదినమునఁనువృద్ధి। బొం
దికుశలవపుత్రులు భూమిజాత। లాలన మొనర్చ తేజఁపు లక్షణములు। కలిగి
మెలగిరి యమ్మౌనికాననమున। చ॥ వనములకేగి నిత్యమును బాహుళరా

## కుశలవులు వనంబున విహరించుట.

క్రమశక్తియుక్తితోఁ। గనకగిరిప్రభావములు గల్గుమహాద్రులువంచి పెట్టి
మి। దనుధరియించి యోధుదురు గౌరుదు దుర్వారసాతల బుచే। తనునిడి
బాణఖడ్గములు ధైర్యముతో మృగ వేటలాడుచున్। వ। ఇవ్విధంబున
నమ్మహనీయమూర్తులగు కుశలవకుమారులు ప్రతిదినంబును ధనుర్ధరులై
ఘోరారణ్యంబులం దిరుగుచుసింహశరభ శార్దూల వరాహంబుల మాదే
భంబుల దారసిల్లగ్రీడి పంగైకొని గంగాసాగరాంతరంబులు గడవనీదుచు
నిత్యమంగళదేహులై వల్కలాజనంబులు ధరించి సహకారజంబీరకపిత్థ
మాతులుంగ మృదుమధుర రసపూరితఫలంబులు పర్ణపుటంబులనించి పుం
గవంబులంగైకొని వకుళమందారమల్లికా కుసుమదామంబులు పరిగ్ర
హించితెచ్చి తమతల్లియగు సీతామహాదేవికి నొసంగుచు మనోల్లాసంబు
గానాడుచు దినదినప్రవర్ధమానులై యుండిరంత॥ సీ। అట నయోధ్యాపు
రియందునలక్ష్మణ భరతశత్రుఘ్నులై పరగమిత్రవంశపావనరామభద్రుం
డు వైదేహి బాయుటదుఃఖ సంభవముగలిగి। రాజ్యాభిలాషలు రాజ్యతం
త్రంబులు విడనాడివైరాగ్యలేపమమర। పలుకకశయ్యపై బవళించియుం
డిన బ్రహ్మాదులును మహాభయము జెంది। నరులువాపోవ గిన్నరవరులు
బెదర। గరుడగంధర్వసిద్ధులు కలతనొంద। దిశలుఘూర్ణిల్ల భాస్కరదీప్తి
తొలగె। సాగరంబులు కలగెనానగమందు॥ చ॥ తెలిసిబుషీశ్వరు ల్న
రుగుదెంచిరి శిష్యప్రశిష్యసంఘముల్। గొలువజటాకలాపములు ఘోర

## ఋషులు శ్రీరామచంద్రుంజూడ నయోధ్య కరుదెంచుట.

మృగాజిన వల్కలమ్ములున్। లలితతపఃప్రభావముల లక్షణకాంతులుదే
జరిల్లగా। ఫలములు దీర్ఘముల్ గొనుచు భావమురాముని యందుజేర్చు
చున్॥ సీ॥ జాబాలిచ్యవన వైశంపాయనులు మతిజమదగ్ని భృగువరా।
శరునుసత్రి। కణ్వకాత్యాయన కపిలమార్కండేయ గాధేయపులహ కశ్య
పులుక్రతువు। వామదేవవశిష్ఠ పౌలస్త్యనారద మంకణాంగీరసమందపాల
వ్యాసహారీతల్య దూర్వాసభరద్వాజ శతబలి సంయమీశ్వరులు గూడి

కపటమానుష రూపముదాల్చి యుండవా॥ ఉ॥ దేహియొనర్చు కర్మమున
దేహమునచ్చును దానుబుట్టియా । దేహములందిభోగములు దీపతనూల
యచూనుభూరిద। న్మోహముజెందుయాతనలు పొందనుమానవ మాసరీ
తులుక్। దేహికిలబ్ధమైతనరుదేహిశరణ్యమహౌఘభంజనా॥క॥వచ్చెడియా
పదసంపద। లెచ్చటమాన్పంగవశమెయీశునికైనన్ । వచ్చునుభవనామం
బును । గ్రొచ్చును దురితములంబాపి కూర్చును శుభముల్॥ చ॥ పవ
న జలాగ్నిహోత్రి కృతిభాసితమైన ప్రపంచమెల్ల సం । భవమగు సీత
గీరమునం బాయకనిండి వెలుంగు చుండగా । నవనిజయెందు బోయినది
యూర్జజనాధిక లోకరక్షభూ । భవ విభవాభిరామ మితభాషణ రాక్షస
గర్వభంజనా॥ వ॥ఇదియునుంగాక యవనిజయగు సీతామాహాత్మ్యంబుబ్రి
హ్మాదులకైన నెన్నందరంబుగా దప్పరమసాధ్వి పూర్వవృత్తాంతంబు సా
కల్యంబుగ నెఱింగితునని కుంభసంభవుండిట్లనియె॥ చ॥ జడిగొని రావ
ణా సురుండు శత్రులపై బహురోషవృత్తితో । నడిచికుబేరునిం గెలిచినా
గధరుంగొమారారుశైలముం । దచబడజేసి యీశ్వర నుతార్చితుండై మ
హనీయ ఖడ్గముం । బడసి యుపాగ్రధైర్యతర భాగము దిక్కులమీఱనుం
డగన్॥ వ॥ ఇవ్విధంబున మహాబల సమన్వితుండై దశ కంధరుండు ధరణీ
తలంబునం దిరుగుచున్న సమయంబున॥ సీ॥ భూసురుండను వేదమునంబ
ఠించుచువేళ దీపించు వేదవతీలలామ । లలన బాల్యము మాని లావణ్యవ
తియైన పెండ్లిసేయగ దండ్రి ప్రియముజెంది । యడుగగా నాదేవి హరిని
పెండ్లాడుదు నెవరిని మోహింప నిదియెనిజము। యనగరక్కసుండొక్క
డాతురంబును మీర నరుదెంచి యమ్మని నడుగగానా। దగదు పొమ్మని
పల్కగా దైత్యవిభుడు । క్రోధమును బెంచి సడి రేయిం గూర్చిపోయి। స
దనమునుజొచ్చి విప్రుని సంహరించి। జణుగు చుండెడి దైత్యునిం జూచిత
న్వి॥ చ॥ కనులను నిప్పులుంబెదర గద్గదకంఠముతోడ నేడ్చుచున్ । దను
జుని దేహముల్ ధరణి దగ్ధముగా శపియించి యప్పుడే। వనమునంజేరిశ్రీహ
రిని భావములోపలం జేర్చి ధీరయై । పనిగొని పూన్కి ఘోరముని వైభ
వ వేషములుల్లసిల్లగన్॥ క॥ ఈరీతినున్న రావణు । డారంభముతోడ సీ
న యుపమితంబు । స్నేరంగ భేరీరవములు । ధారుణి వగులంగనడువ దై
త్యశ్రేణుల్ ॥ క॥ వనతలమునందు నింతిని। గనుగొని యాలలన మోవతో
కనకము చేతం। బనితరచి తీర్చుపత్రిమయొ । కనులకుం బండుగయె జూ
డగా మదినాకున్॥ చ॥ కరములతీరు రేఖగల కన్నులు మోముసుధాంశు
బింబము । స్నేరతనము న్నెయారమును నిల్చినచక్కడ బాహుదండము
లుక్కురులవినోదము ప్పిగువుగుబ్బలపొంకము నాభిరీతియే। తరుణులకైన గ

## రావణుఁడు వేదవతిని మోహించుట.

ల్గునె యథార్థముగా ననుఁగూడ నేర్చునే॥ సీ॥ దీనిఁ గైకొనిరతిఁ దేలించుపు రుషుని పురుషోత్తముఁడని పొగడవచ్చు। నీయింతి కౌఁగిలిఁ బాయకవిహరించు వాఁడు పరమపూరుషుఁడని పలుకవచ్చు। నీతలోదరి మనఃప్రీతి జెందినవాఁడు శ్రీమంతుఁడని నుతిసేయవచ్చు। నీకాంతతోఁ గూడి యేకాంతమాడిన యతఁడు పావనుఁడని యనఁగవచ్చు। గాని తన్వి యెవ్వతో కాననమున। నొంటిగా నిల్చి తపమేల యొనరఁజేయు। ననుచు దశకంధరుండును నరుగుదెంచి। మోహమునఁ గోర్కె యొకమాటనుచ్చరించె॥ మ॥ కనకాంగీ యిదియేమె యొంటరిగ నీకాంతార భాగంబులో। ఘనమై యుండఁగనేల యింక విను లంకానాథుఁడన్నేనున। నొక్కఁడే నిం దోడరంగ లేఁడు భువినీ యారేడు లోకంబులం। దకలంకాధిక సత్యభాగ్యములు నాయందొప్పు నిత్యంబులై॥ క॥ తరుముదుసు సురలనందఱు। ధరణీశులమందు నిలిచి దండింతునుభూ। సుర ముని సంఘంబులనే। వెరపింతును నెదురు లేక విహరింతుఁదగన్॥ క॥ అలివేణిఁ బట్టి పిలిచిన। గనులను నిప్పుకలు గురియఁగా ధైర్యముతో। దనుజాధముండు వీడని। వనజాక్షియుఁ బల్కె గోపవశము చెలంగన్॥ చ॥ తగునె దురాత్మ యీవిధము దల్పఁగవచ్చునె విష్ణుభార్య నే। నగుటను జేరవచ్చితి వినాశము హేతువు లేమియంటివా జగతి జనించి నీతనువు చెండఁగఁ జేసెద నంచునప్పుడే। మగువ శిఖిప్రభావమున మాయముగా మఱికొన్ని నాళ్ళకున్॥

## వేదవతి లంకలోఁ బద్మంబున జనియించుట.

గీ॥ తనదు కోపంబుచేత నాతలిరుబోఁడి। వచ్చిలంకాపురీవన భాగమందు। బద్మగర్భంబులోఁ బసిబాలయగుచు। వేయుచుండఁగ దినములు వెళ్ళగాను॥ క॥ దినదినము శివునిపూజకు। దనుజులు రావణునియాజ్ఞ దలచుచు భయులై। వనరుహములెత్తి బుట్టలకుఁ। జనుదెంచుచు నొండి యొక్క సమయమునందున్॥ గీ॥ స్నానములు చేసి ధౌతముల్ పుక్కగట్టి। హరునివాసంబునకు జేరి యాత్మ బరము। శివునిఁ బూజించుచును గొంతసేపు జరిపి। యసురనాథుండు మౌనముఁ బూను దాల్చి॥ సీ॥ అర్ఘ్యంబిదే నీకు నమరవందిత ధూప దీపంబులివె నీకు దీనపోష। యభిషేక మిదె నీకు నంగజాత విరోధి యాసవాచమనంబు లాదిదేవ। యర్చనాదులు నివె యఖిలలోక శరణ్య నీరాజనంబులు నీలకంఠ। నైవేద్యములు నివె నాగేంద్ర భూషణా స్తుతి వందనంబులు శోభితాంగ। లోక। నాయక సర్వేశ లోక వరద। సత్యచారిత్ర పార్వతీసదయహృదయ యనుచు దశకంధరుండును నభినుతించి। కాంచనాబ్జంబు నొక్కటి కర

ముబట్టి॥ ఉ॥ భారము చెందగా దనుజపాలుడు రేకలు దీసిచూడనా। సా
రసమందు రాచిలుక చందముదోపగ బాల్యవృత్తితో। శారదభార్గవీ శి
ఖల చందముగా గనుపట్టుచుండ యీ। వారిజనేత్రి యీ వికచపద్మము
లో వసియింప నేటికిక్॥ వ॥ అని మహాశ్చర్యచిత్తుడై సంతోషించుచున్న
సమయంబున॥చ॥దనుజులువచ్చి యిట్లనిరి దానవనాయకనాశహేతువై। జ
నితమునైనదీనతివిచారణలెందుకునుంచగూడది। ద్దినమున దాటవేయుమని
దెల్పగయోచనచేసిరావణుం। డనువుగబెట్టెలోనిలిపియబ్ధినివైవగదేలియాా
డుచుక్॥గీ॥పోయిమిథిలాధిపతియేలుభూములందు। బూడిపైమన్ను పెఱుగు
చుబోవగొంత। కాలములునిండనవనుంబుఘనతజేయ। దలచిజనకుడునాథ
రాతలముననందు॥క॥పులిజూడమాడిశిలలును। మొలయుచునేరంగదివ్యమణిక
నురీతిం। దిలకించె బెట్టె బీగము। దొలగించిన బాలయందు దోచగఘన
మై॥ ఉ॥ భూపతిమోదమంది తనపుత్రికగాదలపోసి మెచ్చుచుం। బాలపు
గనెత్తి తెచ్చి తనభార్యకునిచ్చిన గారవించియూ। పాదను పోషణంబమర
బాలనసేయగ సుందరంబునౌ రూపముచెన్నుమీరగ సరోరుహనేత్రి
యు వృద్ధిబొందగక్॥ గీ॥ వేదవతియెసీత విశ్వంబులోనదా। యతివయున
గబరగనాదిలక్ష్మి। దేవనీవు విష్ణుదేవోత్తముండవు। గనుకబరిణయంబు
గలిగెనీకు॥ గీ॥ అంతదశకంఠరుండునుయురథమెక్కి। ఘోరరాక్షసవీ
రులు గొలువమత్త। కుంజరంబులు రథములుగూడిరాగ। భేరులును
మ్రోయు దిశలెల్లభోరుకొనగ॥ చ॥ సురసిద్ధకిపురుష నాగ సభళ్ళర
వీరయోధులక్। నురుసున మొత్తుచుం బలదోలుచు భూతలమెల్లజా
చుక్। బిరుదులు వల్కుచు దనుజవీరులమున్దర హెచ్చరించుచుక్।
ఖురములు దాడిసేయుచును భూరివరాక్రమ శక్తిమించగక్। చ॥ జలవ
రుణాగ్నిహోత్ర జలజాప్త సమీరులకూల్చి ధీరుడై। తలములుదాటిబా
హుబల దర్పముహెచ్చుచు రేండ్రచంద్రులుం। దొలగ రసాతలంబునను
దొంతులుగంపముబెట్టి భీతితో। దలమతలాతలంబును దాటిరి రావణు
విక్రమంబునక్॥ సీ॥ పరుగెత్తి పాతాళవాసులు వెఱచిరి భూలోకవాసులు

రావణుండు దిక్పాలకాదుల నిర్జించుట.

పోయిరంత। నింద్రలోకమునుంచి చంద్రలోకముజొరం జేరిరిసిద్ధులు సిద్ధ
ముగను। వరుణపౌరులు వనవాసులై కొందఱు పవనదేశంబును బాసిచ
నగ। సత్యలోకముకొంత చాలించి కైలాసమార్గం బుబట్టిరి భరమునును
లు। సురులు నరయక్షకిన్నర వరులుబెదర। ఫణులు వాపోవ గంధర్వ వ
తులుచెదర। సమర జయశీలుడై దైత్య సంఘమెల్ల। రూఢికెక్కంగ ద
శకంఠరుండునంత॥ సీ॥ స్వర్గంబు ముట్టడి సాధించి దేవేంద్రు సమరంబు

లోఁగెల్చి శౌర్యమునను । గార్తవీర్యార్జును గదిసి యుద్ధము చేసి మాం
ధాతతో మహాటపర మమర । జేసిమాయవియై భాసిల్లుచునుయక్ష గం
ధర్వసుత నరకాంతలెల్ల। బట్టుచు జెరసాల గొట్టుచు శృంగార వనముల
దిరుగుచు వైభవమున । జమునితోఁబోరి నైఋతిచెలిమివిడిచి। వరుణదే
వుని బెదరించి పవనుగెలిచి । రమ్యమమరంగ రంభను రతులఁదనిపి । ద
శముఖుఁడు రోషగించుచు దిశలఁదిరుగ॥ సీ॥ మహనీయమయిన సీమా
దులు చాలించి మునులు దేశంబులు మొనసి వెడల। ముద్దుగుమ్మల నవ
మోహంబులెడఁబాసి సురసమూహంబులు గిరులకరుగ । హాటకాంచిత
రత్న హర్మ్యంబులును మాని క్రీడశాంగనలు పెనుదిగులుఁజెంద । సఖి
మిత్రబాంధవ సఖులనుగనక వసుధీశులును లేచి పరువులెత్త । రావణా
సురుఁడీరీతి రాజ్యమెల్ల । హల్లకల్లోలములు చేసి యాజ్ఞమించి। సవనము
లుసాగనీయక సకలలోక । నాయకత్వంబు నొందుచు నయములేక॥ శా॥
ఈరీతిం బ్రకటించు దుఃఖములచే నేరీతులుం జకక్ । ఘోరారణ్యములం
దఁటాగిరి సురల్ఘోషించుచున్ బ్రహ్మతో। ధీరత్వంబునఁ దెల్ప గోపవశు
డై దేవుండు దేవేంద్రముం । బ్రారంభంబులనెంచి విష్ణుసదటం బ్రార్థించు
చుం బోవుచున్॥ మ॥ చని వైకుంఠముఁ జొచ్చిపోయె నచటన్ సౌధంబు

## దేవతలు వైకుంఠంబున కరుగుట.

లందాటి చం । దనకల్పద్రుమదేశము ల్గలయుచున్ ధ్యానించుచున్
ద్వారముల్ । ఘనమల్గాచిన భక్తులం బొగడుచున్ గంభీరుఁడై ముదు
గా । జనుచున్ శుద్ధసువర్ణమూఁ వనముల్సంప్రీతితో గాంచుచున్॥ చ॥ అ
చ్చటి రత్నగేహములం హాటకనిర్మితమైన కోటలున్ । అచ్చటిచంద్రశా
లలును నచ్చటిచిత్రితరత్నగేహముల్। అచ్చటిగోపురంబులును హర్మ్యం
తలంబులపై విచిత్రముల్। అచ్చటి చిత్రగేహములు నాత్మను మెచ్చుచు
వచ్చుచుండగా॥ చ॥ కమలదళాక్షుశ్రీరమణకామితధర్మ ఫలప్రదాయకా ।
యమరనుతాంఘ్రిపంకజ మహాగుణ భూషణయంచు మ్రొక్కుచున్ । అ
మరులు సంచరించుచు మణిహర్మ్యముజేరి హరే నమో నమో। విమలమ
తిన్నుతించుచును వేడుక గొందఱు వచ్చిపోవఁగన్॥ చ॥ సనకసనంద
నాది మునిచంద్రులుబద్ధకరాబ్జవాసులై । మొనసిరమేశ యీశ భవ
మోచనయంచు నుతించికొందఱున్ । ఘనమణి హారముల్మెలఁగఁ గాంచ
నచేమ ముల్లసిల్లఁజు । దనకుసుమాభిరాములను తప్పకనిల్చిన వారి
జూచుచున్॥ సీ॥ మహామోక్షతిని బర బ్రహ్మంబు దలచిన వారు సారూ
ప్య సంపదయుఁ బొందు । నాత్మగ్మలక్షణ మాత్మనెఱింగడి వారుసాలో
క్యసమ్మతము జెంద। దారకాంకిత మద్రధారణ గలిగిన వారుసారూప్య

సంభ్రమము బొంద। భూరిఖేచరి చూచు పుణ్యులౌపురుషులు పూనికసా
యుజ్యమునను బొంద। అనుపమానకవాటనిర్ణయములందు। జేరినారా
యణాయుని చేరఁజీరు। వారిదర్శించుమునుబోయి వజ్రమయము। గని
కేతనపంక్తులుగడచిచనంతి॥ ఉ॥హాటకమానమైవిపులహర్మ్యతలంబులుచం
ద్రికాంతముల్। మేటగు గోపురంబులును మేఖల చక్కదనంబు నచ్చు
టన్। నాటిన కల్పభూజములు నప్రసంనములై కటువంటిసాధముల్। బోటు
లు కొందరందు పరిపూర్ణ మనోహరరూపవ్యాప్తి నాఢ్యలై॥

సీ॥ పసిమిపావడపిరాది పెటులు లు సరిగంచు చీరలపై జీరు చిత్ర
మమర। ముఖపద్మములయందు మృగమదతిలకంబు లుల్లసిల్లగ నయనో
త్సవముగ। జలదపంక్తులకాంతి జిలుకించివేణిని బూవుసరంబులు పొం
దుపఱచి। రహిమిచుచెంగావి రవికను బాలిండ్లు పిక్కటిల్లగఁగట్టి వేణి
యమర। మల్లికాసూన మందారపారిజాత। మునుచెలగంగ నవదివ్య
మౌక్తికముల। సరులమగఱాలదాపిన చంద్రహార। పతకముల తోడ
వైష్ణవసతులు వెలగ॥ ఉ॥ ద్వారములందుశేరి నిజదాసులు శ్రీహరిసేవచే
య శ్రం। గారమనోహరాలు శుభకల్పిత నిత్యఫల ప్రసాయ మో।
రారి వితారితాయయని యాత్మదలంచుచు సిద్ధసాధ్యులుం। జేరికవా
టవేదిక వశీకరసీమలుదాటిపోవుచున్॥ వ॥ అచ్చట॥ సీ॥ కనకరత్నప్రభాక

## సురులకు నారాయణుడు ప్రత్యక్షమగుట.

లితసౌధాంతర శేషతల్పంబువిశేషమమర। రవికోటితుల్య విరాజిత దే
హంబుమీసుగా హారంగట్టమెఱయుచుండ। శంఖచక్రగదాసి చాపాయు
ధంబులు కరపద్మములయందు గడలుకొనగ। మహనీయకేయూర మకు
టకుండలరత్న కలితహారంబులు కాంతులీన। దేవిశ్రీదేవిభూదేవి తేజరిల్లవ
న్నమీరంగ గౌస్తుభమణిచెలంగ। బూజితాకార సంపూర్ణభోగరమాగ।
మహిమబ్రత్యక్షమయ్యెను మాధవుండు॥ ఉ॥ చూచిసురాధినాయకులు
శోభితులై నిగమాంతవేద్య దుర్మో। చనసృష్టిపాలన నమోహరి కేశవ
శార్ఙ్గహస్తభూ। ఖేచరసిద్ధసాధ్యమునికిన్నరవందిత పాదయుగ్మశ్రీ। వా
చకమోహదాయక రమాహితవల్లభ మమ్ముఁగావవే॥ చ॥ నిరుపమ శింప
గల్గె దనీవుచరాచర భూతతేజుడై। దినమును రక్షసేయుదువు దేవభవా
జ్ఞకులోనుగాదెమే। మును సురసంఘములున్నలు మానులు నీమహనీయ
శక్తిని। గనుగొనలేము సాధుజనకల్ప మహీరుహనిత్యమంగళా॥ సీ॥ ప్ర
కృతిలోపలఁజిక్కి బ్రహ్మాండగోళంబు పెంపుచుండుదువొక వేళయందు।
భూజలాగ్నిసమీరభూతపంచమగలయజాతువునొక కాలమందు। మహ
దహంకారసంబంధాశ్రయములనుబొందుచు నుండుదువు మహానద్భుతముతో

డ। నిత్యనిరాకార నిర్వేద్యశుభనామ శీలుండవౌచు నిశేషలీల। సత్యగుణప
రిత్రాకార చారుగాత్ర। కమలదళనేత్ర లోకసంకాశపాత్ర। సేవితానంద
పీతకౌశేయవాస। పాహిపాహి దయానిధి పరమపురుష॥ క॥ ఈరీతిని బ్ర
హ్మాదులు। చేరి నుతింపంగ గొంతసేపటికిన్ శ్రీనారాయణుండు కల్యాణ।
సారవచో మధురవికచ చకితాత్ముండై॥ మ॥ సురలారా భయమేల మీకు
శుభముల్ స్వేఖిల్లు నే వేళలం। బరిపాలించుచునుందు నెల్లకనులున్ భావిం
పనాధారమే। పరమానందము బొందినారుగద యాబ్రహ్మాండ గోళంబు
లో। తెరగల్పుట్టునె వింతలుంగలవె యీదీనోక్తులింకేటికిన్॥

## దేవతలు గోవిందునితో రావణునివృత్తాంతంబు సెప్పుట.

చ॥ అనిన ముకుందుఁజూచి సురలందరు సాగిలిమ్రొక్కి దేవ యే। మ
నికొని యాడవచ్చు జగమంతయు దర్పి మహాగ్రహంబుతో। జనులకు మృ
త్యువై యమరసంఘము పాలికి గాలపాశమై। ఘనముగనున్నవాఁడు లంక
కాలుని నీతిగం బంక్తికంఠుఁడున్॥ చ॥ పారిపారి బుణ్యాశ్రమసీమల బోడిమి
పోవగఁజేసె దేవతల్। పురములబాయనాయె బహుపుణ్యతలంబులు మా
యమాయెలో। వెరపుజనింపనాయె దమవేడుకలన్ని యువీడనాయెగా। పు
రములు సేయుచెట్లు సురపోషణసంతతయాత్రరతుణా॥ సీ॥ వనకేళికై ప్రా
ణవనితలతో గూడి విహరించువిధములు విడువగలిగెఁ। బండువెన్నెలలందు
బర్వేందుముఖులతో సాంగత్యములు సేయ సాగదయ్యె। సౌందర్యవతులు
నచ్చటనైన జలముల నాడరు సంతతానందులౌచు। నే ధాంతరంబులు చా
లించి వనితలు విపినభూములయందు వెడలగల్గె। ధర్మములు మాసె నిప్పుడ
ధర్మసమితి। విత్తరిల్లెను భవనముల్విడిచి మునులు। పర్వతంబులు నెక్కిరి భా
నుచంద్ర। మండలంబులగతి తప్పె బద్మనేత్ర॥ క॥ సతిచక్రనిధై యుండిన।
బతిని వధించెని బట్టుబలిమిని నేనిన్। రతిగలయుమ జగంబుల। బతితానేయ
నుచు జగతిపతులదరంగన్॥ సీ॥ అమరేంద్రుతో బోరి యగ్ని హోతుని
దంచి శమనుతో సంగరస్థలిని నిలిచి। నైరృతి నెదిరించి వారీంద్రు భంజించి ప
వనుని నోడించి వంతగించి। యలకాధిపతి గెల్చి యంతటరజతాద్రిఁ జెక
లించి నృపకోటి పీచమణచి। చంద్రసూర్యులతోడ సమరముగ్గావించి వి
పులబాహాటోప విక్రమమున। ఖచరగంధర్వకిన్నరగణములెల్లఁ। దోలిర
ణవీరులై మహాశూలపరశు। ఖడ్గపట్టిసతోమర గదలుపూని। ఘోరరా
క్షసవీరులు గొల్వగాను॥ గీ॥ ప్రబలుచున్నాడు రావణు బాధచేత। నిలువ
నోపముదనుజాలని గ్రహించి। గాచిరక్షింపవలె నిక గతులు నీవె। యనన్యథా
యేమియున్నది యబ్జనేత్ర॥ క॥ నీ చిత్తము మాభాగ్యము। యోచనలుల్ల
మున నెటులయోచి చెదవో। తోచినది మనవి చేస్తిమి। చూచి కటాక్షింపవ

విష్ణువుభూమిపై దా నవతరించెదనని సురలతోఁజెప్పుట.

లయు సుందరమూర్తి॥ అనినవిని॥ సీ॥ ఆమాటలనుహరి యాత్మలోఁదల
పోసి సురసంఘములదయఁజూచివల్కె। నాతురత్వంబున నజుడిచ్చువర
మును దప్పింపనెవ్వరి తరముగాదు। నరవానరులమది మఱచియుండెనుగా
న వేవేగమానుషవేషుఁడనయి। చక్రము శేషుండు శంఖమనుజులుగాఁగద
శరథమేదినీధవునిధర్మ। సతికినూతుడయిదనుజుల సంహరించి। యాది
లక్ష్మిస్వరూపిణియై యవతరించు। భూసుతనుగూడి జనలోకభోగమెల్లఁసలి
పివచ్చెద నాయదాస్థానమునకు॥ ఉ॥ మీరలిదేయథార్థమున మీనిజరూ
పకళాంశతేజులై। ధారుణి వానరాకృతులుదాల్చి మహాభయఘోరరూపు
లై। చేవనాంతరంబుల విశేషనగంబుల సైన్యనాథులై। పోరుదలంచి
యీయిలనుబుట్టుడు వచ్చెదనేనుబైవై॥ గీ॥ పొందుసురలార మీదగుపు
రములకును। వచ్చిపుట్టెదనికమది భయమువలదు। నంతతానందముగవా
నిజంపెదనిక। వెలసివర్ధిల్లెదరుమీరు వెలుపులేక॥ క॥ అనిపల్కి పంప వన
జా। సనగిరీశులుచనిరి దేవసంఘంబులతో। నికులుడు నీవెవిష్ణువు। జనప
తివైనావులోకసంరక్షణకై॥ శా॥ నీమాయామహిమంబులెన్న దరమా
నీవేగదాదేవుఁడున్। రామాదాసవనంగరాంతక మహారాజన్యయానంద
సు। సోమాగ్నిత్రినేత్రతుల్యుఁడగుచున్ శోభిల్లుచుం బ్రోచుచున్। శ్యా
మాకార ధరాధిపా నిను నుతుల్ సేయంగ మేమోర్తుమే॥ క॥ పావనిసీతా
లక్ష్మి। దేవీయనియంచు విష్ణుదేవుడవుమహా। దేవునిసఖుండవిష్ణుడు। భా
వంబునఁదలఁచిచూడు భవభయదూరా॥ క॥ అనిబహురీతులతోసభ। జన
ములువీక్షింప రామచంద్రునిబొగడన్। మునిపతులుదెల్పుకతముఁ। దన
నిజరూపంబుతెలిసి తగనిల్లసిరెన్॥ వ॥ మునీంద్రులారా మీరలీవణత్రి
యసర్జితులైన మహాతపోధనవంతులరు మీకుదృశ్యంబుగానిది యొద్దియే
నియుంగలదేయని మఱియునిట్లనియె॥ మ॥ మునులారా హయమేధమున్

శ్రీరాముఁ డశ్వమేధంబు చేసెదనని మునులతో జెప్పుట.

సలుపంగా మోదించుచున్నాఁడభూ। జనమాన్యుల్మహనీయమూర్తులు మ
హాసామర్థ్యులున్ మీరలేఘనమైయెప్పుడు యాగమేవిధముచేనైకొల్వం
గావచ్చునా। ధమములేమిహయంబు నెట్టిదియో సద్ధర్మంబులెట్లుండునో॥
మ॥ పులహావులస్త్యవంశజుని బోరవధించిన బ్రహ్మహత్యయుం। దొలగున
టంచు నెంచెదను దోషహరంబు మహాధ్వరంబుగా। గలతెఱంగెల్ల చెప్పుద
గుగ్రక్కునమీదయచేత సాగడిన్। నిలువదుతద్విధానములు నిర్భయము
ల్విభవంబుజెప్పరే॥ వ॥ అనిన శ్రీరామచంద్రునిముఖారవిందసందర్శితానం
దకందళిత నయనులయి కుంభసంభవప్రముఖ మహామునులిట్లనిరి॥ సీ॥ మేది

నీధవహాయ మేధంబుసాంతంబు సేదుయాస్త్రమలు శేఖరములు । సకల మహాపాపసంహార కరమౌను సాయుజ్యపదవికి సాధకంబు । సంతాన హేతువు సకలసౌభాగ్యంబు మంగళకరవశీ శోభితంబు । అమరేంద్రలోకశాశ్వతమైన భోగంబులు ధర్మాభివృద్ధి సంకేతశుభంబు । గలుగు దిశల మంగీర్తులు ఘనములొందు । సమధికజ్ఞానమహిమలు సర్వదేవ । వశగరంబులు బుధజన వర్ణితములు । చేరుభూరాజచంద్రిల శేషురిలను ॥ వ॥ ఈ మహాయజ్ఞమున కొకటియితిహాసంబుగలదని కుంభసంభవమహర్షి యిట్లనియె ॥ చ॥ ఇళుడను రాజుతొల్లిపృథివీతలమేలుచు గీర్తిమంతుడై । తలచినరీతి నర్థములుదాన

ఇళోపాఖ్యానము

ముసేయుచు సజ్జనావళిం । గలయుచువిప్రకోటికిని గాలములందు సహస్ర ధేనువుల్ । విలసిలుప్రీతినిచ్చుచును వేడుకలొందగసంచరించుచున్ ॥ మ॥ ధరపైశత్రుల నుగ్గుచేయుచును సద్ధర్మంబులార్జించుచున్ । నరనాథోత్తమ చక్రవర్తియగుచున్ సమధ్వజోభూషుండై । పరిపాలించుచు రాజ్యమెల్ల జనముల్ప్రార్థింప వాస్తోష్పతిన్ । సరిగ్రామశ్రీసహితంబుగా మెలగుచున్ సత్యంబులార్జించుచున్ ॥ వ॥ ఇవ్విధంబున నుండు నన్నరవరుండొకనాడు వేటతమకంబున మెఱుంగులీనుబంగరు జరీపల్లంబుశోభిల్లి తురంగలింబడగలు నీరులంపుసింగంపు తలాడంబునొంటియ జెఱయద్దంబులుగల గుబ్బలపట్టి పుతళ్లులుం జేర్చి కూర్పనగు వాగెనుం బిరుసనవిరిగలంబులై నిగరంపుసగడంపు నిగనిగల్దళిలి జిగిదేరుపట్టుమొగమట్టు రంగుమన్నెలం దూలకించుసింగణులను గోమేధికంబులంబొనవు కళ్యంబుగల తురంగంబుపైగూర్చుండి వందిమాగధులు కైవారంబులుసేయ నిలుండరుగు దేరందదుపరి పార్శ్వంబులంగప్పి యొప్పిపట్టిసప్రాసకరవాలతోమర భిండివాల గదాకుంత శరశరాసనధరులై సుకుటంపుకుల్లాయలు పెట్టిమొలలు నాటుకొని గిగితెక్కలు సాలయగుంకుమ శావిగంధంబుపట్టెల చల్లడంబులు బిగియించి రంగుబంగారు గాసెలశృంగారంబులేర్పరించి చెక్కుకొన్న సూరులవంకి బెడంగుచాయలు పిడియంబుల తళుకులు కులుకుదువలువల చెఱంగులపయింజీరాడ సుసుభట కదంబంబులు గొలువ రాజకుమారులు కొందఱుముందర హాయగజాందోళికాదులనెక్కిచనుదేర జిగిబిగిజిగురుగండెలును సివంగిశకటంబులును కజ్జంబులతోదిగజారువలువలునుపూలరెళ్ళకునొడ్డనగుపాదులను పురిసిశేషంబులును గురుచకోలలును తగుసాధనంబులుంగైకొని వీరభట గోలాహలంబులు చెలంగ నిజసఖజన సహస్రంబులు లావణ్యసౌందర్య విశేష భాసమానవిరాజిత రత్ననిర్మిత భూషణాలంకృతులయిదానదాసీజన వహస్రసంఖ్యలు నందంబుగావసిడిపాలకీలపయినజనమహామరణ్యమహీరుహాశై

లపాలవ్రిదేశంబులం జేరుచు నగణ్యాగణ్యావస్యమ్మగ భీకరుండగుచు దోలు
చు సింహశార్దూల వరాహ శరభ సమూహంబులపై వివిధాస్త్రంబులం
గోదండంబున సంధించుకొని ప్రయోగించుచు నానాపతీ వీర బలం
బరిమార్చుచువచ్చి రజతగిరిసమీప శృంగారవనాంతరంబు నొక్కటిం గ
నుంగొని॥ సీ॥ పల్లవఫలపుష్ప భరితభూరుహములు సహకార మందార
చంపకములు। గజనింబజంభీర ఖర్జూరపున్నాగ కర్పూరకదళికా క్రముక
వకుళ। తక్కోలహింతాల తాలసాలతమాల కుటజకరటక కుముద
ములును। పద్మవద్మాకర భాసితశుభకేకి నినదవినోద మానిత కరం
బు। లలితమకరంద పానవిలాసగరిమ। మోదిమదించుచు భృంగము
ల్మహితగీత। వాద్యములుసేయగల్గు నవ్వనము గాంచి। సైన్యములు నిల్పి
భూపతి సంభ్రమమున॥ సీ॥ లావణ్యవతులయిన లలనాజనంబుల మిసిమి
పావడచీర మెఱుగులమెర। జాళిడ్లకాయిరత్న భరితహారంబులు బిగిదేర
ముత్యాలు బేర్చినట్టి చంద్రసూర్యుల కెంపుజంపులపగడాల దండలుమగ
ఱాల ధవళరుచులు। మిసిమిపాపటబొట్టు మీదగూర్చినరోహిణీ ముత్యాల
సరములు ముఖసుధాంశు। బి బములుచెక్కుటద్దములోమనసేతి। ములును
గొనగోటదిద్దిన మృగమదంబు। గుసుమగుచ్ఛంబులును దమ కొప్పులం
దు। వెలయునారీజనంబులు వెతుకనడువ॥ మ॥ చనియారాజు వనాంతరం
బు ను విశ్వాసంబురెట్టింప భూ। జనితాలోకలతాప్రసూనలముచే సౌజ
న్యమైయొప్ప నా। సనముల్గిగి తలోదరుల్గొలువ నిశ్చానంద కేళీలస। ద్వన
ముల్గొంచువింతలెల్లగనుచున్ గానంబులం జేయుచున్॥ సీ॥ ప్రాణబోణులార
యీపొదరిండ్ల చెంతనువసియింతమా దేవపారిజాత। కుసుమముల్కోటమూ
ము సరుతేంట్లనుదోలిమధుపానములుసేయగదలుదాము। పులినదేశములం
ద నిలిచిబంతులుదీరి యానందమయులమైయాడుదాము। కదళికాస్తంభసం
కాశదేశములందు బుష్పశయ్యలమీద బొందుదాము। సరసిజములందికొ
తామ చలువచప్ప। రములవిహరించివత్తమారమ్యమైన। హంసలనుబట్టు
కొందము యగరుగంధ। పూతిలలరంగరతిదృప్తి బొందుదాము॥

ఇళుండు జలవిహారంబు సేయుట.

చ॥ ఈరీతిన్నవ పూర్ణచంద్రవదన ల్యౌతేరమోహంబులో। దీరగ
యాదవమధ్యముండుమహిమ ల్దీపింప గాసారముల్। చేరంజేరిమనోవిలాస
మొదవన్ శీఘ్రింబ తత్కేళికా। తీరంబందు దుకూలముల్వదల దీయుంజేసి
నెమ్మోంబునన్॥ మ॥ ఖరసినిజొచ్చి యాయుశుడు చల్లుచుదోయుములెత్తి
స్త్రీలపై। మరుగుచు బద్మజాతులను బట్టియురంబులమీద వేయుచుం।
దిరుగుచుమూలనాళమును దీయుచు హల్లకరీతులేయుచున్। పెరవ్వకసీ

మచుంగదల వేడుకనింతుల గారవించుచుం॥ సీ॥ ఒకయింతి కౌగిట నొసిగియుం
చి వేఱొక్క వనితాధరము గ్రోల నవ్వుచుండు నొకసరోరుహనేత్రి మొగ
ము చూచుచునుండి యొక మనోహరి భోగవశత నొందు నొకముద్దుగుమ్మ
తో సుఖగోష్ఠి గావించి యొకతె లోదరిజేరి పంతగించు నొకనీలవేణితో వశ
గతుడయియుండి యొకసుందరవదనకు నుల్లమొసగు । నొకతెతో గూడి భో
గించు నొకతె వయసు। కొల్లలాడుచు నొకచెలి కోకచెఱగు। కరమునను జే
ర్చు నొకతెను కౌగలించు। జలముపై దేలు దనప్రాణసఖుల నేలు॥ ఉ॥ రమ్మ
ని గారవించు దన రాజసమొప్ప మహోత్సవంబులం। గొమ్మని మోవితేనె
రుచి గోలితినీ మకరందమెల్లనూ । సమ్మతి నించి వాను బిగిచన్నులమీఁద
ను జేర్చి కట్టి యేు। కమ్మగ జౌశితీరతుల గైకొనరే సరహోగ్నిదీక్షగ॥ సీ॥ వి
డెమునొసంగి కౌగలించి పీడకచేరిచి ప్రీతిజీరలో। ముడివడలించి [illegible]
లు మూపుపయింగ జేర్చిబంధించు। విడువక పట్టి వేణి [illegible] వేడ్క సలుపగ
వాళలూరగా మెడిమెలు త్రొక్కరాదె యిది మానసమేతను జేగుదెంచు
నే॥ సీ॥ ముద్దుగుమ్మల చేత ముఖపద్మముల నొక సాగిముద్దులుగొని సంభ్ర
మించు। సజ్జగంధులమోహమున సరిపంగ జాదేశబులోపల దిరుగు
చుండు। దలిరాకుబోణుల దయయుంచి కెమ్మోవి పానకంబులుగొని పరు
వులెత్తు। లలితలావణ్య విలాసదేహాంగనాబలముతో జలకేళి సలుపుగొను
చు। సకలవిభవాభిరాముడై జనవరేణ్య విభుడు ప్రౌఢ్ధామెననిలేచి చెపల
గురుష। రూపమునుమాని మానినీరూపుదాల్చు। వచ్చి భూరుహవిస్త్రీనవ

ఇళుండు మగువయగుట.

మునందు॥ సీ॥ చంద్రబింబముతోడ సమమైన వదనంబు కుసుమము జరులవ
గూడుచనులు। నలినంబులను గేరు నయనయుగంబులు కలవారుణకాంత
పాదములును। దిలపుష్పము గెలుచు దీగయున నాసిక దాడింబబీజము ద్దంత
పంక్తి। యళిసీలకు తంగాలంకృత నిజవేణి మదగజమైగ సింగంబు ఉమ్ము।
మదమరాళంబులకు బోలు నందయాన। విధములను [illegible] దితంగా [illegible] వి
పులమీఁద। కనకమయమైన రత్నస కటితహార। భూషణంబులు వింపిల్లు
పువ్వుబోణి॥

సీ॥ పాలిండపయిం గప్పంబడినవ మ్యెదకొంగు జీరాడసవరించుచీర
మెఱయ। గొప్పున జేర్చిరి కుసుమదామంబులు బహువినోదములతో బరి
మళింప। నిటలశాటంబున నిలిపిన కస్తూరి తిలకంబు నిగనిగ తేజరింప। నవ
రంజకమ్మలు హస్తకటంబులు వివిధభూషణములు విభవమమర। సొక్క
సోలు మంగాటుక సొగలలర। మరుని గజ్జలగుర్రంబు మాట్కనతివ। లలిత
మైనట్టి లావణ్య లక్షణముల। వన్నెకెక్కును నేత్రోత్సవంబు గాఁగ॥ సీ॥ నడ

లకొలికి చూచి నవమరాళంబులు తమవియ్యమని వెంటఁ దవిలి రాఁగ | బలు
కులవగ గాంచి చిలుకల మైత్రితో బంధువర్గములని కరువులెత్త | స్తనయు
గంబులగాంచి చక్రవాకంబులు కులమువారలటంచుఁ జలఁచి రాఁగ | గురు
లసౌజన్యంబు దర్శించి మధుపము లేస్తకన్లై లటంచు విశ్వసించ | జఘ్న
నమునిండ శోభిల్ల బంధుక్రీకావి చీరకుచ్చులు బడమూల జారఁగాను | దనువు
చెమరింప భ్రామణ లతులు మెఱయ యాని యువిహరించుచుండె నా నెలవులం
దు॥ చ॥ కనుగొని తర్వభూజరులు కామిని యెుక్కటరుడివచ్చెనో | తనువు
సువర్ణకాంతియు సుధాకరబింబము మోము కన్నులుక్| వనజ మురోజము
ల్గిగులు వానెరబింబము చెక్కులద్దము | ల్గను గొనె వారె యీలలన
నైనడిసుందరు లెంగకుందురో॥ ఉ॥ ఎక్కడి కేగునో యిదియు నిక్కడు నె
య్యెవరో నామ మొంటిగా| నిక్కడికేలవచ్చినదొ యెవ్వకు పంపిరో రాజుదీ
నిపై| నక్కరకల్గినన్మ కనొ యొవ్వరు గోత్రము లే ధంబులో | యిక్కమ
లాక్షి నా యజుఁజు నేగతి మెంచిపుజి చిపంపెనో॥ సీ॥ కళలూరనవముఖ
కంజంబు గనుగొన్న మోహంబు పుట్టగా మునులకైన | విరిగుబ్బ పాలిండ్లు
వీక్షింపదముంబు నాటదా బోడిసన్యాసికైన | కరపల్లవంబులు దర్శింప
విరహాగ్ని దూలకుండునె మహాయోగికైన | బాహుమూలంబులు పరికిం
పవిభ్రమ గతులు పొందకయున్న యతులకైన | దివిజభామయొ శ్రీరమా
దేవి యొకత | పార్వతియొ వాణియొ యొరాయస్య ఫణియువతి యొ| యనుచుడో
లాయమానులై యతివలెల్ల | వచ్చి యీయింతితో నిట్లు పలికిరపుడు॥ చ॥
ఎవతవు రూపలక్షణము యౌవనముక్ నవసుందరంబునుక్ | యెవరికి నైన
గాన మిపుడెచ్చటనుండి తలంచి వచ్చితో| ధవుడెవడమ్మ నీకు నిజధర్మము
గాను గులంబు నెద్దియే| భువిని వసింతువో మరలబొందుదువో వివరింపుకో
మలీ॥ ఉ॥ అనఁగ శిరంబు వంచికొని యాయిళపలెను భామలారయే| మని
తెలియంగబల్కకుము నందఱుసిజల కేళిఁదేలఁగా | మనసిజు మాయయో
పురుష భావముమాని లతాంగినైతి హా| యనిదిగులొందుచుక్ మగువలం
దఱు జేరగ లజ్జితాంగినై॥ వ॥ డోలాయమాన మానసాంగియై
తనమనోహరాంగనల సమీపస్థానంబులఁ గూర్చుండనియోగించి వ్రకతి
యగునీశాదేవి మఱియు నిట్లనియె॥ ఉ॥ భూజనమాన్యుడై సమరభూరిప

## రుద్రికన్యలు శాపక్రమంబు తన కెఱింగించుట.

రాక్రమవర్తనీయుడై| తేజము హీనమై యిపుడు దేశతలంబుల కెట్లు వత్తు
భూ| రాజులునవ్వరా సకలరాజ్యవిచారణ లింక యేలయో| రాజిత నేత్రు
లారయని రాజు విషాదముఁ జెంది యుండగక్॥ సీ॥ రుద్రికన్యలు నాయిళ

రూపు చూచి! వచ్చితివో రాజ ! దేవేంద్ర వగవనేల! పార్వతీదేవి శాపమిది తగిలి వచ్చె। వినుము చెప్పెద గారణ విధము లెల్ల॥ వ॥ లోకైకపరమేశ్వరుండు రజతగిరినుండి పార్వతీసమేతుండుగా నిర్మానంబు ప్రవేశించి కొండొక కాలంబు మదనకేళీ వినోదంబులం దృప్తినొంది నిజస్థానంబగు రజతగిరి కింబోవ నిశ్చయించి యిట్లనియె॥ గీ॥ ఘోరపాపవిదూరమిది కోరుకునం దుర। బురమజ ముఖ్యులు దిగగాను పొందుగా। గోమలీమణినైవెల్లుఁ గోర్కెలొదవ! నీకుఁ మఱువకయుండు నెడలెను తిరజాతి॥ ఉ॥ కావున నీవు పోయి గిరికన్యను గాంచి నమస్కరింపుము! దేవికృపారసంబునను దీఱును నీ మలనాగరూపము। బోవకయుండఁగా యికబొమ్మనితెల్పిన శూలి శాపమును। ల్సేవయొనర్పగాఁ రజతశైలముఁ జేర విలాసవర్తన॥ సీ॥ లలితరత్న ప్రభా లక్షణాన్వితదివ్య భవనంబునం బ్రమథ పతులు గొల్వ! నందీశభృంగీశ నారదవిఘ్నేశ వీరేశ చండీశ విమలమతులు। పూజింపసేవింపరాజితాలంకార సింహాసనంబుపై శివునివామ। దేహంబునను మహాదేవియుమా సతి భాసిల్లదన్పద పద్మములకు! సేవచేయంగ యక్షులు సిద్ధసాధ్య। ఫణులు దిక్పాలకాదిక వరులు సురలు। మునులు గంధర్వులును మహామునులు మోదవ! నగతకారణభూతయై శైలజాత॥ సీ॥ బాలషడాక్షరీ మంత్రాధికారులు పంచదశాక్షరీ ప్రణవపరులు। శక్తిపంచాక్షరీ జపతత్పరులును పూర్ణాభిషేక సంపూర్ణయతులు! చైతన్యకుసుమ విశేషార్ఘ్యయుక్తులు కుల కళాయాచార గూఢమతులు। నిర్లేపలేపనా నిజపరోల్లాసులు వరమంత్ర దీక్ష సద్ధర్మగుణులు। నఖిలభోగాస్పదులై మహానందముగను। వచ్చి సేవింప స్మితహాస వదనులగుచు। విపులమందార కుసుమము ల్వేణిమీఁద! బరిపు ళించంగఁ గొస్తుభవస్త్రసక్త కాంతిచెలువొంద హిమగిరికన్యయొప్పె॥ వ॥ ఇవ్విధంబున సహస్రకోటివిస్తీర్ణ సుధాసాగరాంతర ద్వీపంబున పంచవింశతి తత్త్వాత్మకపంచ ప్రేతాసనారూఢయై చంపకాశోక వకుళమందార కుందబిల్వకల్హార కదంబశోభితంబయిన శతయోజనవిస్తీర్ణ శ్రీచక్రాంతర త్రికోణవర్తులాకారతారిణియై మదాసనసృష్టి స్థితిసంహార నిగ్రహానుగ్రహాదికంబును నవత్రింశత్కళా రూపానందభరితయు జ్ఞానక్రియాకలిత చిత్పంచకవిలాసినియై ప్రపంచాది జననమూర్తియు మంత్ర దైవత సప్తమాతృక సప్తకోటి మహామంత్రస్వరూపిణియు షడ్విధైక్యానుసంధాన షడంబూరుహ షట్చక్రాంతరసౌధామినియును గల్యాణగుణగణ నతకల్యాణదాయినియు సర్వమంగళ విశేషశోభిత సర్వమంగళదేహయు బ్రహ్మాదికోటికోట్యయుతాంతర్యాగసిద్ధిప్రవ్యాప్తను గుణ్యామతియు కీమణివల్లనాదవినోద శిరఃకంపినియు మదఘూర్ణిత నేత్రయు శివశక్తియు

సునగు పార్వతీదేవిం గనుంగొని యిళయును నిజసహస్రకామినీ నివహం
బుగొల్వ పత్నీముఖంబు శేరి యభివందనంబుగావించి యిట్లనినుతించె॥

ఇటుండు పార్వతీదేవిని వినుతించుట.

దండకము॥ శ్రీమన్మహాదేవి సర్వాంసహాధీశ్వరీ సత్యసంధాన నా
గేంద్రహారావళీబద్ధ దేహాలపద్దివ్యరత్నాంచితా హేమభూషోజ్జ్వలానిత్య
తారుణ్య సంపూరితానంద కస్తూరికారేఖ ఫాలాంక తేజోజసౌరభ్య దేవేశ
నాగీశలక్ష్మీశ సంసేవితానంద పాదారవిందా ఘనత్కింకిణీ మేఖలాతా
రహారా వళీరత్న తాటంక కేయూర హస్తాంగశోభాయమానా లసత్పద్మ
గర్భాండ సంరక్షణా దేవతాకార్యబ్రహ్మనుష్యాది ప్రాణి బాహ్యాంతర వ్యాప్త
సుప్త్యాద్యవస్థాది శిష్టప్రిరూపాను రూపక్రియా కారణాకారరేఖావిలోకా
త్రిలోక ప్రమోదాప్తి నిర్మగ్నఫాలేక్షణా కుంద మందార బంధూక చాంపే
యకల్హార జాజీ మహానూన సంపుల్లధమ్మిల్ల సంకాశవాణీ మనోహారిశై
లాత్మజా తొల్లియే పూజలుం జేయంగా గల్గెనో గాక నీదివ్యరూపంబు నే
గంటిదల్లీ భవద్దాసులుంగాక సంగీతసాహిత్య సామ్రాజ్యభోగంబులుం
మిన్న కేకల్గునా నిత్యకల్యాణి నానేరముల్బాపి సంపూర్ణదృష్టింగటాక్షిం
పు మాయమ్మ యీదేహబంధంబు వీడంగనుం జేసి యీలోకముల్బాపి
కైవల్యముంబొందగాం జేయు శీఘ్రంబె యంత్యాయావస్థకాలంబునన్ రోగ
ముల్దగ్గుశ్లేష్మంబు తబ్బిబ్బుమాట వికారంబులున్ లేక నీపాదపద్మంబు
పై చిత్తముంబుట్టగాంజేసి సుజ్ఞానదీపంబులోఁజేర్పు మీఘోరసంసార
తాపత్రయాభీలతాపంబులోలాడఁగా లేనుగా. క్షుత్పిపాసాదులం గూర్చి
భూమానవుల్వేడఁగాలేను నాశాపిశాచంబుతో బోరగాలేను నిన్నేమ
దిందల్చుచున్నాను నేజేయుపాపంబు న్బాపు సామ్రాజ్యదాయీ మహా
మాయి గౌరీ నమస్తే పవిత్రాంచుబు నీవేక దాఘోరదైత్యారి పాశాంకుశా
శూలఖడ్గాయుధా హస్తవిన్యస్త పుల్లాబ్జనేత్రా శివార్థాంగి వాగీంద్ర సు
స్థాన షట్చక్రనాడీ విశేషాకృతీ హృద్యవీణాది వాద్యాకృతీ మూలశక్తి
ప్రంజ్యోతి నేనుందు నేసాన మేదాన మేయోగమెవ్వోటగావించినానో
మిముంజూడగాగల్గె బ్రహ్మేంద్రాదిబృందారకేంద్ర ద్విరద్బ్రహ్మకోటీ
తటీరత్న విభ్రాజమాన ప్రభారాజనీరాజ నీరాజితంబైన నీయంఘ్రియు
గ్మంబు సేవించితిం దుర్మించితిన్ బూర్వజన్మార్జితాశేష దోషంబులన్నింక
నీమూడురూపంబుతో నెచ్చటన్ సంచరింపంగ సిద్ధయ్యెడిం బూర్వరూ
పంబు సంప్రాప్తమౌనట్లుగాజేసి నన్నుంగటాక్షించి రక్షింపుమో దేవదే
వేశ్వరీపుత్రులున్నేర్చినన న్నేరకున్నన్ మహాప్రేమతోఁదల్లిపోషింపదే నా
దు దుఃఖంబులంబాపు సర్వేశ్వరీభద్రకాళీమహాదేవి శ్రీశ్యామలాంబా నమ

కేతపట్టణమునఁ। బంచకల్యాణి మెర్పొఁచిమాచినలేదు సెలవిమ్మువరువీవ సీమలఁగు । బట్టితెచ్చెఁగధరా మండలంబుననైన దేవదానవలోక దిశలనైన। నెచటనుండినగొనివత్తునినకులేశ। యనుచు విన్నపమును సేయు నవసరమున। మునులుఁగూడి శ్రీరాముమోముజూచి। దేవహాయరత్నమన క్రొక తెరువుగఁదు॥ చ॥ సారిదిక రావణాసురుని సోదరికిం బ్రియనందనుండు సంగరనిపుణుండు శూలకరిఘాయుధహస్తుడు దోర్బలుండు భూ। సురగరుడోరగాద్యమర శూరులగ్గెకొన దుర్గమూర్తిగా। ధరలవణాసురుండనెడు దైత్యుఁడు భూతలమందు నుండెడిన్॥ చ॥ శూలివరంబుచే విపులశూలమునఁబట్టి వసించుచు డునా। భీలపరాక్రముండు రణభీషణుఁ డూర్జితధైర్య శాలిభూ। పాలమునీశ్వరాదులకి బాధకుఁడై ఘనరోషవృత్తితో। శ్రీలజెలంగు నాతనికి శ్రీకరవృత్తిని నున్నదశ్వముఁన్॥ గీ। అతనిసాధించితేవలె హయము లేక। సవనమును శేయఁగూడదు జలజమిత్ర। వంశసంభవయనిమునికతులు దెలిపిరిఁ। బిల్కిదమ్ములఁగని రఘువర్యుఁడనియె॥ క॥ వరమార్చిదనుజవల్లభు। పురమువిమర్శించిసవన పుణ్యోదయము। హరగంబుఁ దేర నెవ్వఁడు। శరముశరాసనముబట్టి చనుననిశౌరిన్॥ వ॥ అనిన సుమిత్రానందనుండగు లక్ష్మణుండిట్లనియె॥ మ॥ దనుజమదారి మీమదినిఁదగ్గిన యాహయమే ధయాగముఁన్। జనమునుఁజంపఁగాఁగుణము సంశయమేమి మహాత్మయాజిలో। దనుజునిదుర్గిచెదర సవనధర్మఁబుఁగల్గు హాయంబుదెచ్చెదన్। జనిమెదసెల్వొసంగుమని చాపశరంబులుపట్టి నిల్వఁగన్॥ భరతుడిట్లనియె॥ ఉ॥ కాలవెటనంటిజనకాత్మజకైవశయోగ్రపీరులో। దానవనాథుఁడు నిమిధైర్యవిశారద విక్రమంబునన్। మాచితకీర్తిచే వెలయు మానవసాయక నేనుబోయి మా। దానవుఁదుర్గిఁ ఘోటకము ధర్మముగా గొనివత్తుఁ బంపిన్॥ క॥ అనశతుఘ్నుఁడిట్లను। జననాయకుఁజూచి భరతసౌమిత్రులమీ। రనుపఁగనేలనేనున। జనిసవనహయంబుదెత్తు సంరంభమునన్॥ క॥ అ

శ్రీరాముడు శత్రుఘ్నుని లవణునితోఁ బోరననుపుట,

నవిని రఘుపతిలక్ష్మణునను జన్మనిఁగౌగిలించి యధిక ప్రీతిన్। మనముచెలంగఁగసింహా। సనమునఁగూర్చుండబెట్టిసంభ్రమపరుడై॥ క॥ మును వాలిదశగ్రీవులఁదనువులుతొరుగకయవా తమ్ములకును నే। మనికట్టి పట్టంబును। మనసునశత్రుఘ్ను నపుడు పట్టముగట్టెన్॥ చ॥ మ్రోసెను దేవదుందుభులు మోదముజెందిరి దేవతాంగనల్। గాసిదొలంగిబోయెనుచుగానముచేసిరి నారదాదులున్। వాసియుగల్గనామెనని వర్ణనచేసిరియక్షసంఘములు। శ్చేసి పూజ నందునని చేరిరియచ్చటితాపసోత్తముల్॥ వ। కనకకిరీటముల్పసిఁడికంకణము ల్నవరత్నహారముల్। ఘనమగుమంచివల్వలను గట్టగనిచ్చిప్రియంబులాడి

యూ! దనుజేంద్రు సొంతమాతృనుసిగల్చుచుయుద్ధమునందుఁ బోరి యూ! తే! వధియించిరమ్మాశుభధర్మసుఖంబులు నీకుఁ జేకురున్॥ వ॥ అనిననంతుష్టాం తరంగుండై॥ గీ॥ లక్ష్మణానుజుండు లక్ష్మీంశ శ్రీరాము। పాదములకు మ్రొక్కి మోదమంది। భరతలక్ష్మణులకు బ్రణమిల్లి శరచాప। ధారియగుచు వెడలె ధరణివడక॥ శా॥ సారధి ధ్వజముల్నిలుప జాపశరంబులువట్టి మొగ్గరాగా। భేరులు రోదసీకుహరవీథులుఘూర్ణిల వందిమాగధు। ల్పేరినుతింపభూమిగలసేనలు ముందరఁద్రోచి రాఁగసం। చారముకై మహారథులు సైన్యసమేతులుగాఁగ నిండఁగన్॥ సీ॥ కూర్చి ముత్యాల గొడుగులు మొనగాఁ బట్టంగ నుభయ చామరము లేచ। గతి విక్రమశక్తి గలమహావీరులు పంతంబులాడుచుఁ జెంతఁజేర। బరశుకట్టెస కర వాలాయుధంబులు ధరియించినుభటులు పరువులెత్త। మదహస్తిస్యందన మాతంగములమీఁదఁ గదనధైర్యులు వెంటగదలిరాగ। దర్పము మరంగ గర్జాటదళము నడువ। వేలకొలది రవంబులుభీషణముగ। ద్రోవమొండ్డినడువఁగాఁ జూరగసమితి। వెడలె శతృఘ్నుడావేళ వేగఁబురము॥ మ॥ వ ములకాచుచున్ విపులపర్వతము ల్గనుగొంచు బర్ణముల్। ఘనములు నెంచుచున్ గదలగాను విభావసు డస్తమించినన్॥ జనములు చూచి సైన్యము లుసాగకు యీదివ శేష మెల్లనీ। మునులమహాశ్రమంబునకు ముందరసిల్పిచ ంగ మేలగున్॥ వ॥ అనిమంత్రివచనంబులు విన్నవించిన నంగీకరించి గజతురగస్యందనంబులభాగీరథీ తీరభాగంబులయందున్న మహామునుల యాశ్రమంబులకు వెలిగాఁ నిలిపి యొక్క ప్ర

శతృఘ్నుఁడు వాల్మీకాశ్రమంబున కరుగుట.

దేశంబున శతృఘ్నుండున్న దన్వారమానంబు దెలిసి వాల్మీకిమహాముని శిష్యసంఘంబులతో వచ్చిన నృపవరేణ్యుం డర్ఘ్యపాద్యాది విధులంబూజించి నమస్కరించిన నమ్మునివరుండు॥ క॥ పిలుచుకవచ్చి తదాశ్రమ। నలలితదేశములఁ బర్ణశాలలయందున్। నిలుపంగ గంగాతటమున। గలమానులు వచ్చినుతులు గావింపంగన్॥ చ॥ ఫలములు లుసింగొడెనల్లలఁ బాయసము ల్నవగోఘృతంబులున్। జలములుఁ బానయోగ్యములు జల్లనిమజ్జిగ లూరగాయలున్। వలగొనుజున్ను లడ్డువులు వర్గితమానల శాన్నశాకము। ల్వేలయగ నామహాసురభి విందులుచున్నముసేయ నత్తఱిన్॥ ఉ॥ తాపసకాంతలున్ వికచధామములుం జిగిదేరుమేనులుం। బ్రావుగలంగ దట్టలను బాణితలంబున బట్టియంఘ్రులన్। నూపురములెంలంగ బదినూటికివడ్డనలంది యియ్యనా। తాపసవామదేవ భృగుధర్మలశోభిజముంచిపిమ్మటన్॥ క॥ శాలాంతరమున మునిజన। జాలంబులతోడఁ జేరి శతృఘ్నుండా। లోలాక్షిభ్రాతనూజను। శీలలనగదలిచిమదిని జింతాన్వితుడై॥ ఉ॥-ఉ

మహానీయశాలకు నేదెసనుండునో భూతనూజ నే। నేమనిపోదుఁ గోయిన
ను నేమనునో కృశలేకయుండునో। భూమిజ రామచంద్రి స్పృశభూషణ

శత్రుఘ్నుండు సీతం దలంచి చింతించుట.

బాసిమహాగ్రహింహంబునో। ధీమతినున్న దోమదిని భీతి వహోపదబె దియుం
డునో॥ చ॥ అనిరణవీరులైన కుటిలాసురులన్ వధియించి భూమిపై। జనన
ముగాంచి దేవకపిసైన్యము ఘూర్ణిలవహ్ని జొచ్చి భూ। జనము లవార్తకెక్కఁ
గల జానకికీదురవస్థవచ్చెగా। యనుచు మనైనకగ్నఫల నుందకపోవునె యెు
న్ని భంగులన్॥ చ॥ తలచిననేమిరామ జగన్నాథుని కదని మాటలాడినం। బ
లుకులుచి త్తగించి దయబల్కునె కల్కదౌయేనిధంబులో। తెలియఁగఁ
గూడదీదినముదేవిని జూడగ బుణ్యమబ్బునా। ఖలుకనుంచు నశ్రువులు
కన్నులరాల్చుచు వేదనంబునన్॥ చ॥ ఘనమతిలక్ష్మణుండు జనకాధిపుకి
న్యనుడించిరాగనే। మనుచుదపించెనో మునులయాశ్రమభూములయందు
జేరెనో వనములవెంబడిం జననో పావనియెచ్చట నేమియాయెనో। కనుల
నునశ్రుధారలును గారగనేదరిఁబట్టి యేగెనో॥ క॥ మునువాల్మీకిమునిసీతా
వనజాక్షినిజూచిపిలువ వచ్చెనో రానే। నని బల్కి యెచట కేగెనో। జననిఁ దుఃఖి
డు రజకుఁడెంత చలముదలంచెన్॥ వ॥ అని యివ్విధంబున డోలాయమా
న మానసుండైన శత్రుఘ్నుని చిత్తంబెఱింగి వాల్మీకి మహామునీశ్వరుఁడు
భాగీరథీతీరవాసులగు మునిసంఘంబులతో విశాలంబగు పర్ణశాలాంతరం
బునఁ గూర్చుండి కుసుమగంధ తాంబూలాదులొసంగి యిష్టాలాపంబులా
డుచుఁ దదాశ్రమమాహాత్మ్యంబును గంగాసాగరోద్భవంబులును ననేక
పుణ్యకథలం దెల్పుచు గొంతసేయిగడపి తదనంతరంబ సుమిత్రానందనుం
జూచి యిట్లనిరి॥ చ॥ ఘనసమరంబులో ప్రళయకాలుని రావణు ద్రుంచి
కీర్తిచే కొను రఘుభర్త తమ్ముడవు కోమలదేహ శరాసనాది సాధనము
లరీతులుం దెలియ ధైర్యసమగ్రతనొంది యిప్పుడా। దనుజుని సంహరించు
బహుధర్మఫలంబులు మీకునయ్యెడిన్॥ వ॥ మధుసుతుండగు లవణాసు
రుండు పంచసహస్ర మదగజసమానబలుం డఖిలలోకకంటకుండై విహ
రించుచుండు॥ చ॥ గరుడసురేంద్రయుతు సురకాంతలబట్టినవాఁడు ధీరుడై।
చొరబడి స్వర్గమందు ఘనశూరుల గెల్చినవాడు నాజిలో। వెలుపక ఖడ్గముం
గొని యవక్రబలంబున శత్రురాజులం। దరిమినవాఁడు సంతతము దర్పము
గల్గిన వాతఁడెన్నగాన్॥ చ॥ బవరము కోరి కానన విభాసిత భూతలమందు
జేరి శ్రీ శివుని నుతించుచుం దపము చేయఁగ నేండ్లు సహస్రాబ్దంబులై। సవర
ణ కెక్క భూతపతి సన్నిధిగోరుచు వేడగా నునా। భవుడు ప్రసన్నుడై రుచిరవా
లము శూలము నిచ్చి యిట్లనున్॥ క॥ ఈశూలమెప్పుడు కరమున। భాసిల్లుచు

నుండునపుడు బ్రిహ్మాదులు భూ। వాసులునమ త్తదన జాలు। శాసటనిలువంగ లేరుబవ మలందుఁ॥ క॥ అనిసతుమాపతిచేతన। ఘ శూలమువడసి దేవకం టకుడగుచు॥ దనయింటనిలిపిపూజలు। దినదినముసు జేయుచుండుధీరోన్న తుడై॥ వ। అయినను దీనికినిరపాయంబగు నొక్కయుపాయంబు జెప్పెద నాకర్ణింపుము॥ గీ॥ ఆ ఘోరమునుగోరి యరిగి ఘోర। కాన ంబులదిరి గడికాలమందు। సుగ్రీశూలంబు నింటిలోనుంచుగాన। నపుడుబరిమార్ప వలెనని యాత్మ నెఱుగు॥ శూలముండెనా సమరశూరుల్కైన దరం బుగాదునా। భీలపరాక్రమాకలిత పీరుడునై క్రళీయోగమూర్తియై। తె లుచునుండు గాలమయదేవునిశో సముడైనవాడు భూ। పాలకమాయలుం గలుగువాడని యెంచుచు నెమ్మనంబునఁ॥ చ॥ అనిశరచాపము ల్కవచ మంచితప్రీతివహిల్ల నిచ్చియో జనములు సేయుచు మెజానకిబాలురఁ

జానకి తనయులంగాంచి వగచుట.

బిల్చిప్రేమతో। ననుగ తండ్రులార నరనాథకుమా కుగారతాతయే। మ మునా పనంబులందు దిరుగాడుచుగ్రీడలబ్రొద్దుపుచ్చరే ఉ॥ మీజనకుండు దైత్యకులభేది మహాయుధచాపపాణియై। తేజము నర్క కులదీపకు లోసుతులార విద్యచే। రాజిత మెప్పుగావలయు రంజితశరచాపమర్మ ము। లొమ్మెజాదలంచి నేర్వదగు భూపరాక్రిమ మొప్పియుండగాఁ॥ ఉ॥ కా నలవెంటనంటి తిరుగాడఁగనాగను నాకుబుత్రులై। దీనతబొ దియీయ చలదేశములెల్లను గాయనాయ నే మానవులందుబుట్టి నభిమా ముభో గము నూర్జితంబులో। బూనికనాదుగర్భమున బుట్టగముచ్చటదోచి యుం డెనా॥ వ॥ అనికన్నీరుమున్నీరుగా దుఃఖించుచు జనకాత్మజ తనలోదాను వశమనంబుచేసికొని మఱియునిట్లనియె॥ ఉ॥ మీపితండ్రులుఁ సమరవీ రమహాబలవర్ధనీయులై। ప్రిపుగనొప్పినాగు జనమాన్యులు సత్య వాకులు। దాకరకుకు ల్లబలత ధైర్యులువర్ణనీయులుం। జాపశా ధికాన్విత విచారణశీలురు నెంచిచూడగఁ॥ ఉ॥ అదటు గల్గి డి విపి నాంతరసీమలు చేరనాయె నే। మందును కేమినోచితినొ మోదము గాబరమే ష్టికిట్లనే। యందగెదండ్రి నాకుజనకాధిపుడుం ధరతల్లి యయ్యునీ। నిం దలబెట్టినాడు ధరణీధవు నేమననేల యుగ్రితఁ॥ ఉ॥ మీరుజనింపగానుమ దివేదనలన్ని యుమానె నాకు నా। ధారముగ గాకనుచు దైవములంగొని యాడుచుండుదుఁ। పేరుప్రిసిద్ధిజెంది బహు వేదపురాణము లభ్యసింప కఁ।మీరలు నాటలగడవ మేలగునాయిక నెన్ని భంగుఁ॥ క॥ రామ కథారసపానము। ప్రేమవహిల్లంగజెఱకు బీర్చెడిరుచియా। నామాతుర ములవీణను। నేమముగల్పించిపాడ నేరరటన్నా॥ చ॥ నరపతివచ్చినాడు

### సీతయనుమతిం గుశలవులు శత్రుఘ్నుకడ కరుదెంచివాల్మీకి మునీంద్రు నాజ్ఞవడసి వీణగానం బొనరించుట.

జననాథులు మంత్రిహితాప్తవర్గముల్ । తెరువులనిల్పియుండుట రుధిరతప్త
త్రియుగ్మంబోయి యిరా। గురువులగాంచి వీణ నుగూర్చి సుధారసముంచిపా
డిపే। గిరము రండటంచు జనకాత్మజ చెక్కులుముద్దుబెట్టుచున్॥ గీ॥ ఫా
లములజారి కస్తురిపరిమళింప। దిలకములుదిద్ది చెక్కుల దృష్టిచుక్క । చేర్చి
మగరాలముత్యాలు గూర్చిపేడి। పతకములువేసి జిగిదేరువలువలిచ్చి॥ క॥
మొలగండలు ఘంటరుచిన। ఘలుఘల్లునబరములందు గజ్జెలుమోయం ।
దలకొండెలందు జాజులు। విలసిల్లగ గుశలవాఖ్య వీరులుభక్తిన్॥ గీ॥ జన
నికిని మ్రొక్కి వీణెలు సంగ్రహించి। శరశరాసధారులై చంద్రబింబ। మొ
కటి రెండైనమాట్కిని ముఖములమర। పథికుజనుదెంచు వాల్మీకిసెలవు
గాంచి సీ॥ కుర్చుండియిరువురు జేర్చివీణల తంత్రిగవిసెల్వదలించి కలితమై
న । బిరుసలు సడలించిన విగాద తంత్రిలు సరిగమయనుశ్రుతి స్థాయముందు ।
బొందించి తాళము ల్వ్యాప్తివరిల్లగా గల్పించి రాగసంగతులుదెలిసి । శ
బ్దార్థసగణ సత్సాహిత్యశీలురై రామకథానంద రసము చిల్క । వినులపా
ట్లంబులను దెచ్చి విప్పినట్లు। పానకంపు గోళ్ళు తెరగున బాటనొక్క ఘనమ
మరియొప్పు మ్మహా కావ్యమునందు। గొంతచదివి రాజానకీకొడుకులపుడు॥ చ॥
తమతమదేహముల్ మెరయ దాల్చినభూషణ రత్నహారముల్। క్రమమున
దోయమైకరిగి కారగహాయనిమూర్ఛనొందియున్ భ్రమయగనారదాదిముని
వర్ణితమైనటువంటి గానముల్ । అమరులు నాలకింతురని యాత్మనుతించిరి
తత్సభాధిపుల్॥ ఉ॥ స్మితవదనంబులుం బొడుగు చేతులుదీర్ఘములైనకన్ను
లున్ । వితరణ కెక్కు కర్ణములు వీపులు శౌలము సుందరంబునే । గతిసిదలం
పగాను జనకాత్మజపోలిక రాముతీతి యీ। సుతులెవరోయటంచుమునిజా
చిన్నృపాలుడు పలె గ్రక్కునన్॥ సీ॥ ఈబాలకులు నెప్పుడెచ్చటనుండు
రు తలిదండ్రులెవ్వరి తనయులకును । జదివిన కావ్యమే జనపతిచరితంబుక
లుమహారాజు నేకవిరచించె । వర్ణితంబుగనెవరి వల్లగ్రహించిరి తాళాది
రాగసందర్శమెటిగి। యెంతగ్రంథంబిది యేలోకమందుండి చేరునుదీనికి చే
రునేమి। యనినభృగవామదేవులు హర్షమొగుచు । నిగమసారంబుసురబుధ
నికరపూజ్య। మానమైనది యీకథామహిమదెలియ। సజ్జనకైనను శేషా
హికైన దరమె॥ గీ॥ ధరణిపైద్రొల్లిరావణుదర్పమునకు । వెఱచిబ్రహ్మాదులు

### హరిసురలతోడాను మానవావతారం బెత్తెదనని జెప్పుట.

సుమహా విపిన శైల । తలములనుజేరి కొన్నాళ్ళదాకనుండి । యంత వైకుం
ఠమున కేగిహరినిగాంచి॥ క॥ దేవారియైన రావణు। భావమునమరోగ్రరోషబా

హాబలములన్। దేవసమూహము లెల్లగ। దేవుసుత యాత్మయందు దెలిసి
ట్టులనున్॥ సీ॥ దశరథరాజనందనుడునై జన్మించి తాటకిబరిమార్చి తప
సిచేయు। సవనంబురక్షించి చరణాబ్జధూళిచే తాతిరీతులు లేకనాతిచేసి। గొన
కొని ధూర్జటి కోదండదండంబు విఱచివైదేహిని పెండ్లియాడి। భార్గవరా
ముని భంజించితండ్రియాజ్ఞ సరణ్యములకేగి వనిత విడిచి। వాలిభం
జించి సుగ్రీవుబట్టముపూడె। కట్టి కపిసేనతో దాటి కడలిలంక। కోటచు
ట్టుక రావణుగూల్చి వరలి। వన్నెకెక్కంగ వైకుంఠ పదవిగాంతు॥ క॥
మీమీ నిజతేజంబుల। భూమినిగపివంశమందు బుట్టగవలయున్। నేమ
మిదియనుచుజెప్పిన। నామాటలునారదుండు నాత్మకగనుచున్॥ క॥ వి
నుచున్న దేవగణములు। కనినారద నీవలపుడు కలహాసనుడై। దినదిన
మునువర్తింతువు। జనులకునీవార్తలెచట సాటెరుగుదుమా॥ చ॥ దేవర
హస్యమైతనరు దీనినిజెప్పగరాదు వైనశ్రీ। దేవునిమాయయింకెటుల దే
జనునొందునొ నిర్ణయింపనే। దేవులకైనదీరును మదేభముఖాదియమంబుజో
చ్చి యేడ్వగా। భావమెఱింగి రాడె సురమాన్యుడు నాశ్రితకల్పభూజ
మై॥ క॥ అని తెల్పిపోవనారద। మునియచ్చటువాసి త్రిజగములుచుంచు

## నారదుండు రామావతార వృత్తాంతంబు ప్రాచేతసుండు పుట్టకుండెల్పుట:

చుభూ। జనపదముదాక్కి మృగఖగ। వనతలములజొచ్చికడుపు భార
ముతోడన్॥ ఉ॥ ఏగతిసర్వహింతు నికనేమిగ తేమి రమామనోహరా। బా
గుగగాని యీకడుపుబాధనుగైకొని తాళజాలనీ। భాగమునందు మాన
వుల మార్గములేవియులేవు మెల్లగా। యోగముపుట్టలోగదసి యోచనచే
సెదనంచు ధీరుడై॥ చ॥ శరభవరాహ సింహమద సామజసైరిభశాక
ఘూకసం। కరము ఖగేంద్రఘోరతర కల్పకశైల లతావిశాలవి। స్ఫుర
నవచుల్లికాకుసుమ శోభితమైతనరారు కానలో। బరువులుపారిపారి వె
నుపాపవివాసముజేరియిట్లనున్॥ మ॥ ఫణినాథా మదిటత్తగింపుమిదిగో
బ్రహ్మసురేంద్రాదులున్। జనిమైవెతుందునిజాంచి దైత్యపతులం జెండాడవే
యంచు యో। చమువేసి సూర్యవంశమున రాజాధీశుడైపుట్టి మే। ది
నిదావీరవరేణ్యుడై మెలగు సందేహంబులేదిప్పుడున్॥ సీ॥ రఘువంశజాతు
డైరామనామాఖ్యతో లక్ష్మణభరత శత్రుఘ్నులనెడి। తమ్ములతోబుట్టి
తపసిజన్నముగాచి పాషాణదోషంబుబాపిపరమ। శివునిశాపముద్రుంచి
సీతనువరియించి కానసంబునవేగ ఖరునిగూల్చి। మారీచునదలించి వా
లినివధియుంచి కపిసేనతోగూడి కడలిదాటి। కుంభకంతునిజోక్కాల్చి కదు
నొక్కొండు। వేలసంవత్సరంబులు విమలసకల। యాగములుజేసి దేవేంద్ర

భోగ మొప్పి। పావనము చేయు సాకేతపట్టణంబు॥ గీ॥ అనిన ప్రచేతసుడు పుట్టనణగియుండి। పెద్దకాలంబు తపము నుబేర్మి జేసి। రామనామామృతాభిఖ్య రసము గ్రోలియు। విపులమైనట్టి జడలతో వెలయు జూచె॥ అంత నారదుండు॥ క॥ మునివంశోత్తము కానన। మున నెవ్వరు లేరటంచు మొర వెట్టితివీ। మనసున నని ల్పముదీసిని। యనినారదుడరిగె నవ్వరుఁ లభినుతి సేయన్॥ వ॥ తదనంతరంబ వాల్మీకి నిజశిష్యుడైన భరద్వాజమహర్షితో సికతా ... ంద వేదికాలంకృత ప్రసూనాంచిత విరాజితంబైన తమసా నదీకరగితత్పుణ్యజన స్నాతుండై తత్తీరంబున క్రౌంచమిథునంబులు ... కేళీవినోద విలాసంబుల సంచరించుచున్న నచ్చటికొకనిషాధుండు మృగపక్షికులాంతకుండై వివిధాయుధపాణియై వచ్చి చాపంబెత్తి శరంబు సంధించి తత్క్రౌంచమిథునంబుం బడనేసిన మహోగ్రహమ్మునన మ్మహర్షి శపియించు వాక్యంబమోఘంబై చతుష్పాదనియమసానుభవంబయి ప్రసరిల్లుచుండ నదియెయ్యదియనిన॥

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్॥

వ॥ అనునీశ్లోకంబుం దచ్ఛిష్యులు పఠించుచుండిరంత॥ మ॥ కుసుమాలంకృతుడై త్రిలోకహితుడై గోవిందసేవార్హుడై। వసనానందశరీరుడై ప్రవిమలవ్యాణీసమేతంబుగా। నసమానుండు ప్రసన్నుడైన యపుడే హస్తంబులన్

బ్రహ్మ వాల్మీకిని రామాయణంబు రచింప నియోగించుట.

మోడ్చుచున్। ముసిమింజెండగ లేచివచ్చి మదిలో మోదంబు రెట్టింపగన్॥ గీ॥ క్రమ్మొక్క నిలుచున్న వాల్మీకి మౌనుగాంచి। పుణ్యుడైతివి మూల్లోకముల నటంచు। నమరముని తెల్పె రామనామాతిశయము। గనుక రచియింపు మీది యాదికావ్యముగను॥ క॥ శాపాక్షరములు లక్షణ। ప్రాపువహిల్లంగ నొక్కచ్ఛందస్యంబనియున్। శ్రీపతి చరితామృతమల। నోపిక గొంజెప్పనీకు నొప్పు మహాత్మా॥ క॥ రామావతారవర్ణన। లే మునికొనియూనవచ్చు నెవ్వారితరమా। నీమదిదోచుచువచ్చునే। భూమిని నీవంటి పుణ్యపురుషులు గలరె॥ మ॥ అన వాల్మీకిమహర్షి యిట్లనియె నో యబ్జోద్భవా నన్ను నే। గనుగొంటింగద పూర్వజన్మకృతముల్ ఖండించె రామాయణం। బనఘంబున్ రచియింపగల్గె నిదిపుణ్యంబిట్లు సంధించుటన్। ఘనపాపక్షయమాయెనో హృదయంగై వల్యముం గల్గునో॥ క॥ చతురాననుండు విస్ఫుటమతి చేతను రామనామమహిమోన్నతముల్। యతితో జెప్పి యథేచ్ఛను। సతివాణీసహితుడగుచు జనె నెలవునకున్॥ వ॥ తదనంతరంబున వాల్మీకిమహర్షి భరద్వాజాదిశిష్యులతో జని శుకపిక నికర కోలాహల కలకంఠ సంగీతానందమాలతాలహింతాల రసాల సాలాశోక కదంబ వటకుటజ ద్రుమ్రాక్షపీచుమంద చందనము

దారకుంద కేతకీజంబీరాది బహువిధవృక్షోప శోభితంబైన నిజాశ్రమంబు జేరి నారదోపదేశానువర్తియై రామకథాపాన లలితమధుర వచనార చనదక్షుండై॥ సీ॥ అర భమొనరించె నమరసేవ్యంబయిన కావ్యంబు నిది

సీతవాల్మీకాశ్రమంబున నున్నదని శత్రుఘ్నుం డెఱుంగుట.

మహాకలుషహరము। రామాయణంబను నామంబుదీనిలో శ్రీ రామ పట్టాభిషేకమునకు । షట్కాండములై వేదసామ్యమై యుత్తరకాండంబు తేజమై యలుగునవల। నేనూఱుసర్గలు హితవృత్తిఁ గల్పించి కుశలవులకునతినిశదముగను జెప్పెనారదమునివరు చెంతరాగ। సరళిగాను వల్లకిసరణులెఱిగి । పఠన చేతురు భోగసంభవకరంబు । మోక్షదాయకమైయుండు భూమియందు॥ గీ॥ ఆదినారాయణుడు రాముడైజనించె। శ్రీమహాదేవి సీతయై చెలువుమిగిలె।శంఖచక్రంబు భరతశత్రుఘ్నులైరి । సర్వతల్పంబు లక్ష్మణస్వామి యయ్యె॥ వ॥ కావున శ్రీరామావతార మహాత్మ్యంబెవ్వరికి దెలియదర బుగాదదియునుంగాక॥ చ॥ జనకతనూజ ఘోరతపోగతి వనంబుల నొప్పుచున్నమే । మనుమహాయిస్మితాత్ములయి మోహముగల్గ దల్లిసేవుచు । నిది దురాత్ముఁ డల్కలను నెంచక సిరునునీతిగాను మా। వనములుచూడవచ్చితివి వాసిగమాదురితంబులార్పగన్॥ వ॥ అని వాల్మీకిమహర్షి యనేకవిధంబులం బ్రార్థించి కొంతసేపు పుర్ణాంబుగావించి యాదేవిని నతి గారవంబున జనకమహారాజుకైవడిం బోషించునెడ॥ గీ॥ దేవనదు నెన్నదియగు దినమురాత్రి । లక్షణంబులుగల శుభలగ్నమందు । గనియెనునిగవుర షోడశకళలుగలుగు। చంద్రబింబంబులోయని జనులుపలుక॥ గీ॥ కుశలవ కుమారులని మునికోటులెల్ల। బిలుచుచుందురటంచును విన్నవింప । వె తలనొందుచు దక్షకసుతులగనుచు । దెలిసి శత్రుఘ్నుడును మదిగలిగిసొలి॥ సీ॥ రవివంశమునకు నీ రత్నముల్దగుగాని మానభాగ్యమేమన జనునజగతి। ముద్దుముచ్చటచూచి మోదించి కౌసల్య కైకసుమిత్రాది కాంతలెల్ల । నెంతలాలింతురో యిదిగాక జనకభూవరుడెంత సంతోషవార్ధినోలదు శ్రీలక్ష్మివనములో జేరిన చందాన గోదువ లేలనుగల్గు కొడుకులకును । మన మిపిరితో భాషించు మైత్రియున్న। గాని రామాజ్ఞ నేరికిగడపనౌను।సమయమిది గాదువీరిని సదనమునకు। బిలువనంపింపవలెనని ప్రియము జెంది॥ క॥ మునిపర్ణశాలలోనికి । జనిసుఖనిద్రిలునుగొంత జటిప్రపితామయుక్తిం । దనసైన్యసమేతముగా।జనియెను భూభాగమెల్ల చలనము నొందన్॥

శత్రుఘ్నుండు వాల్మీకివీడ్కొని లవణపురంబున కరుగుట.

సీ॥ నీలాద్రిశృంగము ల్నిలిచినచందాన మదకుంజరంబులు కదిసి రాగ । బవనవేగసమాన జవముగల్గినయట్టి ఘోటకంబులు దిశల్గూడినిం

డ। శరశరాసనశూల చక్రాయుధంబులు ధరియించి ధీరులకళ్ళెములెను
గ। రోదసీకుహరంబు భేదిల్లబ్రస్థాన భేరిరవంబులు భోరుకొనగ। విక్రమా
కారదేజులై వీరభటులు। సింహనాదంబులను గొంతసేపుసల్ప। జంఘాల
మర్యాదలై చతుస్సాగరములు। ద్రోచికచ్చినచందాన దోచనయ్యె॥ గీ॥
ఏకహోరాత్రములకును నేగివిపుల। ఘోరమైనట్టిప్రాకార గోపురము
లు। మండితద్వార ఘోటకమదమదేభ। వర్ణితమునగు పురసమీపంబు
నందు॥ చ॥ నిలిచినృపపాలవల్లభుడు నిండిన సైన్యము జూచి కంటిరే। లలి
తని కేతనంబులును లక్ష్మికిబ్రాపగుసౌధ దేశముల్। విలసితరత్న వేదికల
మీదజెలంగెడి రంగవల్లికల్। బలసిన మేటిమద్దికు పైగలశంబులనొప్పు
వీధులన్। గీ॥ పుర దీతీరమునను సంపొందవకుళ। చూతకర్పూర కదళి
కాశోకనింబ। చందనారంగ తక్కోలసాలకుటజ। భూరుహంబుల చెంతల
జేరియున్న॥ వ॥ దైవయోగంబునంజని లవణాసురుండు భక్షణార్థంబుగా వి
పినాంతరంబునకు బోయియుండు నవసరంబున॥ క॥ దనుజాధిపతి మహో
గ్రహ। జనితుండయి వచ్చునని సామజముల చే। కొనిసలిలాపేక్ష న
పుడు। చనుదెంచిరి వారలధిక సాహసులగుచున్॥ క॥ మదముగలకుంజరం
బులు పొదలగగాసారతీర భూరుహలతల న్। విదళనము చేసిసరసిం।
గుదిరినవకమలములను గొనివిహరించున్॥ ఉ॥ తోయము లెత్తిపీల్చుచు
ను దుండములూశలుగాగ ద్రిప్పుచున్। శ్రీయుతమైనఫాలముల జేర్చవినో
దము జెందియాడుచుం। గాయము నీళ్ళలోనిలిపి కంఠము మీదికి నెత్తిగట్టి
గా। గూయుచుగుంజరంబులును గు పులుగు పులుగాగ నిండగన్॥

## సవనయోగ్యహయంబు పురబాహ్యప్రదంబున కరుదెంచుట.

సీ॥ చాలవన్నియకెక్కు జవనాశ్వములు దైత్యమందిరంబున నుం
డిబ్రాదమయ్యె। కనకనిర్మితరత్న కంఠహారంబులుకళ్లెలొప్పపచ్చలకళ్ళెము
లును। బట్టిజీనంబులు చుట్టుజల్లునపరంజిలో బొదిగిన యంకిణీలు। ము
త్యాలబాసికమ్ములు సింహకగడలు గండపెండేరము ల్గలుగు హారులు।
రాజమార్గంబునను బీతర క్తసీల। వర్ణముల్గలుతురగము ల్వజ్రకాంతి।
బొంది తగువాహనంబుల సుందరంబు। జెందనృపవరు పట్టాభిషేకము ల
కు। యోగ్యమైనట్టి హయములు నొప్పినపుడు॥ క॥ ఆతురగసమూహము
లో। ఖ్యాతిగ హయమేధయాగఘనమగుహయమున్। ప్రీతివహిల్లగసర
సికి। నేతెంచెను రాజహంసమేయుదియసగన్॥ ఉ॥ తెల్లనిరత్నముల్ రుచు
లదేలెడిమోము పిశంగవాలమున్। నల్లనివర్ణయుగ్మములను నమ్రములై
చెలువొందు రోమముల్। ఫుల్లసరోజసంపదలబొందుశిరోధియు నొప్పు
జానువుల్। పల్లవవైభవాప్పద విభాసితకంఠముతో జెలంగుచున్॥ క॥

తడఁబడఁగ నడుగులిడుచుం । గుడిసెడమలం దిరిగిహయము గూడఁగ
బయికిన్ । విడివడిన గంధనాగము । వడుపునసలిలములు జేరవచ్చినబలి
మిన్॥ చ॥ పవనహయంబు చూచితిరె సామజఘోటక మధ్యమందుశ్రీ ।
ధవునకు యోగ్యమైమెలఁగు దైత్యులు వెంబడి నాయుధస్థులై । కవిసియు
నున్నవారు మదగర్వమునూన్చి హయంబుదెచ్చెదన్ । బవరము సేయు
బొందు పురమార్గము ముట్టడివైచి మీరలున్॥ వ॥ అని సేనలకాజ్ఞాపిం
చి యతిత్వరిత గమనంబున॥ చ॥ శరముశరాసనంబు దనచేతధరించి ర
థంబునెక్కి సం । గరముజలంచి సారథినిగన్గొని పొమ్మహయమ్మునొద్ద
నై । చొరబడినట్టి వైరులను చుక్కఁగఁజెద గార్యవేళలం । దిరిగిన
హల్లుమంచు నుపదేశముజేసెను మేఘధీరుఁడై॥ క॥ సలిలములుదాఁవి
గజములు । తొలఁగకశైలములపగిది ద్రోవలనడువన్ । జటములు గో
లి హయంబులు । కలశంబులరీతిగదలఁగా నమయమునన్॥ మ॥ శరచా
పంబులతో మహాగ్రహముతో సంపూర్ణ తేజంబుతో । జటాజూటంబు
లతో మహాకఠినహూ సంగ్రామభీమంబుతో । ధరణీనాథుడు ద్రోవకడ్డప
డిన్ దైత్యాధిపుల్చూచియే । నరుఁడో జిష్ణుఁడొ రుద్రుఁడో యజుఁడొ శ్రీనా
థుఁడో భోగీశుఁడో। క॥ అనియివ్విధమున బల్కుచు। దనుజులు కోదండగా
డదండాయుధులై। వెనుకలముందర నడువఁగఁజనుదెంచెను పవనహయము

## శత్రుఘ్నుండు హయరక్షకులగు రాక్షసులతో బోరుట.

సంకాశముతోన్॥ చ॥ కనుగొని లక్ష్మణాత్మజుఁడు కార్ముకమప్పుడె యెక్కు
పెట్టి భూ। వనములు సంచలింప నిజబాణముగైకొని కాలరుద్రుఁడో । య
నగ విరోధిసైన్యముల నంతయుఁగన్గొని దైత్యులారనన్ । దనరగమిమ్ము
జంపరఘుభూతిపుడంపెనుసంగరంబునన్॥ అనిన॥ గీ॥ నవ్విదనుజులునోనర
నాథతనయ। తెలియదో నీకులవణుని బలిమికలిమి।శూలికైనను బ్రహ్మాదిసు
రలకైన । దీర్చవశమానె యెవ్వారు దెల్పినారు॥ చ॥ సురలవధించినాఁడు
భవుశూలము గైకొనినాఁడుభూమిభూ । వరులహరించినాఁడు బాహుబహుబి
లాసముచేత దేవతా।తరుణులబొందినాఁడుతగుదానవసైన్యసమేతవృత్తితో।
బురములుగెల్చినాఁడెటులుపోరెద వీవుమహాగ్నికీలలన్॥ క॥ తెరువువిడుమను
చుబల్కెను। కరవాలముద్రిప్పినడువగాశత్రుఘ్నుడుసం। గరజయుడైరక్కసులను ।
శరములునాటించియార్చెసరభసవృత్తిన్॥ గీ॥ దీర్ఘనాభుండు రోషించు ది
క్కులదర । సింహనాదంబుగావించి సింధురంబు । నెక్కికోదండమప్పుడె
యెక్కువెట్టి । బాణములునాటనేయ భూపాలుడలిగి॥ మ॥ శరసంధాన
ముచేసిచాపమపుడే చెండాడి వేయొక్కటిం। గరమందన్ ధరియింపగాను వ
డిగా ఖండించికోశంబుచించం । దరమైపోవమదేభముం దెగిన భూతశ్రేణి

ఘూర్ణిల్లసం। గరసన్నాహము బొంది రాక్షసుడు సంగ్రామోగ్ర తేజ బున కా
క॥ ప్రదమియయిదమికి చేతిను। నడిజము ధరియించి యసురుడాతురుడగుచుకా।
వడి రాగ శరము గైకొని। పడనేసెను దనజపతులవంక్తులదరగా॥ వ॥ ఇవ్విధం
బున దీర్ఘనాథుండు పడుటకు మహోగ్రహోదగ్రులైన ముచియు శంబరుం
డును ద్విమూర్త్తుండును వృత్తపర్వుండును హయగ్రీవుండును శంఖశిరుండును
విప్రిత్తియు నయోముఖుండును పులోముండును ప్రహేతియు నల్కలుండు
నుధూమకేతుండును విరూపాక్షుండును కపిలుండును విధానసుండును బిల్వ
లుండును బిల్వలుండును దండశూకుండును వృషధ్వజుండును కాలనా
భుండును మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును మత్త
మాతంగ శరభసింహ హయాద్యారూఢులై పరశుపట్టిస కరవాల శూ
ల చక్ర గదాకుంత తోమర బిండివాల దండాద్యాయుధంబులు ధరియిం
చి నిలువంబడ రఘురామసైన్యాధీశులు మత్తమాతంగ రథఘోటకారూ
ఢులై శరశరాసన ఖడ్గకవచంబులదాల్చి దుందండును సిపధుండును
బుంద్రకేతుండును బుండరీకుండును క్షేమధన్వుండును దేవానీకుండును వి
ప్రుండును పారిహోత్రుండును గుశధ్వజుండును బలచరుండును నల్క
లుండును ధూమ్రవర్ణుండును విజితకేశుండును రశ్మికేశుండును వృషపర్ణ
యు సింహశౌర్యుండును గర్భుండును సుధాముండును రావణాసురు ప
ట్టణంబు ముట్టడించి గోపురప్రాకార మహాద్వార తోరణంబుల గట్టి పట్టుతె
రంగున హయారూఢులనిల్పి కిలార్చుచు శత్రుఘ్నపరితలంబు నికరంబు
లై యుగాంతాక్రాంత జంఝామిలపరికల్పిత దీర్ఘనిర్ఘాతనిష్టునినదంబులం
బోలి ప్రళయసంరంభ విజృంభితసముత్తుంగ తరంగంబైన పారావారని
ష్ఠ్యూత మహార్ణవంబులంబోలి యుభయసైన్యంబులు సంగరంబులుసల్పు
సమయంబున సకలప్రాణిసంహారకారణ విలయంబునం బోలె గదల జమ్మ్ర
చు నడిదంబులనడచుచు గుతలంబులం గ్రుమ్మచు గుఠారంబుల నొంచు
చు వాజులకురికియు వాలంబులనఱికియు దొడలుద్రుంచియు దండంబు
లు ఖండించియు మెడలెడలించియు నడుములువ్రస్సియు నాసికంబులు
చించియు పార్శ్వంబులు నఱికియు గుంభికుంభంబులకుం గుప్పించియు
గాత్రంబులనడచియు గొమ్ములెడలించియు నంగంబులనొంచియు రథం
బుల నలంచియు రథికుల జలింపజేసియు సారథులజంపియు సైంధవం
బులంగొట్టియు కేతనంబులం దూలించియు ఛత్రంబులు నురుమాడియు
జామరంబులం దునుమాడియు నివ్విధంబున బరస్పర గుణభేదంబున న
న్యోన్యకోదండఖండన పటుత్వంబునునుభయసైన్యధ్వజ సారథివికలంబు
నునొండొరుల పాదజానుజంఘహస్త మస్తకనిర్దళనంబున రక్తమాంసమే

దశీశంకసంకలిత సమాగాంగణంబును సంరంభ సమ్మోహానమత్సాహం
బునల్పుచుశత్రునాశోత్సాహంబునశక్తిగల శ్రమఘుంఘుండుప్రళయకాలవ
వనపరిభాసితశిఖిశిఖావళు ం దృణీకరించుచుం గుటిలాలోకనంబుల నా
లోకించుచు యుగాంతక్రీడాలోలుండైన శూలిపోలిక మదించిన మత్త
మాతంగంబు కమలవనంబుజొచ్చి మట్టినుల్లాడువిధంబునం గలహావిహారం
బుసలుపు నవసర బున భిన్నంబులైన శిరంబులును ఖిన్నంబులైన కపా
లంబులును వికలంబులైనభూషణంబులును జిక్కువడిన కేశపాశంబులును
భిన్నంబులైన దంతంబులును విచ్ఛిన్నంబులైన భుజంబులును పిండీకృతంబు
లైన కరంబులునువిదళితంబులైన మధ్యంబులునువిశృంఖలంబులైనవదనంబులు
ను వికలంబులైననయనంబులును విస్తీర్ణంబులును విశీర్ణంబులైన నాసికలు
ను విఱిగినయూరుదేశంబులును విసంధులైన పదంబులునుచినిగినకంకటం
బులును వ్రాలినకేతనంబునుగూలినచక్రంబులునుమ్రగ్గినగజంబులును
నెగసితిరిగెడి కబంధంబులును గలకలంబైన కంకకాకఘూకాది విహం
గసంకుల నినదంబును గలిగియున్నసంకుల సమరసమయంబున రుద్ర
గణంబులును సిద్ధకిన్నర కింపురుష గరుడగంధర్వ ఖచరప్రముఖులును
వీక్షింప సైన్యంబులతో నముచియుం బరివేష్టించి సంగ్రామ శౌ
ర్యాభీల పరాక్రమంబులువర్తిప మత్తమాతంగ రథహయారూఢులైన
దైత్యాది శతుల సంఖ్యలుమడిసిన సవసహాయంబు విడిచికరహితంబులై
దైన్యంబునొంది చేష్టలుడిగియున్న సమయంబున॥ క॥ నరపతియపుడే తు
రగము। శిరమువహిల్లంగబట్టి సిరిచన్నొందన్। దరువునకుగట్టి నిగ్రహ। ప
రుడైయుండంగదనుజ బలము లోడన్॥ క॥ లవణునకి మగదినంబర। శివుడ
యి యుప్పొగు దనుజసింహుడు శరము। న్నవరణము గ్రొవ్వెటన్। భువి
వెల్లగిలంగ రథముబూనికనెక, న్॥ చ॥ నిలుండు దైత్యులార యిదెనేజను
దెంచితి దుస్తరంబుతే। కలచెనసప్తశైలముల క్రక్కుననైవెచద స్వర్గనా
గభూ। తములనదొ్రక్కెడన్ యముని ఘాతనురేంద్రులనైనం దాకెదం।
దొలగకరండు యీమనుజ గర్వబలవంతులునాకసాధ్యులే॥ ఉ॥ నేలుదిగ్రి
ప్పిపేరుగలచక్రి శరాసనదండధారియై। మానితరత్నవిస్మిత విభూసముతె
క్కి పరాక్రమలీలలన్। దానవసైన్యముల్గొలువ ధారుణి వెల్లగిలంగ దుందుభి।
ధ్వానములుల్లసిల్ల మదదర్పయుగ్రాకొని యార్భటించుచున్॥ గీ॥ శేఖరుం
డగు నానారసింహుడువడ। నతనితమ్ముడు శతబలియతనిమామ। శూర్ప
కర్ణుండు ముగ్గురుశూరవరులు। సైన్యముతోడ వచ్చిరిసమరమునకు॥ సీ॥
శాతులుగ్రద్దలు గమనముల్సేయంగం బెనుమంటలులములు వెళ్ళగక్రక్క।
జలధరంబులు రక్తజలములుగురియంగం గేతనంబులు దెగి క్రిందబడగ।

భూతసమూహము లుబ్బికూఁకలువెట్ట భుజగనాథునిక్రొవ్వుఁ బుసలుగొట్ట ।
గనుగొనవచ్చె భగణము తల్లడము౦ద సర్వనేత్రములందు నశ్రులొలుక । భూ
రిసంగ్రామధీరులై పోయికడిసి । పట్టిచాపంబునను చేతబట్టి తీవ్ర శిఖిశిఖావ
ళిమార్గణ శిఖలుజగము । నిండగాఁ జేసి రౌద్రముల్నిండఁ జేర్చి॥ వ॥ ఇవ్వి
ధంబున యుగంధరుండును పుండరీకుండును క్షేమధ్వజుండును వృషపర్వుం
డును దేవానీకుండును హయగ్రీవుండును విప్రుండును శంఖశిరుండును శా
రియాతుండును విపదిజిత్త్రియుఁ గుశధ్వజుండును అయోముఖుండును జలచ
రుండును విభాసుండును సుధాముండును నీల్యలుండునుం గదిసి రథంబుల
రథంబులును వాహనారూఢుల వాహనారూఢులును బదాతులం బదా
తులునందాక సింహనాదంబులు సేయుచు నట్టహాసంబు లెచ్చుచు నా
మ్నాంకంబు లొనంగుచు నన్యోన్య తిరస్కారములుసేయుచు బాహు
సాహసంబులు విజృంభించుచు బెనుబొబ్బలనుప్పరేగుచు హుంకరించుచు సిం
జినీపుంజాంతర జితములుసేయుచుం బరస్పరస్పర్ధభుజాస్ఫాలనంబులు గా
వించుచు మహాశవన విజృంభితములైన కాఁచిచ్చుపగిదియు కాలానలచం
డంబున దరికొనియుం బ్రచండఝంఝానిల ప్రేరితసముత్తుంగతరంగాన్విత
సముద్రంబులభంగినింగికింబొంగి ప్రచండంబులైన గండభేరుండంబులగఁబొ
నిక దుర్లభంబులగు శంభంబులఁ జాట్టునవసరుగదిసి మహారణ్యంబులు
వెడలి మార్కొనుమదదంతంబులమాడ్కి మహోత్కంఠంబులగు కంఠీర
వంబులకైవడి హాహాకారఘోరరవమ్ములు మొరయవీరరసాధికమిళిత రక్తన
యనులై రథంబులపైకిగుప్పించి రథంబులుదాటుచుఁ జండపవనజవన హ
హయారూఢులపైదారసిల్ల దంతికుంభంబులకెగిరుచుఁ గటారుల బొ
డచుచు శూలంబుల ద్రిప్పుచు యుగంధరంబుల దెగనేయుచు హస్త్యశ్వ
ఘాతంబు సేయుచు రథంబులకుగుప్పించుచు నశ్వారోహకుల విదళించు
చు యోధులం బరిమార్చుచు సైనికులందఱిమి నఱకుచు నాయుధీయుల వి
మర్ధించుచు నపప్రయోగులఁ జోలించుచు ధనుర్ధరులఁ దునుముచు యూర్త
లంబిలచుచు సమరపురస్సరుల నమయించుచు రక్షకులం బరిమార్చుచు ర
థంబులం జిదుముచు సారథులం దరించుచు వీరాధివీరుల వేరడగించుచు నా
శుగంబుల డంచుచు దూణీరంబులఁ దూలించుచు జాద్రిహాసంబుల ఝుళి
పించుచు కృపాణంబులం గ్రుమ్మచు ఫలకమ్ములం బ్రకటించుచు ముద్గర
మ్ముల మెఱయుచు బిండివాలమ్ముల భేదించుచు బరిఘాయుధంబుల గీలొ్కా
ల్పుచు గుఠారంబులఁ దూలించుచు బ్రాసంబులెత్తుచు సుభటకోలాహల
రవము దేభగింకారంబులును నశ్వరజయధనుష్టంకారంబులును భూరిభేరీ
నినదంబులును నయి పలుదెఱంగుల నలరునవసరంబున ఛిన్నంబులైన కపా

లంబులును వికటంబులైన కపోలంబులును జిక్కువడిన కేశపాశంబులును
వికీర్ణములైన కర్ణంబులును వికృతంబులైన భుజంబులును బిండీకృతంబు
లైనయురంబులును విసంధులైన పదంబును విభాసించు రుధిరనదులు
నుంగలిగియున్న సమయంబున దైన్యంబులనొంది వికలులై యుద్ధతలంబు
ననిలువలేక హతశేషులగు దనుజాధీశులు విరథులై చతుర్దిక్కులకుం బారి
రి॥ చ॥ శతబలిధీరుఁడై రథము సారథితోరణమంచు వచ్చి భూ। పతులనదల్చు
చుం బ్రళయభాస్కరురీతిగఁ జడతీవ్రుఁడై। మతి వెలయంగ ఘోర రణ
మార్గము వీధులఁ జేరి దైన్యసం। గతులువహించి సైన్యములఁ గైకొన నీ
యకవచ్చుచుండఁగన్॥ ఉ॥ శూలము ద్రిప్పుచుంబరులు ద్రొక్కడగించుచు
ఖడ్గముం దిదో। ర్మాలలవ్రయ్యుచు న్సమరభూమి హయంబుల నెక్కియున్న
భూ॥పాలమహారథాధికుల భంగముసేయుచు గర్వశీలుఁడై। తేలుచు ముష్టి
ఘట్టనలదీర్చుచు భేరులు మ్రోయుచుండఁగన్॥ ఉ॥ చూచి యుగంధరుండు
రథసూతుని మెచ్చుచు వచ్చుచున్న యానీచుని ఘోరరాసుని నిర్జరవీ
రులు మూడఁదుమ్రిచెదన్। సూచనచెంది యీరథము శూరునిమీదికి బోవ
నిమ్మయో। వేచఁగ జెందెదన్ రిపులవీరుల శోణితవార్ధి ముంచెదన్॥ ఉ॥ పు
ట్టితివచ్చెనా సమరభూముల శాత్రవకోటిగూడఁగా। గొట్టితెక్కి త్రిగల్లు ధర
గూలిచ నాకముఁజెందనౌనుసీ। పుట్టినవారణంబులును మూలబలంబును
జెదరుంటినా॥ పుట్టుకతేల సూర్యకులభూపతి సూనుఁడటంచు నెంతురే॥

వ॥ ఇవ్విధంబున బల్కిన సారథియు బగ్గంబులువదలించి హయం
బులబోవనిచ్చిన నడ్డంబువచ్చి యుగంధరుండు శతబలికిట్లనియె॥ మ॥ దను
జాధీశ్వర యెందుబోయెదవు యేతంత్రంబులింకేలయీ। దినమందే హరి
యింతు పోవనగునాదే వేంద్రదిక్పాలకుల్। గనుచున్నారదె యింట దూ
ర్యరవశంఖా నాదముల్మ్రోయనీ। ఘనముగ్ మాపెద జాపశస్త్రముల
తో గయ్యంబులకై నిల్వరా॥ ఉ॥ భీమముగల్గురావణుని బేరడగంగఁ జేసి వం
ట్టి శ్రీరాముని సోదరుండ రణరంగగరిష్ఠుడ వచ్చినాడమీ। సామజ
ఘోటకాది రథసైన్యముదున్మక యూరకుండునా। యేమన నేర దైత్యు
కుల హేతువుగావిది యెంచి పోరరా॥ వ॥ అనిన లవణాసురభృత్యుండగు
శతబలి రోషభీషణానలనేత్రుండై యుడిదంబు ఝళిపించుచు నిట్లనియె॥
చ॥ చలమున రావణాసురుని జంపిన రావణు సోదరుండుయీ। తలమునఁ జేరి
నాడు యిదేతాకెదశత్రులసంహరించెదన్। పలయుచు భూతకోటులకు
మాంసము రక్తము తృప్తిచేసెదన్। నిలిచితినేని యుద్ధమున నీరజగర్భుఁడు
నైనబోరునా॥ గీ॥ శరము కోదండమునఁ దగ సంగ్రహించి। యురము నా
టంగనేసిన నుగ్రుడగుచు। విషమబాణంబునొక్కటి వేసిదనుజ। ధను

వుదెగనేయ నతఁడుభూధవుని గినిసి॥ ఉ॥ శూలముబట్టి యోమనుజశూరు
డ మెచ్చుటకేగవచ్చునా । భీలపరాక్రమాకలిత వీకల ద్రుంచితి దీనినిప్పు
డే । ఫాలముపెల్లగించి నిజబాహుపరాక్రమశక్తినిండ నా । కాలునివీటి
కంపెదను గాయము వ్రచ్చెదజాడు వెచ్చురన్॥ ఉ॥ రాగయుగంధరుండు
నిజరాజసమూహము జూచిమెచ్చ న । యోగముగల్గిలేచి జయ యో
గమునొందు శరంబువైచినం । ద్యోగముచేయుచు బ్రబలియ దైత్యులు
పెల్లగిలంగవచ్చి భూ। భాగమునంటి శూలమును భస్మముచేసినరోషగిం
చుచున్॥ గీ॥ పాశముద్రిప్పి వైవ భూపాలుడలిగి। దొడ్డనారసముల
దాని దునిమియొక్క । శరముగైకొని హయములజెండి సూత । వరు
నిదెగటార్చి శతబలిమదమడంచి॥ క॥ దనుజునిశిరమును ఖడ్గము । గొని
తెగటార్పగను నినదఘోషములెసగన్ । మొనవిరియ శూర్పకర్ణుడు । క
నుగొనివ్రేయోగ్ర కాలకాలుండగుచున్॥ సీ॥ కుప్పించియొకసారి కుం
భికుంభంబుల మెదడురాల్చునుబాహు పృథులశక్తి । హయగజారూఢు
ల నలయించిగద చేత చుట్టించువిక్రమ ధైర్యలీల । వరరథాధీశుల దరుము
చు శైలము ల్వ్రేయుచునిజభుజవిక్రమమున। గంఠీరవములీల గజయూథము
లబట్టిత్రిప్పుచు మీసముద్దేర్చుకొనుచు । రుధిరముఁగ్రోలి మాంసము
ల్రుచిగరంగి । పెద్దగదచేబూని భీషణముగ । యమునిపోలిక నింక్రి
ని యడిదముగతి । శూర్పకర్ణుడు రణమున జూకగొనుచు॥ చ॥ దునుము
చు రాజసైన్యముల దోలుచుదంతిరథాశ్వపత్తులన్ । మొనయుచు యు
ద్ధరంగమున మూర్తివహిల్లుచు ఘోరరూపుడై । జనములబట్టిమ్రింగుచు
ను సాహసవృత్తినితేచి యార్చుచుం । బెనగుచు ముష్టిఘాతముల బెల్లు
గ దేవతలెల్లజూడగన్॥ గీ॥ సమరమొనర్ప నోపక జనము వడక । భూప
తులు చింతనొందగా బూనిలక్ష్మ । ణానుజుండైన శత్రుఘ్నుడాగ్ర
హమున । బాణకోదండధారియై పలికెనిట్లు॥ చ॥ కుటిలదురాత్మయో
దనుజకుంజర నీభుజశక్తిమించిదే । చటులశరంబులో విశిఖజాలము లంబ
రిమార్చి కాయముం । బలుగతిగాకఘూక మృగపక్షుల కిచ్చెదబాపకర్మ
నీ । వెలరణాంగణంబునను నేయిషులెత్తిగాని ద్రుంచెదన్॥ అనిపలికిన॥
చ॥ వకపకనవ్వరాక్షసుడు బాహుమదంబున నోనరాధమా । సుకరము
గాదు ఘోరరణశూరుడ ఖడ్గ శరాసనాది సా । ధకనిపుణుండనింద్రియ
మధర్మ సురాసురయోధులెల్లసమ్ము। ఖమున నిల్వలేరు శిఖిమూలము నే
ధరియించుఖడ్గమున్॥ గీ॥ హాసమువిడిచిపెట్టి యాగినలగ్గగు । విడువ
కుంటివేని విపులబాహు । కఠినశక్తిచేత ఖండింతుబాణముల్ । గాచికొ
నుములేని కలహముల॥ వ॥ అనిన శత్రుఘ్నుండిట్లనియె॥ చ॥ ఎవనిగన

మాడి జనకజాత। గూడి భార్గవరాము కోపంబు బరిమార్చి దండకాటవి జొ
చ్చి దైత్యవరుల। ఖండించి వాలిని గలహించి సుగ్రీవు జేపట్టి వారధి చెలగి కట్టి।
రావణు విజంపి పట్టాభిరాముడైన। యీశ నియనుమతి వచ్చితి యజ్ఞహయము।
బట్టితివి నింక మా భుజాబలము సమర । భాగమున నేనడంచెద బంతగించి॥
క॥ అని బాణాసనముం జే । కొని ప్రత్యాలీఢ పాద గోచరుఁడగుచున్ । దను
జుని నిశితాస్త్రంబుల । దనువెల్లను దగలనేయ దహనాక్షి మాడ్కిన్॥ గీ॥
పొంగి యసురుండు నొకమహాభూరుహంబు। బెఱికి వైచిన మూడు బాణము
లనేసి। సంహరించిన ఘూర్ణిల్లి శైలమెత్తి। వేగ బడి మార్గణంబుల నఱచి
వైచె॥ గీ॥ భిండివాలంబు నవలీల విఱిచి వైచె । బరశువట్టిస తోమర బాణ
ఖడ్గ। సాధనంబులెల్ల దునిసిన సమరమందు। వీరధర్మంబుతో దైత్య వీరుడలి
గి॥ ఉ। సారథి జంపి వాజి ధిషు చర్మకు నేగతి గాళి వచ్చునా। పేరు గటుం
గగా రథము వేగముగా బఱపింపు ప్రాణముల్ । దూరగ నేసిన గదన ధూర్జ
టి కైనను నిల్వవచ్చునే। పోరగ నింతవాడెటులు పోవునొ చూచెద గాక యిప్పు
డే॥ క॥ అని రాక్షసాస్త్రమేసిన। గనలను నిప్పులును రాల ఖండించి మహోఘ।
నమయిన రథము హయములను మాడిన దైత్యుఁడేమి తోచక బలిమిన్
మ॥ కరవాలంబు ధరించి రాగ గరము ల్ఖండించి రౌద్రాస్త్రముం। బరిపాటిం
చుచు నేసి వైరి తనువున్ భగ్నంబుగా బొందసం। గరసన్నాహము మాని రాక్ష
సులు నాకాకున్ ధ్వనిగీర్తించుచున్ । దరమే యీతనితోడ యుద్ధమున నే
ధానుష్కుఁడున్ సవ్యగన్॥ క॥ అనియరుగుచున్న లక్ష్మణు। ననజన్ముడు గాధిక
వరుల కందరకును నే। జనియొక లవణుని మీదికి। క్షణమే మరవలదు కోట
సరణిం దయుండున్। గీ॥ పోయి మృగపక్షి పంక్తుల భూరుహములు । గలిగి
యుండిన భీకర కాననముల। నిలిచి శరచాపధారియై నిగ్రహంబు। వెలయు
చుండగ లవణుండు వెడలివచ్చె॥ సీ॥ పదఘట్టనల ధరాభాగంబు వడ గాజు
చురుకు మాపు చేత చూచుకొనుచు । మదహయమాతంగ మహిషమాంస
బులు రుచి నిముఱింగుచు మృగరుధిరములను। గుటగుటమని కొంత గ్రోలుచు దల
ప్రవహ్య నములుచు నాలుక నాకి కొనుచు । బారసాచుచు వృత్త పాషాణ
ములనెత్తి ఱువ్వుచు లయకాల రుద్రుడగుచు। వచ్చుచుండియు నాననభాగ
మంగ। నొంటిగా నిల్చికొని సంగరోన్ముఖుడగుచు। రాజు నప్పుడు వీక్షించి రా
క్షసుండు। వెఱచి వెఱవక చను దేర విభుఁడు పలికె॥ మ॥ దనుజా పోయిన బోవ
గూడదిదిగో దండి తద్ధర్మంబుగా । జనబాధ ల్పరిమార్తు నిర్జరులకున్ సం
తోషము జేతు నీ । ఘనధైర్యంబులు సాగిరా గజయముం గైకొండు శిక్షింపం
బు చే। కొని యుద్ధాంగణమందు వేగమని సుంగూల్తున్ సురలుప్పొంగగన్॥ చ॥
అనిన సురారియిట్లనియె నైనను నీవెటమాడి వచ్చితో । నను బరిమార్ప

నోపుదువె నాకులకైనంతర ంబుగాదనీ। జనకునినామమేమి ఘనసాహసకృ
త్యములేటవుట్టెపో। మనమునదాచవద్దు నిజమాడుము తాచెద సాగరంబు
నన్॥ ఉ॥ కొట్టితినాగలోకములు కూలఁగనేసితి యక్షదైత్యులం। బట్టితి
దేవతాంగనల బాధలబెట్టితి సిద్ధసాధ్యులం। గట్టితి సాగరంబులను గాలుని
తోసమరంబొనర్చితిం। బుట్టణగించితిన్ సకల భూరివరాక్రమ ధీరవర్యు
లన్॥ గీ। అనినశత్రుఘ్నుఁడను నోరి యసురయట్టి। సమరములుగావు దశ
రథచక్రవర్తి। సుతుఁడశ్రీరామలక్ష్మణ సోదరుండ। బరగశత్రుఘ్నుడను
పేర బరగువాడ॥ వ॥ అనిన లవణాసురుండు పంక్తికంఠునిసహోదరియగు
కుంభీనసకుమారుఁడు గావున బూర్వవైరంబు దలంచి మహారోషానల
జాజ్వల్యమాన మానసుండై యిట్లనియె॥ శా॥ కానీరాఘవ మోదమందె
దనిదే కార్యంబుకైన స్థివా। నేనిమాపురమందు జొత్తునసుచున్ నేమంబు
గావింతురా। సూనాస్త్రియుధవైరియిచ్చినమహాశూలంబు దెప్పింతురా।
మీనామంబును నింకనిల్పను నిదే మీయూరి కేతెంతురా॥ ఉ॥ రావణు
డుగ్రించినట్టి రఘురామునితో బవరంబుసేయనా। భావముగోరుగాకబహు
బాహు పదాగ్రహావృత్తితోడనీ। జీవముగొందు నాపిదపజేసెద యుద్ధము
పట్టణంబుపై। నావలనంతకుండ్రముఖులైన బితామహు దగ్గగించినన్॥
సీ॥ అనినుహాగ్రహావృత్తి నరుగగానిర్జర సంఘంబులకుమది ఝల్లుమనగ।
బదఘట్టనల ధరాభాగంబువడకగా శేషాహికణము చెవుడుపడఁగ। సిం
హనాదము జేసి శివమెత్తగాజూచిగతినప్పిసోమభాస్కరులమెలగ। నా
జానుబాహుల నప్పళింపగఁట్ట దిక్పాలురకుగుండెదిగులుమనఁగ।గరుకు
వెంట్రుకలనుబెద్ద కడుపుదొప్ప। చెవులు విషదంష్ట్రికలు గొప్పచర్మము
లును। బొనవోరును విపరీతభాషణములు। రూఢిజెలగఁగ లవణాసురుండు
వచ్చె॥ క॥ శరభముల గరయుగంబుల। ధరియించిమదేభములను దంష్ట్రల
తోడం। గరచుచునురుధిగపానము। గఱవుచుగగనముసదివిజగణములు బె
దరన్॥ గీ॥ జరుగుచుండగ దశరథసార్వభౌమ। సుతుడువింటిని ధరియించి
శూరుడగుచు। సూతుగనుగొనిదైత్యుని చొప్పుదెలిసి। రథముదోలుము
ద్రుంచెద గగనమందు॥ క॥ తురగములు నడుపదశరథ। నరపాలుని సు
తుడు వింటనారాచములన్। ధరియించి నిలువబడగని। పరువెత్తినిశా
చరుండు పర్వతమొకటిన్॥ వ॥ కొనివచ్చి లవణాసురుం డిట్లనియె॥ మ॥
మనుజాధీశుడ రావణాసురుడు మామాతామహుండాయె వే। దనరెట్టిం
పగరాముడాగ్రహముతో దండించె నావాడు। యీ దినమందేబరి మా
రుతైతచునిద్రెత్తెల్పింతు నీగాత్రముం। గవరా యుద్ధముసేయు మంచని
మహాశంతిరవాకారుడై॥ వ॥ గిరింబటువిన॥ శరములుమూడువేసి ఘన

శైలముపిండిగఁజేయ ధీరుఁడై। తరువులురెంటినెత్తి భుజదర్పము తోఁవడి ద్రిప్పివైచినన్। శరములనేసి తుత్తురుమువేయఁగ సాలము జేతబట్టిభీ। కరముదలంచి రాఁగ నిజకాండములైదిట నుగ్గుజేసినన్॥ సీ॥ ప్రళయా గ్రిదైధరాభాగ భూరుహములు గొనిచప్పిదైత్యుఁడు గూలవయుచు। భూరి భుజాదర్పమునుమించి శైలము శ్రాకలించివయిచును సుకరముగను। వీరుఁడైశుండాల పారుఁడైతిరుగుచు రోజుచుదనమహారూపమప్పుడె। పెంచుచుగొండల బేర్చుచులయకాల దండియైదేవ ఘాతకుఁడు రాఁగ। ఘోషమై యొప్పనిర్ఘాత ఘోషపవన। వేగముగగ్గి కయిదువు కొసరికొనుచు। నుట్టి మల్లాడుచును రోషమత్సరములు। పూర్ణమై యొప్ప నిరువురుబోరిపోరి॥ ఉ॥ చేతులుచేతులఁగదిసి సింహముసింహము

శత్రుఘ్నుండు లవణాసురుం జంపుట.

దాకుచందమై। భూతములెల్లఁగూయ బెడబొబ్బలువెట్టుచు ముష్టిదండనం। ఘాతమొనర్చుచున్ ముదముగ్రమ్మఁగ మీఁదికిబట్టివైచుచుం। ఘాతకుఁడు ప్రపలేక యొకబాణము వింటనుజేర్చియిట్లనున్॥ మ॥ ఘనదివ్యాస్త్రసమంత్రపూర్వకముగా నైకొంటిభేదించినీ। తనువుం ద్రుంచెద నెవ్వరడ్డపడినన్ దైత్యాధమాయంచు। నీఘనపాపంబులు మిన్నకేజరుగునా గావింతుబ్రహ్మాదులున్। ఘనమల్మోదమునొందగా దనువుతోఁబ్రాణంబులం బాపెదన్॥ క॥ నీపురమునకున్ రాముఁడు। భూపాలుఁజేసిపనుపబూనెనిదిగోనీ। రూపముమాపెదగట్టిగ। జాపముధరియింపు సమరసాహసివేనిన్॥ మ॥ అనిబ్రహ్మాస్త్రము మంత్రపూర్వకముగా నర్చించి వేయాంగభూ। జనలోకంబులుగాలి పావకశిఖల్సంపూరివ ర్లిల్లరో। దనముల్సేయనిశాచరు ల్నురవరుల్దైర్యంబులంబొందమే। దినిగుంభీనస పుత్రుడుంబడిన నెంతేసంతసిల్లన్ జనుల్॥ గీ॥ దేవదుందుభిరవములు దిశలునిండ। గుసుమవర్షంబు దివినుండికురిసె సకల। సురలు దేవాంగనలగూడి సుఖము నొంది। రఖిలజనములు నానందమందిరిలను॥ క॥ లవణుని దునిమిన్నృపాలుడు। బవరముచాలించి మధునిపట్టణమునకున్। సవరణతోఁజనుదేరగ। నవనీజనమప్పుడుచూచి యానందించెన్॥ వ॥ రఘువంశసంభవుండగు యుగంధరుండు మిగిలిన దానవానీకంబులంబరిమార్చి కోటలుదాటి హల్లకల్లోలంబుచేసి పట్టణంబాక్రమించి ధనకనకవస్త్రాభరణ మత్తమాతంగ శ్వేతచ్ఛత్రి చామరాందోళికానేక విశేషవస్తుసమూహంబులం గైకొని పట్టణప్రాకార మార్తికరంగవల్లికలేర్పఱచి రంభాస్తంభాదులునిలిపి యాస్థానమంటపాంగణంబున దైత్యశ్రీవీరసింహాసనంబు నియమించి వేదోక్త

మార్గంబున విప్రవరులచేత బుణ్యాహవాచనంబు గావించి గోహిరణ్యాది
దానంబులుచేయించి యుగంధరుండు మంత్రిపురోహితాప్త జనుల
తోనెదురేగి లక్ష్మణానుజు సర్వలక్షణవిభవంబుగాఁ దోడ్కొని భూరిభే
రీరవంబులుమ్రోయ మంగళవాద్య విశేషంబులతో వందిమాగధులు
వందనంబులు జేయఁ గనకాసనాసీనుగావించిన శత్రుఘ్నుండు వసుధాధిప
త్యంబున మోదించుచు ప్రధానులకిట్లనియె॥ క॥ పదునేను దినములాయెను।

## శత్రుఘ్నుండు మధుపురంబుగయికొని సవనహయ సహితుండై యయోధ్యకు వచ్చుట.

మధుపట్టణంబునకువచ్చి మహిమోన్నతితోఁ। గదలవలెరేపయోధ్యకు।
సదయుని గోదండ రామచంద్రుని జూడన్॥ గీ॥ శౌర్యవంతుల గోటలద్వా
రములను। నిలుపుత తార్కిక్యచాతుర్య నిపుణులయిన। మంత్రులను గాపువెట్టు
డు మనము రాముసదనమునుజూడఁబోవలె సంభ్రమమున॥ గీ॥ కోటకోటకు
భూపాలకోటినిల్పు। సదనములయందు గోపురశాలలందు। నశ్వకుంజరశాలల
ననుదినంబు। బెట్టుబిగ్గమైన కాపు విశేషగరిమ॥ సీ॥ ఇంద్రుండు పుష్పకమె
క్కినట్లుగదోఁచె శరదంబులక్ష్మణానుజుఁడున్న। ధవళాతపత్రము ల్దరుచు
గాఁ గొందఱు పట్టి సేతేరగా భటకదంబ। ములు మోహరింపగా ముక్తా
లగొడుగులు తెల్లని శాంజీలు తేజమలర। నుభయదిక్కులనిల్చి యుభయ
చామరములు గూర్చి వేయఁగ మత్తకుంజగములు। తిరుగుచును రాగ సం
గ్రామధీరవరులు। తురగముల నెక్కి యురుగ నదొరసి రాఁగ। రథికవీరులు
వెంబడి రాఁగగార్య। జయమును జేడను గీర్తివిశాలుడగుచు॥ క॥ రపతిబు
హ్యశ్రీమములు। గిరిశరభ వరాహసింహ ఘీంకారము భీకరమయిన వన
తలంబుల। బరికించుచుగంగదాటి వచ్చెంబెలుచన్॥ సీ॥ గోపురప్రాకారకుట్టి
మనవరత్న భాసితంబగు సౌధభాగములును। మకరతోరణబద్ధమార్గదేశం
బులు। కలితహాటకరత్నకలశములును। మాణిక్యనిర్మిత మంటపాంగణము
లు వర్ణితవజ్రకవాటములును। బచ్చలగూర్చి హెచ్చగు రచ్చలు వరరత్న
సోపానవైభవములు। గనుగుసాకేత నగరంబుగనినుతించి। రాజమార్గంబు జే
రగా రాజవర్యు। లెదురుగా రాగ మేడల నెక్కి సతులు। సేసలను జల్లమొగసా
లజేరె విభుడు॥ గీ॥ తేరుదిగి భక్తితో మహాద్వారములను। గడచిముఖమం
టపంబులు విడిచిహేమ। మణిసమన్విత మాస్థానమంటపమున। గోటి
సంఖ్యలు నృపతులు గొలుచుచుండ॥ సీ॥ భరతలక్ష్మణ మంత్రివరులు

### శత్రుఘ్నుండు శ్రీరాముసందర్శించి తా బోయివచ్చిన తెఱంగెఱింగించుట.

సందర్శింప బంధువర్గంబులు బలసిగొల్వ। బంగాళ నేపాళ పాండ్య కుంక
ణమత్స్య దేశాధినాథులు తేజమంద। శాండిల్య దూర్వాస జమదగ్ని గా

లేమ మునిసార్వభౌములు వినుతిసేయ। వేత్రహస్తులుభయ వీధులేర్పడ బరాబరులుసేయఁగ నరవరులు చెలఁగ। హేమసింహాసనంబున రామవిభుడు। వెలయుచుండఁగ నవసరవిధములెఱిఁగి। మ్రొక్కి శత్రుఘ్నుడును మహాముదమొసంగ। భరత లక్ష్మణులకు మ్రొక్కి భక్తినిలచి॥ గీ॥ దనుజుబరిమార్చితెచ్చిన ధనముసవన। హయము మణులును నగ్గల యందలములు। గటకమకుటాంగదాదులు గరులుహరులు। కానుకీయంగ దమ్మునిగాఁగలించి॥ వ॥ యత్యంతసంతోషంబున రాఘవుండును ప్రియంబు లాడి మాయావి యగు లవణాసురునింబరిమార్చి సవనహయంబు తెచ్చిన కతంబున నశ్వమేధంబు నిర్విఘ్నంబుగా బరిసమాప్తి నొందు॥ గీ॥ అనిన శత్రుఘ్నుడును దేవ యవధరింపు। నేనునెంతటివాడను నీకటాక్ష। వీక్షణము చే దైతేయ వీరవరుల। సంహరించితి సాగరస్థలమునందు। సీ॥ సెలవుగైకొనిరాత్రి సంయమీశ్వరుడైన వాల్మీకియాశ్రమ వనము లదు। నిలిచి ప్రొద్దునలేచి బలముతో మధుదైత్యపట్టణకాసారభాగ సింధు। నడగియుండగ యజ్ఞహయముతో దైత్యులు కోట్లసంఖ్యలు వెంట గొలచిరాగ। జలపానమొనరించి జరుగగాసాగరంబు ముట్టడిగైకొని మోహరించి। హయము గయికొని దైత్యులనణచివైచి। కాననంబున నాహారకాంక్షదగిలి। వచ్చుచుండంగ లవణునిమదమడంచి। పురములోపలసామంతవరులనిలిపి। యే గిశీఘ్రంబ నీపాదయుగముగంటి॥ క॥ అనమోదమంది రాఘవ। జననాథుండశ్వమేధ సవనమొనర్పన్। మనమున గృతనిశ్చయుడై। ఘనసంతోషమునంభరతుంగనుగొనిపలికెన్॥ చ॥ హరకర చాపఖండన మహాగుణభూషణ

ఆశ్వాసాంతము.

వైరినాశభీ। కరమహనీయతేజ శుభకాంచనచేల దయాసముద్రసుం। దరదరహాసహాస్య గిరిధైర్యసమన్విత వేదవేద్య భూ। తరుణిసుతాసమేత నిజధర్మవిచారణ రామభూవరా॥ మత్తకోకిల॥ భానుసూతి విభాసితాకర భానుఖండన ఘోషభూ। మానవానవకాంచనాంబర మత్తదైత్యవినాశ శ్రీ। మానితామరరాజనిసుమానసాబ్జ విలోలసం। ధానదాన ధురీణ సద్గుణ ధర్మసత్యవివర్ధనా॥

గద్య॥ ఇది శ్రీమద్భ్రమరాంబికా నిజమనోల్లాస కరుణాకటాక్ష వీక్షణాలంకార సరస రసామృత కవిత్వ తత్త్వాతిశయానంద భరతసాంఖ్య తారకామనస్క శ్రీరాజయోగ సామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ఘట్టువంశ పయఃపారావార సుధాకర కాశ్యపగోత్ర కాత్యాయనసూత్ర శ్రీవేంకటార్య పుత్రలలిత పాండిత్య వేంకటరామకృష్ణ ప్రణీతంబయిన శ్రీపట్టాభిరామాయణంబను మహాకావ్యంబునందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ రస్తు.

# శ్రీ పట్టాభిరామాయణము

## చతుర్థాశ్వాసము

శ్రీజానకీమనోహర ! భూజనమందార త్రిదశ ముఖరవినుతభూ ।
రాజాధిరాజశేఖర । రాజీవదళాక్ష రామరామనరేంద్రా॥ వ॥ అవధరింపు
ము శ్రీరామభద్రుండు సంతుష్టాంతరంగుడయి భరతుని జూచి యిట్లనియె॥
గీ॥ సరయుతీరంబు సత్పుణ్యస్థలము గాన । నచట గట్టింపు యాగార్హమయి
నశాల । సకలవస్తువులందు విచారణంబు । గలిగి నిలిపింపు రాక్షసకపివరు
లను॥ గీ॥ తగగుహాలి నిల్పబంపుము ధరణిగల్గు। రాజవర్యులరమ్మని వ్రా
సిపంపు । బంధువుల నెల్లనొక్కమ్మ బంధురముగ । బుధజనంబుల బ్రార్థిం
పు పూజలకును॥ సీ॥ శాస్త్రరీతిగ యజ్ఞ శాలకట్టింపుము శాలకుంజుట్టు వి
శాలముగను । వీధు లేర్పడ సౌధ విమలగేహంబులు దానికి చుట్టును దంతి
తురగ । శాలలు నిర్మింపు సరణిగా యందన్నసత్రముల్ దశలక్ష సంఘటిం
పు। మునితల్లులకు రత్న భవనాంతరంబులు దీర్పుము నృపులకు దెందమువారి ।
వారలకు నిల్పు విడుదులు మంటపములు । విపణిమార్గంబులను మహావిభ
వము మర । సకలవస్తువిశేషము ల్సంగ్రహించి । నడుపుము నగను భరతుడా
నందమొంది॥ వ॥ సుబుద్ధియగు మంత్రివరుని జూచి యిట్లనియె॥ గీ॥ నీవు సు
గ్రీవవానర నికరములకు । జెప్పి హనుమంతు లంకకుం జేరబనిపి । యచటి
దనుజాధిపతిని వాయసురవరుల। బిలుచుకొని రమ్మపొమ్మని ప్రియము
తోడ॥ క॥ భరతుండతి వేగంబున । సరయూనది చెంత బహుళ శాస్త్రజ్ఞుల
చే । విరళముగ శాల యొక్కటి। పరిపూర్ణము సేయ నాజ్ఞ పల్కెగ నచటన్॥

### యజ్ఞశాలానిర్మాణము.

సీ॥ పంచయోజనముల పరవు తాశ్వాకృతి శాలదిక్కుల రెంటజాంద్రకాం
త। ములు పెక్కు సౌధముల్ మకరాలతళుకులజిగిగల్గు తలుపులు పగడములను। దీ
ర్చిన జోదెలు జేర్చిన ముత్యాల కుచ్చులు గట్టిన గృహవిశేష। ములు చుట్టు ప్రా
కారములు నాల్గు గోపుర ద్వారము ల్పదునారు తగిన కోట్ట । ములు రుజాకక్షన
ములు రెండుమూడు వేలు। సకలవస్తువిశేషసంగ్రహము గలిగి। మోదితంబైన
యుగాంబరములును విపుల్ల । తురగగజరథశాలలు మెఱయగాను॥ గీ॥ భక్ష్య
భోజ్యంబులును మంచిపాయసాన్న । ములు నమృతసూపశాకముల్ మధుర
ములు । పెరుగు దగు నూరగాయలు జేర్చి నన్న। సత్రములు పెట్టె భర

తుడాస్థానమునను॥ గీ॥ సకలజనులకు వేర్వేర సత్రములను । బెట్టఁగాఁజే
సి నవధాన్య విధముగొలది । పర్వతాకారములుగూర్చి బహుపదార్థ ।
సంగ్రహముచేసె హయమేధసవనమునకు॥ క॥ శతసంఖ్య మేరునగములు ।
నతిశయముగఁగూర్చినింత హాటకమూనె। రతినాథువైరి పర్వత । శతమై
నను సిత వెండి సతుకూరునోకో॥ చ॥ ఘనినుతికెక్కఁజేసి తగు నార్యుల
సుందర బిల్వనంపిరియా । ఘనసవనార్హ వేదికల సంయుతమై విలసిల్లు యూ
ప మిం । పెనసిన హోమకుండములు నేర్పగ కాంచన రత్నపాత్రిలున్ ।
దినదినవృద్ధిచేసి పరదేశ నివాసుల నాదరించుచున్॥ సీ॥ హనుమదంగద
నీల కుముదార్కనందన పవన కేసరికపి ప్రభులకెల్ల । సకలరత్నప్రభా
సదనముల్ నిర్మించి యసురారికతికిని నతులదివ్య । భవనముల్గావించి
వర్ణశాలలమర్చి చలువచప్పరములు చాలచుట్టు। వేయించి వీథులు వేడు
కగావించి నిలిపిర ప్రభాస్తంభ నికరములును । మార్గములయందు సత్రము
ల్మంటపములు పూలపందిళ్లు భోజనశాలలు మఱి। నచటబానీయ శాలలు
నలరఁగట్టి । ధరణినాయకనిలయము లొనరజేసి॥ ఉ। కట్టిరితోరణంబులను
గట్టిగ నాహయమేధశాలకుం । జుట్టిరి హేమవర్ణనవ చూతదళంబులు
రంగవల్లిక । లెట్టిరి యూపవేదికల మీదను శోభిరి హేమకుంభముల్ ।
పట్టిరియామహాధ్వరము బాహుపరాక్రమ వర్ణనీయులై॥ గీ॥ దేశదేశాధి
రాజులు దేజరిల్లి । మత్తమాతంగ హయరథ భటులుగొల్వ। సతిసుతాప్త
లతోమహా సవనమునకు। వచ్చుచుండిరి పర్వమార్గములనుండి॥

సకలదేశస్థులును యజ్ఞశాల కరుదెంచుట.

సీ॥ పర్వతోన్నతములౌ భద్రేభములనెక్కి కొందరు నృపతులు
గూడిరాగ। హాటకాంచితరత్న యాందోళికాదులనెక్కి మహీధవులెదురు
కొనగ । రత్ననిర్మితమహా రథసమూహంబుతో వసుధాధిపతులెల్ల
వచ్చుచుండ । ననిలవేగములైన హరులపైగూర్చుండి మేదినీనాథులు వెడ
లుచుండ। సదనములనిల్పువారలు చలువచప్ప । రములదిరుగాడు వార
లు ।వాసియున్న । చిత్రములు గాంచువారలు క్షేమలాభ । ములునునె
ఱిగెడివారలు ముదముగలిగి॥ చ॥ తెరువులవచ్చువారు నరుదెంచి వినోద
మునఁజూచువారు గో । పురములనెక్కువారు నవభూరుహ నీడలఁజేరువా
రు సుం। దరులనుజీరువారలిదె తావురమ్మని చెప్పువారు నం । బర
ములుపొందువారు బుధవర్గముఁబూజలుసేయు వారలన్॥ గీ॥ గొప్పకు
ల్లాయలు మకరకుండలములు । జింకచర్మంబులును వెటకిన్యగణము ।
సతిసుతాఘులు నిరుగడ సందడింప । యాజకులపిండువచ్చెను తేజమలర॥
క॥ అవధాననామధేయులు । సవనార్హుల చాంఛలీలు జటపండితులుం ।

గవినటగాయకజనములు। సవరణతో వచ్చియజ్ఞశాలలునిండెన్॥ సీ॥ పప్పు
దప్పళములు దొప్పలతో నెయ్యి। కలమాన్నములు మోదుకములుగలు
గు। నతిమనోహరమైనయతిరసంబులు పక్వఫలములు సుంద్రముల్పాన
కములు। వడలిడ్డెనలుమంచి పచ్చళ్ళుశిఖరులు నప్పళంబులు మనోహర
ములు మఱి। పిండివంటలు దీయపెరుగూరుగాయలు సఫలంబులగు మన
సదనమట్ల। యనుచు దోవలబలుకుచు నచటిమార్గ। నతరిములభోజ
నంబులు సలుపుకొనుచు। బుత్రదారాదిసహితులై పొగడుకొనుచు। విప్ర
సంఘంబు లేతేరెవిధులందు॥ సీ॥ అవునటే యేసత్రిమందుండెక్కడగనుండు
పుత్రులున్నారటే పుస్తకములు। తెచ్చియున్నారటే దీనాతితలును
పనయుచున్నారటే భక్ష్యభోజ్య। సూపములగలవటే గోందొరికెనదటే.
యతిరస్నానంబులు సధికమటవె। కలమాన్నములు మోదకంబులుంబ
ట్టెదరటే పప్పుదప్పళములు నొప్పునటవె। అష్టయిష్టునేలగోతొమ్మిద వ
న్నసత్రి। ములకు పోయినమేలటే ముదముతోడ వ। నధికవైదికజనము
లు నపుడెయజ్ఞ। శాలమట్టుక నిండిరి జనములకని॥ ఉ॥ ఏపుణ్యంబులు
చేసిపుట్టితిమి మేమీపొత్తుశ్రీరాము। సదానందముం బొందగల్గె మన
కున్ రూఢింద్రభోగంబులుం। బొందంబుద్దలగెన్ సుఖంబుగలిగెం బ్రత్యక్ష
మైనాఁడు శ్రీభూపాలాన్వయుఁడై జగద్గురువునై భోగీంద్రుఁడై చంద్రు
డై॥ శా॥ నానాదేశ నివాసభూసురవరుల్నానావనీ నాథులున్। నానార
ణ్యములందునున్న మునులున్ నానాపురాధీశులున్। నానాయాచకబృం
దపావనయతుల్నానా వేదపారీణులున్। నానాశాస్త్రవివేకలక్షణముఖుల్
నానాపురాణాధిపుల్॥ సీ॥ తమసానదీతీర మమరినమానులు భాగీరథీతటీ
వాసమునులు। వేత్రవతీతీర వేదాంతవేద్యులు గోదావరీపుణ్యకోటిమును
లు। గోమతీ నదులను గూడినయోగులు మణికర్ణికావాసమహాఋషులు
ను। ఇంద్రసరస్వతీ సంచారులును మఱి పంపాసరోవర భాగయతులు।
వచ్చితమపర్ణశాలల వనములందుఁ। జేరశ్రీరామ దర్శన చిత్తులగుచు।
విప్రసృత వైశ్యజనములు వివిధనృత్య।గీతవాద్యవిశేషులు ప్రీతిఁజెంద॥ చ॥
పిలుచుకవచ్చికొందరికి విందులుపెట్టెడివారుసాధుసీ। మలనిలిపేటివారుప
నవాసులకిష్టములైనవస్తువుల్। ఫలములునిచ్చువారు బుధవర్యులఁబ్రీతిగ
గారవించిపూ। జలుసలిపేటివారు ఫలసారములిచ్చెడివారునచ్చటన్॥ గీ॥
పాయసాపూప కలమాన్నభక్ష్యభోజ్య। శాకములఁదృప్తిబొందించిచంద
నంబు। కుసుమ తాంబూలములు బుధకోటికెల్ల। సంభ్రమముసేయువా
రలు శాలలందు॥ క॥ సురటీలునట్టెవిసరెడి। వరిజనములు సభలకపుడుపా
వకములచేధరియించి యొసఁగువారలు। మరియాదలుదెలిసి పిలుచువచ్చెడి

వారల్॥ సీ॥ ఋషితతుల్విభజించి ఋగ్వేదజటలునుజెప్పెడి వారలప్పురు
వుగాఁగ । విశదసంగతియజుర్వేదంబుచదివెడి వారునుహయమేధమంటప
మున । జారుతరంబుగా సామగానంబులు సల్పువారలు సత్రిశాలయందు।
నెరవేర్చి శాస్త్రార్థనిర్ణయంబులెఱింగి పలుకువారలు శాస్త్రవాదములును।
సేయువారలు నొకకొంతసేపు తంత్రి। మలరబన్నెడివారలు మధ్యమందు।
వేదికలుదీర్చువారలు విశదముగను। సకలభూషణతేజులైజనములెల్ల॥ సీ॥
ఒకచోటవేదాంత సకలప్రసంగంబు లొకయెడ వల్లకీ వాద్యములును।
నొకసీమసాహిత్యవర్ణనీయంబులు నొకచెంత నటవిట వైభవములు। నొక
దెస చౌపష్ఠి పదపద్యగద్యాలు నొకమూలసంగీత మధురములును । నొక
సందు బహువిధ వర్ణనీయంబులు నొకభూమి సత్కథలొక్కదెసను। బహు
జనావళి నటనముల్బహుళవాద్య । భేదములుగల్గి శాలకు వెనుకముందు ।
ప్రజలు సాగరములరీతిబ్రబలిపార। హృదయమైయొప్పె నిర్జరవేశ్యమగుచు॥

ఋషి సమాగమనము.

వ॥ ఇట్లొప్పియున్న సమయంబున శిష్యప్రశిష్యసమేతులయి వసిష్ఠ
వామదేవ కశ్యపాగస్త్య పులహ పులస్త్య విశ్వామిత్ర రుచికాగ్నిమిత్ర
మైత్రేయ భరద్వాజ వాలఖిల్య మౌద్గల్య మాండవ్యవిభాండక మార్కం
డేయ కౌండిన్యకణ్వభృగు చ్యవనపరాశరాత్రేయ కాత్యాయనగౌతమ
శ్వేత శాతాతప వరతంతు ఋష్యశృంగ మతంగ మంకణాంగీరస శతా
నంద మందపాల మహామునులు దండాజినకమండలు జటావల్కలధారు
లయి చనుదేరంజూచి తద్ద్వారపాలకులతి త్వరితంబునఁజని రఘువంశప
యఃపారావార సుధాకరుండగు శ్రీరామభద్రుని సన్నిధింజేరి మ్రొక్కి
యంజలీబద్ధహస్తులై దేవాయిప్పుడు శరభసింహమదేభ ఘోరభయంకర
గోదావరీతీర బదరికారణ్య దండకారణ్యవాసులగు మహర్షులుచనుదెంచి
రని విన్నవించినవిని జానకీరమణుండు సింహాసనంబు డిగ్గియుభయపార్శ్వం
బులు భరతలక్ష్మణ శత్రుఘ్నులు చనుదేరం గిరీటహారాంగద భూషణాది
విరాజితుండయి యెదురుగావచ్చి యర్ఘ్యపాద్యంబులం బూజించి విన
యోచిత సంభాషణంబు లాచరించుచుం దోడ్కొనివచ్చి కక్ష్యాంతరం
బులుదాటి రత్ననిర్మిత విద్రుమస్తంభాలంకృత మహామంటపంబుం బ్రవే
శించి యుచితాసనంబులం గూర్చుండంబెట్టి లోకనాయకుండగు కౌసల్యా
నందనుండిట్లనియె॥ ఉ॥ మీరు మహాతపోనిధులు మీమహిమాధులనెంచ
శక్యమే। ధారుణినీమహాక్రతువిధానములెట్టివి నిత్యకృత్యముల్। చారములే
క్రియంజరుగుఁ జక్కఁగవిఘ్నములేక భూమిపై। గారణమెట్టు లేర్పరుపఁగా
వలెనావిని సమ్మదంబునన్॥ క॥ మునులిట్లనిరి మహాత్మా। జననాథుండగు

టగాదు సాక్షాద్వి । ష్ణుండనుమాన పడకుమీ నీ మనసువిధ బవును దివ్య మంగళదేహ॥ సీ॥ శివుని కోదండంబుఁజెండాడి వసుధపై బేరుగైకొను మహావీరుడెవఁడు। ఖరదూషణాది రాక్షసనాశనము చేసి శోభిల్లుచుండెడి శూరుఁడెవఁడు । వాలిని నొకకోల వధియించి సుగ్రీవు పట్టంబుగట్టిన ప్రభు డెవండు । దక్షిణాంబుధి గట్టి దళసమేతంబుగా రాక్షసుఁ ద్రుంచిన రాజె వండు। గలడొ యతనికెవ్వ మేఘంబు గనకఁ జేయు। విష్ణు మెవ్వాడొనర్చును విశ్వకుననను । రమ్యగుణపాత్రి దశరథరాజపుత్రి। రాజ దేవేంద్రి పట్టాభి రామచంద్రి॥

## కనక సీతానిర్మాణము.

క॥ క్రతువిధము చిత్తగింపుడు । సతిహీనుఁ డొనర్పఁదగదు సర్వాత్మకస । ద్గతులకుఁ గారణభూతులు । సతులగుటను సకలధర్మ సంగతిగలుగుఁక్॥ గీ॥ అగ్నిహోత్రాది కార్యములతిథి పిత్రు। తర్పణంబులు దేవతాతర్పణములు । భాగ్యసంపత్తి సకలసౌభాగ్యములును। సతివల్లనె యొనఁగూడునవనినాధ॥ క॥ శ్రుతులిటుల జెప్పుచున్నవి । మతినిశ్చయమేమొ యది యెమార్గమురీతిం। గ్రతువును నెర వేర్చెదమని। యతులా ఘఁగఁ గొంతకాల మాలోచనతోఁ॥ వ॥ తనమనంబునం గృతనిశ్చయుండయి రామచంద్రుండు మునులకిట్లనియె॥ చ॥ జనకజ యున్న చందమున జంద్రిసభాననకర్ణబాహులో। చన పదనాసహాసకటి జానుకరంబులు కంధరంబుచుఁక్ । ఘనము గదీర్చి యాహవనకాలము దగ్గరనిల్పి యజ్ఞమున్ । గొనజగిగింతమన్న ముని కోట్లు మహాద్భుతమంది మెచ్చుచుఁక్॥ క॥ భరతాదులు చింతిల్లుచు । ధరణీజరూపంబు దీర్పఁ దరమా నేయూ। పగ మేష్టికైఁ జెల్లును । కరుణింపక పోదు సవనకాలమునందుఁక్॥ సీ॥ శ్రీరఘుత్తముఁడు చను శిల్పులఁ బిలిపించి కనకసీతా నామకంబు కంఠి। ధమ్మిల్లమునకును దగు నింద్రనీలము ల్గూర్చి వజ్రంబులు గోళ్ళయందుఁ। బొందించి పాపట బొట్టిరుగడలను జంద్రసూర్యులనిల్పి జాతి రత్న। హారంబులును వైచి హస్తకడెంబులు గనకనిర్మిత రత్నకంకణములు। పట్టు పెతాణిచేలంబు గట్టి జిలుగు । రవికె ధరియించి కెంపులు రవలు మెఱయ। జారుశృంగారమమరఁగా సవనమంట । పమున నిల్పిరి సకలభూపతులు చూడ॥ వ॥ అట్టియెడ సుబుద్ధియను మంత్రిపుంగవుండు లక్ష్మీప్రసన్నంబగు కిష్కింధాపురంబు జొచ్చిన సుగ్రీవుండు తద్వృత్తమానంబు దెలిసి యెదురేగి తోడ్కొనివచ్చి యుచితాసనంబునం గూర్చుండనియోగించి సేమం బడిగి వచ్చినవారికందరికి రససంపన్నంబైన యన్నంబు బెట్టించి గంధకుసుమతాంబూల వస్త్రాభరణములొసంగిన సుబుద్ధియు సంతసిల్లి సాకేతపురాధీశుండగు శ్రీరామభద్రుని హయమేధ ప్రయత్నంబు దెలియంబడం దె

ల్చిన రామాజ్ఞప్రకారంబున సుగ్రీవుండు సమీరనందనుంబిలిచి లంకాపు రిజొచ్చి విభీషణాది రాక్షసులందోడ్కొని రమ్మనిపంచిన నమ్మదంబుదా టిహనుమంతుండు విభీషణునింగాంచి యచటివృత్తమానంబుదెల్పినసంతో షచిత్తుండై స్వర్ణంబపరిమితంబుగాఁగైకొని రథారూఢుండై ఘోరాసురు లుపరివేష్టింప గిష్కింధాపురంబుజేరి యారాత్రినిలిచి మరునాడరుణోద యంబున హనుమదంగద పనసకుముద శతబలిసుగ్రీవవిషణాంగద సహి తుండైద్రోణాచలవింధ్యాచలసీలాచల నీలాచలోదయాచలహస్తాచల శం ఖాచలఋషభాచల హేమచలాదిమహాకపులును నిజసైన్యసమేతులై నఖ వక్త్ర వాల దంతనాస భయంకరులగుచు గ్రిక్కిరిసి నేడు రఘువంశవర్ధ నుండు చేయు హయమేథయాగంబున ఘోరయుద్ధంబగునను వారును యు ద్ధంబుచేయు వీరుండెవ్వండనువారును వీరులెవ్వరుండినగాని సమరంబునకు వత్తురాయను వారును సీతామహాదేవి సద్గుణ ధర్మంబులెరింగి యుండిరా ముడు కాననంబునఁద్రోయవచ్చునా యనువారును మహాలక్ష్మి స్వరూ పియగు సీతా కారుణ్యంబు లేనిచోట యజ్ఞంబు నిర్విఘ్నంబుగ సాగునా యను వారును నిటులనేక విధంబులం బలుకుచుఁ బట్టణ పర్వత వననదీ దేశంబులుదాటి యయోధ్యాపుర రాజమార్గంబుఁ బ్రవేశించి యప్పట్ట ణంబు చుట్టును శతయోజన విస్తీర్ణంబుగా దండునిలిపి సుగ్రీవ విభీషణాం గద నలనీల గజగంధమాదన జాంబవత్ప్రముఖులు ముకుళిత కరకమలు లై గోపురద్వార తోరణంబులు గడచి భయభక్తులతో నాస్థానమంటపం బునకరిగి నిండినిబిడీకృతంబై మహారాజ సామ్రాజ్య సింహాసనాధీశుం డగు శ్రీరామ భద్రునిం గనుంగొని హర్షాశ్రులుజార సాష్టాంగ దండప్ర ణామంబుగావించి యనేక దివ్యరత్న రాసులునించి సవినయ రాజునాలిం గనంబు గావించుకొని కుశలంబడిగి సమీపంబుననున్న హేమాసనంబు నం గూర్చుండ నియోగించి యిట్లనియె॥ చ॥ నుతులు సమృద్ధి నొందుదు రెసోదర బంధువులెల్లసేమమే। సతులు సమస్తభోగములు సౌఖ్యము లొందునె సత్యగీర్తిసం। గతులు సుబుద్ధినొందుదురె కాంచనకాంక్షలు లేక భూపప్రజల్। హితులుబురోహితు ల్సుజనులెల్లరు దృప్తివహింతు రేప్రియా॥

## రామచంద్రుండు యజ్ఞశాల కరుగుట.

ఉ॥ దీనుల బ్రోచు చుందురె దేశములన్ని ఫలించుచుండునే। వా నలు గల్గునే జనులబాధలడంగునె పుణ్యమబ్బునే। మానులు నిత్యకృత్య ముల మోదము నొందుచు నున్నవారెమీ। కానల భూరుహంబులును గోరిన వెల్లఫలించు చుండునే॥ క॥ నేనిచట నశ్వమేధము। పూనితినడిపిం

పగానభోలగ మీామీా । సీవలతో రప్పించితి । మాసములుజాల మో
దమహిమల నొందక॥ మ॥ అన సుగ్రీవ విభీషణాదులు మహోయానందసం
న్మూర్తులై । కనితాంబులు పులకరింప నపుడే కాకుత్థ్సవంశేస్థునిన్ వి
నుతుల్సేయుచు నిత్యమంగళ మహావేదాంత వేద్యాధిశా । వనజాతోద్భ
వుడాదిగా సురలు నిన్వర్ణింపగా శక్తులే॥ సీ॥ పదపద్మములుసోక పాషాణ
దోషంబు వాసి రతితుల్య భామయయ్యె । సమరోగ్రములు జూపజాలక
మారీచు డేకతంబున నొకవత్తియయ్యె । బాహువిక్రమ ధనుర్బాణంబు
లనుజూచి పరశురాముడు వనవాసియయ్యె । నట్టహాసస్ఫూర్తి యణగి
యాజలరాశి బిందుప్రై జలమందు బొందనయ్యె । నీవు జేసిన కార్యము ల్వి
ర్ణయింప । బ్రహ్మకైనను దరమానె ప్రబలదనుజ । మర్దనుండవునీదయా
మహిమచేత । సంతతానందులైతిమి జగతియందు॥ క॥ కొట్టితివి
దనుజులనుజే । కట్టితివిపర భోగరాజ్య పట్టమువార్ధిం । గట్టితివి రఘుకులం
బునం । బుట్టితి విందార్కు లెఱుగ భూజననాథా॥ క॥ అని పలుకుచున్న
యత్తరి । మునిజనములువచ్చి లగ్నమును బొందెనునీ । దినమునను యజ్ఞ
శాలకుం । జనుమని దెలుపంగ రామచంద్రుడు వేడ్క॥ క॥ నవవిధధీ
తులునైకొని । నవరణతో బుష్పకమును సారథినిలుపక్। భువిజనములెను
రు చూడంగ । నవనీధవుడపుడు దనశతాంగము నెక్కె॥ క॥ లక్ష్మణ శ
త్రుఘ్నులు శుభ । లక్షణమమరంగ జాపబాణాయుధులై । రతునువివె
నుక నిలువంగ । దక్షత్వముకలిగి సూర్యతనయుడు వేడ్క॥ సీ॥ జాంబ
వంతుడు మారుత్సంభవుడుసుసీల గజగంధమాదన ఘనులుతమ్ము ।
వానరులును నిరుభాగంబులను గొల్వ వినత కుముదముఖు ల్వెంబ
డింప । రాక్షసావలితోడ రాక్షసాధీశుండు ముందుగానడువ సమూ
హజనులు । పరువెత్తి సాకేత పట్టణ సైన్యంబు దిశలునిండుచురాగ దిగి
భనదృశ । కుంజరంబులు రథములు ఘోటకములు । నాతపత్రధ్వజం
బులు నఖిలరాజ । వరులు సామంతులును జుట్టుబలసిరాంగ । రాజదేవేం
ద్రుడైవచ్చె రాఘవుండు॥ క॥ తల్లులు రత్నమయంబగు । పల్లకులను నె
క్కిరాగ బంధులు గొలువం । దెల్లని గొడుగులు పట్టంగ । వెల్లువలై సై
న్యమెల్ల వెడలెను వేడ్క॥ సీ॥ జయజయ రఘువంశజలధి రాకాచంద్ర
జయజయాగాధేయ సవనరక్ష । జయజయ భూతేశ చాపఖండన ధరాపు
త్రీ మనోహర పూజితాంగ । జయ జయ సుగ్రీవ సామ్రాజ్యదాయక జ
యజయరాక్షస సంఘభీమ । జయజయ రావణసంహార కారణ జయజ
యకీర్తి విశాలశీల । యనుచునుతియింప భేరులు నేకసమున । చేటుల
గతిమ్రోయదిక్కులు సందడిలగ। రామచంద్రుండు బహుజన రంజితంబు।

గలుగ హాయ మేదశాలకు గదలివచ్చె॥ గీ॥ శాలలోపలఁ గూర్చున్న సకలమునులు। శ్రౌతవిధములు గావించి చదువ వేద। శాస్త్రములు చెప్పువారలు సవనహోమ। విధులు నియమించువారలు విభవముగను॥ వ॥ ఇవ్విధంబున వంతర్వేదిప్రముఖంబులైన వేదికలయందు గార్హపత్యాద్యగ్నుల యత్తను చిత్‌స్థానంబులం బ్రతిష్ఠించి హోత్రోద్గాతృత్వనియమిత వసిష్ఠ వామదేవ జాబాలివిశ్వామిత్రాత్రిభరద్వాజ గౌతమబోదాయన కణ్వకాత్యాయ నాపస్తంబ శతాన దప్రముఖమహర్షి శ్రౌతవిధి సమారంభసమయాదార్యమాణ మంత్రస దోహ సంజాత ధ్వనితరంగిత స్వాహాకారఘోషణాదిశబ్దబృంహితదీక్షారక్షధురీణ పురాణపారీణవాణీరమాయిత రామాభిధాననారాయణసంపూజిత సవనవిభజ్యమాన విలక్షిత తరంగపుంగవగతినిరోధిప్రతిపక్ష క్షేపణాధ్యక్ష స్వపక్షసమక్షపాన్నపతీకృతభీషణ తనూభవవిసత్రాణ సంభూత స్వయంభుజృంభారంభజాంభవముడ నీలమైందద్వివిదపనసకేసరి శరభగంధమాదన గవయగవాక్ష దధిముఖానేక పరివృతుండై హేమసీతాసమేతుండగుచు రఘుకులాచార్యుండగు వసిష్ఠానుమతంబున శ్రీరామభద్రుండు॥ గీ॥ సవనహయమును బూజించిజనవరేణ్య। వరుఁడు సుగ్రీవలక్ష్మణ భరత పవన। పుత్రులనుజూచియజ్ఞముభూరిమహిమ। కరులనుతియింపగా మీరుకనులవలయు॥ సీ॥ అఖిల మానవులకు నన్నంబు బహువిధ శాక భక్ష్యవిచార సరణులందు। సౌమిత్రితాంబూలచందన కుసుమాది వస్తువులంకుసు భానుసుతుడు। కోడు వలైనదివేగ గొనితెచ్చుటకు వాయుపుత్రుండు నవరత్నభూషణములు। వస్త్రంబులను జవస్యులకును నీగ హనుమ వెంట శత్రుఘ్నుడని వసిష్ఠ। వామదేవులు విచరామభద్రుకనిమె। దేశదేశంబులను వచ్చెంచు రాజ। వరులకును రత్నభూషణ వస్త్రములను। సదనములనిచ్చిమర్యాదసరణి లెరిగి। పాలనము చేయుటందుకు భరతుఁడనుచు॥ వ॥ ఇవ్విధంబున సకలకార్యంబులందు నిర్ణయంబు లేర్పఱచి బద్ధకంకణుండై కృష్ణాజినంబు ధరియించి హయముబూజించి బిరుదాక్షరంబులు లిఖియించిన కనకపట్టంబు గైకొని॥ క॥ వీనిడు కౌసల్యాది కు। మారుడురఘువరుడు దేవమాహాత్మ్యం డీభూ। భారముకొఱకు హయమును। ధారుణిపై విడిచెఁ బట్టదరమా జగతిన్॥ ఉ॥ భానుకులుండు రామనరపాలుడుపంపు హయంబు నెచ్చటన్। మానవులైనగాని సురమాన్యులు నైననుగాని రాజులే। గానితలంచిపట్టుదని కాంచనపట్టమువ్రాసి కట్టి శ్రీ। మానిత లక్ష్మణానుజుడు వచ్చెను తేజికి రక్షణార్థమై॥

## మఖాశ్వంబువెంట శత్రుఘ్నుం డరుగుట.

గీ॥ కనకపట్టంబు హయరత్నమునకుగట్టి। భూరిభేరీరవంబులు భోరు
కొనగ। వందిజనములు నెల్లగై వాడ మొనగ। కుసుమవర్షంబులునుదివిగురి
యువిడిచి॥ సీ॥ మ్రొక్కి నిలుచున్న శత్రుఘ్ను మోముజూచి। రాఘవుడు
పల్కె నీహయరత్నమెవరు। పట్టికట్టిన రణమునగొట్టి సకల। దేశములు
దిప్పిరమ్మని తెలిపెనపుడు॥ సీ॥ చతురంగబలములు సాంద్రమైహయరథ
సామజంబులనెక్కి చాపబాణ। ఖడ్గాయుధంబులు కరములధరియించి
సాకేతసైన్యము లరుగగాను। నడువగాశత్రుఘ్ను సరనాయకుండును
రథమెక్కి వెనుకనురాంగశంఖ। రవములుచెలగగా రాజాధిరాజులువీరా
ట్టహాసులై వెడలగాను। బట్టణంబులు వనములు పర్వతములు। గడచి
యుత్తరభూములు గనుచుం దూర్పు। దక్షిణంబును బశ్చిమతలములెల్ల।
దాటుచుండెను నాసప్తతంతుహయము॥ క॥ తురగము వెంబడి నుత్తమ।
ధరణీసురవరులు సవ ధర్మముకొలదిన్। తెరువుల హోమమొనర్పగం।
బరతెంచె సహస్రసంఖ్య పరమప్రీతిన్॥ క॥ తురగముతిరుగంగ నెడ
నెడ। ధరణీసురవరులు సవనధర్మముకొలదిన్। చరణాంచితముల హో
మము। నెరవేర్పంగ సైన్యమొదిగి నిబిడంబగుచున్॥ సీ॥ అంగవంగ కళిం
గయవనదేశాధీశ వరులెల్ల హయమును వచ్చిచూచి। రాక్షసాంతకుడైన
రఘురామభద్రుడు పంపు నీహయమును బట్టవశమె। యనిపోవురాఘ
వునను జూనిగొనివచ్చి భక్తితోంగాంచన వస్త్రరత్న। మండనంబులొసంగి
మర్యాదలాచరించి పూజించినంతనే భూవిభుడును। బట్టనేరకయుండిన
పవనజవన। వేగమునవచ్చి వాల్మీకి వెలయు ఘోర। కాననాంతరమునం
దిరుగాడుచున్నంజూచితలయూచి వైదేహి సుతుడుపల్కె॥ ఉ॥ ఆటలు
పాడనేటికిదో। యద్భుతమొప్పంగగానసంబులో। ఘోటక మొక్కటుంది

## జానకీపుత్త్రుండగు లవుండు సవనహయంబు బట్టుట.

పదికోట్లవరాలును జేయు సందనం। దీటుగ నాహయంబు గొనితెచ్చిత
పోవనమందు గట్టెదన్॥ వ॥ అని త్వరితగతింజని హయంబునకడ్డమై బట్టు
కొని కనకపటంబున వ్రాసియున్న బిరుదాక్షర పద్యంబునుం జదివిమహా
రోషంబున నేత్రారుణవిస్ఫులింగంబులుచెదర ఘోటకంబునుంగొనితెచ్చి
కదళికాస్తంభంబున గట్టిన నచ్చటిమునిసుతులు భయాత్ములై యిట్లనిరి॥
చ॥ మఱికిదిదక్కునా లవకుమారక యొంటిగనేలవచ్చునే। జనపతిపంపి
నాడొ బలసైన్యము వచ్చియునిన్నుముట్టినీ। సునవపుడేమిచేయుదువృశూల
గదాయుధఖడ్గధారులై, కనలిననెట్టులౌను జనకాత్మజయేమని చింతనొందు
నో॥ సీ॥ స్నానసంధ్యాహోమజపతపంబులు విప్రపుంగవులకు మహాభూష

ణంబు। కఠినరాజన్యసంగ్రామధీరోద్ధార నైపుణ్యములు నరనాథులకును। గృ
షియు గోరక్షణాంకుర ధర్మవృత్తులు నూరుజులకు స్వకులోచితంబు। సేవాధి
కార విశేషధర్మంబులు శూద్రజనులకును విశుద్ధగుణము। గాని నిగమాధి
కార సత్కర్మహోమ। జపతపంబులు విడనాడి సమరమునకుఁ। గారణం
బైన హయరత్న కాంతమదిని। లక్ష్యమెంచుటకొఱగాదు లవకుమార॥
ఉ॥ బాలుఁడవీవు మూఁడ రణబాహుపరాక్రమశక్తి లేదు భూ। పాలక యో
గ్యమౌ హయముఁ బట్టిన క్రోధముతోడ సేయ। భీలముగాఁగ వచ్చిన ను
భీతివహిల్లుగాని శత్రులం। దోలఁగనౌనె యిన్నియును దోచవె పోవిప
రీత వంతముల్॥ క॥ అననవ్వి లవకుమారుఁడు। మునినందనులార సమర
మోదము గాదే। మును జేసు హోమము గానీ| వనజాక్షుని దంతిగాని పట్టక
విడవన్॥ క॥ వీరుఁడు కౌసల్యాసుత। ధీరుడు రఘువరుఁడు పంపు తీవ్రహ
యంబున్। శూరులు పట్టుఁ గెట్టుచును। వారావయొ సంగి ఫలలపట్టము
గట్టెన్॥ క॥ ధీరతయా కౌసల్యా। నారీమణి కంటె జనకనందనకిపుడున్।
ఏరీతి లేదొ చూచెద। బోరుదు నిందాద్రదులైనఁ బూనిక హయమున్॥ గీ॥ త
ల్లి గర్భంబునను బుట్టు తనయవరులు। క్షత్రధర్మంబు విడనాడి సమరకేళి।
దేలిలోలాడకుండిన దేహమేల। చెలిమి వాల్మీకి విలువిద్య చేతి నేర్పు॥
వ॥ అని పలుకుచున్న సైన్యాధిపతులు హయంబు పోయిన మార్గంబు
పట్టి॥ గీ॥ వచ్చిపట్టిన సీతాభవాని సుతునిఁ। జూచి హయరక్షకులు నేమి
చూడలేక। కట్టితివి బ్రాహ్మణుఁడవు గానఁ దప్పు। విడువు పోవలె నిదియొం
తవింతవత్స ఉ॥ బాలుఁడవీవు నేర్పుతడబాటు తలంపక రావణాంతకా।
భీలమహాపరాక్రముఁడు వీరుఁడు పంపు హయంబు సాధ్యమే। చాలును
గాని మానిసుత జన్నము చూతువుగాని రమ్ము భూ। పాలుడ గావు వైరము
లు పట్టగ విప్రుని కేలయుద్ధముల్॥ మ॥ పరమాన్నంబు ఘృతంబు భక్ష్యఫల
సూపవ్రాతముల్ కాంచనా। భరణానేకము నొప్పు చేలములు సంపాదించు
కోవచ్చు భూ। నరుడౌ రాముని సప్తసంతువిదియౌ భావించి నీయాత్మలో।
బురమధ్యంబున కేగుమీ సమరసంభూతావేశ మింకేటికిన్॥ క॥ సమర
ము నృపతికి లక్షణ। మామరను విప్రులకుఁ దశము పావనంబులు నే। మము
లనుగాఁ దలపోయుము। సమకక్షి విగావు పోరఁ జరుగుము వత్సా॥ వ॥ అని
రోజుచు రోషభీషణానల తేజులై హయగజరథారూఢులై పరశుపట్టిస
ప్రాసకరవాల తోమర గదా కుంత శరశరాసనాద్యాయుధ ధరకరులై నిలు
వంబడి వలయాకారంబులు బైదళంబులు మోహరించుచుం బౌరుషోక్తు
లు పలుకుచున్న లవకుమారుండిట్లనియె॥ క॥ పట్టిన హయమును మిన్నక।
కట్టితినని చెప్పఁబోవఁ గడు హీనుడనై। పొట్టకునన్నము గోరను। బుట్టిన

విక్రమము తోలగబుచ్చుటతగవే॥ క॥ ధైర్యస్థైర్యము లోకనిధీ। కార్యం
బులుదెలియ సేయఁగానగు మీమీ। శౌర్యము జూపక హయమును।
నార్యులు మెచ్చంగ విడువనని యాతండున్॥ గీ॥ కంకణంబును ధరియించి
కార్ముకంబు। వెనుక శరములు సంధించి భీషణముగ। వినదములు జేసి మ
దిలోన నిజముగలిగి। రవికులుండును శరములు రాల్పఁజూచి। ఉ॥ బాలుఁడు
గాఁడు వీఁడు నరపాలక విక్రమలక్షణంబులున్। జాలగ నుండె విప్రకులజాతు
నిపోలిక నున్నవాఁడు। శ్రీరాముఁడు వీని చేఁ బెరసఁ జేయుట యుద్ధనీతి గాదు
దే। కాలనృపాలకోటి సురసైన్యములైన నుఁ బాఱనేర్చునే। వ॥ అనునాస
మయంబున॥ క॥ చిరుతఁడు కోదండమునేన। కరమునధరియించి మత్తగజ
ములమీఁదన్। హరివచ్చినచందంబున। బరతెంచెను నాయుధములు
పట్టుచుగడిమిన్॥ వ॥ ఇవ్విధంబున సైన్యంబులఁగ్రమించి యాయుధంబులు
ధరియించి ప్రళయకాలాభీలమేను జ్వాలంబుచందంబున ఘూర్ణిల్లుచు బా
ణవర్షంబుగురియించిన జనకజాతనూజుండు రథంబు నుగ్గునూచలుగా నా
నర్చి సారథులందరిని గజకుంభాగ్రంబులు చించి నెత్తురుపేరులంబఱపి విం
టనారిసారించి శస్త్రాస్త్రములు గీలించి మూఁకనురథంబును రెంటనుగజం
బును నొక్కటపహయంబునుబడ నేయుచుఁ గోదండంబును జికిమాలలకుజి
కియుండెదంబులు వెలికివచ్చుజన్మున జఘనకటికరముఖ నాసికాదంత నాభీపద
నంబులు నురుమాడుచు విలయకాల రుద్రాకారుండై నృత్యమ్ముగతిం దో
చుచు మహా రథమాత్రింబున ననేకసైన్యంబులు నుగ్గుమాడుచున్నంజూ
చి శత్రుఘ్నుండు లవకుమారుని నడకురథంబు నడువంబంచి యిట్లనియె॥
చ॥ ఎవఁడవు నీవు యజ్ఞహయమేటికిగట్టితి వశ్వహారివై। బవరము సేయ
గాగలవె బ్రాహ్మణరీతులుగావు యిప్పుడే। సవరణకేకుఁ మాసవనశా
లకు బోదము వంత మేలనీ। భవనమునిండగాంచన సువస్త్ర సమృద్ధులుగ
ల్గుదృప్తిగన్॥ గీ॥ పక్వశాకలమాన్న పాయస భక్ష్యములును। భోజనము
సేయఁబంపుదు భూషణములు। ఫలములును నిత్తుఁ మురగము బట్టవలదు।
రమ్ము పోదము సాకేత రాష్ట్రమునకు॥ చ॥ సమరమొనర్చలేవు నృపసైన్య
ము బాలుఁడవీవుగట్టిగా। నమరులునైన బోరుదురె యబ్జభవాదులునైన
నిల్తురే। విమలదళాక్ష నీ మొగము వీక్షణచేసిన వేళనుండి ప్రేమమును
దలంచినాను రణమార్గము గోరకపొమ్మనందనా। క॥ శరసంధానము జే
యఁగఁ। గరములు రాలేవు ఘోర కలహము డిగిమా। పురమునకు రమ్ము
సామిత। హరులను నిచ్చెదము నీవు నడిగినరీతిన్॥ క॥ అనిపల్కునట్టి లక్ష్మ
ణు। ననుజన్ముని జూచి మంచిమనమతి నాతుఁడన్। వినిపించినారు వినాదయ।
ఘనసైన్యమందగను మాటుఁగలిమికి నరుదే॥ సీ॥ ఘోరాటవులయందుఁ

గూరగాయలుదిను నరులకు నవరసాన్నములవేల। జీలాబుగావారచీరలుధరియించు వారికి వెలగవస్త్రమేల । కొండలబిలముల గూర్మిజరించెడి వారికిబురవర వాసమేల । రుద్రాక్షమాలికా రూపవంతముగల్గు జటులకురత్న భూషణములేల । తపమొనర్చుచు మునివనాంతరములెల్ల౯ । దిరుగుచుండెడివారికి దేశమేల । యుత్తమాతంగ ఘోటకమణులవేల । పట్టివిడుచుటకంటెను బ్రాణమేల॥ క॥ ధరపై జననంబెత్తెగ౯। మరణమునిజమవును సకలమానవులకు నే । ర్పరచియు సంగరభూమిం । దొరలినస్వర్గంబు వెంటఁదోచునరేంద్రా॥ గీ। విడిచిగుఱ్ఱ ము నీవెను వెంటనేను।వచ్చినిలుచున్నరచ్చటి మనుజవరులు । సతులుగూడి నవ్వరాచనగరకేళిఁ। దేలిపోదము స్వర్గప్రదేశమునకు॥ ఉ। ధీరసవృత్తిలేదు పరదేశులుమానులుసంగరంబులోఁ । భోరఁగ శేరటంచు నిజబుద్ధివిచారణ జేయవద్దునీ । వీరతఁజూపు బాణములువిల్లు కరంబునఁ బట్టినిల్వభూ । భారమువాన్పుదామునరపాలక యోచన సేయనేటికి౯॥ ఆ॥ ధరణిసంకటంబుఁధరియించవగా నేల। శత్రురాజవరుల సంహరించి । విపులకీర్తిచేత వెలయగావలెగాని । తల్లికుక్షిఁబుట్టి దనయుఁడౌనె॥ క॥ వచ్చినబ్రతికిన గీర్తులు । వచ్చును సంగరమువలన వసుధేశులకు। న్నిచ్చట దైన్యమునొందిన । మెచ్చుదురేమీరుగాని మేదిని మీఁద౯॥

క॥ జయమైనగానిభువినప।జయమైనంగానివిడువజాలనుహయము౯। భయమొంచబోమరణనిర్భయుడై యున్నానులెమ్ము బవరమొనర్చ౯॥ ఉ॥ ప్రేమనుదల్లిదండ్రులకుబిడ్డలుకీర్తులు బొందజేసిన । నోములునోచినందుకు మనోరథమాను నటంచునుందురీ। భూమినిబొందకున్న దమపుణ్యముకై వెతనొందుచుందురే । నామము రాదు పోదు జననాయక యేమిదలంపనేటికి౯॥ క॥ కులమందుబుట్టి కొడుకులు । బలవంతులునైన సకల భాగ్యము కలుగు౯ । బలహీనులైన నుత్తమ । కులమైనంగాని కీర్తిగోల్పటును నృపా॥ గీ॥ శేఖరుఁడగు వాల్మీకి శిష్యవరుడ । లలితమమరంగ నాపేరు లవకుమారు । డనుచు బిలుతురు మనుజులీ యవనియందు । సమరధైర్యంబుగలవాడ జనవరేణ్య॥ క॥ అవనిపాలకుండు బలికిన । వినిలక్ష్మణ సోదరుండు విశ్వాసముతో । మునితనయ యెంతచెప్పిన ।మనసునదెలియంగజాల వకటకుమారా॥ సీ॥ ఘోటకస్యందన కుంజరంబులుగాని సారంగమృగముల సరితిగాదు । పరశుపట్టిసగదా కరవాలములుగాని పూజించు సంపెగపూలుగాదు । ఘనరక్తసిక్త సంకాశకాయముగాని భూషించువిభూతి పూతగాదు । కఠినశాత్రవకోటి కదసియుండుటగాని వర్ణిప బాలవర్గములు గాదు । యేలమాతోడ వైరము వెఱరికైన।ధీరనా యెంతవా

డవు ధీరహృదయ । తల్లినిన్నెంతతలచునో తడవువలకు । తోడిబాలుర
తోఁగూడి తొలఁగిపొమ్మ॥ సీ॥ ముద్దయ్యెనీదగు మొగముగన్గొననాకు బా
ణాసనము నెట్లు పట్టనౌను । యనురాగమారయునీ యవయవంబులుగన్న
దురమునగవచంబు దొడఁగలేను । మమతవహిల్లె నీమందహాసముఁజూడ
ఘోరయుద్ధమొనర్ప గూడలేను । అన్న శరణన్నబ్రోచెద నరుఁ వంశ ।
ధర్మలక్షణములు దెలియఁగ ధరణిమీఁద । రమ్మునావెంట సాకేతరాజధా
ని । లక్షణముజూచి వత్తువు లవకుమార॥ క॥ తురగంబువిడువు యజ్ఞము।
జరుగకపోయినచో సమరసన్నయముగాదే। బిరబిరబోవలె శాలకు । దర
హాసా బ్రహ్మకైన తగునాయనఁగన్॥ ఉ॥ పోరకనీహయంబు గొనిపొమ్మ
నిచెప్పను తల్లివద్దకున్ । జేరను దవ్వుగావుమని చెప్పను భూషణ వస్త్ర
మాల్యము । గోరను దోడిబాలకులు గూడగ భీతివహిల్ల నింటిలో ।
దూరను భూరిశౌర్యములు ద్రోయనుమాటలు నెన్నిచెప్పినన్॥ క॥ ధై
ర్యంబు గలిగియుండిన । గ్రౌర్యంబులు సేయ భయముగలిగిన నిపుడే ।
శౌర్యంబుమాని జరుగుము । యార్యానుమతంబు సవన హయమును
విడువన్॥ క॥ కనుబెట్టజేసి లక్ష్మణు । ననుజన్ముడు కల్కిబిట్టడని చెప్పి
తినా । మనసునకు భీతిగల్గదు । విశ్వైతివి యిదిగోశరము విడిచెదవత్సా॥
అని॥ చ॥ కరమున విల్లుబూని జనకాత్మజ నందను మీదబాణముల్ ।
వరుసముఁరీతిగాఁగురియ బాలకుమారుడు విల్లుపట్టి సం। గరముదలంచి త
చ్ఛరనికాయము చూర్ణముచేసి పిమ్మటన్ । శరములునాటనేసె నృపసిం
హుని కాయము తల్లడిల్లగన్॥ మ॥ శరసంధానమొనర్చి మెచ్చియపుడా
శత్రుఘ్నుఁడత్యుగ్రుడై । గురిగాబంచ సహస్రముల్నడుపగా గోపించి త
ద్బాణముల్ । ధరపైజూర్ణమొనర్పగాదిగిచి మేధాశక్తిభాసిల్లగా । గురి
గాబాణసహస్రము ల్వరసగా గుప్పించి చెండాడగన్॥ క॥ ఎన్నిశరంబులు
నెత్తిన । నన్నిటి దునుమాడి రోషమడరంగ రథముల్ । తన్నుచు రౌద్రా
కారము । పన్నగ శత్రుఘ్నుడంత పౌరుషమొదవన్॥ ఉ॥ బాలుడు వీడ
టంచు మనభావములోపల నెంచగూడదా । భీలపరాక్రమాకలిత వీరుఁ
డుగాని తపస్విగాడుమే । లీలదలంచిచూచినను లెక్కసమూహముగాని
పోరగా । జాలరువీనిపైనెవరు చేయగమంచిదిగాదు పిమ్మటన్॥ మ॥ అని
మేఘాస్త్రము వేయుగా లవుడు నాయస్త్రంబుఖండించి మే । దినిభీతిల్లగ
నొక్కబాణమువడిన్ దీపించి భూపాలునం। దనుకోదండము రెండుగాసతి
క మేధాశక్తితోఁగేతనంబుమువేగూల్చియసంఖ్యవాడిశరము ల్భూపాలు
పైనేయగాన్॥ గీ॥ ధనువువేఱొకండు గైకొని దశరథాత్మ । జుండు నారా
యణాస్త్రము సూటిచేసి । ధృతినిపైచిన నలుగడ దిశలువడక । మించువ

తెరాగ లవకుమారుండు చూచి॥ ఉ॥ పదిపదిబాణముల్ వ్రేయ భస్మముసే
యుచు రాగ నప్పుడే। గదగొని వైవ నల్లదివ శాపకలై చెదరంగ ఖడ్గముల్ ।
మొదటికి వైవగా లయముబొందిన జివ్వున లేచి కేడెము । న్వదనము మీద
జేర్చ వదిబ్రద్దలు చేసి యురంబునాటినన్॥ గీ॥ ధరణిపయి దూలిపడియున్న
తనయుజూచి। యెంత చెప్పిన వినవైతి వేమిసేతు। సమరమున నాదు శరముచే
జావుగలిగె । నెటులభరియింతు దుఃఖంబు నిప్పుడేను॥ చ॥ కళకళ దేరు
నీ మొగము కన్నులచందము రూపురేఖ సీ । లలితవయోవిలాసములు
లక్షణముల్పదునాలు రేఖలుం । దలచుచు దల్లి యేమనునో దైవకృతంబు
ను దక్కజేయగా । నలవియె బ్రహ్మకైన నిజమాడితి కయ్యము నీవు పూ
నగాన్॥ వ॥ అని యనేకవిధముల శత్రుఘ్నుండు విలపించుచు జనయా
త్మగతంబున॥ క॥ శ్రీరాముని సమ్ముఖమున । శేరు తురగ రథము మీద జే
ర్చిన యపుడే । యీరీతి దెలిసి బాలకు । మారులు మునియాశ్రమునకు
వచ్చిరిభీతిన్॥ గీ॥ వచ్చిసీతనుగనుగొని వందనములు । సలిపియో యమ్మ
లవుడును పవనహయము । వెడలమే మెంత చెప్పిన వినకపోయి । పట్టుకొని
వచ్చి వనములో గట్టగాను॥ క॥ తురగములు కరులురథములు । ధరణీత
లమెల్లబెదర దళపులుతరుచై । చొరబడగ లవకుమారుడు । వరసైన్య
ముతోడ బెద్దబవర మొనరగన్॥గీ॥ చేసి నరసాధుచే మూర్ఛ జెందిపడియె।
నేవిధంబున జరుగునో యింక మీద । ననిన వనజ మూర్ఛిల్లి యట్టె లేచి ।
భూరిశోకంబు చేతను పొగిలిపొగిలి॥ చ॥ ననుగనుతండ్రి నీమొగము నాకు
ను జూపగరాదటంచు నే । జనపతి చేతజిక్కితివి శౌర్యబలంబులు
చూపువేళలా । మనమున ధైర్యమొప్ప మునిమాటను గూరలు గాయలే
రుచుం । దినములు ద్రోయువారికిని ధీరగుణంబు లివేల నందనా॥ సీ॥ ము
ద్దుమాటలచేత బ్రొద్దులు పుత్తువు లాలితాకారయో లవకుమార । ఫల
ముల నోడినిండ బట్టుమటందువు లాలితాకారయో లవకుమార । అ
మ్మ మాతండ్రెవ్వరని పొచ్చరింతువు లాలితాకారయో లవకుమార ।
తొడమీదగూర్చుండి విడెములందిత్తువు లాలితాకారయో లవకుమార ।
వనములన్నియు దిరుగాడి వచ్చి వికచ। పరిమళంబులు గలమంచి పారిజాత।
కుసుమజాతులుగొనివచ్చి కొప్పులోన । లక్షణంబుగ నియుంతువు లవకుమా
ర॥ చ॥ వారలును నేల స్వర్ణమయమైన దుకూలము లేల మొక్కగా । నర
దము లేల రత్నఖచితాభరణంబుల వేల భోగముల్ । గరులును నేల ఘోర
మృగ శాలన సీమల జేరి మానులై। తిరిగెడివారికిన్ నగరదేశము లేల కుమా
రశేఖరా॥ సీ॥ నినుబాసి నే నెట్లు నిర్వహింతును మహాఘోరమైనట్టియీ
కాననమున । నఖిలదుఃఖంబులు నడచి మీరుండుట వలన నీవు డవిలోని ల్లి

చినాను । తొలిజన్మమున నేను తోఁచక చేసిన పాపంబుకూడని వనములో
న । పడినయప్పుడెయింతి వడిదపించుచున్ను దలచుకొంటివో యిక దా
ళిగలనె। హాయమువచ్చిన విధమేమెఱు యశ్వమేధ। యాగదీక్షవహించిన
భోగిమెవడో । బవరమును జేసి నిజభుజాబలము మెఱయఁ । దశరథుంబుం
దునిడినభూధవు డెవఁడో॥ సీ। జనకమహారాజ సార్వభౌమునియింటఁబు
ట్టియీదురవస్థ బొందవలసె । దశరథ మేదినీధవు పెద్దకోడలై తీరనిదుఃఖం
బు చేరవలసె । రవివంశపావనురఘురాము పట్టపుదేవినై కానల దిరుగ
వలసె। భరతలక్ష్మణులకు వదిననైపుత్రిని బరులువట్టిరియని వగవవలసె।
బ్రహ్మదేవుండు మున్నేమి వ్రాసెనుదుట । దిక్కుగలిగియు నిప్పుడుదిక్కు
లేక। పోయెనాతండ్రి నిన్నిడబాసితనువు । పోషణము సేయవలసెనా పు
డమిలోన॥ చ॥ తలచితలంపలేను వనితామణులార కుమారుఁడిప్పుడే। తల
మునుండునో తగనిదండన జేసిరో పట్టణంబులో । పఁబడవైచిపోతనువు
ప్రాణముబాపిరో యాతపంబులో । నిలిపిరొ నిర్దయాత్ములై నేరములెం
చిరో యేమిసేయుదుక్॥ సీ॥ అమ్మనీకిపుడెంత యాకలోయని పక్వఫలము
లొసగెడి వారలెవరు । తల్లినీకిపుడెంత దాహమాయనొయనివర్షించుజల
మిచ్చు వారలెవరు । భూజాత మల్లికాపుష్పముల్గనుమని తెచ్చికీల్జడఁబె
ట్టుధీరులెవరు । మాతనావిక్రమమహి మలిట్టివియని వరసింహములుదె
చ్చు వారలెవరు । మత్తమాతంగ ఘనకుంభమండలములు । వ్రిచ్చినవ
మౌక్తికంబులు వడినిగట్టి । సరములును నిండధరియింపు జననియనుచు ।
బహువిధంబుల బ్రార్థించు వారలెవరు॥ ఉ॥ హాసుకుమార హాతనయహా
కులభూషణ హాదయాకరా । మోసముచేసి యెచ్చటికిఁ బోతివి కాననసీ
మలోన నీ। గాసిపడంగ నేల కసుగాయలఁ బొద్దులుపుచ్చ నేలయీ। వాసము
గాదటంచు నెడవాసితివో దయలేకనందనా॥ ఉ॥ నాకుగ తేమిరా మనల
నాథుడు ప్రేమయొకింత లేకభూ। కాకబకాదిగృధ్రముగ కాననసీమల జేర
బంపెనీ। శోకముమానియుందు మిముజూచిమనంబున నోర్వలేక యీ ।
లోకులునవ్వగా నొసటిలోన జడీగతి వ్రాయవచ్చునే॥ఉ॥ తీరనిదుఃఖమా
యె వనదేశము కాపురమాయె నించగా । గారడమాయె నాథునముకా
యముఁబాసెద నోర్వలేనయో । ధారుణిమీద నాసుతునిఁ దప్పక చూపె
డువారులేరుపో । స్వారథిజొత్తునా దరికి బారుడునా తపనాగ్నిజొత్తునా॥
ఉ॥ మాటికిమాటికి న్నడుగవత్తువుతీయనివండ్ల నింపుగా । మాటలుచెప్పు
చుండుదువు వర్ణనసేతువు వచ్చియప్పుడే । యాటలనాడుచుండుదువు య
న్నభుజాతువు భూమిలోననా । సాటెవరంచు బల్కుదువు సాహసవృత్తు
లు వేయుచుండువే॥ సీ॥ భావించి కెంగేలు పట్టియాడుదువురా లాలితా

కారయో లవకుమార । పాలిమ్మటనితొడ పైనివసింతువు లాలితాకార
యో లవకుమార । తొట్లయూచుమటంచు మదుకులుచేతువు లాలితా
కారయో లవకుమార । కుసిలించినను నెత్తుకొమ్మని పిల్తువు లాలితాకా
రయో లవకుమార । అన్ననాయన్న యీమహారణ్యమందు । దిక్కు నీకే
లనవి నన్ను దిరుగఁ జేసి । శ్రుతులకుఁజిక్కపోతివా సంకరమందు। లలినిజనక
జసుతుడవై లవకుమార॥ సీ॥ దశరథరాముని తరుణి నైకంటకవనములో
దిరుగాడ వలసె నేడు । సత్యబంధుండైన జనకమహారాజుకూతునై శయనిం
ప గృహాలుగలిగె । రఘువంశమున మహారాజుకోడలనునై సింహాగ్రి
వనములు చేరవలసె । హనుమదంగదసుషేణార్కజాదులబల్మి గలిగిమ
హారణ్య గతులుగలిగె । నేమికలిగినఫలమేమి యీశ్వరాజ్ఞ। లబ్ధ ప్రారబ్ధ
కర్మాదిలక్షణము లౌ । మానకనుభోనెట్లేనోముఫలమొగాక। లలితకందర్ప
శృంగార లవకుమార॥ గీ॥ అనిరోదనంబొనర్చుచు । వనతలమునబొరలి
పొరలి వగ్షముకరణిం । గపోలతజలములుగారగ । దనదేహము విడువమ
దిని ధైర్యముచేయుచుఁ॥ వ॥ అట్టియెడ కుశకుమారుండు మహారణ్యంబు
లయందు శరభసింహ మదేభమృగసమూహంబుల దోలుచు మహాద్రుల
నెక్కుచు నానావృక్ష కుసుమఫలంబులు రాల్చుచు దనతల్లియగు సీతా
మహాదేవిని దలంచి యతి త్వరితగమనంబున॥ గీ॥ పండ్లుకొన్నిటిగైకొనికట్టి
చేత । బునుగుజవ్వాజి కస్తూరి గనాభి బూనిసురభి । దామములుగొన్ని గై
కొని తల్లిమీదఁ। మమతమీరంగ కుశకుమారుండువచ్చి॥ క॥ తమయా
శ్రమంబుగనుగొని । విమలంబైయుండలేమి వేదములిందుకె। గుమిగూడి
కతనజేయరు । సుమగాత్రితల్లియేన శోకించెడినో॥ గీ॥ మార్గమునగనగ
లవకుమారుడిప్పు । డెందుకేగెనొ రాడు యెచ్చటికేగినాడొ । యఖిలమును
లెల్ల దేవతార్చనలుమాని। విస్మయము నొందియుండెడివిధమదేమొ॥ వ॥
అనియనేకవిధంబులం దలపోయుచు మార్గంబునందుశ్శకునంబులు వీక్షిం
చుచు లుంగనారంగరసాల కుటజపట తమాలతక్కోలంబు జంబీరగం
ధనాశోక పుష్పఫల భరితానంద శుకపిక నినద కోలాహల కలకలంబగు
తద్ధాశ్రమంబుఁ బ్రవేశించిన॥ క॥ జనయిత్రి సన్నిధానము । కనుగొని
ప్రణమిల్లి నిటల కరకమలుండై। వినుపింపు విపులదుఃఖము। పునగినకార
ణమదేమివింటివికల్లీ॥ అనిపలుకుచు॥ గీ॥ ఇలనుబడియున్న తల్లినినెత్తిరత్న।
భూషణంబులు సవరించిపుష్పవికచ । మాలికలువెట్టి పొరలిన మైలదుడి
చి । చింతలునుబాయ బరిచర్యచేయుచున్న॥ వ॥ ఇట్లుపచరించు కుశకు
మారునింజూచి కౌగలించుకొని దుఃఖించుచు భూసుతయిట్లనియె। సీ॥
మున్నుడు కాననాంతరమందు దనయిష్టసఖులతోనాటలు సలుపుచున్న తే

నవనీశ్వరుండొకం డశ్వమేధముసేయ తురగంబురాగ సంతుష్టుడగుచు। బట్టిన హయరక్షపతులు కిక్కిరిసిన మదగజహయరథ వరుల ద్రుంచి। వైచి నానాసైన్య నరనాథుడెవ్వడో పిన్నవాడనకను భీమసమర। తలమునను మూర్ఛవంచించి ధైర్యమొందవ। రథమునం బెట్టుకొని నిజరాజధాని। మార్గమునుబట్టినచుచు గుమారవరులు। చెప్పినారన్న యికనేమి సేయు దాన॥ క॥ అంత గుశకుమారుం। డనియెను వైదేహి లవుని నరివర్గం బుల్। గొనిపోయిన భయమేమే। గొనివచ్చిన వెనుకనన్ను గొడుకనుతల్లీ॥ క॥ తమ్మెదను సురల సయిచను। గరుడోరగ దనుజయక్ష గణములనైనం। బరువిడగం జేయకుండిన। హరివంశజుడనుచు నన్ను నందురెభూమిన్॥ క॥ త్యాగముశౌర్యము రెండే। భోగంబులు పురుషులకును బుడమిని నటులన్। యోగంబు లేకయుండిన। జోగనిపిలువంగవలెను సుతుడనవలెనా॥ క॥ తల్లిశిరంయులు గలిగిన। వల్లభుగతికంటె ద్యాగ బలవిక్రమముల్। చెల్లిగొడుకనగవచ్చును। పొల్లిన నతడొలికిలోని బూడిదెగాదే॥ క॥ పనులేమి యిచట జెప్పక। జననయిత్రీయిపుడు విల్లుశరములు చేతన్। గొనిజయము చెప్పియిమ్మా। వనజభవాండములనైన భస్మము సేతున్॥ క॥ అనివేడుకొనిన తనయుని। గనుగొనిసీతాలతాంగి కౌగిటనిడియో। యినవంశ జలధిచంద్రా। నినుబాయగలేను సుమతనేనెట్లు ద్రోతున్॥ చ॥ కరిరథ ఘోటకాయుతము గల్గుమహారథి వీరువల్వెరో। వెరువకపోయినా రొకడె వెంటబలంబులు లేక బాలుడై। శరములు వేయగాగలవె సాహసవృత్తులు చూపనేర్తువే। పరులవధింపనేర్తువెటు ప్రాణములుంతును రాకుమారకా॥ క॥ శర సంధానవిధంబులు। గురుతెరుగుదువా తలంచి కోదండముసం। గరమందుబట్టినిలుతువె। చిరుతవు సైన్యములబట్టి చెండాడుదువే॥ గీ॥ నిన్ను నెడబాసియొంటిగనిల్వలేను। విపినమందును నామహా వీరవరుల। దళములను సంహరించెడి ధైర్యశక్తి। గలుగునా తండ్రి యికనేమి గతులొ నాకు॥ గీ॥ ధరణిమీదను కౌసల్యతనయుడయిన। రామచంద్రుని విపినాంతరములబంపు। కాలమున నేమి దీవించి పంపినదియొ యాఫలంబులు నినుజేరు నర్కవంశ॥ క॥ సురపతినిగెల్వ గరుడుడు। పరతెంచెడి వేళలందు బావనివినితా। తరుణాంగి చెప్పుశుభములు। వరతనయా నిన్ను బొందవలయును ధాత్రిన్॥ వ॥ అనిప్రేమంబున శిరంబుమూర్కొని మన్నించి తనముద్దుటుంగరము మొసంగి తనయా దీని లవుని శరీరంబున దాకంజేసిన పునర్జీవితుం డగునని యొసంగినం గుశకుమారుండు॥ గీ॥ తల్లికిని మ్రొక్కినిలుచుండి తల్లిపుత్రి। శోకమనుమానుమిపుడు నీకుతుని నెచట। బట్టియుండినగొనివత్తుభయముపలద। టనుచుబ్రి

ణమిల్లి విల్లును సమ్మదాల్పి॥ చ॥ వెడలగ దేవసంఘములు విస్మయులై పరికింప శైలము। ల్పుడకుజలింపగా జలధిఘోరునమ్రోయగమింటజుక్కలుల్ । విడివడిరాలగా జనులు వేదనలొందగ నూనికోటి యు। ప్పుడు దిగులొందిమూడ ఘన భూరుహజాతులు పెల్లగిల్లఁగాన్॥ ఉ॥ పోయెడి సేనఁజూచి యెటుపోదగు బోయినఁ బోవనీయ న। న్యాయము చేసిపోయినను నాకెదిరెక్కువలేదు వెంటనే । బాయకహస్తి మాచియుత పాపడుమీతును దక్కిపోవునా । సాహసవృత్తులందెలియ జాలగ జేసెద రండుపోరికిన్॥ ఉ॥ నేరనిబాలునిం గదిసినిల్చిన సంగరరీతి యాన యా। శూరతలెల నాయెదుట జూపఁగ రండు గతేమిగల్గునో। పోరకయున్న నేవిడువ భూమినిదూరిన సాగరంబులో। జేరిననాగలోకములు సీమలుచూచిన బాసిపోదు నే॥ క॥ తన కోదండము గట్టిగ। నినదంబును జేసి పట్టినిలువగ హరుడో। యినుడో యింద్రుడో యనఁగను। జన సైన్యము బెదర ధైర్యసంయుతుడగుచున్ ॥ సీ॥ రథముల జెండాలు రౌతుల బరిమార్చి మదగజంబుల నెల్లమంటఁగలిపి । ఘోటకంబుల దునిమి గొడుగుల తెగనేసి బాణాసనంబులు పట్టివిఱచి । గదలు మీదికి నెత్తి కరవాలములు దూసి చక్రముల్ ద్రిప్పి భూచక్రమదర। బట్టిసంబుల నేసి ప్రాసముల్ తగిలించి ముద్గరంబులుగొని మోహరించి । రుధిరరసము వార విరోధిరాజ। వరులు వెరగంద సైన్యము భయము నొంద। మెదడు రాలంగ మొండెము లీడ్చదేల । బలముధైర్యము గలగ నబ్బాలకుండు॥ క॥ శరము సకుమగురసలుగుర । బరిమార్చుచు గరుల నేల బడవైచుచు భీ। కరబాణమెత్తి వైచుచు । నరదంబులు విఱిచి నేల కణచుచు గడిమిన్॥ క॥ పదిశరము లైదు నెనిమిది । కదియఁ బ్రయోగించి మొదలు ఖండించుచు జే। గదచేత విసరి వైచుచు । బదములు జక్కాడి శౌర్యపౌరుషమతియై॥ క॥ పదుకరులు విఱుగు తేరులు। నడలనుజాలించు చతురహయరత్నములుం। గడగడవడ కెడి సైన్యము । నడిచెడుపృథుకోటి ఘోరసమరములోనన్॥ సీ॥ పదములు విఱిగిన బహువిధ దేహంబులు నవనిపైగూలెడి యరదములును । దౌడవిరిగినజవ తురగసమూహంబు మార్గంబు చేరెడి మావటీలు। వెలవెఁబోయెడి వీరాధివీరులు భయముచేతను మరలి పారు భటులు । దివ్యాస్త్రముల చేత దిక్కులుంగ రక్త ధారలు గ్రమ్మెడి ధరణిపతులు। భీమమైనట్టి పరిశయార్కబింబమగుచుఁ । గాలరుద్రుని కైవడి గలిగినటుల । శరములను బట్టి రిపులను సమరరంగ । మహిమ జూపెను సీతాకుమారవరుడు॥ క॥ ఈరీతిఁ బోరుచుండగ । వారణములు తురగనికర భటసముదయము । ల్ధీరత్వమెల్ల వీడలగ । బారిరి దిశలదర సురగపతి తలలదరన్॥ గీ॥ చూచి శత్రుఘ్నుడా వేళ జోద్యమంది । నిలిచి సారథి

తోడసి నీలవర్ణ । గాత్రుఁడెవ్వఁడో సంగర కఠినశక్తి । రాజుచున్నాఁడు
పోనిమ్ము రథముపైకి॥ ఉ॥ బాలుఁడు మూఁడ రామనరపాలునిరీతిగనున్న వాఁడు
భూపాలకుమారుఁడో మరుఁడొ భానుఁడొ చంద్రుఁడొ చిక్కనట్టియీ । బాలు
నిసోదరుండొ ముని బాలునికింతటి ధైర్యమున్నె గో । బాలుని జూచి ధేను
వులు పారెడిరీతిగ నుండె సైన్యముల్ ॥ సీ॥ పూర్ణచంద్రుతో సమానమైన
వదనంబు నీరజాబులవంటి నేత్రయుగము । ఆజానుబాహులు నతివిశాల
మురంబు పదములు పల్లవ వైభవములు । కర్ణాంతానాన కటి తలానం
దంబు పూజితాకారమౌ భ్రూయుగంబు । అధరబింబఫలంబు సమరిసఫా
లంబు చెక్కుటద్దంబులు చెలువుగలుగు । బాలకునిగన్నతల్లి యేభాగ్య
వతియొ । యెన్నినోములు నోచెనో యితనికొఱకు। శరము లేరీతి సంధిం
తు జాపమునను । హయములేరీతి గొనిపోదు హవమునకును॥ క॥ అనిప్ర
ళయరుద్రుకైవడి । జనుదెంచెడి జనకజాత సంభవుకెన్నరె । వినువత్సన
మరధర్మము । ఘనమే మాతోడ లేని కలహముసగునే॥ గీ॥ రమ్ము పోదము
సాకేతరాజధాని। చూచివత్తువు బహుభక్ష్య శాకశాఖ । భోజనముసే
యు బంపుదు భూషణములు । కనకచేలంబులును నీకు గట్టనిత్తు॥ క॥ నీ
రీతినున్న బాలుఁడు । ఘోరరణంబునకు వచ్చి కూలెనుమాతో । బోరాడ
జాలవిప్పుడు వీరత్వము చాలుగాని వెడలుమువత్సా॥ క॥ పేరెఱిగించె
ద దశరథ । భూరాజసుతుండ ద్విదశపుంగవుఁడైనం । బోరాడ లేరునా
తో । నేరక వచ్చితిని యనుము నినుమన్నింతున్॥ చ॥ దనుజుల దుంచు
రామవిభు తమ్ముఁడ బూనికనశ్వమేధమున్ । పినతికినెక్కఁజేయు రఘు
వీరుని సాహస విక్రమంబులున్ । మనసున దోచదో దురభిమానము
మానుము రమ్ము వెంటనా । ఘన సవనంబు జూచెదవు కయ్యమునెయ్య
ముగాదు పిమ్మటన్॥ క॥ జననీజనకులు నెవ్వరో । వనతలమున ద్రెళ్లిపడి
న బాలుండెవఁడో । మునులకు సంగరధర్మము । చనునా రోషాగ్నిదృష్టి
సాగదువత్సా॥ వ॥ అనిన కుశకుమారుండు క్రోధ దండహత మానమాన
సుండై రోజుచుజటావల్కలంబులు దాల్చు రామభద్రుని తెఱంగున నిజ
పాణి ఘటిత శరశరాసనుండై నేత్రారుణ విస్ఫులింగంబులు చెదరం బ్రళ
యార్కబింబ సదృశవదనుఁడగుచు సుమిత్రానందను రథంబున కెదుర
నిలిచి యిట్లనియె॥ క॥ మునివృత్తిగన్న క్షత్రియు । జననాథుల శౌర్యమె
చ్చు సేయగనౌనా । మనుజమదగ్ని కుమారుని । ఘనవిక్రమ శక్తిదల
పగలిగిరె రాజుల్॥ క॥ జనకజసుతులము నిరుపుర । మనుజన్ముల గుశను
మారెడనియెడివాడన్ । ఘనవాల్మీకి మహాముని । గలుగున్ శిష్యులము
నిక్కమయ్యా మహాత్మా॥ ఉ॥ ఏకులమైననేమి మఱి యెవ్వఁడనైనను నే

మి వియ్యము । చేకొనివారిని న్నడుగఁ జెల్లునని విధమెందు గానమా ।
లోకమునందు విన్నెదరు లోకులు కేరని తోచుఁదోచినన్ । నాకు భయం
బు లేదు నరనాథ తనూభవ సంగరంబునన్॥ క॥ అనుజాని బట్టితివని మా ।
వనమున విని వచ్చినాను బాణంబులు నా । ధనువుఁ జేర్చితి భూధవ। తన
యుఁడనో లేక తపసి తనయుఁడో దెలియన్॥ చ॥ సమరము సేయఁ గాదె
లియ శౌర్యము సూరక చెప్పనేలనే । మములును గోరనేల బల
వర్గము గల్గిన వాఁడగాను నే । మ మును మానుషై విపిన మార్గము
లోబహు దీనవృత్తితో । గమనము సేయువారము జగత్పతి వీవు దలం
పనేటికిన్॥ క॥ దుర్బలుడై జనయిత్రి । గర్భంబునను బుట్టి వంశ కారణుఁ డ
గునే । నిర్భరవృత్తిని శత్రుల। గర్భంబులు బంపఁ బుట్టు కపును ఘనంబా॥
క॥ పుట్టిన యప్పుడె భూమిని । గిట్టగనే కీర్తిగలదె గిరిధైర్యుండై । మెట్టి
నరణముల శత్రులఁ । గొట్టినదవపేరు నిలుచు కొడుకనవచ్చున్॥ క॥ జన
కునకు దక్కువైనను । దనకొడుకని చెప్పబోతె తలవంపరియా । ఘ
నవిక్రమంబు గలిగిన। తనయుండని చెప్పుకొనగ ధర్మము గాదే॥ గీ॥ సిగ్గు
లేక బ్రతికి చెలగుటకంటెను । చావు మేలు సకలజన ములకును । మాన
హీను డగుచు మహి నేలినను నేమి । వానిభోగమేల వసుధలోన॥ క॥ అ
నిశలుఁ జన్న లక్ష్మణు । ననుజన్ముడు మదిని దెలిసి యామహాసీతా। జన
యిత్రి గన్న కొడుకులు । గనుకన్ నిజబాహు విక్రమములుం గలిగెన్॥
సీ॥ కాకున్న సంపూర్ణ కళలు దేరెడిచంద్ర ముఖమేల శోభిల్లు మనులకై
న। నాజానుబాహులు నతివిశాల యురంబు ఘనతనొందు నెమునితనయు
లకును। నాసహాసాదాంత మమృతవాక్యంబులు సమకూడు నేయగ్రజన్ము
లకును। శరశరాసనములు సాహసకార్యముల్ బుట్టునే యగుణ భూసురు
లకు । జానకీదేవి యీముని స్థానమందు । కొడుకులను నాకునలముల
గూర్మిదినుచు। నెంత దుఃఖించుచున్నదో యేమి బ్రహ్మ । దేవుడెట్టుల
వ్రాసినో దేవినుదుట॥ గీ॥ హయము గొనిపోక పోయిన నశ్వమేధ। సవ
నమును సాగనేరదు సఖ్యమునకు। రారు యీబాలకులు రఘురాము నాజ్ఞ ।
గడవగూడదు శాత్రవ గణము గాదు॥ వ॥ అని శత్రుఘ్నుండు॥ క॥ తనయాత్మ
జింతసేయుచు । తనయునివీక్షించి వీరధర్మము నాకుం। గొనసాగ లేదు బాణ
ము। ధనువున సంధింప లేను దయారంజిల్లన్॥ ఉ॥ చేతులు రావు సంగరము సేయ
గనీగుణమేల తండ్రినా। నీతులు చిత్తగింపు జననీమణి యేఁటి నితల్లడిల్లునో। భూ
తలమందు వ్రాలగను భూపతి రాముడు సేయుయజ్ఞము। జూతువు గానిం యీ
హయము జోలికిబోవక రమ్ము వెంబడిన్॥ వ॥ అనిన గుశకుమారుండిట్లనియె॥
క॥ తురగమును విడిచితమ్ముని। నరయక మా వెంటనేన యరుదెంచిన భూ। ను

రులవలె యుత్తరకూటికి। గలుపై రోషితుం జేసిన రేఖనులో భూపా॥ క॥ పోటవము
సంగరమొనరించి। మోదంబున యజ్ఞమునకు మోహముతనిగా॥ వాదింపఁబో
కశరములు। పోద్రిదిగ గూర్చితిని వింటభూమి వడంకన్॥ క॥ అంతశత్రుఘ్నుఁడు రౌ
ద్రము। కనుల సుగ్రమ్ముంగ బ్రళయకాలుని రీతిన్। ధనువంది రోషకుమారక
ననుమారో గ్రనవశమెసఁగిన నాథుని కైనన్॥ వ॥ అనిప్రళయకాలానల సదృశ
లోచనుండై వరశరాసనంబులు దాల్చి దిశలదర దిక్కుంభికుంభంబులు బెగ్గడి
లజలనిధులు చలింప ధరణీతలంబు వడంక గుణధ్వని గావించి మూఁడు వాఁడిశరం
బుల హృదయంబు భేదించిన జనకాత్మజాసుతుండు నారాచంబుల జెండాడుసిం
హకిశోరంబు మాటిక్కంగదిసి పంచవింశతి మార్గణంబుల తురంగంబులను
త్రయోవింశతి శరంబుల సారథిని పంచబాణంబులం ద్రిభువనగరుడ గం
ధర్వామరసురయక్షాది సమరజయ దశకంఠకంఠలుంఠన పరితోషరామసో
దరుండగు శత్రుఘ్ను నేసిడాసి దశశరంబులకు వింశతిశరంబులును వింశతి
మార్గణంబులకు చతుర్వింశతి మార్గణంబులును మున్నూటికి మున్నూట
పదునెనిమిది యంబకంబులను శతవిశిఖంబులకు సహస్రవిశిఖంబులును
లక్షకు ద్విలక్షలును గల్పించుచు బుంఖానుపుంఖంబులుగా భూనభంబు
లు ప్రమోయ ధైర్యంబులు రెట్టించికొనుచు సమరోగ్రరోష భీషణులై
యాయుధవిశేషంబులం గరలాఘవసౌజన్య చిత్రంబులు గనుపుచుం బవ
నాస్త్రంబుల శైవాస్ఫోటనారంభ మహోద్వనన ఘాతంబులు సంహూర్చు
చు నాగ్నేయ విశిఖంబువలన దందహ్యమాన జ్వాలాభీలమహోగ్రకీల
లం గీలించుచు గంఠంబుల వాటించుచు ముఖంబులం జిల్లులు గర్ణంబులను
రుముచు భుజంబుల మర్దించుచు ముఖంబుల మోదుచుం బదంబులం జె
క్కుచు నుగ్రింపుచూపుల గోదండంబుల ఖండించుచు శరశరాసనంబుల
మొత్తుచు మహాబలుల పగిదిం దిరుగుచు ముందువెనుకంగుం దమకించు
చుం దమలో దాము మెచ్చుచు మహాఘోరసమతేజులై ఘోరంబుగా
బోరుసమయంబున॥ సీ॥ పరిగా బోరెడిజూడ నీబుడుత తత్సామర్థ్యముం
జూడభూ। తరుజాతాదిమహాత్మ్యమో కఠినధైర్యామోదమో రామభూ।
వరుకారుణ్యమొ మానిశితమెటులన్ భావింపగావచ్చునం। గరముంశౌ
ర్యము రాముఁబోలునితఁడే తన్మాత్రుఁడే చూడగాన్। అనివితర్కించి॥ క॥
శరములు నాలుగు నురమున। జొరఁబడ నేయంగ గుశుఁడు చూచి పడేనన్। శర
ములరువ్వి హయంబుల। ధరపై దూలించి ప్రళయదహనునిమాట్కిన్॥ క॥ సా
రథిని ర్దంచి సంగర। ధీరుండై కేతనంబు తెగనేసి మహా। వీరసంబున దొమ్మిది।
నారసములు దూరనేసె నరనాథునిపై॥ గీ॥ అంతశత్రుఘ్నుఁ డావేళ నరగ
మందు। మూర్ఛరీతిగ వ్రాలిన భూమియెల్ల। వడికెవాపో ఘోభూతము ల్పాట

పగలె। తారకలువ్రాలె నక్కలు చేరియఱచె॥ వ॥ ఆసమయంబున గుశుండు॥
గీ॥ లవకుమారుండు పడియున్న లక్ష్మణంబు। గాంచి సీత యొసంగిన కనకరత్న।
ఖచితమైనట్టి ముద్దుటుంగరము నెత్తి। తనువుమీదను శేర్ప దత్తసచేతనుండు॥
క॥ కలవరమున ఘననిద్రాకలితుండై లేచి కుశుని గనుగొని యన్నా। బలు
నిద్రపోతిననిపద। జలజంబులు గాంచి మ్రొక్కి సదయుండగుచున్॥ వ॥ కుశ
కుమారునితో నిట్లనియె॥ సీ॥ వనతలంబున నేను వచ్చి వినోదింప నశ్వమే
ధారంభ హయము తిరుగ। జైడి కేతుస్రవాసి బంధించు బిరుదాక్షరంబులు
చదివి క్రూరాగ్రహమున। బట్టిగట్టగ బెద్దబవరంబు సన్నృపు బాణంబు చే
తను బట్టువడితి। బ్రతికించి నశ్వంబు బట్టుటమంచిదో కారానిపనులోలో
కంబునందు। దెల్పుమనిపల్కదమ్ముని దిక్కు జూచి। ఘనతరంబిల్ల బ్రేమ
తోగౌగిలించి। బ్రతికితివి నాదుభాగ్యము పల్లవించె। తల్లిహంసఖంబు వాసె
నుధైర్యమొందవె॥ గీ॥ హయముబట్టిన యికార్యమధికఫలము। చూచిప
ట్టక పోయిన సోదరుండ। వనుచు నిన్నెన్న వచ్చునా యర్కవంశ। సంభవుల
మంచు జెప్పంగ సహజమౌనె॥ క॥ అనియన్నదమ్ములిరువురు। ఘనసాహ
సమొదవ హయముగదలి స్తంభం। బునగట్టి ధీరవృత్తిని। ధనువులు ధరియింప
వడకె ధరణితలంబున్॥ క॥ హతసైన్యజను లయోధ్యకు। జతనముతో వచ్చి
యజ్ఞశాలాంతరభూ। పతియైన రామచంద్రుని। వితరణతో గాంచి మ్రొక్కి
వినుతించితగన్॥ సీ॥ సమరభీకరముతో శత్రుఘ్నుడను యజ్ఞ తురగంబు
తో ంబుధులు కలంగ। నంగమత్స్యకళింగ వంగదేశాధీశ వరులచే ధనరత్న
వస్త్రమాల్య। భూషణంబులగొని భూస్థలి గుమ్మరి సమరవిక్రమశక్తి నలు
వురిర। ధరణీధవులు లేక తర్లి గంగారణ్య దేశంబులో శల దిరుగుచున్న। జడ
లు మెఱయంగ వెచ్చున జారభూతి। పూతచన్నొందగాంతిన పూర్ణుడగుచు।
దశసినందను డెవ్వడో ధైర్యమునను। హయముతోనీక త్రోవనుదగ్గించి॥
మ॥ తరుమూలంబునగట్టి క్రోధవశుడై ధైర్యంబుతో సైన్యసం। గరుడై
నిల్చి యనేక ఘోటక మహాగంధేభయూధంబులన్। దోరలందు పంగలక్ష్మ
ణానుజుడు దోర్గర్వంబుతో బాణనిన్। శరవేగంబున మూర్ఛజేసి తనదౌ
సైన్యంబులుం గూల్పగన్॥ ఉ॥ త్రోవను బోవుచున్న యొడ ధూర్జటిరీతిం దా
రికడ్డమై। దేవకుమారసోదరులు తీవ్రమహానలశేత్రియుగ్మలై। దేవగణం
బు భీతిలగ ధీరులవారి గరథ్యసంఘము। బ్రోవ్రులు సేయమీయనుజా భూత
లమందున మూర్ఛనొందగన్॥ క॥ వచ్చితి మే మన రఘుపతి। విచ్చలవిడి
శోక వహ్ని విహ్వలుండగుచున్। హెచ్చుగ దమ్ముని దలచుచు। న చ్చిక
నాశ్చర్యవృత్తి యతిశయము మరన్॥ ఉ॥ బాలుడనంగ నెవ్వ డురుబాణము
చేతను బట్టి తమ్మతో। నాలముచేసి నాడనగ నద్భుతమైనదియంచు నేలపై।

సోలుచు ధైర్యవృత్తి మదిశోభిలనీ హయమేధయాగమున్ । జాలము సేయ
గాదగదు శౌర్యము వేళలటంచు ధీయుడై॥ చ॥ కనుగొనిలక్ష్మణా పవనశా
లము శోకము వేళగాదనీ । పును జతురంగసైన్యములు గొల్వగబోయి
హయంబుబట్టుమా ॥ తనిదెగటార్చి సోదరునిధైర్యముతో గొనిరమ్ము లె
మ్మమే । దివిసమరంబులో గెలువ దేవగణంబులకైన దీరునే॥ గీ॥ అనినల
క్ష్మణదేవుండు నమలపాద । పల్లవుండైన శ్రీరామభద్రునకును। వందనము
నర్చి కోదండపాణియగుచు । స్యందనము నెక్కి నిజధైర్య శౌర్యుడగుచు॥
చ॥ లలితరసాల పల్లవవిలాస పదాన్వితహస్తచారుసం । కలితవిభావరత్న
కటకాంగదభూషణ సుప్రకాశదో । ర్బలసుగుణాలవాల సురవర్ణితదీనశర
ణ్యమేదినీ। లలనసుతాసమేత శుభలక్షణ శ్రీరఘువంశపావనా॥

గద్య॥ ఇది శ్రీమద్భ్రమరాంబికా నిజకరుణోల్లాస కరుణాకటాక్షవీక్ష
ణాలంకార సరససరసామృతకవిత్వ తత్వాతిశయానంద భరిత సాంఖ్యతార
కామనస్క శ్రీరాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ఘట్టువంశ
పయఃపారావారసుధాకర కాశ్యపగోత్ర కాత్యాయనసూత్ర శ్రీవేంకటా
ర్యపుత్ర లలిత పాండిత్య వేంకటరామకృష్ణప్రణీతంబైన,
శ్రీపట్టాభిరామాయణంబను - మహాకావ్యంబునందు,
చతుర్థాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీ పట్టాభిరామాయణము

## పంచమాశ్వాసము

శ్రీజానకీశ పురహర । పూజితపదపద్మయుగళ పురుషోత్తమభూ।
రాజాధిరాజశేఖర । రాజితసత్కీర్తిసాంద్ర రామనరేంద్రా॥ వ॥ అవధరిం
పుముసుమిత్రానందనుండగు లక్ష్మణుండు రథారోహణంబు చేసిన॥ మ॥
తురగారూఢులు వెంబడింప ఘనమై శూరత్వంబులున్ మోయ ధీ। కరమై
వారణముల్సెలంగలయకాలాకార సేనావళీ । కరవాలంబులతో నదల్ప
రణఘీంకారాట్టహాసంబులన్ । ధరణీకంపమునొంద మెండుకొని మోక్షధి
రాద్యాదిసంగాత్ములై॥ మ॥ విమలాదిత్యుడనంగ లక్ష్మణుడు దోర్వీర్యప్రతాపం
బుచే సమరాసన్న జయంబుగాంచుచు మహాశస్త్రాస్త్రపారీణుడై। గమనా

నందతనొంది యోచనలతోఁ గాకుత్థ్సవంశస్థుతో। సముఁడె వీరుఁడు నెవ్వఁడో
పుధరణీచక్రంబుఁ నాకంబునన్॥ సీ॥ హయమునుబంధించి యనుజన్మునిన్
బోరి బ్రతికిరి యే నరపాలసుతులు। సమరవిక్రమ రామచంద్రుతో సమము
గా గలహించు మునులు నేఘనులో సురలో। ప్రళయ మారఘు సైన్యపతులు
తో మార్కొన్న సాహసధైర్యవిశాలు లెవరో। చటుల రౌద్రాకార జలధి
యూడగ గూడుబుద్ధిగలెడి రాజ పుత్రులెవరో। యెవ్వడయినను నో పురా
యిలను లవణదనుజు గెల్చిన నా సహోదరుని తోడఁ। బోరగలవాడు నె
వ్వడే పుణ్యావశము। తల్లినో దిననోములో దైవబలమో॥ క॥ అనివచ్చుచు
గంగానది। వనతలమును చేరజనని పావనిసీతా। వ. జాతి సుతులు సైన్య
ము। గనుగొనుచును మెచ్చి దివ్యకవచాయుధులై। క॥ కుశలవకుమార
వీరులు। శశివదనములమర విపులసైన్యము కెదురై। దశదిశలు సదరసంగర।
యాశులై కయ్యంబునకును యత్నముగాగన్॥ చ॥ కరిరథఘోటకాయుత
ముగల్గగ దిక్కులునిండి వైభవీ। కరులు శరాసనంబులును గైకొని మేరుస
మానధీరులై। హరులనదల్చుచున్ రథములప్పు చెలంగగ వచ్చి చుట్టిమా।
తురగము బట్టగానగునె ధూర్జటికైనను దాపసోత్తమా। క॥ విడువిడువు విూ
రలెఁ తటి వడుగులు తాపసులు బడుగు బాలలు శరముల్। కడతలు దెలి
యరుకోనల। నడవుల విహరించువారి కవునే బలముల్॥ ఉ॥ రామునితమ్ము
డున్ సమర రాక్షసమారణవిక్రముండు భూ। తామరసాప్తవంశజుడు
ధర్మదయాకరుడైన లక్ష్మణుం। డీమహరోషుడై వెడలె నీశ్వరుడైననునిల్వ
జాలఁడ। త్రామసరీతిమాని నిజా తాపసవృత్తిభరింప మేలగున్। చ॥ అనిన
గుమారులిట్లనిరి యాప్తులు నెవ్వరు లేరుమాకు నీ। వనములనీనృపాలకుని
బాహుపరాక్రమశక్తి యెట్టిదో। కనుఁగొనవచ్చినాము త్రిజగంబులు మెచ్చ
గ సంగరంబులో। ఘనముగ బోరగాగలరె కాదని ప్రాణము నాశ్రయింతు
రే॥ వ॥ అని మహాబుధులు కలంగ రోదసీకుహరంబు భేదిల్ల గుణధ్వని గావిం
చి బాణవర్షంబు గురియ బాణాసనంబులు విఱిచి ఘోటకంబులబడనేసి మ
దగజంబుల మర్దించి శిరంబులు ఖండించి వక్షంబులు చించి ఫాలంబులు వ్రే
చ్చి కరంబులు ఖండించి మధ్యంబులు త్రెంచి తొడలు తీండ్రించి రక్తప్రవా
హంబు చేసి గాసిపఱచిన నోర్వక పారెడి తురంగంబులును మ్రగ్గపడిన గజంబు
లును బెదరెడి సైన్యంబులును వ్రీడిమస్తకంబులును బెడబొబ్బలిడు భూతం
బులును మేదోమాంసంబులు పర్వతాకారంబులుగా బెండువడి సమరంబు
న నృపసైన్యంబులు మొనవిఱిగి భయాత్ములై తిరిగి చూచుచు బుట్టం
బులు దిగజార గిరీటంబులు సడల కేశపాశంబులు చిక్కువడ గాంచనరత్న
భూషణంబులు సడల కేయూరంబులు దిగబడ హారములు చెదరింపహాహా

సునాదంబులు నెలంగఁబరఁతెంచు సేనాసమూహంబుఁజూచిచెయివిచి సు
మిత్రానందనుండిట్లనియె॥ చ॥ మగతన మెల్లమానినృపమార్గము లేక విరో
ధభీతులై। మగువలరీతిగాఁజనఁగ మాన్యతదక్కునె యోగ్యనిల్వరే। జగతి
నిప్రాణికోటులకు జావునిజంబులు గాఁగ యుద్ధమై। తెగిన సురేంద్రలోకము
రుదెంచును శాశ్వతకీర్తులొందఁగాన్॥ చ॥ వెఱువకుఁడన్నలార పరమేశ్వరు
నైన నదల్చినిల్తుభూ। సురునినిమిత్తమై వెనుకఁజూచుచుఁబోయినఁగీర్తిదక్కు
నా। చొరబడిరండు నావెనుకఁ జూతురువిక్రమధైర్యశక్తిసం। గరముఖభుజా
బలంబుఘనకార్ముకబాణమహానలంబులన్॥ వ॥ అని తనసారథిఁజూచియి
ట్లనియె॥ క॥తురగములు నేర్పుఁజూపుచు। బిరబిరఁబోనిమ్ము రథము భేదింతుమ
హా।గరళమ్ములైనను ద్రిమ్మంగుచు। దరుముదుఁడనుజులకు నైన ధైర్యము కొలదిన్॥
క॥ అరథమునడువఁగఁ బొంగరు।ధరణీతలమందు విపులకార్ముకధరులై। మరుని
భదేహుల గనుగొని। మతిమతియోచించి విగతమానసుడగుచున్॥ సీ॥
మునులని చెప్పంగ మునులకీ చెలువంబు గలుగునా లోకసంకాశముగను।
సురలనిపల్కంగ సురలకీరూపంబు పొందునా యెచట సంపూర్ణముగను।
గంధర్వులనఁగను గంధర్వులకు దివ్యదేహముల్గలవె సందేహముగను। కిన్నరు
లన్నను కిన్నరులకు నిట్టి శేఖరంబవు నెక్రసిద్ధముగను। నెవరు యే దేశమేయూ
రో యెవరుగన్న। తనయులో గాక విక్రమధైర్యశక్తి।బలము లేరీతి వచ్చునీబా
లకులకు। బరువులైతిరి నరపాలపతులు నడరి॥ క॥బలవిక్రమంబు ఋషులకు।
గలుగునె వరచాపహస్తఘనకౌశలముల్। తెలియునె యుద్ధమునర్పఁగ
దలతురె యీపృథ్వీరాజ తనయులుగాకన్॥ చ॥ రాజకులాభిరాముఁడ
గు రాముఁడు పంపిన యజ్ఞయోగ్యమౌ। తేజినిబట్టిరా వశమె దేవసమూ
హముకైన వీరుభూ। రాజులుగారు దైత్యపర రాజులుగారు ధరాత
నూజులున్। మోజు చెలంగ బుత్రులయి పుట్టిరి యీగహనాంతరం
బునన్॥ ఉ॥ భానుకులుండు రామనరపాలుఁడు మున్ను జనాపవాదమున్।
జానకిపైదనర్చి వనశైలతలంబుల ద్రోయుమంచు నా। శానతిచేసినంచె
సతిగర్భమునం దుదయించినారలీ। సూనులు లేకయున్న బరిశుద్ధపరాక్ర
మవృత్తిగల్గునే॥ చ॥ అని తలపోసిపోసి తనయాత్మగతంబున ధైర్య
మొప్పగా। జనిచని మొండెముల్ తెగిలి సామజముల్హతమైన గుఱ్ఱముల్।
పెనగినభూతకోటులకు వెల్లువచునుండెడి రక్తధారలుం। దునిగిన కార్ముకం
బులును ధూళిశతఘ్నచయంబులెన్నుచున్॥ వ॥ ఇవ్విధంబున సుమిత్రా
నందనుండు మహాభయంకరంబగు సమరతలంబున మహాపరాక్రమంబున
ధనుర్ధరులయియున్న కుశలవకుమారులం బొడగాంచి చేరంజనియిట్లనియె॥
ఉ॥ బాలకులార మీకు నరపాలుడు రాముఁడు పంపు తేజినిన్। మేలనిక

ట్టగా దరమె మీకిది మంచిది గాదు రాక్షసు । ల్వాలగ లేరు ఘోర సురసంఘ
ములైనను నిల్వలేరు భూ । గోలకు గర్త నిత్యశుభ రామునితో గలహింప నేటి
కిన్ ॥ చ॥ జలనిధి గట్టి పోయి కపిసైన్యము గొల్వగ లంకఁ జొచ్చి భూ । తల
ము మహాతలంబులును దల్లడమందసురాలనాథ దో । ర్బలమును తాను రావ
ణుని బంధు సుతాప్తులతోడ దున్మించె భూ । జలరుహమిత్రవంశజుడు సంగ
రధీరుడు మీకు సాధ్యుడే ॥ ఉ॥ ఎవ్వరు దెల్పినారలిది యేమి విచారణ జేసినారు
మీ । రవ్విలుకాండ్ర మేటియగు నాతనితోడ త్రిలోకవంద్యుతో । నెవ్వ
రైన బోరదరమే వరమేష్టికినైన దీరునే । నవ్వచురంబు ప్రోచు శరణాన్నను
గాచె విభీషణాదులన్ ॥ సీ॥ దశరథమేదినీ ధవువంశజాతుడై భవుని గార్ము
కమును భంగపఱచె । బాషాణదోషంబు బాపియు జనకాజ్ఞ గయికొని
గహనవ్రికాముడయ్యె । ధరణి చతుర్దశదళ సహస్రములను భజించె నిజ
భుజా బలము కొలది । జలనిధు లేకును జౌకలించెడి వాలి గర్వంబణంచె నే
కాస్త్రమునను । గడలి భేదించె లోకభీకరకరాళ । వక్త్ర నఖదంతరోమ
భయంకరములు । గలుగు దైత్యాధిపతిని త్రిలోకకంఠ । కంఠదశకంఠ లుంఠన
ఘనయశుండు ॥ ఉ॥ కావు పబోరలేరు త్రిజగంబులునైనను మీకు సాధ్యమే ।
పావనులార తాపసకుమారకులార సుబుద్ధి మీరలీ । భావము మానిరం
ముకలమాన్నములుం గటకాంగదంబులుం । దావులు మీకొసంగెదను
దంతిచయంబులతోడ నిప్పుడే ॥ క॥ అనవిని కుశుఁడిట్లనియెను । జననా
యక యిట్టి సాహసంబులు మాపై । బనిగొనగఁ జేసి యశ్వము । గొనిపో
వలెగాని యిన్ని కూర్పఁగ నేలా ॥ క॥ బలవంతులు మీరిలఁదు । ర్బల
వంతుల నెఱుచు తోచబడినచో మమ్మున్ । బలదుర్బలములు సంగర ।
తలముల నేర్పడుఁ బవలెను దగునా వినుతుల్ ॥ క॥ పసిడి గలవారు గను
కను । మసలగ మత్తేభతురగ భటవర్గముతో । ముసరుకొనినార లడ
విని । వసియించెడివారి కెట్లు వచ్చున రెండ్రా ॥ ఉ॥ మీసరి విక్రమంబు
లును మీ చతురత్వము మీ మహాత్మ్యముల్ । మీ సమరత్వ ధైర్య
మును మీ విపులాధిక సత్యధర్మముల్ । బాసయొనర్ప మాకగునె బ్రా
హ్మణవృత్తి భరించి కోనలో । వాసము సేయువారలకు వైభవసంగతి కోర
నేటికిన్ ॥ సీ॥ ఫలపుష్పసంకాశ వనము లేమాకును బట్టణప్రాకారమందిర
ములు । సారంగమృగపక్షి జాతు లేమాకును జటులరౌద్రాకార సైన్యప
తులు । మలయాద్రి నీలాద్రి మందరాద్రియు మాకు నభినవహేమ సింహా
సనములు । శుకపికషట్పద నికరంబు లేమాకు భీమవిస్ఫుటనాద భేదగతు
లు । పట్టుజేలంబు లేమాకు వల్కలములు । ఫలము లేమాకు బహువిధ
భక్ష్యములును । బోసగరుద్రాక్ష లేమాకు భూషణములు । దనిసియుండు

ము మీరిచ్చుధనములేల॥ క॥ నవనార్వ్యా మైన తేజిని। నవనీధవ కట్టివిడువ నవ్వు నేయిదిగో। బవరములుచేసి గెలుతుము। అవనీశు లైనగాని యమ రులనైన॥ క॥ బిరుదొకటిగాని యేకుల। నరవరులకునయిన నమరనా థులకైనం। దురగమునుబట్టి విడుతుమె। హరిగ్రోయోగ్య హరుడునైన న క్కుండైనన్॥ ఉ॥ తాటకిదు్రించిపోయి భువితాపసిజన్నముగాచి రాతి నిన్। బోటిగజేసి యాజనకభూపతిమెచ్చ గిరీశుచాపమున్। పేటులుపొం దజేసి కపి వీరునినొక్క శరంబుచేత నో। నాటగనేసి ట్టినరనాథుడునైన నుభీతిగందుమే॥ ఉ॥ జలనిధిగట్టి ఘోరమగు సంగరభూరి పరాక్రమాపరా ముడై। చెలువముగా ధరాతలవిశాతలం బదరంగ శేషుడుం। దలలను నంప రాక్షసకులాన్వితుడౌ దశకంఠుకంఠము। ల్బలమునదు్రించు రాము నరపాలకుడైనను మాకసాధ్యుడే॥ క॥ రామునిమాతకు వీరసు। నామం బులుగల్గె జనకనందన కెట్లున్। యేమాట్కి రాదొ చూతము। భూమిం బేరైననొకటి పొడమగవలదే॥ క॥ సంగరముగెల్వ వ్రాలిన। భంగము గాకుండ స్వర్గభవ భోగంబుల్। శృంగార మమరగల్గుచు। సంగతియిల శాశ్వతములె జసములకెల్లన్॥ క॥ మీతల్లియె బలవీరుల। భూతల మున గనెనొగాక భూషణమనరేన్। మాతల్లి యేలకనదో। చూతము సురవర్యులెల్ల చోద్యమునొందన్॥ క॥ తురగమును విడిచి మీరా జ। పు రికింబోరాదు పాయకెు బూనినవెనుకన్। జరగుము మునివనములకై। హ రుషింపగ నింక యుద్ధమైనది మేలే॥ ఉ॥ పట్టినపట్టు మీధణి పాలకులై నను నెవ్వరైననుం। దిట్టన సత్యకీర్తులరు దెంచునె దైన్యత నొంది భూమి లో। బొట్టలు పాకగానగునె భూరిపరాక్రమ వర్ధనీయులై। పుట్టిన తల్లి దండ్రులకు భూషణమా దిశలెల్ల మెచ్చగాన్॥ క॥ ధైర్యముగల కుశల వులలో। గార్యంబులు సేయుగడుప గనుగొనుచుమహా। శౌర్యంబునసౌ మిత్రియు। సూర్యాన్వయ నుతులకనియె శోభితుడగుచున్॥ ఉ॥ తాపసు లారయేల శుభదామ విలాసములార యూరకే। కోపము సేయనేల స్వ పకోటులు నన్నెదురింపజాలరీ। చాపముచేత దైత్యకుల థంభవు లందె గ టార్చినామమీ। తాపసవృత్తిమానుదురె తామస ప్రవృత్తినిబొందనర్హ మే। చ॥ సమర వరాక్రమాలితను సాహసరీతులుమీకు నేలమా। సవ మును గారు వేదములుశాస్త్రములున్ విహితంబుమీకు నే। మములనవచ్చు యుద్ధములు మాకు దపోవరయాగ్న్య నేలుశ్రీ। రమణునియజ్ఞశాలకును రండు శుభంబులు మీకునయ్యెడిన్॥ క॥ అనిన గుమారులువినిమో। జ నపతి హయమేధయజ్ఞ శాలనుమాకుం। బనియేమి కఠినసంగర। మున గెల్చిన వెనుక మనముపోదము పురికిన్॥ చ॥ అనవిని లక్ష్మణుండుతనయూ

త్మను శౌర్యము పెంచిధీరుడై । మునిసుతులార చెప్పినను మూర్ఖము
మానర దెంతవారునా । ఘనశరవహ్ని కీలలు ప్రకాశమెనర్చెద నోర్చి
నిల్వరే । యనివిశిఖంబులేయ వియన్నియుఖండముచేసి ధీరులై॥ వ॥ ఇ
వ్విధంబున సైన్యంబులకు లవుండును మహాఘనుండగు సుమిత్రానందనునకు
గుశకుమారుండును నిలిచి చటుల రౌద్రాకారులయి భూనభోంతరం
బులు నిండనార్చుచు శరంబులు పుంఖానుపుంఖంబులుగా బరగించుచు
వజ్రమయంబులగు కవచంబులు చించి చెండాడి గరినాస్త్ర భేదరక్తసిక్తాం
గులగుచు దశ శతసహస్ర లక్షలకోలల శితాస్త్రంబులు నించుచు శర
కౌశల చిత్రంబులు గనుపుచు లవకుమారుండు సైన్యంబులపై బ్రళయ
కాల కాలనలజ్వాలా భీలనేత్రుండగుచు మేదోమాంసంబులు రాల్చుచు
ధవళాతపత్ర ధ్వజచామరంబులు తెగనేయుచు మత్తమాతంగ కుంభా
గ్రనిష్ఠ్యూత జనిత నవమౌక్తికంబులురాల్చుచు పవననిభజవతురంగసమూ
హంబుల దరుముచు మహోన్నత విభాసిత కనకరత్న నిర్మిత రథంబులం
బడద్రోయుచు నరనాయకుల నఱకుచు గాక గృధ్రానేక భూతంబులకు
విందులు సేయుచు రక్తాంభోనిధులుగావించుచు గదాధరుల జదుముచు
ధనుర్ధరుల ఖండించుచు శూలహస్తుల శోధించుచు గరవాలాయుధులఖం
డించుచు సామంతుల చెండాడుచు సేనాధిపతులం జీరుచు చక్రాయుధుల
వక్త్రంబులు సడలించుచు ద్రినేత్రుండు భవనంబులు గెల్చినపగిదిం బ్రళ
యకాలా భీలమూర్తియై కమలాకరంబు చొరబడు గంధసింధుర కిశోరం
బు చందంబున విచ్ఛిన్నంబులైన వదనంబులును విఫలంబులైన సైన్యంబు
లును విభిన్నంబులైన దేహంబులును విడివడిన కేశంబులును చెదరిబారె
డి ఫౌజులును గలిగి యుండెడి సమయంబున సింహంబు సింహంబును గ
జంబు గజంబును బర్వతంబు బర్వతంబుగను సముద్రంబు సముద్రంబుగను
మార్కొను చందంబున సుమిత్రానందనుండును వయిదేహీ నందనుండగు
కుశకుమారుండును ననేక విధంబుల సంగరంబులు సలుపుచు॥ సీ॥ ఆక
ర్ణముచేసి యాగ్నేయశరములు పవనాస్త్రములును నేర్పరులగలిగి ।
రౌద్రాస్త్రములవీర రౌద్రాద్భుతంబులు శేషాస్త్రములమహా చిత్రమాల
ను । చక్రాయుధంబుల చందంబు బ్రహ్మాస్త్ర వివిధాయుధంబుల వేత్తల
గుచు। చాపాన శరములు సంధించి వేయుచు దిరుగుచుబేరులు దెల్పికొ
నుచు। వడిగ నిప్పులురాల్చుచు వజ్రపంచ । రత్నములు సుప్రకాశిత రమ
ణమమర। గోత్రధరణులు ఘూర్ణిల్ల గుండెలదర । దేవగణములు గను
గొన దిరుగబడిరి॥ చ॥ జలనిధులెల్లఘూర్ణిల్లగ జండపరాక్రమ క్రోధితా
స్యులై । జలరుహామిత్ర వంశజులు సంగరధీరులు సుప్రకాశులుం। జెలు

నమ్మానెరదుచుక్ సకలసీమలు సన్నుతిసేయ బోరుచున్ । దోలగుచుండ దావ
యుతుం బ్రళయ ధూర్జటులో యన నొప్పుచుండగా॥ సీ॥ ప్రళయోదా
చారి కార భానుబింబంబులో లయకాల మృత్యువి లయగణములో । కాల
పాశద్వయ గజములో దేవేంద్రు వజ్రద్వయంబుల సెంపుకలిగి । యతిబ
వంబుఁ బేర్చి యచలాస్త్రములుగూర్చి యాగ్నేయశరములు నాగ్రహించి ।
కదన విక్రమమదగర్వ ప్రతిష్ఠులై పోరాడుచును నెల్లభూనులదర । లక్ష్యము
లు వట్టిశరముల లక్షలమర । విశిఖములుమీద రుధిరమునువీరరసము । వద
నములమీద జెన్నొందవైపులెసగ । మహినిలక్ష్మణసీతాకుమారు లనగ
లు॥ వ॥ ఇవ్విధంబునం బ్రళయకాలకాలానల విజృంభమాణులగు సాకేత
పురమపావనియగుసీతామహాదేవి గర్భపారావార సుధాకరులగు కుశలవ
కుమారులును నింద్రజిద్వైరియును సాకేత్ శేషాహి వ్యూహప లక్ష
ణుండును నగు లక్ష్మణుండును నధిక సాహసంబులతో నితరేతర జయ
కాంక్షలతో సాటిలేని వీరాట్టహాసంబులం జెలరేగుచు మదగజంబుల
రీతిం గదియ నూదుచు సింహార్భటులు గావించుచు శింజినీ నినదంబులు
సలుపుచు శూలంబులు ద్రిప్పుచు జక్రింబులనేచుచు బాశంబులడాయుచు
బాణంబులబెంచుచు విశిఖంబులు వేయుచు ముసలంబులు నురుముచు
ముద్గరంబుల మెఱుపుచు దూణీరంబుల దూలించుచు ఖడ్గంబులు విస్తుచు
శరంబులకుం బ్రతిశరంబులు పరగించుచు శరసంధానంబులు సాధించుచు శిం
జినీటంకారంబులం జెలరేగుచు శరంబునకుం బంచశరంబులం బంచశరంబు
లకు దశశరంబుల దశశరంబులకు వింశతిశరంబులను వింశతి శరంబులకుం
బంచవింశతి బాణంబులం బంచవింశతి మార్గణంబులకుం ద్రయోవింశతి
శిలీముఖంబులం ద్రయోవింశతి శిలీముఖంబులకుం జతుర్వింశతి బాణంబు
లం జతుర్వింశతి బాణంబులకు బంచవింశతి బాణంబుల బంచవింశతి మార్గ
ణంబులకుం ద్రయస్త్రింశచ్ఛిలీముఖంబులం ద్రయస్త్రింశచ్ఛిలీ ముఖంబు
లకుం జతుస్త్రింశద్బాణంబులను చతుస్త్రింశద్బాణంబులకుం బంచత్రిం
శద్బాణంబులను బంచత్రింశద్బాణంబులకు షష్టిబాణంబులను షష్టిసా
యకంబులకు సప్తతిసాయకంబులను సప్తతిసాయకంబులకు శతసాయకం
బులను శతసాయకంబులకు బంచశతశరంబులను బంచశతసాయకంబులకు
సహస్రవిశిఖంబులను సహస్రవిశిఖంబులకు దశసహస్ర శిలీముఖంబులను
దశసహస్రబాణంబులకు లక్షమార్గణంబులను లక్షకుఁ గోటిగోటికి దశకోట్లు
నా సర్బుదంబులకు న్యర్బుదంబులను బద్మంబునకు మహాపద్మంబులను
క్షోణికి మహాక్షోణులును శంఖంబులం బటుతరసూర్యబింబంబు మఱుఁగుపడ
గాఢాంధకారంబై యుండ నంతనప్పుడయ్యిరువురు నాందోళులపై శరవర్షం

బులు గురుపించుచతతింబోదు ఘోరంబయ్యె దేవేంద్రామర యక్షగంధర్వ
కిన్నర పన్నగకింపురుష గరుడగంధర్వ సిద్ధసాధ్యాప్సరసలుదివినుండి భేరీ
రవంబులుసేయుచు మహోత్పాతం బగుననియెన్నుచు శంకాశంకితమన
స్కులై వీక్షించుచున్నంతటందనతోఁ సమముగఁబోరు కుశకుమారునిశరసం
ధానంబునకు మెచ్చుచు నితండుదేవాంశ సంభూతుండుగాని నరుండుగాడ
నియెంచి లక్ష్మణుండిట్లనియె॥ ఉ॥ బాలకులార మీచటుల బాణముచేధ
రియింప దీనిచేఁ । దూలుదురెవ్వరైన బలితోపము నొందితినన్నలార
మీ । మేలునుగోరినాడఁ జనమేదినిపై నెదిరింపలేరు భూ। పాలకుజేరరం
డటవివాసములెల్లఁ దొలంగజేసెదన్॥ వ॥ అనినసర్వలక్షణ లక్షితుండగులక్ష్మణ
క్ష్మణ స్వామింజూచి కుశలవకుమారులిట్లనిరి॥ మ॥ నవమాకోరిరామ ని
జసాయకతీవ్రమహానలంబులై । భువనముఁ బాసిపోము ఘనభూషణవిక్రి
మశక్తియాలునే। యువనిని నీటముంపఁగల మర్కమహావీర దైత్యులైన
శ్రీ। ధవుడుఁగాని పోరకను బాసిన మమ్మునుజూచిమెత్తురే॥ క॥అనినమ
హాస్త్రము లక్ష్మణు । డనుకవచమునంట నేయనద్రిదుంచెమహా॥ వనని
ధులుసకలనిర్జర । ఘనసంగములదరి భూతగణములు బెదరన్॥ గీ॥ మతి
యుబ్రహ్మాస్త్ర శరముపమాత్రికముగ । ధనువునందున ధరియించితల్లి పర
మ । సాధ్వియైనను నీమహాసాయకమున। నవనినాథుండుబ్రదెళ్ళెడు మని
తలంచి॥ క॥ విడిచినమండుచు శరములు । నడుమనదెగటార్చికొనుచు న
గములువడకన్ । జడురథసంబున రోజుచు । వడపుఁ సౌమిత్రి విపులవ
క్షమునాటెన్॥ గీ॥ ఆదిశేషాహిగనుక నాయస్త్రమునను । మృతినినొం
దమూర్ఛతో మేదినిపయి । బవ్వళించెను హతశేషపతులు వడిగ । వ
చ్చిసాకేత పట్టణభాగమందు॥ వ॥భగవంతుడగు శ్రీరామ భద్రుఁ యజ్ఞ వా
టంబునాచ్చి తమదాకమొతింగించి నమస్కరించినిటలతట ఘటితకరకమల
పుటులై దేవాసుమిత్రానందనుండగు లక్ష్మణస్వామి సకలమృగపక్షి సం
కులగంగారణ్యంబునందు పవనహయంబుకొఱకు దావసులగు కుశలవ
కుమారులతో ఘోరయుద్ధంబుచేసి బ్రహ్మాస్త్రప్రయోగంబున మూ
ర్ఛాగతుండయ్యెనని చెప్పిన గడగడవణకుచు నిట్టూర్పులునిగిడించుచు
హాహాకారంబులు సలుపుచు ధరణీతలంబునంబడి మూర్ఛిల్లి కొంతవడికిం
దెప్పరిలి ప్రియసహోదరుండగు లక్ష్మణుగుణంబులం దలపోయుచు శ్రీరా
మభద్రుండిట్లనియె॥ చ॥ నినునెడబాయలేను జననీమణినేగతి నూరడిం
తునా । తనువు ధరింపలేను సురదానవులందుననీ వజేయుఁడై । వనముల
సంచరించుమని బాలకుమారులచేత మూర్ఛగా । గనలితివేల చిత్రమది
కాంతుని నీధరణీతలంబునన్॥ చ॥ ననునెడబాయలేక జననాయక భోగ

ముమూనినీకానిపై । వనముల వెంటనంటి తరుభాగము. శాఖలు నేర్పరించిగా।
దనక ఫలంబుఁ జేరి యవి దాఁచి యొసంగుచు నిద్రమానినా । మనసు విధంబు
గా దిరుగువారలు నెవ్వరురా కుమారకా॥ చ॥ చటులత రావణాసురుని
శక్తియు నీ యెడ వ్యర్థమాయె । నేడిటువలె దానవాన్వయుడు నేసిన మార్గ
ణమన్ని జొచ్చి । యాపటుగతి ద్రెళ్లినావనగ భావములో నిజమెంచ వచ్చు
నా । కటకట నీవు లేని యొక కార్యము సేయఁగ నిశ్చయింతునా॥ సీ॥ అతికా
య ధూమ్రాక్ష ముఖాసురాధినాథుల బలవిక్రమంబు లేపగిది నడఁచె । నిం
ద్రాదిసురులతో నెదురించు దశకంఠు నాత్మజుఁ డెవనిచే నడఁగె బోర। కుం
భనికుంభాది ఘోర రాక్షస మహాగర్వంబు లెవనిచే గరుగఁబడియె । నమ
రారి వేల్చెడి యజ్ఞకుండంబులో సత్వము లెవనిచే హతములయ్యె । నట్టి శే
షాహితో సమమైన బలిమి। గలిగి వర్తిల్లువాఁడవు కయ్యమందు । బాలకు
లయందు నీ బాహుబలము నిలిపి। సమరదుర్బలుఁడైతివో సత్యశీల॥ క॥ అ
నికొంత సేపు దుఃఖము। జనితంబుగఁ జేసి సమరసాహసుఁడగుచుం । గనులం
దు నెఱుపు గదురఁగ । గనుఁగొని భరతాదిరాజగణములకనియెన్॥ చ॥ స
వనపువేళ దుఃఖములు చాలదగూడదు మీ రశ్వరతు । లెవ్వరు మొనర్చు ని
ల్చెదరు బంధుహితాప్తులు గొల్వఁబోయి యా । భవుఁ డనఁగాఁగ బోరి ర
ణ మార్గము చూపి హయమ్ము దెమ్మయీ । రవికులమందుఁ బుట్టి కర
రాజుల గెల్వకయున్న మెత్తురే॥ చ॥ అన భరతాదిరాజవరు లందఱు
సాగిలి మ్రొక్కి దేవయా । వననిధులడ్డగించినను వజ్రియు నిర్జరులైన వచ్చి
నన్। ఘనసమరంబు సేయుదుము గైకొని వత్తుము ఘోటకంబు నీ । జనములు
మెచ్చగా సవనశాలకు మున్నకయే లవచ్చెదన్॥ అని రాసమయంబున॥ సీ॥ అంగ
కళింగ వంగాది దేశాధీశవరులు భూనభములు వడఁకగాను । రథములపై రాగ
రౌతులు నడువగా మత్స్యకేరళ నృపవరులు గొల్వ। మాళవముల యాళి మగధ
భూపతులెల్ల గంధేభముల మీద గదిసి సెలఁగ । బంగాళ నేపాళ పతులు వా
హముల నెక్కి బారులు దీరి వెంబడిని రాఁగ । ఘూర్ణితంబయ్యె రోదసీ కుహర
మెల్ల । భేరులు మ్రోఁగె సైన్యములెడలెగవచ । ధాతులందరు జనిరిని దా
నులఁగుచు । వందిజనములు కూడిరి వైభవముల॥ ఉ॥ తేరులు వెంబడింపఁగ మ
దేభసమూహము వెంటరాఁగ । సంచారణ ఘోటకాది వరిచారులు విస్ఫుట
చాపధారులై । ధారుణి వెల్లగిల్లఁగ మదారుణ నేత్రములందు నిప్పులున్ ।
గారఁగ గొంతపౌజు వెలిగా జను దేరఁగ మేరుధీరుఁడై॥ సీ॥ పర్వతాకారమ
హా భద్రేభములతోడ వర్ణితంబుగ వీరవరులు నడువ । జటులరౌద్రాకార భ
టులు మ్రొతాప్రులై తప్పక కర్ణాట దళము లెదుర । గరవాలము మరకతినా
యూధంబులు ఘనమంది రాజపుంగవులు వెలఁగ । ధవళాతపత్రము ల్థరి

యించికొందరు వేద్యులై యెడనెడ వెడలికొలువ । దిశలు బెగడొందమిం
టను దేవగణము । కుసుమములురాల్ప గుహ్యకకోటి బెదర । ధరణీనాథు
లు నిదియనుత్పాతహేతు । వనుచుబలుకంగ భరతుడాగ్రహముతోడ॥
క॥ సారథియరదంబును శృం। గారము గావించి తేర గమనోన్ముఖుడై । భేరు
లుగ్రమోయగసంగర । వీరులతో నెక్కి నడువ వెడలెను బౌజుల్॥ ఉ॥ పో
వుచునున్న నత్తరిబ భూజననాథునిజూచి భానుడి । భూవరమందునుండియి
క భూరిరణంబును జూడసంచునా । భావముతో మహాంబునిధి మధ్యము
నందువసించెనోయనం । దోవను నంధకారములుదోచెను గాటుకకప్పు
లై వడిన్॥ చ॥ తమము ప్రసిద్ధి కెక్కను ముదంబున నంతత మోహరాగ
సం । గరమహిచక్రవాక పరికల్పిత ముజ్జ్వలధూమమోయనన్ । నమరె
దిగంత రాళములయందు నభంబును నాజ్ఞంబు సం। గమతవహించివర్ష
ములుగా గురిపించెననంగ భీమమై॥ సీ॥ సరభసంబునబక్షి జాతులు మేత
లువిడిచి భూరుహముల మీదవ్రాల । శరభసింహమదేభ శార్దూలమృగ
ములు శైలాంతరంబుల సంచరింప । భూతప్రేతపిశాచ భేతాళసంఘంబు
కాంతారసీమల గదలుచుండ । ఘూర్ణిల్లగామహా ఘూకచయంబును క
డుభీమనిదనము లడలుకొనగ । జారచోరులసంతోష జలధిదేల । సూర్జి
తంబుగ గోమాయువుల్చెలంగ । దితిజులు చు లేచియప్పుడే దిశలుదిరుగ। నం
ధకారంబు వొడమెను నతిశయముగ॥ వ। ఆసమయంబున సాకేతపట్టణం
బున గడిదివంచ యోజన దూరంబుకా క్రిరమృగ సంకుల శైలారణ్యంబు
లం బొద్దుగుంకిన సామంతాదిమహాయోధ వరులు కైకేయీ నందనుంగ
ని కేలుమొగిచి యిట్లనిరి॥ క॥ ధరణీనాయక గంగా। వరతీరమునందు నిలి
చి పరగంగారే। వరుణోదయ మయ్యెనంతనె । బిరబిరబోవుదము సమరభీ
కరులగుచున్॥ చ॥ కవలనుగట్టినీవు మొడగాంగల దచ్చటిసైన్యవీరభూ ।
ధవులనుడస్సినారు కుముదాప్తుడు నైననురాడు మిక్కిలిన్ । నవరణరా
త్రులందు ఘనసంగరధర్మముగాదు మేదినీ। ధవులకుమున్న భూవిభుడతండము
కమ్మని హెచ్చరించగాన్॥ ఉ॥ తావులుచూచువారు మరిదంతిచయంబు
లగట్టువారలు । ద్రోవలుదీర్చువారు బరితోషముతో హయబృందకో
టికిన్ । సేవలుచేయువారు జనిశీత జలంబులుగ్రోలువారుభూ । పావని
జాహ్నవీయనుచుం బ్రార్థనజేసెడివారు కొందఱున్॥ వ॥ ఇవ్విధంబునం
దమకుదగిన భూములయందు ననేక సైన్యాధిపతులుగుడారంబులు వేయిం
చి స్నానంబులుగావించి తగుపుట్టంబులుగట్టి చందన విలిప్తాంగులై వివిధ
భూషణంబులు ధరియించి సరసనసంపన్నంబులైన యన్నంబులుభుజియించి
తాంబూలాది వినోదంబులం బొద్దుగడుపుచుం గదనోత్సాహులై భా

నూదయంబు వీక్షించియిట్లనిరిః ఉ॥ బాలకులెవ్వరో బహుతరభాగమునంబ్రి
ళియొూర్కురుద్రములై। దేలుచునున్నవారు బుధదేవతలోనరయక్షసిద్ధులో। నా
లోములోన లక్ష్మణునినాతనితమ్ముని మూర్ఛ సేయునా। భీలపరాక్రమాకలి
త వీరులు నేగతిఁ బోరనేర్తురో॥ ఉ॥ తల్లియు నెంతపుణ్యవతొ దైవబలంబొ
తపఃప్రభావమో। తెల్లమిగాదునయోనిజులో ధీరులొ రాముని పైచలంబు।
శోభిల్లగనేమికారణమొ భీమపరాక్రము మెట్లుపొంనో। పుల్లసరోజనే
త్రులను బోరదరంబగునే తలపగన్॥ వ॥ అదియునుగాక॥ చ॥ జనకుని
పుత్రిసాధ్వి జలజాక్షిని ఘోరపనాగాగ్నిలోంబులో। వనముల ద్రోచిరమ్మ
నుచు బలిష్ఠనపాపము చిత్తమోవునే। జననికిబుత్రులై విపులశౌర్యము
రాణగజేసి నావెయిా। దినమున నెట్టులైనదివి దేవసమూహము కైనదీరు
నే॥ గీ॥ తేజరిల్లగ శ్రీమహాదేవిగాని। మనుజకన్యకయనగూడ వశమెప
రమ। సాధ్వి పైనిప్డు నిందలు సంభవించు। కతమునను నిన్నికార్యము ల్గలు
గనయ్యె॥ క॥ సీతాపుత్రకులయినవి। ధాతకుదరమానె గెలువ ధరణిస్థలి
లో। భూతాధిపతికిఁదీరునె। పాతకుండారజకుడెంత పనిసాధిఁచెన్॥ క॥
అనుచుననేక విధమ్ముల। జనములువలుకంగ రాత్రిసమయము తెలనై।
యినుడుదయమొాట సైన్యముఁ। గనుఁగొన వస్థానభేరిగడలుకొనంగన్॥
క॥ తురగములునడచె వెంబడిఁ। గరులును శైలములవగిదిగదలెను సపు
డే। ధరణీతలంబువడకెను॥ శరకరవాలములు మెఱయసైన్యము చని
యెన్॥ క॥ వచ్చెడిసైన్యము గనుగొని। యచ్చటగుశలవులు క్రోధమడర
గనదిగో। ముచ్చటదోచగ నరవతి। వచ్చెడిచందంబుచూడ వైభవమమ
రన్॥ సీ॥ కూర్చినముత్యాల గొడుగులపడగలు తరచుగానుండెను దంతి
చయము। నీలాద్రిశృంగము ల్నిలిపినచందాన సాగివచ్చెనువాయు జవ
తురంగ। బృందంబులేతెంచె భూచక్రగొడుగులు నర్కబింబముదీప్తినడ్డ
గించె। రమణీయమగుచామరములుతీవిజెలంగె స్యందనంబులుచుట్టుసం
చరించె। దట్టమైవచ్చె గర్ణాటదళములిదిగొ। పరశుపట్టిసకరవాల పాశ
కుంతతోమరంబులు తరుచయ్యెత్రోవలందు। నిందద్రిభోగముగలయిత డెవ్వ
డొక్కొ॥ మ॥ ఎవడైనన్ మనకేమిసంగరములో నిందాద్రిమద్రశ్రేణితో।
భవుడైనం జనుదెంచెనేని భయమా పంతంబులీడేరెగా। జవసత్వంబులు
గల్గు నీతురగము ల్చండాడిభద్రేభభూ। ధవులం దుర్గింపగలేకపోయినను
సీతాపుత్రులై యుందుమే॥ క॥ ధీరతతో నీపోరను। శూరపరాక్రమము
మనము చూపియువీరిన్। ఘోరరణంబున గెల్చియు। జేరినమనతల్లిప్రీతి
చేయునుబిదపన్॥ క॥ అనిదృఢ నిశ్చయులగుచును। ఘనమగు కవచములు
దొడిగి కార్ముకధరులై। యినచంద్రులో వీరనగను జనుదెంచిరివారి

జూచి సైన్యముదరుచె॥ మ త్తకోకిల॥ తావసాధిపులారసంగర ధైర్యము ల్దలపోసియి॥ భూపవర్యులతోడి బోరగబోలునే యతిధీరతం। బాప యుక్తుని రావణాసురు బంధుమిత్రి సుతాప్తులం। జాపబాణము పట్టిరా ముడుచండడే రణభూమిలోన్॥ కావున॥ క॥ తరుముదుము సురలనైనను। వెఱపింతుము రుద్రునయిన విదళింపుదుమే। ధరణీనాథులనైనను। నెరత నమునమీరుపోర నేర్తురెబలిమిన్॥ క॥ అనిసైన్యంబులు గ్రమ్మగ। గను గొనినేత్రముల నగ్నికణములు రాలన్। ఘనకుంజరములమీదను। జను సింహకిశోరయుగము చందముదోపన్॥ వ॥ ఇవ్విధంబున గుశలవకుమా రులు తమజననితోగు జనకాత్మజను మనంబునధ్యానంబుచేసి వ్రీళయకా లానల విజృంభమాన పరాక్రమాభీలతేజులై మోహరించు శవనజవం బుగల ఘోటకంబుల దఱుముచు మహోరుద్రులచందంబున నెదిరించు మత్తకుంజరంబుల మర్దించుచు జారులంజీరుచు సామజ గండస్థలంబుల రక్తంబుజొనుపుచు రథంబులబరిమార్చుచు గజారోహకుల విదళించుచు శక్తిహేతుల సమయించుచు బహుఘోరాయుధంబులు భస్మంబుసేయుచు గుఠా రంబుల ఖండించుచు దోమరంబుల దూలించుచు ప్రాసంబుల బట్టుచు మహారభసంబునందేలి దేవాసురసంగ్రామసన్నాహంబైతోచుచున్న సమ యంబున వివిధభేరీరవంబులు చెలంగ దెగినమస్తకంబులును విరిగినయూరు దేశంబులును బగిలినఫాలంబులును విచ్ఛిన్నంబులైన నాసికంబులును వి సంధులైన శరీరంబులును నలినలియైన జానుదేశంబులును వ్రస్సినయురం బులును జెదరినకేశపాశంబులును విరథులైనరథికులును బారెడిరక్తప్రవా హంబులును నాడెడిమస్తకంబులును జెడబొబ్బలిడు మస్తకంబులును సాంద్రతరంబుగా మహార్ణవం బేకార్ణవంబులుగావర్షించుగతి శరంబులు గురియుచు మహాభయంకర సంకులసమరంబునందు॥ సీ॥ బంగాళనేపాళ పాంచాలరాజుల సంగరతలమున సమయజేసి। కొంకణకెంకణకోసలా ధీశుల గర్వంబులెల్లను నిర్వహించి। లాటవరాట మరాటధాత్రీనాథ వ రులవిక్రమములు మాయజేసి। మాళవకాశ్మీర మగధబర్బరముఖ దేశాధి నాథుల దిశలకనిపి। గౌళకర్ణాటకోసల ఘనులనెల్ల। బట్టివిదళించి ద్రావి డభూపతులగెలిచి॥ తిరిగిరథాశ్వవజాతులకలహమందు। గర్భములుంచి విక్రమకఠినులగుచు। చ॥ తరుముచు ఘోటకంబులను దంతిసమూహము వెంటనంటుచున్। విరథులజేయుచున్ రిపుల వక్షతలంబులు దూరిపోవగా। శరములు రువ్వుచుంమిగుల సాహస వృత్తులనేర్పరించుచున్। నరములు ద్రెంచుచుం గతిననారసముల్దగనాట నేయుచున్॥ చ॥ తనువులుదూల నేయుచును దప్పకసైన్యముమీద దూరుచుం। గనులను విస్ఫులింగ

ములు గ్రక్కునరాలఁగ నట్టహాసముల్। జెనఁగొనఁగాంచము ల్వాదలవేయు
చు సింహముఁరీతి నార్చుచున్ । వనవిధు లెల్లఘూర్ణిలఁగ భండన ముత్కృతమై
చెలంగగాన్॥ చ॥ కలవరమందఁగానపుడు గన్గొనిమండుచుఁ గ్రోధితాత్ము
డై। నిలునిలు బాలులారయిదె నేఁజను దెంచితి రండుమీభుజా । బలములు
నెట్టివో తెలిసివత్తును దుర్బలకోటిమీదవిబా । రలిగిన తోడివారమును చు
నాత్మదలంతునె సంగరంబునన్॥ క॥ అనిపలుకుచుండ సీతా । వనజాయ
తనేత్ర సుతులు వాడిశరంబుల్ । పెనుమంటలెగయ నేసిరి । ధనువును
సారథియు రథముధరపైఁ గూలన్॥ ఉ॥ అంతని వేదురుఁదగిలి యార్భటి
సేయుచు విప్రులారమీ । రెంతటివారు పోఁగను నీగదచూచితే భరిం
తురే। యెంతటివాడైనగాని యిపుడెడ్డమువచ్చిన భీతినొందడే । వంతముతే
ల యీసమరభాగములో బరువెత్తిపోవరే॥ క॥ అనిపల్కులవకుమారుఁ
డు । ధనువున మార్గణమునొకటి ధరియించిదో । కనుమనుచు వైవనా
గద। దునుమాడిన నాతడేమి లోఁచకయున్నన్॥ క॥ శరమొకటి వైచి నిజ
భుజ। గరువంబు దూలంగఁ జేసి కలహోత్మునినా। ధరపైఁ గూలఁగ నేసిన । బరు
వెత్తిరియతని సైన్యపాలకులెల్లన్॥ చ॥ మఱియునుఁ బుండరీకుడనుమాన
వనాథుడు శౌర్యశక్తితో । శరమును వేగవైచుచును జేరఁగవచ్చినఁ జూచి
గుఱ్ఱముల్ । పారలగనేసి సారథిని బుట్టడగించి శిలీముఖంబుచే । శిరమును
ద్రెవ్వనేయగను జిందరవందరలొందె సైన్యముల్॥ చ॥ ఘనుఁడనుతేజు
ధన్వుడను గార్ముకముల్ధరియించివచ్చి । రో మునిసుతులార సంగరము
మోదముతో గనుడంచు శస్త్రముల్ । దునుముచు గ్రూరబాణముల
దోడన నేసిరి క్రోధితాత్ములై । ఘనవిశిఖంబులందలలు గ్రద్దనద్రుంచిరి
వారినిర్వురన్॥ వ॥ తదనంతరంబ॥ క॥ దేవానీకుండంతట । భావం
బున రోసగించి పటురభసముతో । దేవగణంబులు గనుగొన । సేవకుల
రుదేర ఘోర సింహనాదమాడ్కిన్॥ చ॥ మదమున సారథీతురగ మర్మము
లెల్లను నీ వెఱుంగవే । కదియగబోవనిమ్ము లయకాలునినైన తృణీకరిం
తునన్। డడనమునందు మెత్తునని కార్ముకనాదము చేసిగట్టిగాఁ। బదిపది
బాణముల్బఱప బాలకుడా లవుడార్భటించుచున్॥ ఉ॥ వేసినశస్త్రము
ల్నఱికివేసి నరాధిపనాశరాగ్నిచే। గాసిగలంగనొందు జనగా జనునంచు శిలీ
ముఖంబులున్ । వాసియొనర్పగా బఱపివఱము చిందరలాడ కైక్కము
ల్। ద్రోసినవాఁడు చండతర ధూర్జటిరీతిగ మార్గణంబులున్॥ చ॥ మఱి
మఱి వేయుచున్నయెడ వానిని ద్రుంచి పదైదు తూపులన్ । హారులనుగొ
ట్టిరథ్యముల నప్పుడ భిన్నముచేసి యాజిలో । పరువు లెఱింగి పోరుచును
బట్టిమహాశరలక్షణంబున । న్శిరమును ద్రెవ్వనేసి తన చిత్తము సంతస

మందు చూడఁగాన్॥ గీ॥ పారియాత్రుండు పరిశయు విభాకరాఖ్యు । కఠిన
దళ్ళుచు నమ్ములు గవచఖడ్గ । పరశుపట్టిసతోమర పాశకుంత । శస్త్ర
ములువట్టి యెదిరించె సమరమునను॥ చ॥ మదకరిమీద నెక్కి ఘన మా
ర్గణముల్ధరియించి ధైర్యుఁడై । వదనము జేవురించుకొని వచ్చి కుమారుల సా
యకంబులం । బొమవంగుశుండు రౌద్రముగ బొంగుచు జాపము నెత్తి సై
న్యము । ల్చెదరగఁ జేసి పంచదశ సంజ్ఞశరంబుల నాటనేయుచున్॥ చ॥ ం
గుకవచంబు చించి మదదంతిని ద్రెళ్ళగఁ జేసె యప్పుడే । ఖగపతి వన్నెగత
బులను గర్వము మాపి చరితి దోపవా । తెగునఁదలంచి యానృపతి దేహ
ము బద్దలుచేసి యార్వగా । జనములు సంచలించె బరసైన్యము సాగెను
భీతి నొందుచున్॥ చ॥ మఱియుఁ గుశధ్వజుండు జనమాన్యుఁడు చచ్చుటఁ
జూచి కోపమున్ । వరలఁగ దాన యారథము పై విలసిల్లు చువచ్చి చాపమున్ ।
శరములువట్టి వైచుచును జండ విభాకరుఁడో యనంగ సం । గరతలమం
దుఁ నిల్చి జనకాత్మజ పుత్రులఁజూచి యిట్లనున్॥ చ॥ సమరమునందు నాయె
దుట సాగునె మీబల విక్రమంబులున్ । అమరులయందఁ జేయుఁడను నై బ
లశక్తిని దృంపకున్ననో । కమల దళాక్షులారయక గయ్యముమాని వ
నాంతరంబుకై । గమనము సేయ మేలౌ దవుగా గలహంబులు సేయనేటి
కిన్॥ చ॥ అనినలవుండుపల్కె ప్రళయాంతకుఁడైనను బోరనేర్చునే । ము
నుపటి సంగరంబులని మోసములొందక నిల్చి చూడుఁడీ । దినమున నీకళే
బరము ద్రెళ్ళగ వైచి తదీయమాంసము । ల్దనిపెదఁ బక్షిజాతులకుఁ దప్ప
దు నన్నెవరడ్డగించినన్॥ చ॥ అని విశిఖంబులం బఱపి యద్భుత మందగ
బోరు ఘోరమై । పెనగుచు నిద్దఱుం గలయ బేరెములాడుచు నార్భటించు
చున్ । మొనయుచు హెచ్చరించుచును మోములపై రుధిరంబు జారవే ।
దనలు సహించుచున్ మరలి ధైర్యములొందుచు సంతసించుచున్॥ క॥
మఱియపుడు లవకుమారుడు । తురగంబులదల్చి చింపి తుత్తుమురులుగా ।
నరదంబునఱికి వెంటనె । గరువము పోకార్చి నృపతి గాయముచించెన్॥ సీ॥
బలపరుండదిజూచి ప్రళయార్కుఁడై లేచి స్యందనారోహుఁడై జనమువడక ।
నాగ్నేయ శరమును నధిక సాహసవృత్తి గూర్చుచరోదసి కుహరమెల్ల ।
నిండ జెన్మంటలు నిబిడంబులై నిండ గవచకుండలములు కడు వెలుంగ । బ
రిఘాత్రిశూలము ల్పట్టిశరంబుల జటుల రౌద్రాకార జలధిదేల । వచ్చు
చుండెడి నరపతి జైవు దెలిసి । కుశకుమారుడు నడ్డమై కూర్చిశరము । ధ
నువుధరియించి పటుముత్తగుల జేసి । పంచశరముల చేత భూపతిని ద్రుంచె॥
క॥ కని యుల్కలుండు నప్పుడ । దనసామర్థ్యంబు చూప దలచునపుడే ।
కనులెఱ్ఱజేసి సారథిగనుగొని పోనిమ్ము రథము గరువము లడఁతున్॥ ఉ॥ బాలుర

గెల్వకున్ననగపాలకుమారుడటంచుబిల్తురే జాలముసేయనేల యనిచాపము
భీమముగాధరించియా। భీలపరాక్రముండు రణవీధినినిల్వ లవుండు మెచ్చిభూ।
పాలుని నిగ్రహింతుబరి పంథిసమూహము తల్లడిల్లగన్॥ వ॥ అనుచుం దన
మదిందలంచిరయంబున॥ చ॥ శరము శరాసనంబు రభసంబునదాల్చిపదై
దుబాణము। ల్పరపగ నన్నితున్కపగను బంచశరంబుల గేతంబునం। గ
రమున ద్రుంచి సారథినిగర్వము మాపి మహాస్త్ర మొక్కటి। న్నురమున
నాటనేయగను నుర్వినిద్రెళ్ళెను గొండకైవడిన్॥ సీ॥ వరవిక్రముడు ధూ
మ్ర వర్ణుండు రౌద్రాగ్ని కణములురాలగా గనకరత్న। కవచమేర్పడదా
ల్చి కార్ముకంబుధరించి సకలశస్త్రాస్త్రముల్సంఘటించి। చతురాశ్వఘట్టి
తచారు రథంబుపైగూర్చుండి ముత్యాల గొడుగులమర। బరిఘపట్టసప్రా
స కరవాలసకలవిధాయుధోపేతుడై యాగ్రహమున। మత్తమాతంగ
ఘోటక మండలములు। రమ్యమైయొప్ప గదనవిరాజితముగ। భటసమూ
హంబు లిరుగడ బలిసికొలువ। శోభితంబుగ సారథింజూచి పలికె॥ చ॥
చటుల తరంబుగా రథముసాగగ నిమ్ము మదీయ శౌర్యముం। బటుగతి
జూపెదన్ రిపులబట్టెద గొట్టెద సంగరంబులో। నటనము సల్పెదం దిగ్
దశనాథులు నన్నెదిరించ నేర్తురే। మటమటమందునా విశిఖమర్మము ల
న్నియు నీవెఱుంగవే॥ చ॥ అని పురికొల్పి రాగ లవుడంతట నన్నకు మ్రొ
క్కి చూచితే। ఘనుడెవడో యతండు లయకాలుని రీతిగ రుద్రుకైవడిన్।
ధనువుధరించి మేలునగధైర్యత వచ్చుచునున్నవాడు వా। తనిసమరంబు
లోపలను దాకిమదంబడగించి వచ్చెదన్॥ చ॥ అనుడుం బ్రచండరోషము
న నస్త్రము లేయుచు గుంభికుంభము। ల్దునుముచునుత్త మాశ్వముల
దోలుచు రథ్యము నెక్కివచ్చునా। జనకతులన్ వధించుచును సైన్యము
లం బరిమార్చి యార్చుచున్। దినకరుడో యనంగ రణ ధీరతగైకొనియు
న్నయత్తఱిన్॥ సీ॥ శరఘట్టనల చేత సైవక మదమత్త వారణంబులు నేల
పయిని ద్రెళ్ళ। గంకప్రతాన్విత ఘనశర ధారకు భీతిలి దురగము
ల్బెండుపడగ। మార్గణ మహనీయ మహిమలు వీక్షించు స్యందనాధిపు
లు విచారమంద। గాండకాండానల కణములుదర్శించి సైన్యనాయకులు
చంచలతనొంద। బగిలియెగసెడి పుత్తెలు బహుళరక్త ధారలుగారు
తలలును నొకటదొలగి। చెదరుబహుకేశ పాశము ల్సమరమందు॥ క॥ ఈ
రీతిగతిన సంగర। భారంబై యున్న ధూమ్ర వర్ణుడు రౌద్రా। కారము
న తేచి బాహులు। సారించుచు లవకుమార చంద్రుని కనియెన్॥ మ॥
పసిబాలుండవు నన్ను గెల్వవశమా బ్రహ్మమహేంద్రాదులన్। వధియిం
తున్ బహువిక్రమా కలనచే వర్ణింపగానేల నీ। వసహాయుండవు నోర్వ

జాల విపుడే యాలంబు చాలింపుతా। పనులుఁ రాజుల గెల్వ జాడి
యగునే భావింపు నీమహాత్మలోఁ॥ చ॥ అనవిని బాలుడిట్లనియె భూజనవా
యక మేము మహాత్ములై। దినములు దాటవేయుదుము దీనుల మామక
తీవ్రతాప మే। మనికొని యాడ నేలయిదె యమ్మనువిల్లును బట్టినిల్తునీ।
ఘనములు మాబలంబులును గయ్యముతోఁ విభజించి చెప్పెదఁ॥ వ॥ అని
విల్లుగుణధ్వనిచేసి వింటనారిసంధించిబలుపిడుగులపగిది శరంబులుగురియిం
చుచు ముఖకర్ణ నాసికాధర కంఠకర వదనంబుల లక్ష్యంబు లేర్పరించు
చు మత్తమాతంగంబులకై వడిందిరుగుచు సింహంబుల పగిది రొప్పుచు
సర్పంబులరీతి బుసకొట్టుచు విహంగంబుల గమనిక నెగయుచు శరభంబు
ల పోలిక నిలుచుచు సారంగంబుల చందంబున దుముకుచు నీరాటుల వి
ధంబున బట్టుచు సివంగులవలె దూరుచు మయూరంబులవలె నాడుచు భూ
నభంబులు గలంగ సింహ నాదంబులు సేయుచు జక్రంబు లెత్తుచుం బ్రా
సంబులు ద్రుంచుచు విశిఖంబుల నేయుచు గటారుల దటాయించుచుగుం
తమ్ములం గ్రుమ్ముచు నశిదంబుల ఝళిపించుచు ముసలంబు ద్రిప్పుచు
జాపంబులు పట్టుచు భిండివాలంబుల భేదించుచు దమతమ యన్వయ నా
మంబులం దెల్పుచు వజ్రమయంబులగు కంటకంబులు వ్రచ్చుచునాలీ డవ్రి
త్యాలీఢ వైభవంబులు గలుపుచు మహార్ణవంబులై మహార్ణవంబుగలచు
చు మోహరించుచు నమ బలవిక్రమాన్వితులైరం బోరు ఘోరంబయి
యున్న సమయంబున॥ చ॥ కర కరలాడుచుఁ లవుడు కార్ముకనాద మొ
నర్చి వెంబడే। శరముల నాటనేయుచును ఛత్రము సారథిద్రుంచి వేగ
మే। హరులను గూల్చి మార్గణములన్ని హరించి మహా విరోధియై। న
రవరు సంహరించె జననాథుని గుండెలు తల్లడిల్లగఁ॥ తదనంతరంబ॥ గీ॥
వినుత కుశుడును గన్నుల విస్ఫులింగ। ములు చెలంగగ బ్రళయార్కమూ
ర్తివోలె। స్యందనా రూఢులై లేచి సాయకములు। పఱపుచును రాగ
గుశపుత్ర వరుడువడిని॥ చ॥ కదిసిమహోగ్రుడై చటుల కాండములన్ని
యు నుగ్గుచేసితా। మదమడగించె తీవ్రమగు మార్గణ పంక్తులు నాటనే
యుచుం। బొదవుచు నెత్తురుల్క శలబూనుచు జెండుచునార్భటించుచుం।
గదనము మెచ్చుచుఁ సుతులుగాంచుచు నిద్దరుఁ దారసిల్లుచుఁ॥ చ॥ కి
నిసిన రౌద్రుడై విజిత కేశుడుచేత ధరించినట్టి యా। దనువునుద్రుంచిమే
రునగ ధైర్యముతోఁ శరలాఘవంబులం। బెనగొని వజ్ర కాచములు జె
గ్గడిలం దగ జేసియార్చె మే। దినిబడ నేసె దచ్ఛిరము దేవగణింబ్బలు [illegible]
[illegible]॥ [illegible] మొప్ప। [illegible]
[illegible]

ర్షంబు గురిపించె శౌర్యవుపయి॥ చ॥ ఘనగద ద్రిప్పివైవగను గాండము లై
దిటవు ఱ్రించి భీమమహా। ధనువు ధరించి వత్సమున దారుణబాణము లేయ
నన్నియు। దునిమి శరంబులు న్నొడల దూరగనేసి మహాస్త్రశక్తిచే।
ధనువును రెండుగా నఱికి ధారుణిపై బడనేసె ధీరతన్॥ గీ॥ అంత వృషవ
ర్మ గనుగొని యాగ్రహమున। సాయకంబులు వింటను సంఘటించి। ర
త్నకన కాన్వితంబైన రథము వడిగ। దర్లగాజేసి యుద్ధసం దర్భ మొప్ప॥
మా॥ అదిగో సారథిఁజూచినాడ ధరపై నత్యుగ్రులై ధీరతం। బది బాణంబు
లు వింటనంటుకొన దోర్బాహా బలంబొప్పగా। వదనాబ్జంబులతో హిర
ణ్మయమహా వర్ణంబుతో ఘోరమహా। కదనానంద మనస్సుతో నిలిచి
రేకల్యాణికిం గల్గిరో॥ చ॥ పడిరి వరాధినాయకులు పౌజులు ద్రగ్గ రథం
బు రథ్యముల్। పొడిపొడిగాగ ద్రెల్లె దెగిపోయిరి వీరులు ఘోటకంబు
లుఁ। గొడుగులదోడ గూలెర్ణ కోవిదు డెవ్వడో గానిశక్తిచే। బుడమి
ని సంగరంబునను బోరకపోయిన నన్ను మెత్తురే॥ చ॥ అనియని చేరవచ్చి
వడిదమ్ముల వత్సము వ్రచ్చి యార్చినం। గనలి లవుండు తీవ్రమగు కాండ
ము లంగము నాటనేసినన్। మినుకుచు హుంకరించుకొని మేటిశరంబులు
గాడనేసినన్। మనమునరోషుడై కఠిన మార్గణ కుంతులు నేసిడాయగన్॥
ఉ॥ శూలముచేత బట్టుకొని శూరపరాక్రమ తేజమందిరో। బాలుడనన్నె
దుర్వఁ దరమా పరమేష్ఠికినైన నివ్వుడీ। యాలము చాలుపొండిదియునం
తకునైనను సంహరించులో। కాలుచెడంగ జేయు లయకాలుని దండము
తో సమానమహా॥ క॥ అని చెప్పివైవ మండుచు। బెనుమంటలు గ్రుమ్మ
రిలగ బిడుగోయనగా। జనుదేర లవకుమారుడు। తనవిక్రమశక్తి మంచి
ధైర్యం బొదవన్॥ క॥ విలసిల్లుశక్తిగయికొని। బలమున దిగదీసివైవబ్రి
హ్మాండములో। ఫెళఫెళ మనగానప్పుడు। తొలుతను శూలంబు రెండుతు
నుకలునొందెన్॥ క॥ శరముల నాల్గిట హయముల। గరువంబులడంచి ప్ర
కయ కాండంబుల సం। గరమున వృషవర్మును వే। దరిమియు వధియించె
దనదు దళములు చెదరన్। గీ॥ సింహశౌర్యుండు నావేళ జేరిభద్ర। సా
మజంబులపై వచ్చు చటులసింహ। మూర్తివలె బాణ తూణీర ములుధ
రించి। వర్ణితంబుగ గుశునిపై వచ్చిదాకి॥ వ॥ సంభ్రమాటోపుండై యిట్ల
నియె॥ చ॥ ఘన విపినాంత రంబులను గాయలనేరుడు మానులారయా।
జినిగెలునంగ వచ్చితిరె చిన్నతనంబున దేవవర్యులం। దునిమిన వాడనేను
ఘనదోర్బల వంతుడ నిప్పుడైనమే। దినిశరణన్న గ్రోచెదను ధీరగుణం
బుల నెన్ననేటికిన్॥ చ॥ కలతును సాగరంబులను గట్టుదు సర్వదిగంతరా
ళముం। గొలతును సాహ సాధికుల జోరుదు దేవగణంబులైననుం। దా

లుతురు వ్యోమ మండలమెం దోలుచు జన్నగ రాతుసాదులం । దలతును
విక్రమాతి శయదర్పముతో మహనీయ యుద్ధముల్॥ క॥ విని కుశుడో
యీ జనపతి । నినుసివే బాగడికొనగ నెరతనమౌనే। ఘన విక్రమాదిగు
ణముల। జనపతి యెన్నంగదగునె జగతీస్థలిపై॥ క॥ శారదవి శాయలేరె
డి । వారలమోాలేక నృపతి వంశస్థులమో। పోరాడి నంతదెలియును। నూ
రక పలుకంగనదియు నుచితంబగునే॥ శా॥ అనినను లింపహశౌర్యుడుమహాం
బుధులెల్లగలంగధీరుడై । ధనువుధరించి యుగ్రముగదారుణమార్గణవిస్ఫు
లింగముల్ । వెనుపగజూచుచున్ గుశుడుభీమముగాశరరత్నణ.బుచే । ధను
వునుద్రుంచిసారథిని దారుణిపైబడ నేసె వెంబడిన్॥గీ॥ దర్పమదరంగ ఘూత
వాతాస్త్ర మొకటి । వింటసంధించి విడువగా వెసలి చటుల । రభసముగ
వచ్చియతని యురంబుదాకి। బవనఘూర్ణిత వృక్షంబు పగిదిగూలె॥ గీ॥ క
రుబిరుండును గనుగొని గర్వమునను । శంఖనినదంబు ఘూర్ణిల్లజాండరుచు
లు । గలుగు చక్రంబులు గైకొని కార్ముకంబు। ఖడ్గమునుబట్టి కవిసినగని
లవుండు॥ సీ॥ ప్రళయాగ్ని కణములు పడెడు విధంబున విశిఖము ల్జొను
ప భూవిభుడుగినిసి । దశ మార్గణంబులు తనువుననాటించి వింశతి శరము
లు వెంటనేయ । జవసత్త్వవృత్తిలో జక్రంబు విసువంగ బాణంబు చేతను
భంగపఱిచె । మూడంబకముల గార్ముకమును నుగ్గాడ బుచ్చంబు ద్రొ
క్కిన భుజగరోష । విషముగ్రిక్కగ దిక్కులుబెదర ధరణి । వడక ఖడ్గం
బు గైకొని వచ్చుచున్న । కర్బురునిబోాద దశశత కాండములను । బొ
దివిబరిమార్చె సంగర భూమియందు॥ క॥ అంత సుభామన్యుండును । నం
తకువలె రోజుకొనుచు నరథము కుశుపై । బంతంబుతోడ నడుపుచు ।
జెంతకు జనుదెంచె దివ్యచాప ధరుండై॥ క॥ మూటను నేసిన శరములు ।
మాటులుదప్పించి వివిధమార్గణములచే । నాటించె నాథరాధిపు । కోటీర
ము శరముచేత గూలగ నేసెన్॥ ఉ॥ కటుగతి బ్రాస పట్టిసము భల్లము
తోమర బిండివాలముల్ । చటులతరంబుగా బఱవ సాయకము ల్వాలె
దయంబునాట నా । ర్భటిచెలంగంగ వక్షమును బ్రస్విధరాతలమందు గూ
ల్చిను । ర్భటులుగలంగ దిక్కులకు బఱ్వులువెట్టిరి శౌర్యహీనులై॥ సీ॥ మ
హనీయమత్తేభ మండలంబులుదెగి పడిన మొండెంబులు బాణములును ।
దుత్తుమురైయున్న తురగ సందోహంబు రమ్యమై విఱిగిన రథచయంబు ।
మహివిూద బ్రద్దలైన మకుటకేయూరముల్ భాసిల్లు మణిమయ వలయ
ములును । గదల వేర్పులనదెగి వదలు హారంబులు జినిగ్రవేలాడెడి చేల
ములును । సమసితేలెడి గొడుగులు జామరములు । నడిమికని బ్రస్విపడె
డు బాణాసనములు । నార్భటించెడి భూతము లధికరుధిర । సాంద్రి నద

ములు చెన్నొందె సంగరమున॥ ఆసమయంబున॥ ఉ॥ పోరఁగలేక భూపతు
లు పోయిరి సర్వదిగంత రాళముల్। చేరిరి సంగరాధికులు సీమలు చూచిరి
సుప్రయోగులుం। దూలిరి కార్ముకాయుధులు దుర్బల మందుచు వాహినీ
పతుల్। కోరిరి శాసనంబులును గోనలు గొండలు బట్టిరందరున్॥ సీ॥ అమరా
ధిపతియైన నబ్జగర్భుండైన రూఢిల్లఁగా గాలరుద్రుఁడయిన। నాగేంద్రుఁడైన
గిన్నరులైన నరులైన రణవిక్రముఁడు రఘురాముఁడైన। భండనంబున గెల్వ
వశమానె వీరిదోర్బల విక్రమముల కెవ్వారు సాటి। యెక్కడ నేర్చిరో
యీవిల్లు విద్యను గురువు లెవ్వారొ రణ కోవిదులకు। ననుచు దహాతహా
నొందుచు నధికశౌర్య। వీర్యములుమాని వెగడొందు వీరవరుల। జూచి
భరతుఁడు సంగర శూరుఁడగుచు పరంగఁతే। నేచెనుభయ చామరము ల
లో॥ ఉ॥ సారథిఁగంటివా వికచసారసనేత్రులు కోమలాంగ శ్రీం। గారు
లు మించుభావము కార్ముక ధారులు చాలబల్లవా। శార జటాకలాప
శుభకాములు చూడుము నీవు వారిపై। దేరును బోవనిమ్మురణ ధీరపరా
క్రమ మెల్ల నిండఁగాన్॥ క॥ అని చేరవచ్చుతప్పక। కనుగొని సుకుమారు
లార కడనాయతమా। మనసేలకగ్లెనీకుం। జనిగొను నే నృపులతోడి
నంతములెల్లన్॥ క॥ హయమిదియు రాక్షసాధిప। జయుడగు రఘురామ
పయది సవనార్థంబే। భయము పడకీవు పట్టగ। నయమవు నేయమరలో
క నాథులకైనన్॥ ఉ॥ రాముఁడనంగ నెవ్వఁడు పరాపరుఁ డాగమవేద్యుఁడూ
ర్జిత। స్తోముఁడు సర్వలోక పరిశుద్ధుఁడు నాశ్రిత రక్షకుండు ను। ద్దాముఁడు
నిత్యమంగళుఁ డుదారుఁడనంత దనాధపోషణుం। డీమహిసాధ్యుఁడే కదన
మేమని యెంచితి రెన్ని భంగులన్॥ సీ॥ ఆధారభూతుఁడై యఖిల బ్రహ్మాం
డంబు బెంచును నొకవేళ భేదమునను। సగుణుఁడై యొకవేళ సంహార
మొనరించు సేవ్యుఁడై బహువిధ సృష్టినిలుపు। బూజ్యుఁడై సర్వాంతము
ల సంచరించుచు దివ్యవిగ్రహుఁడయి తేజరిల్లు। నిర్వికారుండయి నిర్గుణత్వ
మునొందు నాద్యంత శూన్యుఁడై యతిశయిల్లు। ప్రకృతి వికృతులనంటక
ప్రబలుఁడౌచు। సర్వగుణ వృత్తి జూపుచు సర్వసాక్షి। సాధకత్వంబు గ
మగొని వెలుగుచుండు। రఘుకులాంబుధి చంద్రుఁడౌ రాఘవుండు॥ సీ॥ మ
త్స్యావతారుఁడై మహనీయ రాక్షస పతియైన సోముకు బట్టిచంపెఁ। గూ
ర్మావతారుఁడై ఘోషించి మంధాద్రి పేర్చియెత్తెను రోషభీకరముగ। నా
దివరాహమై యవని జేకొనివచ్చె నరసింహుఁడై దైత్యు నణకివైచె। గు
జ్జుఁడై బలివిభు గోరిధారుణి వేఁడె జమదగ్ని రాముఁడై జయముగాంచె। రవి
కులాంబుధి చంద్రుండు రాఘవుండు। నాది దేవుండు మనుజుఁడై యవని
బొడమె। దానవాంతకుఁడైన దుర్ధర మహాస్త్ర। పాణి నెదిరింప దరమె

గులను గారణమేగలో యేవిధంబులో । తెలియగశక్యమౌనె భువిదేవజ
నార్దనుకైన చెచ్చెరన్ ॥క॥ కట్టితిమి సవనహయమును గొట్టితిమిందాద్రి
దులెఱుగ గూలిరిపౌజుల్ । కట్టితిమికంకణంబులు । ముట్టితిమత్యుగ్రశౌ
ర్యములురాజిల్లన్ ॥గీ॥బ్రతుకులస్థిరములు భాగ్యంబులట్టివిగనుకదెలిసికీర్తి
కాముడగుచు । బొందినట్టివాడు పుణ్యవర్తనలోక । విభవమెల్లయేల బృ
థ్వియందు॥మ॥ పరమాత్ముండగు రామభద్రుడు వరబ్రహ్మంబు కాబట్టి
సం । గరరంగంబుననిల్చి పోరగనువేగైవల్యముంబొందు దు। ర్భరపాపంబు
లుపాసిపోవుననుచున్భావించియున్నాముముం।దరదేహంబులుపోవు శాశ్వ
తములేదైర్యాత్మయిన్నేటికిన్ ॥ఉ॥ భూమణివ్రయ్యనైనగుముదాప్తుడుభా
నుడు దోవ్రవదప్పినం । దారలురాలినన్ ఫణిమధాన్వితశీర్షములెల్ల వంచి
నన్ । వారధులెల్లనింకినను వజ్రియువజ్రముధార దప్పిన । న్నోరిమిగల్గిదిం
క హయమూరకయిత్తుమె భీతినొందుచున్॥క॥ బలవంతులెవరొవారలె।
యిలయేలుదురింతె యెపుడు నేలుదునని దుర్బలవంతు లయినవారికి । నిల
నెట్టులుకీర్తియశము నెన్నగగల్గున్ ॥క॥ బలవిక్రమాన్వితంబులు । గలవా
రలుమీరుగనుక రథగజములచే । జెలగుచునుందురు మేమును । బలహీను
లుగనుక శైలవనములుదూరికెన్ । సీ ॥ కనకనిర్మితరత్న కంకణంబులుమీ
కు సాంద్రహారుద్రాక్ష నరులుమాకు । హాటకమయమైనయాంబరంబులు
మీకు గలితవల్కలములుఘనముమాకు । బొందుగాబహుభక్ష్యభోజనం
బులుమీకు నడవిలోగల యాకు నలుమమాకు । వైభవాలంకార పట్ట
ణంబులుమీకు సౌఖ్యముగ్గల పర్ణశాలమాకు । మత్తగజ రథఘోటక బ
లములమీకు । ఘటితమృగపక్షి పన్నగ గణముమాకు । వారివారియదృ
ష్టము వారియందు । వర్ణనము నొందు నొక్కరివలన తగునె॥ఉ॥ ఆకుల
నమ్మ మేరుచును నద్రులయందు వసించు వారికిన్ । రూకలు గల్గునే విమ
ల రూపము లేవిధమౌను గట్టగా । గోకలునెట్లు వచ్చు బుధకోటులుమ
మ్మెటు వాశ్రయింతురే । లోకులు మెత్తురే సకలలోకములందు దరిద్ర
మొందినన్॥క॥ కులహీనుడైన ధనమును । గలయాతండైన సకలకార్య
ములందుం । గులతిలకుడనుచు భువిలో । బలుకరె మర్యాదలెట్లు వచ్చు
నరేంద్రా॥చ॥ కరముల రత్ననిర్మితపు కంకణము ల్కటకాంగదంబు
లున్ । సరిపెణ తారహారములు స్వర్ణమయాన్వితమైన భూషణాం । బర
ములులేవు చూడ నరపాల కులోద్భవు లంచుచెప్పినన్ । హరువమునొం
దునే జనుల కందఱకున్ మది యుల్లసిల్లెనే॥ చ॥వనముల బేదవారనుల
వి పల్కగమాకును వన్నెతగ్గునా ధనువు శరంబు గూర్పదగు దారుణ
విక్రమ శత్రులార వే । పెనగొన సంగరంబులను భీతి యొకించుక మమ్ము

యోగాశాలులార ॥ఉ॥ తెలియరు మీరుబాలకులు దీనశరణ్యుఁడు సత్యవి
క్రమా। కలత డహల్యశాపగతకల్మషవిదూరుఁడు చండశౌర్యుఁడో। ర్భలు
డు మహేశు చాపమును భంగముచేసెను ధైర్య శక్తియుక్। గలిగినవా
డు దైత్యులకు గాలుఁడు వార్ధి మహోగ్ర గర్వముం। గెలిచిన సాహ
సాధికుఁ డెవ్వఁడు గర్యములోన నిల్తురే॥ క॥ ఖరదూషణాది రాక్షస।
వరులకు బదునాల్గు వేల బలములలోనం॥ టరిగా నిలిచియు ద్రుంచిన।
వరమాత్ముండైన రామభద్రుండనరే॥ క॥ తనబలిమి మొదిటిబలిమియు। ఘన
హీనము లెఱిఁగి పోర గావలె మహిలో।నిఃశర్మిమీదిగదియఁగ। జనునే శైలం
బు తగరు సమగతి యగునే॥ చ॥ మగటిమిగాఁడు రామనరపాలుఁడు దీనశ
రణ్య మూర్తియా। జగముల కెల్లదండ్రి యిది సత్యము మీకును
దండ్రి గాఁడె మా। పగలిక సాగిరావు శుభ భావము జూపెద రం
డు వెంబడిం॥ దగు ధవళాశ్వము ల్మణులు దంతిచయంబుల తోడ ని
చ్చెదక్॥వ॥ అని మఱియునిట్లనియె ॥ఉ॥ మునులో మహాత్ములో నృపులో
మూర్తి వహిల్లెడిసూర్యచంద్రులో। వనరుహనేత్రులార సుకుమారశరీరకు
లారమీపయిం॥ జెనఁగుచు బ్రేమయున్న యదిబేరములన్నియు మానితజ్ఞ
ముం। గనుగొనివత్తురీ హయముఁ గట్టుట మంచిదిగాదుభూమిపై ।క॥ జగ
ములనేలెడి నృపుతో। జగడము సేయుంగ విప్రజనులకునగునే। తగుమీ
కుజపతపంబులు। నగణిత యుద్ధములుమాకు నధికఫలంబుల్ ॥క॥ తనకు
లధర్మము విడచుట। చనునే యెవ్వరికినైన సత్యవ్రతులై। మనమున గోత్రి
జముదంబము। ఘనవిఘ్నములనుచు దెల్పఁగలదో మీకున్ ॥సీ॥ అరుణో
దయముపూర్వ మందు పావనమైన జలమందు స్నానమలరఁ జేసి। భూతిరు
ద్రాక్షలు పూజితంబుగ దాల్చి పరతత్త్వనిరతసంభరితులగుచు॥ వేదశా
స్త్రశ్రౌత వివిధమార్గములును సష్టాంగ యోగము న్లభ్యసించి। యధిక
సంతుష్టులైయగ్నిహోత్రంబులు పితృకర్మంబులుప్రీతిగలుగ। విహితకర్మ
బులివియెల్ల విప్రులకును। క్షత్రియులకెల్లసంగర స్థలములందు। శత్రువు
లవంహరించుట సహజగుణము। గనుక మీకేలవైర మెక్కుడనునైన ॥క॥
బాలుడగు కుశకుమారు। డాలము చాలింపుమనెడి యావనీశ్వరుసం। శీల
ము దెలిసితనమదిం। గాలానలరోషభీష కలితుండగుచున్ ॥చ॥ జననాథో
త్తమ మానులంచనఁగ నిస్సారంబులే యాజిలో। ఘనధైర్యాదులు నేల
గల్గవాకొ యుగ్రస్ఫూర్తిశోభిల్లదో।వినవే భార్గవరాముఁడత్యధికదోర్వీర్యుం
డునైకార్తవీ। ర్యునిసంహారముసేయలేదె కడురోషాగ్రిన్యుఁడై మున్ని
లక్॥చ॥ బలమునువిక్రమంబు నిలభాగ్యము విద్యలయందు నొక్కఁడే। గ
లుగునె వాని కెక్కువయికల్గును వానికివాని కెక్కువై। కలుగుచుఁ గొన్నిభం

జెందునా । మొనయుచు గత్తిచే నఱుక మొండెము తేర్పడ జేయుదుం
దునే॥ చ॥ జనకుని కన్న శౌర్యబల సాహస వృత్తుల మెంచియుండినం
దనయులటన్న మెచ్చుదురు తక్కువలై మురిపెంబు మించి మీ । తనయుల
టంచు జెప్పిన యథార్థము తోచునె భూమిమీద నీ । దినమున నిగ్రహిం
తుము వధింతుము చొత్తుము సంగరంబునన్ ॥వ॥ అనిన భరతుండు
రాకాసుధాంశు విభాసిత వదనులును వికచ నేత్రులును గమనీయ విద్రు
మారుణాధరులును బాలపల్లవసంకాశ హస్తులును మహాసుందర
రూపులును నగు కుశలవ కుమారులం జూచి తనయాత్మగతంబున
వీరు ధరాసుర వంశసంభవులుగారు వనవాస గతులయిన మునితనయులు
వీరేల యగుదురు సత్వసమన్వితుండగు జనకచక్రవర్తి పుత్రీగర్భ పారా
వార సుధాకర మూర్తులుగాని యితరులుగారు పరమపావనయగు సీతా
మహాదేవిని నేకతంబున సకలమృగపక్షి సంకులమహారణ్యంబుల విడచుట
దోషంబుగాదే తద్గర్భజనితులు వీరజేయులుగాని దుర్బలులుగారు శ్రీరామ
ప్రతిబింబావతారంబులును సమరంబున రాఘవునకయినను నెదిరింపదరంబు
గాదని దోచుచున్నది నిజసహోదరులు మహాపరాక్రమ వర్ధనీయులు లక్ష్మణ
శత్రుఘ్నులు స్మారకంబులు దెలియకున్న వారలు రథగజాశ్వపదాతులు వం
గాంగ బంగాళద్రవిళ చోళమళయాళకర్ణాటలాట మరాటమత్స్యమహాదే
శాధీశ్వరులు ధరణీతలంబు పైబడిరి పరమపావనివైదేహీ మహానుగ్రహం
బువ్యర్థంబుగా బోవనేరదు మూలప్రకృతి మహామ్మాయి యాదిశక్తి
పరంజ్యోతియగు జనకజాత్మజతొల్లి లంకాపట్టణంబు బ్రవేశించి పుత్రమి
త్రబాంధవ సహితంబుగా గాలానల పరక్రమాన్విత దైత్యాధిపతుల
నిటవతియగు శ్రీరామభద్రునిచే సంహారంబుగావించి ధరాభారంబుమాపి
నిప్పుడొక నెపంబున మునికాననాంతరంబుల వసియించి ప్రియపుత్రద్వ
యంబుచే మహారాజాధిరాజులం బరిమార్చుచున్నది యితరంబుగాదు శ్రీ
రామానుమతిలేక యుద్ధవిసాన్నిధ్యంబుజేరి ప్రసాదింపుమనుట యుచితం
బుగాదు బ్రహ్మాండనాయకుండగు శ్రీరామచంద్రుండు తనప్రతిజ్ఞానుసార
ముగా హయంబుగొనివచ్చి సవనంబు నిరవేర్పకుండనిది ప్రళయావసా
నంబు కరుణిసున్నదని తలంచుచునిట్లనియె॥

ఉ॥ బాలకులార యుగ్రగుణపాలకురార హయంబుగట్టగా। వేళలు
గావుమీకుఘుని భేదములెంచుట హెచ్చుగాదు సం। శీలముగల్గి మాపుర
ముజేరగరండు ధనంబులిత్తు భూ।పాలుని రామభద్రుని గృపావరతంత్రుని
జూచివచ్చెడిన్ ॥ఉ॥ జగడమువీరు మేముకొన సాగగసేయుట మేర
యానెయీ। జగములువీరికోసంగెదను శాతవసంతిగాదు మీక్కాలిం। బ

గలుదలంచునన్నకుడ పాపియు మానవనంబు విఘ్నముం। దగదు ధరాత
లంబుడను ధర్మములంచు దలంపరెవ్వరుకా ॥వ॥ అదియునుంగాక ॥క॥ మీ
తల్లి జేరిమీరలు। ప్రీతివహిల్లంగరామవిభుసైన్యంబు। త్వేతగలంచెనమను
డా। మాతానుమతంబుమీకు మాకుమభ్రాతికా ॥చ॥ మతిహయమేధ
యాగమును మానవనాథుడుచేయుంచుడి యా।తురగముఁబంపగాను నిజ
దోర్బలవృత్తినిబట్టి గట్టిగా। దరువుకుగట్టి సైన్యములదాకి రథాశ్వమదేభ
మేదినీ। వరులనుద్రుంచి నారమనిపల్కఁ నాజలజాక్షి యేమనుకా ॥మ॥
ధరసాకేతపురాధి నాయకుడునాధారుండు శ్రీరాఘవే। శ్వరుడుం బంపిన
యశ్వమంచనగ నాచంద్రార్కయయ్యు బీరితిసం గరముఁవద్దనిచెప్పనో తగ
వునం గయ్యంబుమేలంచు నే।ర్పరుచంబోయి యెఱింగిరండనుచు సంభా
వించి మోహంబునకా॥ సీ॥ ముద్దమ్మ మీచెక్కుటద్దంబులనుజూడ బా
ణాసనంబెట్లు పట్టునేర్తు। మోహంబులమ్మ మీముఖములువీక్షింప శర
ములనేరీతి సంగ్రహింతు। గారుణ్యమునుగల్గి గనుదమ్ములుదలంపఁ బరి
ఘలుయేరీతి బఱపవచ్చు సంతోషమమ్మమీ చందంబుగనుగొన శూ
లంబులేరీతిఁ జాచిపొడుతు। పద్మమిత్రునివంశ సంభవుఁడుసేయు। సవన
రత్నము విఘ్నంబుసలుపబ్రహ్మ। కైనదరమానె మీరలునధికభక్తి। నయ
మువర్తిల్లరండు మానగరముఁకకు॥సీ॥ త్రిపురముల్గెల్చినదేవుని కార్ముక
బలముచెల్లెనె నృపవరునియెదుట। మహిమహాసురుడైన మారీచుమా
యలు విభునితోఁబోరిరేవిధముఁలారె। వనతలంబున గబంధునిదనుజాధీ
శుబలిమెదిరించి యేపగిదినిల్చె। సాంద్రవైభవుడైన జలరాశిరవివంశవల్ల
భుం డెదిరించి భయమునొందె। రజతగిరిపెల్లగించి విరాజబాహు। వింశ
తియుగల్గు రాక్షసవిభుడుముందు। నరవరునితోడ నెదిరించి నలినగర్భ।
సంభవునిచూడ నేగతి సల్పెరణము॥చ॥ కనుకను మీరుబాలకులుకావు
న దెల్పితిబల్కులాత్మజే। కొనివిపరీతరోషములు గోరక యాతురగంబు
మీరుమే। మును నొకటయ్యెబోయినను మోదమునొందుదు రెల్లమాన
వు। ల్మనసుకు సమ్మతంబవుచు మాకునుమీకును వైరమేటికికా॥

ఉ॥ భరతుడు పల్కువాక్యములు బాలకులన్నియు జిత్తగించిభూ।
వరకదనంబులందుఁ బ్రియబంధువులైననుగాని పుత్రసో॥ దరులునుబోరగా
నిలను ధర్మమపెద్దలు చెప్పుచుందురే। మఱిమఱిమీకుమాకును సమస్త
ములేదు విచారమేటికికా।ఉ॥ తనువులునస్థిరంబులు ముదంబున సంగర
మందుద్రెళ్ళినకా।ఘనముగస్వర్గభోగములు గల్గుననట్లును గాకయున్న మే।
దినినిజవంతులై సకలదేశములందును గీర్తికాములై। పెనగొనవచ్చుగాక
రణభీ[illegible] గజ [illegible]

న్నియుమానితల్లికిన్ । మొ్రక్కినజూచు నాముఖము మోహమునొందు
నేమాటలాడునే। యెక్కరగల్గునేమదిని నాశలునుండునె దేహమొందునే। ది
క్కనసేలపోవుదుము ధీరవరాక్రమ పర్ధసీయులై ॥క॥ అనిపల్క సుతుల
గనుగొని । కనులనుమిణుగురులుచెదర గార్ముకధరులై। విసరైతిరిదిగో శ
రములు। తనువులనాటించు నింకదయదప్పంగన్ ॥వ॥ అనిచెప్పి ॥ మ॥ జన
నాథుండును జూపమెత్తియపుడే సంధించి బాణంబులన్ దనువుల్నిండగ
నేయగా గుశుడుభూరాతావేశరోషంబుతో । ధనువుంజేతధరించి బాణముల
చందంబెల్లగాంచించి భూ। జననాథోత్తముపైపయింగడచి హాహావక్త్రి
సంకాశుడై ॥మ॥ తనువుల్నెత్తురుగారగా నిరువురుందర్పోగ్రులై బాణ
ము। ల్పెనగన్ వేయుచు దీయుచున్ నటుచున్ భేదిల్లగోదండముల్ ।
ధ్వనిచేభూనభమెల్ల ఘూర్ణిలగ చందంబెల్ల వీక్షించుచున్। జననాథోత్త
ములెల్లమెచ్చగ మహాసంగ్రామ ధీరాత్ములై ॥చ॥ పదివిశిఖంబులంబటిత
బంచశరంబుల నుగ్గుచేసి యా।పదివిశిఖంబులుం గడకుపంతిముతో శతసం
ఖ్యకెక్కవై। గదలుధరించి త్రిప్పుచును గార్ముకనాదము భీషణంబులం।
బుధులుగలంగ నిద్దరును బొంగుచు జీరుచునార్భటించుచున్ ।చ॥ బలముల
నెన్నుచుంజటుల బాణములెత్తుచు దృష్టిచక్కగా।నిలుపుచునారిమీటుచు
నునిర్భరవృత్తిని హెచ్చరించుచుం। గలహమ్ములెంచుచుం బగలగాండములే
యుచు ముందువెన్కగా ।నిలుచుచునేత్రియుగ్మములనిప్పులురాల్చుచు మే
రుధీరులై ॥క॥ఇరువురుసమబలవిక్రమ।వరులయిపోరాడిసింహబలవిక్రములై
బిరబిరశరసంధానముకలుపుచు దుందుభులుమ్రోయ గడురభసమునన్ ॥చ॥
భరతుడుధీరుడైయపుడు పంచశరంబులు గూర్చువింట॥ నిర్భరగతితోడనో
తపసిపాపడ యీశరవహ్నికీలలే। తెఱవుసదప్పిపోవునె మదేభముకేసరి
మీదదాకునే। గరువముమాపెదంచనుచు గాండమ్ములెదిట నేయుచీవ్రితన్॥
గీ॥ పజ్రికవచంబుచెండాడి వక్షమపుడె। దూర రుధిరంబుగారగా ధూళి
లేచి। మార్గణంబులతొమ్మిది పట్టినిలిచి । చురుకుచూపుల భరతునిజూచి
పలికె ॥ఉ॥ మానవనాధ చూచితివె మార్గణము ప్రళయాగ్నికీలలున్ ।
మేనును గాచుకొమ్మనుచు భీషణమొప్పగదీసి వైవగా । భూనభమెల్లరో
జుచునుభూధవుచాపముదుంచి వక్షమున్ । మానుగనాటరక్తములపార
ముగా వెడలంగ నుగ్రతన్ ॥క॥ మరలనొకధనువుగైకొని । భరతుడు విశిఖ
ములనపుడు వర్షమురీతిన్ గురియింప గుశకుమారుడు శరలాఘవమమర
నతని ఛత్రముదుంచెన్॥మ॥ మనమున రోషుడైన్నృపతి మార్గణముల్వర
వంగ నన్నియుం। దునిమి మహాట్టహాసమున దొమ్మిదితూపులువైచి గాసి
చే। సినజటులాస్త్రములవ్వాలపి సింజిణిబోర్రియగనంతలోనవే। దనమమరం

గసారథిని ధైర్యముతోఁ దలఁడొల్ల నేసినన్ ॥చ॥ హరులను జానదల్చుచును
నస్త్రము లేయఁగ బాలుఁ డప్పుడా । తురతవహించి శక్తినివిధానసమంత్రక
పూర్వకంబుగా। గరమున నిల్ప దిక్కులువణాంకరై చెదరంగ దేవత। లృరు
వులిడంగ నిబ్బరపు పాటున మంటలు గుప్పుగుప్పునన్ ॥ఉ॥ వచ్చెడి శక్తి జూచి
నరపాలుడు రోషకషాయితాక్షుడై। యచ్చెరువంది చూచుచును నస్త్ర
ములేయఁగ దాటి మూలవుం । గ్రుచ్చఁగ ద్రోచిరాఁగ జనఘోషమునొందఁగ
గ్త్రిచేతనే । పచ్చగదప్పి యానృపతి వక్షమునాటఁగ నిద్రకైవడిన్ ॥చ॥
కనకరథంబుపై నొరిగె గొబ్బల మెల్లను జెట్టుగుట్టకై చనిన మహారథాధిపు
లు సంగరభూమిని బాయలైరి వే । దనలుకలంగి యశ్వములు దంతిసమూ
హము దెళ్ళరక్తముల్ । మునుగుచు దేలుచుండె బహుభూతములార్భటి
సేయుచుండఁగాన్ ॥సీ॥ ఎక్కడఁజూచిన నిభకళేబరములు నదనుగా దెగిపడు
నశ్వములును। నేయెడఁజూచిన నృపమస్తకంబులు వేదనలొందెడి వీరభటు
లు। నేమూలచూచిన సామజతుండము ల్ఘనముగా విఱిగిన కార్ముకములు।
నేతావు చూచిన హేమచ్ఛిన్నవరత్న కటకాంగదవిలాస కంకణములు। ఎచ
టఁజూచిన రథములు నిండ్రసీల । మణులువజ్రాలసరములు మకుటములును।
జామరంబులు దెగిపడు ఛత్రములును । గలిగి విలసిల్లె నామహాకదనభూమి
వ॥ ఇవ్విధంబున మహాఘోరభయంకరంబై నెత్తురుల దొప్పదోఁగియున్న
యవసరంబున విద్రుమలతా విచ్ఛిన్నంబులుగా శోభిల్లుచు బాహుదండం
బులు దీర్ఘభుజగనికరంబులుగా వెలయుచు నాయత కరిఘటలద్రిసం
ఘంబులుగా బ్రకాశించుచు వివిధాయుధఖండంబులు మీనంబులుగా
దిరుగుచు నతులదంతిదంతంబులు తిమితిమింగిలంబులుగా నొప్పారుచు
ఫేనంబులు పంకంబులుగా నొప్పుచు ధవళాతపత్ర సంపూర్ణసంతతులు
మరాళంబులుగా మోదించుచు గుశలవకుమార సాంద్రహాసద్యుతులు
చంద్రికలగుచు నడరెడు రక్తాబ్ధితో దొరసి వర్షియరుద్ర వదనంబుగా గ
దనరంగంబుతోఁచుచున్న సమయంబున ॥ గీ॥ అంత హతశేష సైన్యము
లధికభయముఁ బొంది ముఖమును వెలవెలబోవ జెమట। పరగ దిగజారసా
కేతపట్టణంబు। జేరఁగావచ్చి హయమేధశాలఁజొచ్చి ॥సీ॥ విలసిల్ల మంత్రము
ల్విధియుక్తములుగాఁగ జెప్పుచు హోమముల్సేయువారు। సకలశాస్త్రపు
రాణశ్రేత సందర్భము ల్బహువిధార్థంబుల బలుకువారు। చతురశ్రముల
యందు స్వర్ణపాత్రాంతర వృషదాజ్యముల నెత్తి పూనువారు । దక్షిణా
హవనీయ ధర్మాగ్ని హోత్రము ల్విభజించి ఘనముగా వేల్చువారు। శ్రౌత
విధములు దలపోసి నంభ్రమమున । శిష్యజనములతోడ విశేషవృత్తి । సామ
ములు చెప్పువారల చందములును ॥ జూచుమువారలఁ జూచుచు వచ్చివచ్చి॥

వ॥ తదీయ సభామధ్యంబున హేమసీతాసమన్వితుండును బాలపల్లవా రుణ హస్తకంకణుండును మకరకుండలాంకిత రత్నప్రభాకలిత కపోలుం డును బరిశుద్ధపీతాంబరా లంకృతుండును వసిష్ఠవామదేవ భరద్వాజమ తంగజమదగ్నికణ కాత్యాయన విశ్వామిత్ర మంకణాంగీరస మందపా లగస్త్య మహామునీశ్వర సమన్వితుండును గారుణ్యకటాక్ష వీక్షణాలం కారుండును రఘువంశ పారావారసుధాకరుండును నిత్యానంద హృదయ కమలుండును లీలామానుషవిగ్రహుండును నఖిలలోకనాయకుండునునగు శ్రీరామచంద్రునిం బొడగాంచి నమస్కరించి నిటలతట ఘటితహస్తులై దూరంబుననిలిచియిట్లనిరి॥ సీ॥ దేవేశభరతుండు దీపితకీర్తియై పోయిగం గారణ్యభూములందు। రవి క్రుంకగా నాటిరాత్రి యచ్చటనిల్చి మరునాడు సామంతవరులు నృపులు। ఘోటకంబులు మదకుంజరంబులు వెంటనంట గాభువనాంతరంబువడక। సమరధైర్యంబుడై జనపతిసైన్యము క్షోభించి గ్రమ్మ నాయోధబటుల బాలురావేళ గోదండ పాణులగుచు। వారణంబుల జెండాడి భటులగూల్చి। హయములను ద్రుంచి రథములనదిమిగదిమి। చదివి సైన్యాధిపతులను సమయజేసి ॥ వ॥ ఇవ్విధంబున మత్తకుంజరంబులపై సింహకిశోరంబులు గవిసి ఘోరయుద్ధంబు సలుపుచున్న యవసరంబున ద్విసహస్ర తురంగంబులును బంచశత మదశుండాలంబులును ద్రింశతి రథంబులుంగొని వారలమార్కొని దండుడు పరాక్రమంబు గోల్పడిమృ తుండయ్యె దదనంతరంబ పంచసహస్ర జవనాశ్వంబులును ద్విసహస్రవార ణంబులును ద్విసహస్ర స్యందనంబులను గూడి నిషధుండురణంబునందే గటారె మఱియును షట్సహస్రఘోటకంబులును బంచ సహస్రమదేభం బులును ద్రయస్సహస్ర రథంబులుంగలిసి పౌరాడిడిండరీకుండుపరలోకగ తుండయ్యె సప్తసహస్ర తురంగంబులును బంచసహస్ర గంధసింధురం బులు పదమూడువేల రథంబులు క్షేమధన్వతోడ నాభిను మృత్యుం దదనంతరంబ తొమ్మిది వేల హయంబులును నాలుగువేల నాగంబు లును రెండువేల రథాధిపతులును దేవానీకుండును సంగరంబున సమసిరి నవసహస్రతురంగంబులతోడను బంచసహస్రగజంబులతోడను మూడు వేలరథంబులతోడను గుశధ్వజుండు భండనంబునంగూలె బంచదశసహ స్రసైంధవంబులును దశసహస్రదంతావళంబును బంచసహస్ర స్యంద నంబులును బలచరుండును సమరంబున సమసిరి దశసహస్రోత్తమా శ్వంబులును నవసహస్రద్విరదంబులును నలువదివేలరథంబులునుబుష్క రుండును గళంబునమడిసెనష్టాదశసహస్రవాహనంబులును షోడశసహ స్రసామజంబులును నేకాదశ సహస్రదివ్యరథంబులును ధూమవర్ణుడును

మృతులైరి నవవింశతి సహస్రతురగంబులును సప్తవింశతిసహస్రవారణం
బులునష్టవింశతిసహస్రశూలాయుధులతో సుభాహుసైన్యంబు రణరంగం
బునందు హతుండయ్యె పిదపయును॥ చ॥ భరతుడు సంగరంబున విభాకరకాంతి
సముండు తీవ్రమౌ। శరములు వేసిడాసి నిజసాహసవృత్తిభరించి మించ
భూ। సురసుకుమారు లత్తఱిని జూచి శరాసన పాణులయ్యు భూ! వరు
నెదిరించి బాణములవారి బ్రయోగము చేసి ధీరులై ॥క॥ అందగ్రజుండు
కుశుడును, ముందర నెదిరించి శక్తి మూర్తివహిల్లన్। డెందంబు జల్లు
మనగను। బృందారకులెల్ల దిగులు వొందగవిడిచెన్ ॥గీ॥ చెరిదముగ మం
డుచును వేయుపిడుగు వలె। వచ్చిజనకతివక్షంబు వ్రచ్చి। రక్త
ములు గార మూర్ఛిల్లె రథముమీద। వచ్చితిమిమేము మీకునీ వార్త
దెలుప॥ఉ॥ అనినరఘూత్తముండు దనయాత్మవిచారణచేసి నేలపై। ఘ
నముగమూర్ఛనొందగ గనుంగొని మారుతి సూర్యపుత్రుడా। తనితన
యుండు చేరజనితత్పక సేవలు దేర్ప। గొంత సే। పునుజరుగంగమేల్కొని
విభూరితరంబుగ శోకమందుచున్ ॥మ॥ హాసుకుమారదేహ సుగుణాకర
హాకులభూషణా యనున్। మోసముచేసియా మరణభూమిని జిక్కితివేమి
చేతునా। వాసవుతో సమానబల వైభవమెక్కడగుప్రింగిపోయె నే। దో
సముపొందెదో సతినిదోసిన పాపఫలమిప్పడాయెనో ॥చ॥ ననుగనుతండ్రి
నీముఖమునాకును జూపగరాదటంచు మే। దినిరణమందుసోలితివో దీనద
యాకరమూర్తినిన్ను నే। మనిగదిలేదు చూడక యరక్షణమైనను నుండలేను
నా। ధనములు బ్రాణమీ వెగదతమ్ముడ యెట్టుభరింతుదేహమున్ ॥సీ॥
మనతండ్రి దశరథ మహీపాలకుడుతొల్లి సమరంబుసేయగా సతికిమెచ్చి।
వరములు రెండీయ నొకటికినీధరా భారంబునీకును వనమునాకు। ననినిర్ణ
యముచేసి యనుటచే జనకాజ్ఞ విధముగైకొనినేలు వెడలితీవు। వచ్చియ
ప్పుడెయట్టి వర్తమానమెఱింగి తల్లినిదూరి బాంధవులవిడిచి। యడవికే
తెంచి నావేషమపుడుగాంచి। యధికదుఃఖంబు చేతను నఖిలభోగ। భాగ్య
ములురోసి నాయాజ్ఞబాదుకలకు। నిలకునిభుగనునియమింప నెవరుగలరు॥
క॥ నీవటిసత్యవాదియు। నీవంటిదయాంబునిధియు నీవంటిమహా। పావను
డునాకుదొరకునె। యేవిధములనైన నింకనే నెటులోర్తున్॥ శా॥ నీగాంభీర్య
గుణంబులెన్నదరమే నీవేగదా నాకునీ।భోగానంద మొనర్చితీవెగదయీభూ
మెల్లనీదేగదా। శ్రీగౌరీశ్వరతుల్యవిక్రమ మహాశృంగారవక్త్రాంబుజా।భో
గాధీశ్వరశాయి యీతనువికం బోషింపనాకేటికిన్ ॥గీ॥ తండ్రియానుమతి
నేను గాంతారమందు। జడలుదాల్పంగ నావలెజడలుదగిన। వల్కలంబులు
ధరియించి యొడలధూళి। పూతచెన్నొందగాధరా భోగమెల్ల।మానియుం

టివి నీవంటివారుగలరె॥చ॥ జనకజపుణ్యసాధ్వియని చాలఁజెప్పినమాట
లెల్లనే। వినకయరణ్యమందు మదివేదనలొందఁగద్రోయఁపంపనీ। మనమున
క్రూరచిత్తుఁడనిమానితివో ననుగోమలాంగ యీ। దినమున నెట్లు దుఃఖము
లుదీర్చెడి వారెవరన్న ధీరతన్॥చ॥ సతులునసేకులుంగలరు సాంద్రమునౌ
విభవంబుగల్గుసం। గతిగనసేకబంధువులు కాంచనరత్నహారంబులాదిగా।
సుతులును వృద్ధిబొందెదరు సోదరులొత్తరె యేమిసేతునే। బ్రతుకనునింక
మీద మిముబాసి ధరాతలమెల్లనేటికిన్॥చ॥ కలిమియునేల దివ్యమణి
కాంచనగేహములేల మోహమా। లలనలునేల సర్వశుభలక్షణభోగము
లేలయేలభూ। తలములునేల సంతత మదాన్వితకుంజర బృందమేలన।
తురగములునేల గొల్వనృపకోటియు నేలతలంచిచూడఁగాన్॥క॥ వినిన
ప్పుడె జననాయకు। డనురాగమునఁ మొనర్పవలయు నటులేకనునా। తనువందు
నేలయున్నది। వనజాసను డేమనుమట వ్రాసెనొయనుచున్॥ఉ॥ ఏకతినిర్వ
హింతు నికనేమితలంతుచు నశ్వమేధమా। యాగము నేక్రియన్ జరుగు
నేలజనించితి భూమిమీద నిం। కాగలకార్యమేమి జనకాత్మజబాసినవెన్క
నింకనే। భోగములేలగల్గునని భోరునఁగన్నుల నశ్రులుంచుచున్॥సీ॥ అవ
నిన యోనిజ యైపుట్టిమిథిలేశు పుత్రియైనృపులెల్ల పొగడగాను। దశరథ
మేదినీ ధవునకుగోడలై తేజరిల్లఁగనాకు దేవియయ్యె। నఖిలాదులెరుగంగ
నాసాడులంకలో నగ్నిముఖంబున నధికధైర్య।మున జేరనిర్జరుల్మునులును
వినుతింప వచ్చినయాసీత వరమసాధ్వి। యనకనీచునిమాటకై యడవి
యందు। విడువుమని యాసతిచ్చితి వెలడినపుడు। దానవవజయమయ్యెనా
తమ్ములెల్ల। నిలచిరోయింక నేమననేల యిపుడు॥ఉ॥ వారలునెవ్వరో తప
సిబాలురకీ సమరోగ్రవిక్రమా। కారములేలగల్గు శరకార్ముకవిద్యల నెట్లు
నేర్చిరో। శూరులొయక్షులో సురలొ చోద్యము నాతురగంబుబట్టగా।
ధారుణినెవ్వరోపుదురు దైవబలంబమరంగ దున్నదో॥చ॥ చలమున భూత
నూజనిజసాహసమాయుధరించి బాలురై। నిలిచెనొ యశ్వమేధములునేను
నులేకను సాగునాయనం। గలహమువన్నెనో ప్రళయకాలమువచ్చెనొ
యేవిశేషమో। తెలియదరంబుగాదనుచు దీనతనొందుచు సొమ్మసిల్లు
చున్॥చ॥ రవికులమందుబుట్టి ఘనరాక్షస నాశముచేసియుగ్రతం। శివుఁడు
ధరించు చాపమునుజిందరలాడి ధరాతలంబుపై। బవరములెన్నొచేసితిని
బ్రాహ్మణులెవ్వరు శౌర్యవృత్తితో। నవనినిదమ్ములంగెలువ రమ్యతమై
నదిమొన్ని భంగులన్॥గీ॥ అనుచువిలపించు శ్రీరాముసాననంబు। గాంచి
సుగ్రీవుడప్పుడు కరముమొగిచి। స్వామిచింతింపఁగానేల సకలలోక। పతివి
యైయుండినీకొక భయముగలదె॥ఉ॥భానుసమాన విక్రమవిభాసిత దీన

శరణ్యమేదినీ। మానవనాథ వంశపరిపాలన పల్లవపాదపద్మయా। జాను
కరాట్టహాస బుధసన్నుత కార్ముక బాణహస్తనం। భూనభరాసుతాహిత
హృదబ్జ సురాధిప రాజవల్లభా॥ పంచచామరము॥ సురాధినాథసేవితాం
ఘ్రిశోభితా రఘూద్వహా పురారిచాపఖండనా విభూషణా దయాకరా।
విరోధిదైత్యమర్దనా మహావిలాసవైభవా। ధరాసుతాసమేత నిత్యధర్మ
సద్గుణాన్వితా॥

గద్య॥ ఇది శ్రీమచ్ఛ్రీమరాంబిక నిజమనోల్లాస కరుణాకటాక్షవీక్ష
ణాలంకార సరసరసామృతకవిత్వ తత్వాతిశయానందభరిత సాంఖ్యతార
కామనస్క శ్రీరాజయోగ సామ్రాజ్యలక్ష్మీవిలాస ధురంధర గట్టువంశ
పయఃపారావారసుధాకర కాశ్యపగోత్ర కాత్యాయనసూత్ర శ్రీవేంక
టార్యపుత్ర లలితపాండిత్య వేంకటరామకృష్ణప్రణీతంబైన శ్రీపట్టాభిరా
మాయణంబను మహాకావ్యంబునందు బంచమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీ పట్టాభిరామాయణము

## షష్ఠాశ్వాసము.



శ్రీమద్రాజకులాంబుధీ। సోమాఖిల సుగుణసంఘ శోభితమహి
తో। ద్ధామపరాక్రమ వర్ణిత। రామా సీతాకళత్ర రంజితగాత్రా॥ గీ॥
అవధరింపుము రఘుపతియాననంబు। గాంచి సుగ్రీవుఁడావేళ గరము
మొగిచి। సకలలోకాధిపతికి విచారమొకటి। మదినిదోచగ నేల భూపాల
తిలక॥ సీ॥ సకలంబు నీయందు సంభవంబైయుండు నఖిలంబు నీయంద
యడిగియుండు। నత్యంతశూన్యుఁడై యతిశయంబవుదువు యాద్యంతగతుఁ
డవై యమరగలవు। నిత్యుడైయొకవేళ నిర్గుణుండవుదువు సగుణుఁడౌదువు
సర్వసమితినొంద। నన్నిటికినినీవె యాధారుఁడౌదువు నవ్యయగోత్రము
లందు రావు। మూఁడుమూర్తులు నీయందు మొనసియుండు। మూఁడు
మూర్తులు కావలి మూర్తి వీవు। సత్తసత్తులు రెంటికి సాక్షివగుచుఁ। బ్రకృ
తివికృతుల నటియించు వాఁడవీవు॥ చ॥ పరమానందము నొందుచుండిన
పరబ్రహ్మంబునీవేగదా। పరిపాలింతువు సర్వలోకములకుం బ్రీత్యాత్ముఁడై
నిత్యుఁడై గురుఁడైనీవ యనంతనామములచే గోవింద వైద్యుష్మూర్ణశం। శర

దామోదరకేశవాచ్యుతులుగాఁ గైకొందు వెల్లప్పుడున్॥ ఉ॥ కావున నీక
సాధ్యములుగల్గునె లోకమునందుఁ జూడనో । దేవసురేంద్రపోషణ మదే
భమహోత్కదనాశ యీశ భూ । పావరదైత్యమర్దన శుభాకర దీనశరణ్య
యిందిరా । స్థావరసద్గుణాధర॥ సంగరభీషణ మంజుభాషణా। క॥ భువి
మీఁద రాముఁడనఁగా । నవతారంబెత్తినాఁడ వమరులకొఱకై । శివ
కోదండ విఖండన । యవనీధవ నినునుతింప నజునికివశమే॥ చ॥ కరమున
విల్లుపూనఁగను గన్గొనశక్యమె బ్రహ్మకైనసుం। దరదరహాస రామ విన
తాసుతవాహనభోగితల్పనీ । వరయుగ దేవదేవుడవు యాత్మనుచింత దలంప
నేలసం । గరమున రావణాసురునికన్నను శూరులు పుట్టియుందురే॥ సీ॥
భార్గవరాముని బాహాబలముకన్న కరసవిక్రమములు నెక్కుడనుగలరు। చతు
రంబుధులుదాటు చతురుఁడౌవాలితో సమమైన వారలెచ్చటనుగలరు ।
మాయావియైన దుర్మదుఁడుమారీచుతో సములగువారచ్చటనుగలరు ।
కుంభనికుంభాది కుంభకర్ణాసుర విభులకు శ్రేష్ఠులు వెలయగలరె । యబ్ధి
నాయకుడుప్పొంగ నతనిబలిమి। బాణమునబోనడంచిన ప్రబలబలుఁడు। సా
హసుఁడవు నీవుమహాసమరమునను । బోరఁగలవారలెవ్వరీ భూమిలోన॥ సీ॥
గజుఁడుగవాక్షుఁడు గంధమాధనుడును, పనసుడున్ జాంబవంతుడును
[illegible]యు। పవనపుత్రుఁడు వీర పారియాత్రుడును ధైర్యవిశాలుండైనదధి
ముఖుండు। కుముద మైందద్వివిద గోత్రసంచారులు శరభసుషేణులు
శౌర్యవంతు । లంగద గిరిభేదియాదిగాఁ దరుచర ముఖ్యులుముజ్జగములను
గెల్వ । గలరపారులుభయమేలగలుగవారు । త్రిజగములుగూల్పఁగలిగిన
ధీరవృత్తి । కలుగువారముమముబంపుకయ్యమునకు । సవనహ[illegible]మును
దెత్తుము శైలకిపుడు॥ ఉ॥ అనినుతియించు రామవిభుఁ డంతట దుఃఖము
మాని ధీరుడై। యినజునిజూచి యిట్లనియె నేనికనోర్వను లోకమందునన్ ।
దనరగ జంద్రసూర్యుల దావులనుమాపుదు యత్నసాధ్యులన్ । వననిధి
లోన ముంచెదను వజ్రినినైనను బోరగెల్చెదన్। వ॥ అనిదందహ్యమాన
మానసుండై విజృంభించు నేత్రంబులనరుణవిస్ఫులింగంబులు సెదర బొమలు
ముడివడం బ్రహ్లాదసంరక్షణంబు సేయవడంచివిపులబరా క్రమకలితవర్ధనుం
డగుహిరణ్యాక్షునివధకై స్తంభోద్భవుండైననరహరిమూర్తివగిదినిలిచిన జల
ధులుఁ గలంగె దిగంతరాళంబులవడంకె రోదసీకుహరంబు భేదిల్లె దారలువ్రా
లె మహామేరువు రసాతలంబునకు దిగంబడియె నారదాదిదేవర్షులు విస్మ
యంబందిరి. సురలు బెగడొందిరి కింపురుషులు వెఱచిరి సిద్ధులుజరిగిరి సూ
ర్యులుమునిగిరి. ఫణులుక్షణంబులవంచిరి విద్యాధరులు వేదనలొందిరియువ్వి

ధంబునఁ బ్రహ్మాదిదేవసమూహంబు దిగులొందుచు సకలభువనంబులు భ
స్మంబులగుటకుం గారణం బేమని విమానారూఢులై యంబరవీధిలో నిలచి వీ
క్షింప దేవదుందుభులు మ్రోయ రఘువల్లభుండు కోదండధరుండై మహా
తపోనిధులగు వసిష్ఠవామదేవ కుంభసంభవాది మహర్షులం జూచి యిట్లని
యె॥ గీ॥ ప్రళయకాలరుద్రుఁడనైనను బవరమందు । బోరిహాయమునుగొనివత్తు
భూనభములు । భస్మములొనర్తు విరాళిదిముఖమునేటులు। సాగునో యని
యోచన సేయవలదు॥ చ॥ మఱియు సమంత్రపూర్వముగ వాసిగ హోమ
ము సేయుచున్న నే। నరిగెదనుగ్రసన్నుసుజాలండతితోడ నటించు । మొక్క
సం। గరముదలంచి సారథినిరర్థ్యము తెమ్మన నాతడంతవే। గిరమునరత్న
ముల్వెలుఁగ గాంచనరథ్యము దెచ్చి నిల్పఁగన్॥ సీ॥ రణభేరి మ్రోయంగ రథ
ము పైగూర్చుండి ముత్యాలగొడుగు మూడువేలు । పట్టగా ధవళాత ప
త్రంబు లిరుగడ వింజామరంబులు వేయ ముందు భూచక్రగొడుగుల బూ
నికొండరు రాఁగ మదకుంజరంబులు గదియఁబవన । జవఘోటకంబులు సాం
ద్రమై యేతేర బహుబలసహితులై భటులు నడువ । బ్రాసతోమరకరవాల
పట్టిసములు । చక్రములు బట్టి వీరులు సందడింప। మఱి విభీషణ రాక్షసపతు
లుకదన । శూరులై రాగ నిర్జరులు చూడగాను॥ చ॥ భువనములెల్ల ఘూర్ణిలఁగ
భూరిపరాక్రమ వర్ణనీయుడై । పవననిభంబులైన బలవంతులతో మ్మిదికో
ట్లవానరు లిరువియ్యఁగ భీతిశౌర్యములు గల్గఁగ మర్దనశైలనాథుడో। గవయు
డు వచ్చి నిల్చెను నగంబులు తల్లడమందుచూడగన్॥ సీ॥ గజుడు పదికోట్లక
పులతో జనుదెంచె దళలక్షవనచర దళముతోడఁ। గుముదుండు నేతెంచె
ఘూర్ణితారుణనేత్ర విస్ఫులింగంబులు వెడలజాంబ। వంతుండు దశలక్ష భ
ల్లూకములతోడఁ బరగజాసంతట వచ్చి నిలిచె । నేపు మీరఁగ బదునేను ల
క్షౌహిణి ప్లవగజనంబులు బలిసిరాఁగ। బనసుడరుదెంచె నిజభుజాబలము
మెఱయ । నలుడనుప్పొంగ బదునారునర్బుదములు। వెంబడింపఁగ దరుచరు
ల్వేయికోట్లు। మెలఁగ దధిముఖుడుగ్రుడై వెడలెనపుడు॥ గీ॥ పరగ బదునే
నుగల మహాపద్మములును । గూడి శరభుండు వెనువెంట గొల్లుప్లవగ। వల్ల
భులుగొల్వ వెడలెను వనచరములు । నారుకోట్లతో వినతుఁడు నరుగుదెం
చె॥ సీ॥ పదికోట్లు పది యిరువది పద్మముల్మహా మహనీయ సేనా సమన్వి
తముగ। నంగదుండరుదెంచె నర్కసూనుండును బదివేలకోట్ల సేబదిసహ
స్రలక్షలమున్నూరులగు మహాఖర్వ యక్షౌహిణులును వెంటనరుగుదేరఁ।
బరగంగ బనసుండు పదునేనునర్బుద సంఖ్యలు చనుదేర శౌర్యమునను । వేగ
వంతుఁడు గూడెసువిభవమునర। సంభుడను నాతడిరువదియారు వేల।య
ర్బుదంబులతో వచ్చె నవనిగలఁగ। గోపాలివిభుండు దశకోట్లుగొలువఁ జేరె॥

ఉ॥ నలుఁడుప్లవంగవల్లభులు నాలుగులక్షల యాఱుకోట్లతోఁ వెలయఁగఁ
జేరవచ్చె రణవీరులు నేబది కోట్లవానరుల్ । బలమమరంగఁ గేశుడనువాడ
రుదెంచెను వేగమేమహా । బలసుతుడంగదుండు శరభద్వివిదాదులు వచ్చి
రుగ్రితన్॥ వ॥ ఇవ్విధంబున నెల్లకపినాయకులునుద్దండమండిత భుజాదండ
లును బ్రికటకరాళికవక్త్రులును దీర్ఘనాశికాదంష్ట్రులును గరవాలసదృశ
రోమాన్వితులును మహావాల పాశాయుధులును వికృతకర విజృంభమా
నులును శైలసమకాయులును నగవనచరులు చతుస్సముద్రంబులవలెబొం
గుచు నార్భటించుచు నాక్రొక్కుండు బద్ధమహాపద్మ శంఖక్షోణింసాగ
రమహాసాగర పరిమితసైన్యసమేతులై పదఘట్టనంబుల ధరాభారంబుగ
లుగంజేయుచు సింహార్భటులనెలులంగ ననేకదినంబులకు నచరంబు సేయఁగ
లిగెనని సంతోషించుచు శైలంబులు భేదించి శిరంబులపై బెట్టుకొనియా
డుచు ఫలభరితభూరుహంబులు భుజంబులంబెట్టి తత్ఫలవర్ణంబులు నమలు
చువచ్చుచున్న సమయంబున శ్రీరాఘవేశ్వరుండు॥ చ॥ కనకమయంబు ది
వ్యమణికంకణముం గటకాంగదంబులుం । బెనగొని వజ్రహారములు పేర్చి
నరత్నకిరీటమొప్పఁ జం।దనమును బారిజాతములుదాల్చి విహాకరకోటితే
జుడై। కనకరథంబుపైనిలువ గన్గొని భేరులు మ్రోయుచుండఁగన్॥ సీ॥ ర
ఘువంశసాగర రాకాసుధాకర కమనీయరూప రాఘవపరాకు। దర్పంబు
నంజతుర్దశ సహస్రాధీశదైత్య సంహార భూధరవరాకు। బహుబలాన్విత
దైత్య వరతనూభవు గర్వముకునిగ్రహించు పావనపరాకు। అఖిలకంటక
మహాసురదశకంఠుని యుద్ధతీవ్రకలాయుధపరాకు। కోమలాంగ విలాస
సద్గుణపరాకు। ధర్మపరిపూర్ణ సత్యవర్ధనపరాకు। దర్పకానన దతుల్యమూం
దరవరరాకు। వైభవోజ్జ్వల రామభూవరరాకు॥ చ॥ అనుచు బ్లవంగవ
ల్లభులు నందరు జేరినుతింప వాలినం। దనుడును నాంజనేయుడును దగ్గర
రాగ సుషేణుడాదిగా।వనచరబృందము ల్నడువవచ్చెడి రాముని జూచిని
ర్జరుల్ । అనుగమచిత్తులై యపుడె యంబరవీధిని బల్కిరివ్విధిన్ ॥సీ॥ భా
ర్గవరాముని భంగముసేయగా దీపించినాడు నీతెగవలేదు। ఖరదూషణాది
రాక్షసవీరవరులతో బోరాడునాడు నీ పొగలులేదు। మాయాసురుండై
న మారీచునాకకోల వైచిననాడు నీవిధములేదు। భూరిధైర్యస్థైర్యముల
బొంది సేతువు గట్టించునాడు నీఘనములేదు। నాగపాశంబులను
మేఘనాథుడుమును। గట్టికదలిననాడు నీక్రమములేదు।బంధుమిత్రాదిదై
త్యులబట్టి దనుజ। పతినిదున మాడునాడు నీక్రమములేదు। ॥ఉ॥ పరగ
ద్రిలోకవాసులను భస్మముసేయ దలంచినాడో శ్రీ। కరముమహోగ్రశౌ

ర్యమును గన్గొనఁగూడదు రుద్రుకైనవే। గిరమున శాంతుఁడౌటకును కార
ణ మొక్కటి లేదు సీతసం। గరమున వచ్చి నిల్చి నుతియించిన నిప్పటి రోష
మారునో ॥ చ॥ జగముల కెల్లఁదల్లి జలజాక్షి మహాత్మ్యము తోఁచలేదు భూ।
ఖగమృగ నాగసంకలిత కానన సీమలఁ ద్రోయఁబంపెనో। పగలిటు పుట్టియుం
డఁగను బ్రహ్మసుత మొందుకు వచ్చు మెచ్చుబ। న్నగశయనుండు రామనరనాయ
కుఁడే విధమాత్మ నెంచెనో॥ గీ॥ రాముఁడే యాదివిష్ణువు రాజవదన। జనకజాత్మ
జయాలక్ష్మి జగములెఱుఁగ। నిద్దఱకుఁ బుట్టు చలములనెవరికైన। దేర్పఁదర
మా నెయేమని తెలియవలయు॥ గీ॥ రాముఁడైనను విదియనుగ్రింబటుచు
సీత యొద్దకుఁ బోవలె సీతయైన। నఖిలజగములు గుప్రింగునో యనుచు దలఁచి। ద
శరథాత్మజు చెంతకు దర్లవలయు॥ క॥ రాముఁడు లేనపవాదము। భూమిజా
సుతయందు మోపి పోవఁగ సీతా। రామునిబ్రతిమాలదుయిక। నేమానో తె
లియదరమె యీశునికైనన్ ॥ క॥ అనినిర్జరాధిపతులును। మనమున యో
చింప రామభద్రుఁడు గంగా। వనతలములందు నిలువఁగ గనుగొని కుశుతో
డలవుఁడు ఘనముగ బలెన్ ॥ మ॥ అదిగో సైన్యసమేత మత్తగజసంఘంబ
శ్వముల్ ఛత్రముల్। గదసామర్థ్యులు వైరిభీకరులు సంగ్రామాట్టహాసాధికుల్
పదికోట్లర్బుద నర్బుదంబులు మహాపద్మంబు లక్షౌహిణుల్। గది
సెన్ సైన్యమహాధినాయకుల యాకారంబులం జూచితే॥ సీ॥ మిడిగ్రుడ్లుకో
రలు భీమరూపంబులు గలవారు వారు మర్కటబలంబు। నీలమేఘంబులు
నిలిచినపోలిక కలిగినవారు రాక్షసబలంబు। రూఢిల్లగా నఖరోమ సమృ
ద్ధిచే లోలాడువారు భల్లూకపతులు। కమనీయ మదమత్త గంధేభములు
దివ్యరథములవారు భూరాజవరులు। సందడింపఁగ వెనుకల సైన్యమైతె। నే
లయీనిన చందాన నిలిచె చటుల। జలసమన్వితులైన యాప్లవగవరులు। శై
లవృక్షాయుధములచే వెలుగువారు॥ మ॥ ధరణీనాథుని జూచితే యతఁడు నేత
స్త్రాత్రిదేవులం। బరిపాలించెడివాఁడు నీసుడు పరబ్రహ్మంబు వేదాంత
గోచరుఁడుం బంకజనేత్రుఁడున్ సగుణుఁడున్ సంపూర్ణచంద్రుండు భూ। చరు
డున్ ఖేచరుఁడున్ విశాలయశుఁడున్ బ్రహ్మపాలవంశస్థుడున్ ॥ సీ॥ శతకోటిమా
ర్తాండసంకాశ దేహుండు కమనీయరత్న కంకణమువాఁడు। అతిదీర్ఘబాహుల
యుమారిక గలవాఁడు కలితవిశాల వక్షంబువాఁడు। కలిసీవిభాసిత నయనముల్గ
లవాఁడు మందార కుసుమదామములవాఁడు। మహనీయ నవరత్నమయ
కిరీటమువాఁడు సౌజన్య మందహాసంబువాఁడు। విల్లునమ్ములు కరముల వె
లయువాఁడు। అఖిలలోక శరణ్యుఁడై యబ్ధియట్టి। కరుణగలవాఁడు భూరిశం
గరయశుండు। రాజమాత్రుని గానెన్న రాదు మదిని ॥ గీ॥ కాన నేమరరా
దా సంగరమునందు। శరశరాసన కవచముల్ సంగ్రహించి। పడలవలెసం

చుదెల్పగా వినికుశుండు। ధైర్యముప్పొంగి నిలిచి సోదరునికనియె॥ చ॥ చెం
డుచుభూరిధైర్యమున జంచలమందగజేతు భూమిచు। ద్దండతప్రవృత్తి సైన్య
ముల దంతిరథాశ్వదావతియోధులం। గండలుచెక్కివైచెదను ఖడ్గముచే
ధరియించి దేహముల్। మొండెములేర్పరింతు మిదిముచ్చటతోడనుజూడు
తమ్ముడా॥ఉ॥ వానరులైనగాని సురవర్గములైననుగాని భీమమౌ। దాన
వులైనగాని నగధైర్యసముస్థతి గాంచినట్టి భూ। మానవులైనగానినృప
వర్ణితులైననుగాని యాజిలోఁ। గోనలువృక్షముల్నదులు కొండలుఁబట్టఁగ
జేతుఁగగ్రివన్మరణ॥గీ॥ అమరనాథుడుగాని యాహరుడుగాని। యంతకుడు
గాని కేశవుడైనదాని। పట్టిచెండాడుదును నాదుబలిమికొలది। పేరునిలుపు
దురణమందు భీతిగలదె॥క॥ అనుకొనుచు నన్నదమ్ములు। ఘనకవచము
లెత్తితొడిగి కార్ముకధరులై। పెనగొనగనెదురునడువగ। గనుగొనినీలుం
డు ప్రళయకాలునిమాడ్కిన్॥సీ॥ శతకోటివానర సైన్యసమేతుఁడై చ
టులరౌద్రాకారజలధిదేలి। కుప్పిగంతులు వైచి కొండలుదరువులు బట్టి
వానరవీర వరులుముందు। తగులగా లవుడుకోదండంబు నొకచేత నొకచే
తబాణముఁ బట్టితలలు। బాహువుల్నఱుకుచు బక్షముల్వ్రేందుచుఁబదము
లుద్రెంచుచు బర్వతములు। వేగ్వైవఁగబట్టుచు విశిఖములను। నుగ్గునూ
చలు చేయుచువర్గలముగ। దరులుగొని తెచ్చివైవగా దహనుఁడగుచు।
బొంగిహరియించుచును యుద్ధభూమియందు॥క॥ శరమునకు ముగురనలు
గురు। బరిమాప్పుచుఁ దీవ్రమైనబాణాగ్నులచే। ధరణీతలంబు మిన్నును।
గుఱుతెఱుఁగకచేసి మదిరగ్రోధములొదవన్॥ఉ॥ బారులనుగ్గడించుచును
బొజులు పౌజులు నుగ్గుసేయుచున్। శూరతచూపులం గఠినశూలము చేధ
రియించి కుమ్ముచున్। సారములైన వృక్షములు సారెకుజెందుచు నా
గ్భటించుచున్। పేరులనుగ్గడించుచును బీనుగు పెంటలుగాఁగఁ జేయుచున్॥
ఉ॥ పారలెడివానరుల్ దిగులు పొందుచుఁ గేకలువేయువానరుల్। వరువు
లువెట్టువానరులు వడ్లిగిలించుచు నున్నవానరుల్। తరువులకెక్కువాన
రులుదైన్యతనొందుచు డాగువానరుల్। పురములుదాకువానరులు నూర
కమోచనలాడువానరుల్॥క॥ తనసైన్యంబులు తరిగిన। గనలుచునీలుండు
లవునిఁగనుగొనివత్సా। ననునీకుగెల్వ శక్యము। వనజాసనసురులకైన వశ
మేపోరన్॥శా॥ భానుసమానవిక్రముఁడ బావనుదన్ రఘురాముబంటని।
వానరసైన్యనాయకుడ వ్రత్తును నిర్జరబృందమైననీ। మేనునుగాచుకొమ్మ
యిదె వేసెదనంచు మహాద్రియెత్తగా। మానితశౌర్యుడై లవుడు భస్మము
సేయుచు సాయకంబులన్॥ఉ॥ శైలముచూర్ణమైచనగ సాంద్రభుజాబల
మొప్పనంతలో। సాలమువేళ్లతోఁ బెఱికిసాహసవృత్తిని ద్రిప్పివైవగా।

ధూళిలవుండు లేచి పదితూపులు వక్షమునాటనేయ నా । భీలతనొంది వే
ఱొకటివృక్షము గట్టిగదీసి వేయఁగన్॥ క॥ శరమొకటి వైచి వృక్షము । ప
రిహారముఁజేసి యైదుబాణంబులచే । నురముఁ గ్రుచ్చిన నీలుఁడు । ధర
వయిమూర్ఛిల్లె గపులదళములు బెదరన్ ॥ క॥ ఆవిధముతెలిసి రాముఁడు ।
పావనులగు కుముద పనసవనచరపతులన్ । రావించి మీరు యుద్ధము । గా
వింపుడనంగ వారు క్రోధోద్ధతులై ॥సీ॥ పదిశంఖములు మహాపద్మంబు
లెనిమిది వేల వానరవీరులెనయఁగ । నుప్పొంగుచును మహోత్పాత
మోయన ధరణీపరాగంబు దట్టముగనును । గ్రమ్మగా లయకాలకాల
ధ్వయము మాడ్కి రంజిల్లుచును మహారౌద్రమమర । నెదిరించి పెడబొ
బ్బనిడుచు వాలంబులు విసరుచు దంష్ట్రిలు వికృతదృష్టి । జూపగు
శుండంత బరిశుద్ధమానుడగుచు । బాణకోదండములజేత బట్టినిలిచి । దర్ప
మలరగ విలుగుణధ్వనులుచేసి । వనచరుల కెల్ల యముఁడుగాఁ గనలివచ్చె॥
క॥ వచ్చినవనచర దళములు । నచ్చెరువందుచును నవ్వుడవనీరుహముల్ ।
దెచ్చుచు వ్రచ్చుచు దేహము । గ్రుచ్చగ మిణుగురులు చెదర గ్రోధవివశుఁడై॥
వ॥ కమలాకరంబు జొరంబడు గంధసింధుర కిశోరంబు చందంబున శరవర్షం
బులు గురిపించుచు బంచశరంబుల శిరంబులఖండించుచు దశకోటివానరు
ల వింశతివిశిఖంబుల బడనేయుచు వింశతివానరుల త్రియోవింశతి విశిఖం
బుల నుగ్గుసేయుచు బంచశతతరుచరుల సహస్రవిశిఖంబుల నురుమాడు
చు సహస్రతరుచరుల ద్విసహస్రాశుగంబులం ద్రుంచుచు ద్రయస్సహస్రప్ల
వంగుల షట్సహస్రకాండంబులం జెండుచు లక్షప్లవంగుల ద్విలక్షకాండం
బుల నురుమాడుచు నొక్కొకపెట్టున నర్బుదన్యర్బుదంబులుగా బెక్కండ్రు
ప్లవంగులు హతమగుటఁజూచి నేత్రంబులందు మిణుఁగురులు చెదరఁ గు
ముదుండు కుశునిపయిగవిసిన లవకుమారుండు రోషభీషణాత్ముండై పన
సాభిధు నెదిరించి పనసుండిట్లనియె॥ ఉ॥ బాలుడ యెంతవాడవు కృపా
పరతంత్రుఁడు నాఁడుమూర్తితో । నాలసుచేయుఁగాగలరె యబ్జజుఁడైనను
రుద్రుఁడైన భూ । పాలునితో విరుద్ధములు మంచిదిగానివి మీరువహానుద్రై ।
శీలము లేలమానెదరు సింహముపై నిభమెత్తిపోరునే ॥చ॥ జలనిధిగట్టినా
డుజలజాప్తకుమారుని బ్రోచినాఁడు భూ । తలమును నేలినాఁడు మదదర్ప
ముగల్గిన రావణాదియో । ధుల దెగటార్చినాఁడు మదిదుర్బలుఁడంచు వివేక
శూన్యతం । దలచుట నీతియెట్లగును దాపసులార యిదేటివైరముల్ ॥చ॥
అనిన లవాఖ్యుఁడిట్లనియె నద్రులపై కెగబ్రాకి యాకులే । తిని ముడివారు
మీకురణధీరత లేక్రియ గల్గునూరకే । యనదగునే బలాధికులమంచును
బెద్దయు నేర్తుమంచు నా । య్యనగడు మాటలాడుటకు నేర్పిది యెంతయు

వానరోత్తమా॥ వ॥ అనిన॥ ఉ॥ జలధుల నేడు దాటు జవసత్త్వముగల్గిన వారమే
ము। మీబలములు సాగునా తపసి బాలకులార వనాంతరంబునై। తొలగిన మే
లుకద్దు మదితోచదొ యెవ్వరు చెప్పినారొయీ। కలహములో జయంబ
గునగాదు త్రినేత్రునికైన గ్రక్కునన్॥ అన॥ క॥ వినికుశుడనునో వానర। వన
జాసన రుద్రులైన వచ్చిన భయమా। జనినామాధవు జూచిన। మనమున
జూనంబుగలుగ వచ్చునె మాకున్॥ క॥ అమ్మూడు శరములేయగ। గన
లుచు శైలంబువైవ గాండము చేతం। దునుమాడి ఏడుశరములు। తనువు
నజొప్పింప నతడు శరోప్ప్రిజ్వాలుడై॥ ఉ॥ తరువులుమీద రువ్వుచును ధైర్య
ముతో నెదిరించి పోరుచున్। శిరమున ముష్టి వేయుచును చేతులుగట్టిగబ
ట్టి త్రిప్పుచుం। పదుగులు పెట్టుచు బ్బ్వ్పుల శర్వ్తము గ్గొని వచ్చి వైచుచుం।
జఙ్ఘముల ఎత్తి త్రొక్కుచుచు శౌర్యము జూపుచు నార్భటించుచున్॥ క॥
పవనాత్మ్రమేయ మిక్కిలి। జవసత్త్వము వదలి కనక శైలముపగిదిన్। భువిన
గ్గజుండు ద్రెళ్ళిన। నవపీధవుడైన రాముడచ్ఛితమందెన్॥ చ॥ తరుచరసం
ఘమంత ఘనధైర్యములెల్లను మాని వాలముల్। శిరములమీద వైచు
కొని చింతలునొందుచు నింకవీరికో। హరుడును గాని యబ్జభవుండైనను
గాని విరోధమొంచగా। బురమును జేరగూడదని పోవుచునుండగ జాంబ
వంతుడున్॥ చ॥ వనచరులార పోకుడు భవాదృశులిట్లొనరింప బాడియే।
యనివురి కొల్ప వాయుసుతుండు దలబేరొకని యేలపారిపో। ననిత రసా
ధ్యుడౌ రఘుకులాధిపుడుండగ భీతియేలయీ। వనములడాగి దేహమున
బ్రాణమునిల్పిన గీర్తిగల్గునే॥ వ॥ అని వారికిం దెగువ పుట్టించిన॥ చ॥ వినివ
నసుండు రోషమున భీషణుడై ప్రకటించు శైలముం। గొనిపడవైవగాల
వుడు కోపముతో శరమొక్కటేసి యా। ఘనగిరినుగ్గు చేసి దశకాండము
లుగ్రత నేయ వృక్షముల్। తనువునడిప్పి వైవ నొకదారుణ బాణముచేత
ద్రుంచినన్॥ సీ॥ వ్రేశయాక్కడై మండి పనసుండు ముష్టిచే బొడిచిన బడితే
చి పొదలుకొనుచు। ఖడ్గంబువైవగా ఖడ్గంబు దప్పించు కొనిలేచి పైబడి
గోళ్ళనాట। గ్రుచ్చగాదన చేతి కోదండమునకును భీమసాయకములు పేర్చి
వైవ। నవియన్నియు విఱుచుచు నార్భటింప లవుండు చటులాస్త్ర మొక్కటి
సంఘటించి। తీసివిడువంగ భూమిపై ద్రెళ్ళి లేచి। వచ్చిపిడికిట బొడిచిన బా
రుష మున। నాల్గుశరముల దేహము నాటనేయ। దరువునొక్కటి గొనివ
చ్చి గరువమునను॥ గీ॥ పట్టిరువ్వంగ గడగడవడకి వింట। నారిసారించి శర
ములు నాల్గుతనువు। దూరనేయంగ రక్తము ల్దొరుగనతడు। కోతులెల్ల
రువాపోవ కూలెనిలను॥ క॥ మతియుగుశుండును గుముదుడు। ధరణీతల
మెల్లవణక దార్కొనిగరితో। గరిపోరురీతి జలములు। గరువంబులు నతిశ

యిల్లదాఁ జెలఁగుచు వే॥ చ॥ తరువులు రెండుచేకొనుచు దాకఁగఁజూచి కుశుం
డు వింటిని౯ । శరములు కట్టివేయఁగను సాలము ద్రిప్పుచు రాఁగ బాణము
ల్ । యురమున దూర చేయఁగను నుగ్రతనొంది మహాద్రియంతలో । గర
మున నెత్తివైవ నిజకాండముచేతను నుగ్గుచేసిన౯॥ క॥ తరవొకటిబట్టివై
చిన । శరములచే ద్రుంప నలిగి శైలము వైవ౯ । వెరువక కుశుఁడాగ్రహు
డై । శర శకలీకృతి వైచెఁ గుశుఁడు పవనసుతు నాటన్॥ చ॥ వనచరనాథుఁ డంతట
ను వాలము పెంచి మహోగ్రవృత్తితో । దినకరుఁ డోయనంగ గురుదెంచి
ముఖాముఖి నిల్చియార్చినం । బెనఁగుచు మూఁడు బాణములు వైచిన నెత్తు
రునోటఁ గక్కుచు౯ । ఘనగిరిరీతిఁ గూలెను జగంబులు తల్లడమందఁ మ్రో
యఁగ౯॥ తదనంతరంబ॥ చ॥ శతబలి ధీరుఁడై ప్లవగసైన్యము లేఁబదికోట్లు
గొల్వ । నుద్ధతిగలుగంగ భూమిపయిఁ దాటుచునున్న లవుండు సేనపై । నతి
శయవిక్రముండగుచు నమ్ములనేయుచు రోషగించుచు౦ । గతములు సేయు
చు న్వాఁడలు ఖండముగాఁ విభజించి పేర్చుచు౯॥ సీ॥ మూఁడస్త్రములచేత
భుజములు తెగవైచు నైదస్త్రములచేతఁ దగ జేయు । నారేఁడు శరముల నంగం
బులను జీల్చు దొమ్మిది శరముల దొడలు నఱకు । నూఱు మార్గణములు నో
ళ్లను నిండించు నలువది తూపుల దలలు ద్రెంచు । పదునేను తూపుల బద
యుఁగంబులు గొట్టు నెనిమిది శరముల నేపుమాపు । నగ్గలంబుగ వనచరులం
తసమర । విక్రమంబులు సైపక విముఖులగుచు । బడుచు లేచుచు నఱచుచు
బండనమున । బరువులెత్తుట కనుగొని పౌరుషముగ॥

చ॥ శతబలి కేక వేయుచును శౌర్యము మానుట మంచిదా నె । మీ
బ్రతుకులవేల రామనరపాలుని ముందర చాపుగల్గితే । మతిహరుషింప స్వ
ర్గసుఖ భాగ్యము పొందును రోగబాధచే హతమయిపోతె యేమవునొ యీ
శలు దేహము మీఁద మంతురే॥ క॥ కొట్టుమను సురలనైనను । బట్టుము బ్రి
ళయాగ్ని నైన బాహాబలిమి౯ । మెట్టుదును లోకవాసుల । బుట్టిన మచ్చ
రము నణఁచి పుచ్చుట తగవే॥ వ॥ అనిపౌజులం బురికొల్పుకొని పవనోద్ధూ
తమహానలంబు కైవడి శతబలి యను ప్లవంగవల్లభుండు వృక్షద్వయంబు క
రద్వయంబుచే శిరంబున నూఁదుకొని వికృతవదనంబును దీర్ఘవాలంబును వి
పుల స్తంభాన్విత హస్తంబులతో వచ్చుచుండెడి వనచరులం జూచి విస్మితుం
డగుచు కుశకుమారుండు బాణములు ముడివడ గోపరసాన్వితుం డగుచు గుం
డెలదర గుణధ్వనిచేసి యభ్యాసనిపుణుండగుచు ద్వరితంబుగా నాశుగం
బులు సంధించి యిట్లనియె॥ చ॥ వనచర యెందుబోయెదవు వత్తునునన్నెది
రించి నిల్వవే । ఘనములు నేవిధంబువునా కాయము గ్రద్దల పాలుసేతునా ।
ఘనుఁడవి చూచినా వియని దారుణమౌ తనరారు బాణముల్ । తనువుపనా

టనేయగను పత్తరచిత్తముతోడ నిట్లనున్‌। చ॥ నిలునిలునీవు బాలుడవు నీవును నీబలమెంతమాత్రిమా। గెలుతును మూడులోకములు కిందికి ద్రొక్కుదు నాగనాథునిన్‌। జలనిధులెల్లదాటుదును సత్వముతోగన కాదిరివ్రేలిపై। నిలువుదు నన్ను గెల్వగనునిర్జరబృందముకైన గూడునే॥ వ॥ అనిన రఘువంశసంభవుండగు కుశకుమారుం డిట్లనియె॥ ఉ॥ వాజివసత్వము ల్మురుపెమేదినిపైనిక సాగిరావు భూ। రాజితకీర్తిశించ బరరాజుల ద్రుంపగ బుట్టినాముయీ। యాజివిహారగలవె యంగముపై నికనాశ యుండిశన్‌। తేజముహీనమైగహనదేశసంచారము నిన్నుగాచెడన్‌॥ గీ॥ అనిన శతబలియుగ్రుడై యధికమైన। తిరువ్రవైవంగ్గంటను శరమునొకటి। గూర్చిదునుమాడి పెడచేతి కోదండమైవ। శరములైదింట భస్మము సేయనలిగి॥ క॥ తరువొకటి పెరికైకొని। హరుషించుచు వేయ నాలుగమ్ములచేతం। బరిమార్చ పేరుశైలము। నురముపయినైవ్వవనతని యుగ్రశమాపెన్‌॥ చ॥ పటపటదంతములొరికి పర్వతమంబడ వేయు ధీరుడై। మటమటమండు బాణముల బాహులవేతెగనేసి రక్తముల్‌। జొటజొటగారనేసినను శూరతతోనతడార్భటింపగా। బెటపెటశబ్దములొలుగ భీమశరంబులు దీసివేయుచున్‌॥ గీ॥ అర్ధచంద్రాస్త్రమును వేసియతనిమస్త। కంబుధరమీదగూల్పగా గపులుబెదరి। పోవగాజూచి నలుడుసంపూర్ణవిక్రి। మధిక మమరంగ గపులతోనప్పుడనియె॥ ఉ॥ ధరణీనాథుని డించిపోవ సీనకున్‌ ధర్మంబె మీరూరకే। పరువెత్తం బనియేమి రామధరణీపాలుండు కోదండము। గరపద్మంబున బట్టనిల్వగను నాగంగాధి నాథుండు సం। గరమందున్‌ మెదిరింపశక్యమగునే శక్యాంబునన్‌ నిల్వరే॥ అదియునుం గాక॥ శా॥ నాపామర్థ్యమునీకుమున్‌ దెలియదో నాగేంద్రుడూహింప। పంవాసంబైయమరారి సాగరముపై నొప్పంగ శైలంబులున్‌। భాసిల్లన్‌ మరి పేర్చినాను జగముల్బంధింతు వాలంబుతో। బాసల్చెసెదరండు యీము నిమతు ల్బ జింపనింకేటికి॥ చ॥ అనినవకోటియర్బుదము న్యర్బుదముల్దశలక్షగొల్వగా। మొనసకును నిల్వసైన్యములు ముందునకార్చుచు జేరవచ్చినం। గనిలవుడంత తీవ్రితనుగాంచుమిలన్‌ ధరియించి నిక్కుచుం। దనువులుచించుచుం విపులదారుణబాణములేసి యార్చుచున్‌॥ సీ॥ ఒకనికినెనిమిది యొకనికితొమ్మిది యొకనికినాలుగు నొకనికైదు। నొకనికిపదునేను నొకనికిపదునారు నొకనికిపదుమూడు నొకనికారు। నొకనికినిరువది యొకనికిడెబ్బది యొకనికిమున్నూరునొకనికేడు। నొకనికినెన్నూరునొకనికినార్నూరు నొకనికిబండ్రెండు నొకనిమూడు। శరములనువైచి చెండాడి శౌర్యవృత్తి। గలుగు సింహంబుపోలిక గదసిరక్త। నదులువారం

నగరములు నతిశీఘ్రవృత్తి । తతులనిర్మూలములుచేసి తనరుచున్న॥ చ॥ నలు
డును మచ్చరంబమర నాగము పోలిక వచ్చుచుండగా। దెలిసిలవుండు ద
ట్టమయి తీవ్రశరంబులు మూడురొమ్మునపై । గలుగగ రోషభీషణము నిం
డగబర్వత మెత్తివైవదు । ర్బలమిడియంచు రౌద్రమున బాణమునంగము
దూలనేయగన్॥ చ॥ పసితనమైననా డనుచు భావములోపల నింకనెం
చితే॥ పసచెడునంచు వేతఱయొక పర్వతముఁదల మీదవైవగా । గనిన
దినెంచి ధైర్యమున కాండములేసి నగంబుత్రుంచి। హనుమ్మనుచును మూడు
బాణముల మస్తకముందెగవేసి యార్వగన్॥ ఉ॥ అంతట గంధ మాధను
డునాగ్రహచిత్తముతో హుటాహుటిం। బంతముమించి వానరులపారము
సంఖ్యలు వెంబడింపగా। జెంతకువచ్చికప్పుకొని సైన్యము వృక్షములెత్తివై
వలో। చింతదలంపకంగుశుడు సింహకిశోరమురీతి దాటుచున్॥ చ॥ శరము
లుదీసివైచుచును శౌర్యముజూపుచు గంఠనాళముల్। నఱకుచు వక్షము
ల్గొడలు నాసికముల్దెగటార్చివేయుచుం। దిరుగుచు మూలమూలలకు దే
జమునొందుచు బట్టివైచుచున్ । మొఱగుచు శూలము ల్దెగిన మొండె
ములం గడకాలదన్నుచున్॥ సీ॥ ఒకసారిబహురోష భావంబునూహించు
నొకసారిబాహులు వట్టిత్రుంచు । నొకసారిచక్రంబు వైవనుద్యోగించు
నొకసారిశరములు వంచిఱిచు। నొకసారి కత్తిచే వాలము ల్దెగనేయునొక
సారికోదండ దండమేయు। నొకసారి ఖరశువు బట్టివినోదించు నొకసారి
నృత్యమువైపుగరపు। నివ్విధంబున బోరగా నెదుటనిలువ। లేక వనచర
బలములు తొకలెల్ల। మెడలనిడుకొని యడుగులు తడబడంగ । దర్లగా
జూచి గంధమాధనుడు నలిగి॥ ఉ॥ వాలముద్రిప్పి గ్గియార్చుచునువచ్చిమ
హాగిరితోడనిల్చి రొూ । బాలుడనన్నెఱుంగవె యపారపరాక్రమ వర్ధి
యుడై। తొలుదు దైత్యవల్లభులదుస్సహతేజుడ నాజిలోన నా । శూలి
తొనైన బోరుదును జోద్యము నన్నెదిరించి నిల్తువే। ఉ॥ తపసులకేల
యుద్ధములు ధైర్యములేగతి బుట్టనేర్చునే । జపములుగావుదుర్ఘటిత సం
గరము ల్లిదియంచుదోచదో । చపలుడు రావణాసురుని సైన్యములం బరి
మార్చినట్టి న । ద్విపులబలాధికుండనిన పేఱిడిరేటి కెఱుంగవేలనన్॥ క॥
వినినవ్వి కుశకుమారుఁడు। వనచర నీబలమునీవె వర్ణనచేయం । జనునా
పూర్వమునడిచిన। పనులిచ్చట జెప్పినంత భయమూనాకున్॥ ఉ॥ అని
క్రోధోజ్జ్వల మానుడైనిలిచి యేడస్త్రంబులన్ నేర్పుతో । ధనువందున్
ధరియించి వైవగనుగ్రోధా యత్తుడైపుచ్చముల్। పెనగం బాణములన్ని
యుం దునిమినన్వేగంబె యేడమ్మలన్। గొనగా శైలముద్రిప్పివైవ మది
లో గోపంబు దీపింపగాన్॥ క॥ నారనములు పదిసయిచిన । భూరుహ

గజుడు గవాక్షుండు కదనంబు వీక్షించి శతకోట్ల నర్బుద సంఖ్యల వీర। దరువులు శైలము ల్కరముల నిడుకొని వాలభీకరులుగా వచ్చి లవుని। గుహ నిభాకారొక్కని పెద్దకొండ వైచుచు నట్టహాసము సేయఁగా నతడు నలిగి। కరములు పలుకుచు నురములు జీల్చుచు బహుముల దెగ్రించుచు ప్లవగతతుల। భూమిపై గూల్చ గజుడును భూరిధైర్య। సాహసంబున లవునిపై జౌకళించి। ముష్టిఘనమునంచు బొడిచిన మూర్ఛవిధము। బొంది యంతనె దెలివొంది మదమెసంగ॥ గీ॥ శరములయిదైదు ధనువున సంఘటించి। దీసి వైవంగ ధరణిపైఁ ద్రెళ్ళె నతఁడు। మఱి గవాక్షుండు లవునిపై మత్సరించి। ధనువు గోనిశరము వైచెను దనువు దాక॥ చ॥ అనలము లోఘృతంబు వడునట్లుగ మెండుచు మూడు బాణము। ల్తనువున నాటనేయగను దైన్యతనొందుచు నెత్తురొల్కఁగా। గనలుచు నేలపైబడిన గన్గొని వానరనాయకోత్తము। ల్వనములు పట్టి రంగదుడు వాలము ద్రిప్పుచు నార్భటించుచున్॥ చ॥ వనచరులార రండి యిదె వచ్చితి రుద్రుని నయిన దాకెదం। దనువుల సంహరింపగల ధయిర్యశాలిన్ విడనాడి పోయినన్। జనములు నవ్వరాయనుచు శైలము వ్రేళ్ళతో బీకి బాలురం। గనుగొని జేరవచ్చి ముఖకంజవిలాసము జూచి యిట్లనున్॥ ఉ॥ వైరము లేల మీకు నరపాలుడు రాముడు శ్రీధవుండు శ్రేయం। గానిగోత్రగావళమె? కయ్యము లేలను మీరు పారులే। ధీరత లేల వచ్చి రణధీరుడ వాలికి నందనుండనా। పేరును విన్న మాత్రి సురబృందము బెగ్గడిలున్ భయంబునన్॥ వ॥ అనునప్పుడు జాంబవంతుండిట్లనియె॥ చ॥ కనుగొన చిన్నవారు త్రిజగంబులు గెల్చిన ఫాలనేత్రుడున్। మొనకును నిల్వ లేడు హరిమోదముతో నవతారమెత్తెనో। వనచర గర్వముల్ద్రుంగ భానుసుతుండును రామచంద్రుడీ। దినమున నేమిగాగలరో దీర్పగ నెవ్వరు లేరు యుద్ధముల్॥ సీ॥ బాల్యమ్మునను నేను మందరాచలమును గనకాద్రి దిరుగుడు గడియలోన। నేడు సముద్రము లీదుచు నొకసారి కుప్పింతు నిర్జర కోటి బెదర। ధరణీస్థలి పడంక బరువెత్తుచుండు దు ఫణిపతి నైనను బట్టి చీల్తు। శతయోజనోన్నత శైలముల్కందుక గతిబట్టిమీటుదు గరములందు। నిపుడు బహువృద్ధునైతిని నెడమకాలు। మొదటవిఱిగెను బెనుగొండ కదనమందు। విక్రమంబున బనిగొను విధము నాకు। దోచగా లేదు యేమని దోచనీకు॥ గీ॥ అనిన భల్లూక నాథుని యాసనంబు। గాంచి తెలియును నామది గానవలసి। యడిగితివి వీరలెవర నయమరవరులు। గారు కిన్నర గంధర్వమనుజులు గారు॥ క॥ రాముని నిజ తేజంబును। భూమిజ ధరియించి గనిన పుత్రులు వీరిల్। ఈ మహనీయుల గెల్వన్ భూమిని నెవ్వారైన లేరు బుద్ధిదలంపన్॥ క॥ జనకజ శ్రీసతియు వినీ। మనసున

నెఱుఁగంగఁగలవు మహిమాన్వితమై। మును దైత్యసమరమందలి। పెనుమగతన
పాటవలని బలములుగలిగెన్॥ సీ॥ ఆధారభూతయైనట్టి మహామాయి సీతా
లలామ వశీకరమున। రాముఁడు దనిమెను రాక్షసాధీశుని శక్తిచే సకలంబు
సంభవించు। మూఁడుగుణంబులు మొదల నెందుజనించె భూజలాగ్నులు
నెటపుట్టెననగు। మూఁడుమూర్తులకును మొదటిమూర్తి యొవండు నాద
బిందువులకు నాయకుండెవఁడు। నిత్యుఁడనఘుఁడు రాముఁడు నిర్గుణుండు। నాది
మధ్యాంతరహితుఁడై యాదిమూల। కారణంబైన ప్రకృతినింపారగలము॥
క॥ మనగర్వంబుల మాపఁగ। జననాథుఁడు లేనిపోని సంశయమొకటిం।
జనకజపైనిడి కానన। మునితలముల నిలుపుకతనఁ బుట్టెఁ జలంబుల్॥ ఉ॥
బాలురకీప్రతాపములు వచ్చుటచిత్రముగాదె వీరితో। నాలము సేయఁగా
దరమె యబ్జభవాదులకైన మున్నయో। భీలతనొందిరాక్షసులఁ బీచమణం
చిన రీతిగాను లో। కాలను నుగ్గుసేయుదురు గావున యోచన సేయనే
టికిన్॥ చ॥ అనిమనుచుండఁగా గుశుఁడు నాతనితమ్ముఁడు చాపబాణము।
ల్పెనగొనదీసి రువ్వుచును బీనుగుపెంటలుచేసి త్రొక్కుచున్। జనపతి
యైన రాఘవుని సన్నిధికై మొగ్రబాకి రాగమే। దినివడకంగ వాయుజుఁడు
దిగ్గున దేహముబెంచి యడ్డమై॥ ఉ॥ నిలునిలు బాలులార యిదె నేజను దెం
చితి నెందు బోవగా। వల్వదు రాక్షసాంతకుఁడు వైరము నాపయిసాఁగి
రాదుదో। ర్బలములుగల్గువాఁడ మఱి వాయుతనూజుఁడ రామబంట ని।
ర్మలుఁడగు భానునందనుని మంత్రిని నన్నెదిరింపనేర్తురే॥ సీ॥ మాతల్లికొఱ
కుఁగా మేదినీధవుఁడైన రామానుమతిని ముంగరంబు గొనుచు। దక్షిణాంబు
ధి దాటి దైత్యాధిపతినిజస్థానమౌ లంక నిశ్చింతఁ జొచ్చి। కోటలేడును గొ
న్ని కొత్తళంబులు చూచి బోవగా లంకిణీ భూతమువ్వ। దడ్డమై నిల్వఁగా
నట్టహాసముచేసి మర్దించి నవరత్నమయములైన। సౌధములు హేమమ
యమైన సదనములును। చిత్రితంబైన గోపుర శిఖరములును। మంటపంబు
లు గొలువైన మందిరములు। పురిసదేశంబులును వనభూములెల్ల॥ ఉ॥
వెదకుచు బోయిపోయి రణవీరుల దైత్యుల మోసపుచ్చి సం। గతులు దద
లంచి లోకులకు గంటకు నాదశకంఠుఁ గాంచి సం। భ్రమతము లశోకవృక్ష
వన భూమినివసిన్ని దేహకాంతితో। క్షితిసుతయున్న జూచి గొనచెట్టుకయి
శ్వసీయించి ధీరుఁడై॥ క॥ తల్లీ విను నీపతిహిత। వల్లభుఁడును క్షేమమొను
చు వచ్చితి నుతింపన్। ఉల్లమున మోదమందుచు। గల్లలు కాయనికొంత సేవ
కలవరమతియై॥ క॥ నా పూర్వోత్తరమెల్లను। నాపాలతితోఁ జెప్పియుంగ
రమునిచ్చియు నా। రూపంబుజూపి శీలమణి। భూపాలుని కొఱకు లేచి
భూశీలమవరన్॥ ఉ॥ వనమునను న్న వృక్షములపారముగా బెకలించి కా

పులో! దనుజుల సంహరించి ఘనదంతి వయంబుల నిగ్గుచేసి మే । దినిప డకుంగరాగ విని ధీరుఁడు రావణు డాగ్రహంబుతో । గనలుచు సైన్యముల్పను వ గయ్యములో దశకోట్ల దుంపగన్॥ గీ॥ అక్షయకుమారుదునుమసర ణమున । నింద్రజిత్తునను రాక్షసుడేగుదెంచి । యొప్పు బ్రహ్మాస్త్రమును వేసి యుదిమిపట్టి । కొనుచు నేతెంచి రావణు గొలువుఁ జనుసు॥ గీ॥ అతడునా వాలమునకును న బరములు । జుట్టి వేనిప్పు తగిలించు సారిచిరుద్ర । మూర్తి యై లేచి దనుజుల భుజములదర । దన్ని యప్పట్టణంబెల్ల దగలబెట్టి॥ చ॥ కోటలు నుగ్గుచేసి తగుకొత్తళముల్పడవైచి సౌధముల్ । తీటుచు శైలము ల్వైరికి మీడికి వైచుచు మెచ్చి యంబుధిన్ । దాటి శుభంబు చేకొని ముదంబున రాఘవుని జేరి క్షేమమున్ । నాటగ జెప్పినట్టి కపినాథుడ నన్నును గెల్వనేర్తురే॥ చ। కలహము లేల రాముఁడు నఖండ పరాక్రమమూర్తి యోచగా । నలువకు గన్నతండ్రి నరనాథుడటంచు తలంపవద్దు మీ । బలములు నెంత మాత్రములు బాలుర చెక్కులపాలు గారెడి । జలమును మాని యీ జనకజాతకు దోచును మాప్రతాపముల్॥ చ॥ అనినగుశుండు నన్నియును నాడితివీవు భయంబు గల్గినన్ । జనకమిత్తమై కొనుపుసాహసకృత్యము జూపినాడ వీ । దినము నిన్ను బ్రోతును విధేయముతో శరణన్న బూర్వమా । ఘనములు నెన్న నేల యిక గయ్యము చేసెదవో తొలంగెదో॥ చ॥ అనహనుమంతుడిట్లనియె నాత్మను నాకు భయంబు పుట్టదీ । ఘనజవసత్వ రీతులు పరాశిత మొదదు బాలురంచు నే । వినుతులు చేసినాను మతినీ కలంగదటం చు రౌద్రుడై । తనువును యోజనత్రయముదాల్చుచు బుచ్ఛము చేత ద్రిప్పు చున్॥ సీ॥ ప్రతిలేనిరుద్రునిపగిది భయంకరవదనంబు రక్తవిభాసితంబు । నేత్రద్వయంబులు నిడుదవాలంబును వక్రనానఖములు వజ్రకాయ । మతివిశాల ముఖంబు నమరిన పదములు భీమమై విలసిల్లు రోమచయము । క్రూరరాక్షసరణ కోలాహలభీల విక్రమ తేజుడై శకదేవ । గణము బొగడొంద జలధులు కలగబడగ । బగలు చుక్కలు రాల సోమార్క మండలంబులు ను ద్రోవదప్ప నాబింబములును । మించికనుగొన నాంజనేయుండు వడి ని॥ క భూరుహము బట్టి వచ్చెడి । మారుతిగని లవుడురాగ వద్దనెకుశుడున్ । ధీరత్వమెసర జాపము । నారిని సంధించి ప్లవంగనాథుని కనియెన్॥ గీ॥ విస్మృత వేమంబు దాల్చిన భీతిగలదె । చాంపుజయములు నేమములు నమరమందు । బట్టివిదళింతునిదిగొ నాబాణములను । చూడుమని వైచెశరములు నూటిగాను॥ క॥ తరువెత్తి వేయ శరమున । ధరజూర్ణము చేయ విపుల దర్పోగ్రుండై । గిరియెత్తి వేయ నలువది శరములతో ద్రుంచి నొందు శైలము బెరికెన్॥ గీ॥ అదియు భస్మంబు చేసిన నపుడు సాల । తరువుతో

పైవనడిమికి నతికి వయిగా । నాత్మశోపల వెఱగంది యవనియందు । వీరి
తో బోరగలిగెడి వీరులెవరొ॥ క॥ జనకజ దీవనబలములు। వనజాసను డ
యినదీర్పవచ్చునె మనకుం । బెనగొనుటయొకటి వీరిని । ఘనసమరము
లోన గెల్వ గలుగునె నాకున్॥ క॥ అనిమూర్ఛనొంది ధరపయి । హనుమం
తుండున్న కపులునలబడి బరవం॥ గని జాంబవంతుడును ఘన । వనమున
నొక చోటనొదిగి పడియుండగన్॥

సుగ్రీవుండు కుశలవులతో కయ్యంబొనర్చుట.

ఉ॥ భానుతనూభవుండు మఱిభానునిరీతిగ దోర్విక్రమై । మాన
వులార తాపసకుమారకులార విరోధమేల మా । మానవనాథుచే గె
లువ బ్రహ్మ త్రినేత్రులకైన శక్యమా । దానవలోక భీకరుడు దాశరథీ
శుడు మీకుసాధ్యుడే॥ క॥ తపసుని సుతులను నేబహు । కపులకు బ్రభు
వాదు దనుజకదనములందున్ । నిపుణుండ మీకు బాలుర । కపటంబులు
గాదు పొందు కాయముదక్కన్॥ చ॥ అనిన లవుండునిట్లనియె నర్కజతెగ్రి
ళ్ళిన వారికన్ననీ । ఘనములదెంత మాత్రిమవు గట్టిగ నారశవహ్నికీలచే
దనువును బాపుజేతునని దారుణ మార్గణ పంక్తులేయగా । ఏని శతకో
టిశితుల్యముగ నెతయు వేగిర మగు దేరగాన్॥ క॥ భూరుహముచేత విన
రుచు । నారసములు దున్రింప దొడ్డవారసములచే । దూరంగనేయ శయి
లము। ఘోరంబుగ బట్టివయివ ఘోషమునొందన్॥ క॥ శరములుమూట
ను నగ్గిరి। ధరదుత్తుము లగుచురాల దగునాలముచే । వెఱవకయుడచి
నరెంటను। తనువునకును నాటవిపుల ధైర్యము కొలదిన్॥ గీ॥ చటులశా
ణంబు ధనువున సంగ్రహించి। వెయుబ్రిళయాగ్ని కణములువెడలగాను।
వచ్చువత్తంబు నురుమాడ వడకిభాను । సుతుడు మూర్ఛిల్లె దేవత ల్పొప్ప
ద్యపొంద॥ ఉ॥ అంత విభీషణుండనియె హారఘునాయక దేవదేవవి । రెం
తటి వారలో తెలియ నీయిలవాగ్రిలిరి వానరోత్తముల్ । చెంతకు జేరవచ్చి
రి భుజాబల మొప్పగ నేను నిప్పుడే । పంతము దీర్తునంచు గదపాణి తలం
బున బట్టి యడ్డమై॥ వ॥ విభీషణుం డిట్లనియె॥ చ॥ జననము బ్రహ్మవంశ
జాడ సాహసవృత్తి భరించువాడ నా । ఘనముల నెన్న నేల యికగయ్య
ము సేయగలేరు చూడనే । దనుజులకెల్ల నాయకుడ ధైర్యములుం గల
వాడ వాదునీ। దినమున బ్రహ్మరుద్రులరుదెంచిన నాకుభయంబుగల్గునే॥

కుశలవులు విభీషణునితో బోరుట.

చ॥ దశరథ నందనుండు శుభధాముడు రాముడు భీమరూపుడౌ ।
దశముఖ రాక్షసాధిపుల దర్పముమాపిన విక్రమాండు భూ । విశదయశుం
డు నిత్యుడు విభేద శరాయుధపాణి గెల్వగా। వశమగునా త్రినేత్రునకు

బావనులార విరోధ మేటికిన్॥ ఉ॥ అట్టిమహాత్ముఁ డున్న రుడై యూదిరమా
రమణుండు లోకముల్। బొట్టను నిల్పియుండుజనపోషణుఁడై జలమేలమీ
ఁదు నీపట్టునవాదు బుద్ధిని వచ్చి పదంబులు ప్రీతితోడుతం। బట్టిన నా
త్రరక్షకుండు పాలనచేయు దయాసముద్రుఁడై॥ చ॥ అనినగుశుండు నోయ
సుర యాడినమాటలు నిక్కమానుమే। మునుమిటి యీశరీరముల పో
షణ చేయుటలేదు యుద్ధమై। చనినను నాకముం దొరకు శార్ఙ్గియై రాఘ
వుఁడైనమాకు నీ। దినమున సత్వరూపముయి దివ్యపదంబల రారుగ్రక్కు
సన్॥ ఉ॥ శరణముఁ లేమి కారణము శౌర్యముతో నెదిరించి నిల్వవా। న
టిగెదవా యుద్ధమునఁగ నాడుము బోర్లీసమటన్న నుగ్రుఁడై। చిరుతలట్టం
చు బల్కినని చిత్తములో రణభీతినొందనే। శరముల వాడి చూడుమని
చాపముఁ బట్టను బూని వేయఁగాన్॥

చ॥ వేయు శరంబుల దునిమి వేయుచు దొమ్మిదిసాయకంబులుం।
గాయము శోణితంబులును గారగనేసి మహాగ్రహంబుతో। బాణములుగ
ట్టుచు న్నతఁడు పట్టిన చాపము గొట్టి వెంబడిన్। సాయక మేయఁగా నతఁడు
శౌర్యముతో గదచేత ద్రిప్పుచున్॥ గీ॥ వచ్చుచుండఁగ గోదండ పాణియ
గుచు। దోర్బలంబున బాణము ల్దూరనేయు। ఘనతగద నేయునై దారు
కాండముఁలను। గదనుదునుమాడి సంగర ఘనతనొందె॥ చ॥ దనుజుడవీ
డసాధ్యుఁడని ధైర్యముతో గుశుఁడాత్మనెంచి భూ। జన సురసంగముల్ప్ర
బర శౌర్యముతో మహనీయ శక్తిచే। కొని ధ్వనితనూజ బుధకోటులు
మెచ్చఁగసాధ్వియైన నీ। దనుజుని దెబ్బనంచు నని తీవ్రక సూటిగ జేసి
వేయఁగాన్। వ॥ అదియునుం బ్రళయ కాల కాలానల విజృంభమాణజ్వా
లాభీలంబుగా గుప్పించుచు బలుపిడుగుల చందంబున ఘూర్ణిల్లుచు భూన
భంబు లేకంబుగా మ్రోఁడుచువచ్చి దైత్యకుల శేఖరుఁడగు విభీషణువక్షం
బు నాటం బవనహత భూరుహంబు పగిది రథంబుపయి మూర్ఛనొంద
భయాకులితచిత్తుండై తన కెదురునడచు కుశలవ కుమారులం గనుగొ
ని శ్రీరామచంద్రుం డిట్లనియె॥ ఉ॥ తాపసబాలులార మది ధైర్యము లే
కిరియఁగల్గెనైననీ। చాపశరాయుధంబుల విచారణ లెక్కడ జేసినారు
మీ। తాపసవృత్తికిం జను నెతకర్మము మీకుఁ దపంబు లైననీ। కోపము
వల్ల మీతపము గుంగదె యోచనసేయరైతిరో॥ క॥ మీతల్లిదండ్రులె
వ్వరు। ఖ్యాతిగ నేవంశమందు గలుగుదురో మతిన్ ప్రీతియమె ధైర్య
వృత్తికి। భూతలములనేచట మీరలుందరో యనినన్॥ వ॥ విని కుశలవ
కుమారులు తమయాత్మయందు సకలలోక నాయకుండని యెఱింగి యి
ట్లనిరి॥ మ॥ జననాథోత్తమ యిన్నియూ న్నడుగ విశ్వాసంబునన్ మీదు

డేఁ మును సంబంధము చేయఁబోదుమెమఱక మోదంబుతో మేము నే । జ
ననంబైనను నేమి శోచబడవో సంగ్రామముం జూడగా । మును లోట
న్న ప్రపులోట సర్వములకున్ మూలంబు నీవే గదా॥ వ॥ పరమాత్ముండవు
నాగిమూర్తివి పరబ్రహ్మంబు నీవైననీ! శరఘాతంబున ద్రెళ్ళి నీకళలతో సం
ప్రాప్తమైయుంటిమో! వరలక్ష్మీధర నిత్యానందమహో బాణంబు సం
ధింపవే. మఱియుంతైన భయంబులేదు మదికి స్వర్ణింక నిం కేటికిన్॥ అది
యునుంగాక॥ క॥ మాతల్లే రణశూరుల ఖ్యాతి వహింపంగ గనిన ఘనము
వహిల్లన్ । మాతల్లియేల గాదో । మాత .. మా నేర్పు విధము శూరులు
మెచ్చన్॥ వ॥ అనిన శ్రీరామచంద్రుండు నిజస్వాంతంబునం బుత్రులని హ
త్తుకొన్న చిత్తంబునం బ్రాణవల్లభయగు జనకాత్మజాస్మరణచే మహా
మోహావేశ పరవశుండై కోదండంబు మాఱిచి శరంబుల నిగవయిచియో
గనిద్రాపరుండై శరీరంబు మఱచి మూర్ఛనొందిన॥ క॥ కనుఁగొని కుశ
లవు లంతట! ఘనవిక్రమశక్తి మెఱయఁ గయ్యము సేయన్ । జనపాలురు

కుశలవులు నిజాశ్రమంబునకు వెళ్లుట.

లేదనుచును । మనమున మోదంబు ఖేద పరవశులగుచున్॥ గీ॥ రణము
శోధింపఁ దలచి యారాత్రిలవుడు । కుశుడు గోదండములు చేత గొనుచు
శూరవరులు బ్రతికినవారెవరో యటంచుఁ । బొడఁచుచు సురంగ సం
గర భూమియందు॥ సీ॥ జాంబవంతుడు మారుత్సంభవుండయినట్టి హనుమం
తుడొకచోట నణగి మూర్ఛ । విధముగా బడియున్న విమల కోదండంబు
చే బొడిచిన జవసత్వమెల్ల । వదలి కన్నులనీరు వరదలై పారగా లేచిని
లంబడజూచి కుశుడు బాణంబు సంధింప భయపడి మోడిచి శరణని
మ్రొక్కంగ సంతసమున । భయమును దయచేసియు సకలసైన్య । పతు
ల కధినాథు డెవ్వడో మాకు దెలియ । జెప్పుమనగను నొక్కింత సంశ
యించి! ధయిర్యముప్పొంగ నడిచెడి కార్యమెఱిగి॥ చ॥ బాలకులార ర
త్నమయ భాసిత రథ్యము మీవనుండు భూ । పాలుడు దేవతాధికుడు పా
వనమూర్తి నరుండుగాదులో । కాలకుఁ గర్తనిత్య శుభకాముఁడు సద్గుణ
భూషణుండు సం । శీలుడటన్న జేరజని చివ్వన రథ్యము నెక్కి భక్తితో॥
చ॥ ఘననవరత్న సంకలిత కాంచన దివ్యకిరీటహారటముల్ । గొనిముదమం
దుచున్ మసలి కోతుల జూచుచు తల్లిప్రీతితో । ననితగ వెంట బెట్టుకొని
యంతట వచ్చుచునుండె నచ్చటన్ । జనకతనూజ పుత్రిను స్వాంతము
నందు దలంచి యిట్లనున్॥ సీతాదేవి కుశలవులు మసలుటకు జింతిల్లుట.

సీ॥ పృథ్విలో పలనన్ను విడిచిపోవుటనీకు దగవగునే యాజ్ఞ ధర్మశీ
ల! బ్రహ్మయేమని తల వ్రాసెనో దయమాలి యేమని పుట్టితి భూమి

యందు । నేదుష్కృతంబులనే జేసితినో తొల్లి సమయాక పాపిసి జగతి
యందు। బుత్త్రులయినవారాని పోషింతురనియుంటి నిక్కంబు వ్యర్థమ్మ
యై యరుగుదెంచె । నహాహాయోమని విలపింతు నాపుత్రులన్న । రన్నదమ్ము
ని కొలుకుగా నరిగి ఘోర । సమరముల జేసి చిక్కెనో శత్రురాజ ।
వరులతో బోరిగెల్చెనో వసుధలోన॥ ఉ॥ కానల గొందలం గనగుగా
యల సేయుచు నున్నవారిపై । మానవనాథు డవ్విధి సమానముగా
గలహించి ధీరుడై । సూనులబట్టినో పగనె శోణితపూరచ్చగ లేకయి
తృనిం । బూనిరి యేమి సేతు పుత్రుల మోమెటుచూతు సిమ్మ
టన్॥ ఉ॥ తమ్మునిగానకం గుశుడు తల్లడమందుచు భాగిదుఃఖముల్ ।
గ్రమ్మగ నెంతభోయెనొ ముఖం బెటుచూపుదు వంచు నింక తా। ర్యమ్మ
లు దోచకన్ కదన రంగములోపల చిక్కినాడో ప్రే। ర్యమ్ము వహించ
లేను బరరాజులు నెంతచలంబు సేసిరో॥ చ॥ సమరము వేళలందు ఘన
సాహసకృత్యము బూనియుండరా । సములమగాము పేదలము శైల
తలంబుల నున్నవారమా । మమత వహించు తల్లియని పల్కగరా
దెకుమారులార యో। కమల దళాక్షులార యని కన్నుల నిండగ నశ్రు
లుంచుచున్॥ ఉ॥ పౌజల జాత్మ పావిమల పాకుశ పాలవ పాకుమా
రకా । రాజిలలేక పోయి రణరంగములోపల చిక్కిపోగనా । తేజము
వ్యర్థమాయె బరచేతికి నాపద పుట్టవచ్చెనే । మోజు చెలంగ రాఘవుల
ముచ్చట తీరగ నేడుచూచెనో॥ చ॥ ననునెడ బాయలేద నరనాథుడు తే
నపవాదదోషముల్ । జనములువల్కిరంచుమది సంశయవృత్తిభరించి యొం
టిగా। వనముల ద్రోయబంపుటయె బ్రాణము పోవగజూతు సూనులా ।
దినమున నడ్డమైరియిక దేహము పైడియాస యుంతునే॥ సీ॥ వనతలం
బుల నుంచి ఫలములుప్రీతితో గొనివచ్చియిత్తువే కుశకుమార । తల్లినీ
కిక నేమి తక్కువే యనిపుష్ప గుచ్ఛము లెత్తువే కుశకుమార। యమ్మయమ్మయ
నియని యడుగులపైబడి లాలింతువే నన్ను లవకుమార బలవిక్రమంబులు
గలవారమనిశర లక్ష్యంబొనర్తువే లవకుమార। అన్న నాయన్నలార యారాఘ
వులందు। నొంటిగావచ్చి శాత్రవవరుల చేత। బట్టువడి తిర్గ యెడల నా ప్రాణ
మెట్టు। నిలుచు బుత్రుకనునిక మీదనిమిషమయిన॥ చ॥ అనుజునిదోడితెత్తుని
క నాత్మను దుఃఖము మానుమంచు జే। ధనువుధరించిపోయితివి ధైర్యముతోని
వు డేలరావు యో। దినముతో నారువారములు దీరెను నెచ్చట నున్నవాడవో।
కనుగొనుటెట్లు డో యనుచు గాయమునదంలి యాశమానుచున్॥ క॥ ఆరా
త్రిగడువగు శలవ। వీరులు జయశీలురగుచు విభవంబలరం । జేరద దాశరథి మహా
సులు। దూరంబున గాంచి మదిని దోషమెలర్పన్॥ సీ॥ పవమనందనుని సాభల్లా

## కుశలవులు సీతాదేవిం గాంచి సమరంబు చెప్పుట.

కనాథుని వశమున నొకచో౯ నిలిపి యధిక। భయభక్తితో దృఢపాణులై శు
కపికకలకంఠపట్టుల కలితనద। మంగళాన్వితమైన శృంగారవనతలసాలాం
తమున విచారయుతిని నున్న వైదేహిని నొక్కెడం గనుంగొని పదపద్మము
లకును వందనములు। చేసి నిలుచున్న సంతోషచిత్తముననుఁ। పేదవసిడి
గనుంగొన్న విధముగాను। గద్దములవంటి చెక్కిళ్లు ముద్దుగొనుచు। నవని
సుతసీత తనయుల కనిపెంపెల్ల॥ చ॥ అమరెడి చూడమీ యురములందును
కింశుక పుష్పకైవడి౯। సమరమునందు నిల్చి పరసాయకసంఘము నాటి
యున్నదో। విమలకళాత్ములార రణపీఠుల నెవ్వరు సేసిమిత్తము। సమ
గతి వీరగాథ లసి జక్కఁగ నాకును విన్నవింపరే॥ ఉ॥ కేలన్ దేకి ప్రియం
బిదికి నెచ్చటనుండెను నేధంబుగా। నాల మొనర్చినావు జయమైనది
చోద్యము కేశవుండు నా। బాలికటగల్గె వారిదమువంటెను వోటు నోముపుణ్య
మో। చారగ సౌఖ్యములు గల్గెను సంభవమాయెను మాంగళ్యంబులు౯। క॥ అనిప
లుకుచున్న సీతా। జననియుతిని జూచికుశుడు సంగరములు నే। మని తెల్పవచ్చు
దీవన। ఘనమున బ్రతికితిమిగాక కదనములందు౯॥ సీ॥ తమయనుమతి బొంది
ధనువు బాణంబులు ధరియించి పోవ భూధవుడు లక్ష్మణుని। మూర్ఛిల్లగా జేసి మూ
కలతో కూడి పోవగా గడ్డమై భూమిఁ బడక। శరములు సంధించి సైన్యముల్ చెం
డాడి రథములు భంజించి సారథుల గూల్చి। ఘోటకంబుల డల్చి గొడుగులు తె
గ నేసి సామజంబులదూరి మిగుల నరమున। భూపతియు వచ్చి పోరాడ గోపమునను।
నతని బరిమార్చియును జన్ముడయిన లవుని। రమ్యమయి ప్రీతమయు గారంబు
మీఱ బెట్టినప్పుడె బలికె యాభీలముగను॥ చ॥ కరిరథ ఘోటకాయుధము గల్గి
న వేరొక భూధవుండు సం। గరమునకు వచ్చి చుట్టుకొని కాండను జేయగ మీఱ పదా
బ్జము లొత్తితలపోసి యుద్దరము మత్తగజంబుల సైన్యనాధులం। దరగముల౯
వధించి నిజదోర్బల మొప్పుచునున్న యాత్తజు౯॥ చ॥ కనకసమానవర్ణుడు జగం
బులు ఘూర్ణిలవచ్చి తాకగా। గలగుచు బోరు ఘోరమయి కాండము లేయుచు
బట్టి తుంచుచుం। బెనగుచు నార్భటించుచును వేదనలొందుచు నాన్రుపాలు
ని౯। ధనువు రథంబు గూల్చి కడు ధైర్యముతో విలసిల్లుచుండగా౯॥ చ॥ యాతి
ధరణీశుడొక్క రుడు వైభవమొప్పన సాంఖ్య సైన్యముల్। పురువడి జోడరా
గగసియుగ్రితనొప్పి ధరాధినాథుల౯। శరములు వర్షించి వృక్షములు చీల్చి మహా
రభసంబు చేసియా। దొరను వధింపగా నపుడు దోచెను మింటను దేవదుందుభు
ల్॥ ఉ॥ ఏమని చెప్పవచ్చు బరమేశుడొ దివ్యుడొ యాదివిష్ణువో। కాముడొ
యెంచగాదరము గాదు సురేంద్ర ఫణీంద్రులైననా। శ్యామలవర్ణము౯ వికచ
సారసమున్న యనాధికాంగముల్। భూమిని నిట్టి సుందరము బొందినవారలు

తేరుచూడగాఁ॥ చ॥ కపులనసంఖ్యులంగొలువగాం బనరథ్యములందుమేటి
రై। తపనునిరీతి వెల్గుచును దైత్యులతోఁ బ్లవగాధినాథులుం। గపటమునన్ను
లైగిరులు గైకొని మమ్మదలించ యుగ్రులై। కపులనుద్రించుచుఁ వెడలగ
న్గొని యానరపాలవర్యుడుఁ గీ॥ మమ్ము గని యెపుడు నృపాలవరుడు।

శ్రీరామచంద్రు భూషణముల గని శోకించుట.

పట్టియున్నట్టిచాపము పైడితేరి। పయినిబడమూర్ఛనొందె నారేయిరణము।
జూచి శోధించుచును మేము శూరులమయి॥ వ॥ అమ్మానవేశ్వరుని దివ్యభూష
ణంబులం గొనివచ్చితిమంది॥ చ॥ అతని కిరీటకుండలము లంగదహారము
లంచు ముందరన్। వితరణతోడబెట్టగను విస్మయమందుచు జూచి తప్ప
కన్ మతిదిగులొందిరామనరపాలుని భూషణమంచు భూమిపై। బతనముజెంది
లేచితడబాటునశోకదవాగ్ని హెచ్చగాన్॥ చ॥ నను నెడబాయలేని నరనాయ
కయీగతియేలవచ్చెమే। దినివిపరీతముల్గలదె దీనశరణ్యదయాసముద్రభూ।
జనసురవంద్యమానజలజాప్తకులోద్భవయాశ్రితరక్షణా। మనసిజతుల్యసుంద
రసమన్వితచారుసుధాకరాననా॥ మత్తకోకిల॥ ఎంతవింతనుతోచె నేనిక నేమి
సేతునునైనలో। కాంతమైవికటించెనో జనకంటకంబులు సీరమా। కాంతు
డున్ రణమందుమూర్ఛిలగారణంబగురీతి శ్రీ। మంతు నే నెడబాసి ప్రాణముబ
ట్టుటల్విహితంబులే॥ చ॥ అడవుల నెంతకష్టములనైననుగొండలనున్న కాయ
లేరుడిచిననారచీరలను కూర్చినదుఃఖము లేదు నాకునీ। పురమునిభోగభాగ్య
ములబొందుచు నీవు సుఖంబు జెన్దితే। కడుముదమందుచున్నదము కర్మము లేమి
తలంచిచేస్తినో॥ ఉ॥ నీముఖమందహాసమును నీచెలువంబును నీయోయార
మున్। నీమహానీయశౌర్యములు నీచతురత్వము నీవిలాసమున్। నీమహిమాతి
భోగములు నీసరసత్వము నీగుణంబులున్। భూమిని నెన్నగావశమె పుణ్య
ములెంతటి కాదె నిచ్చటన్॥ ఉ॥ హారఘువంశపావన సురాధిప వందిత
పాదపద్మ శృంగారవిరాజగాత్ర శుభకామ ఫలప్రద ధైర్యభీమసం।
సారతమప్రకాశ జలజాప్తసుపోత్తమ నిత్యమంగళా। ఘోరసురారిఘో
రమదగర్వవినాశన పాపశోషణా॥ చ॥ ననువరియింపగాదలచి నాకము
లోగల నిర్జరావళిన్। మనుజుల యక్షకింపురుష పన్నగ రాక్షస సిద్ధసా
ధ్యులన్। జనకనృపాలుడుం బిలువజంద్రజటాధరు చాపముప్పుడే। తునిమిననీ
భుజాబలము దోచకపోయెను నేడు భూమిపై॥ మ॥ కరమునురక్తితో విపుల
కార్ముకనిస్వన మొప్పభీషణా। శరములుదాల్చి బాధవుల జెందిన భార్గవరా
ము ధైర్యముం। గరుణయడంచిన ట్టిఘనకల్పితశౌర్యము లెల్లనేటికిన్। మరచి
తివాకుమారులనిమానసమందునదోచిభూధవా॥ చ॥ పసిడిమృగాకృతింగలి
గివచ్చివనాంతరమందునిల్వనా। యసురుని వెంటనంటిజగమంతవడంకగజావ

హస్తుఁడై। కసిగలుగంగ ద్రుంకబడుకాండము నేటికి నెందుబోయెనో। శిశువుల టంచుబోషణము జేసితివారఘువంశవల్లభా ॥చ॥ అలరజతుర్దశౌకసహస్ర మహాసురవీరవర్యులం। దలపగనొక్కఁడే నిలిచి దంతిరథాశ్వకదాతులన్ మహా। బలులసు జెండినట్టిభుజబాహువరాక్రమమెల్లనిప్పుడే। దొలగగ జేసినా వెరయదోచివిభాకరవంశపావనా। చ॥ బలమెటువంటిదోయనుచు భానుజుడున్ ఒకయోజనోన్నతం। బలరుకళేబరంబుగొనివచ్చినపాదముచేతనన్న భూ। తలమున నూటఋక్షామడలు తన్నితినీభుజశక్తి నప్పుడే। నిలిపితవాక్యపారన ముగిందగ బుత్రులకైధరాధిపా ॥చ॥ జలనిధులేడుదాటు జవశక్తియు మెల్గి నయట్టివాలితో। జలమువహించి భానుజునిసఖ్యము తో నొకసాయకంబు నం। దొలుతధరాతలంబునను ద్రొక్కడగించిన నీపరాక్రమం। బలచన చేసి నావశసిబాలురటంచు నరాధినాయకా। చ। తలచిననీమహాత్మ్యమును దర్పముతో జలరాశి పొంగగా। వెలయగ మార్గణంబుపయి వేసినదైన్యత నొందిబిందువై యలజడినొందిసిగ్గు మతి నమ్మన మత్తముదాపినట్టులా। బలమిపుడెందుదాచితివి పవననిత్యఫలకృదాయకా ॥చ॥ తరుచరకోటిగొల్వగను దాటిసముద్రములంకజొచ్చి యా। పురమునుగాల్చి రావణునిపుత్ర హితాప్తులతోడద్రుంచిరం। ధురసముగ్రవిక్రమములుదోచక చేసితివో మహాత్మనా। కరుణదలంచి పుత్రులనుగైకొని ప్రోచితివా దయాకరా॥

హనుమజ్జాంబవంతులు సీతను వినుతించుట

సీ॥ అనివిలపించెడి యంబనుగనుగొని ముకులితహస్తులై మ్రొక్కితల్లి। చిత్తములోపల జింతిలగానేల భయముబొందదునీకు బరమసాధ్వి। మహిసీనుసంగరమధ్యంబులో గపిరూపములగ్గు నారూఢబలుల। జట్టితెస్తిమివారివలన సర్వమునీకు వేద్యంబులౌనని విన్నవించి। జాంబవంతుని వాతాత్మజాతు నటకు। బిలుచుకొనిరాగ నత్యంతప్రియము భయము। భక్తిచె న్నొంద వైదేహిపాదములకు। వందనముజేసి సంతోషభరితులగుచు॥దండకము॥శ్రీమన్మహా దేవి నీరేజపత్రేక్షణానంద కల్హారచాంపేయ సౌగంధికాపుష్పధమ్మిల్లసంకాశభాసాననాచిత్రకస్తూరిరేఖాంచితా మందహాసామహా పద్మరేఖాన్వితాదివ్యతాటంకసంపూర్ణరత్నప్రభాజాలకంఠస్థలీ మంజువాగ్వైఖరీ నిత్యసంతోష భక్తావళీలోలసంరక్షణా చిత్రభాసాపరంజ్యోతిరూపీవిరూపీ మహాదైత్యభూతాదిభేతాళ వర్గాది సంహారశక్తీ త్రినేత్రీ త్రిరూపీమహామంత్రియంత్రి ప్రశస్తాధికారీజగన్మోహినీ దేవతాపద్మవాణీరమావైభవానంద శృంగారగాత్రీ మహాఘోరసంసార తాపత్రయాభీలపాశంబులన్నీదునామంబుచే మాయమైపోవు నీపంచభూతంబులున్ వృద్ధిగా జెందు నీయందు బద్మాల్గులోకంబులుం జంద్రసూర్యాదులున్నష్టదిక్పా

లకుల్ దుష్టగంధర్వసిద్ధాల్సురసేవ సంఘము బులలోన్ శైలముల్ దివ్యరత్నం
బులుంగల్గు మాయాప్రపంచంబు మాయామయంగా జేయు భూతేశ్వరీ సర్వ
సంపత్కరీ సర్వలోకక్రియా శక్తివై యుండు నీవు నిర్మింపగా బ్రహ్మ
యుంగూడి యిచ్ఛాప్రకారంబుగా వేదవేదంబులున్ సర్వమంత్రంబు
లున్ సర్వతంత్రంబులుంబద్యముల్ గద్యముల్ పాదిసర్వాత్మ సంభూతమై
తోచి ప్రజ్ఞానశక్తైరహా దేవియై విష్ణు భోగాంగ రూపమై నాదబిందుస్వ
రూపాక్షరాహంస తత్త్వంబుతో మూడువర్ణంబులై యేకమై భవ్యమై దివ్య
తేజోనిరాకారమై సర్వసాక్షి ప్రసన్నంబులోలాను భవ దేభయా నామహా
మోహపాశంబులుంగట్టి నీశక్తిచే మత్తశుండాల సంఘాలై సైంధవ వాసికముల్
ఛత్రముల్ సైన్యముల్గల్గు కారుణ్య సంపత్తిచే నిత్యకల్యాణి సీతామహాదేవి
శ్రీరామభద్రుండు వైకుంఠవాసుండు నీవేమహాలక్ష్మి మీకన్ననింకేమి
యున్ లేదు మిమ్మున్ సదాస్తోత్రముల్ సేయుపుణ్యాత్ములున్ దివ్యులై హెచ్చి
నారూప్యసాయుజ్యముల్ పొందరే దీనమందార వృక్షౌన్మదాహేతు చిత్తా
న్వితా మొన్న శేషాహికైనన్ వశంబా నికి శ్రీరామదేవినమస్తే నమస్తే నమః॥
మత్తకోకిల॥ మిమ్ము నెన్నగఁగూడునే పరమేష్ఠికైనను నేమమా। యమ్మ మొప
ట్పదవేణి యాపదలన్నియుం బరిమార్పుసీ। తమ్మభక్తవశంకరీ బహుదై
త్యభూతవినాశనీ। సమ్మతిగ బ్రహ్మాండనాయికి శాశ్వతామరపోషణీ॥

సీతాదేవి హనుమంతుం బ్రశంసించుట.

చ॥ అనినుతియించు వాయుజునియందు మహాదయయుంచి చూచి
యో। వనచరనాయకోత్తమ విభాకర శౌర్య మహోట్టహాసభూ। జనసుర
పూజితాంగ మునిసన్నుత రాక్షసయుద్ధభీమమే। దిని నిను నెన్నగావశమె
దివ్యసమూహముకైననిప్పుడున్ ॥సీ॥ ప్రత్యక్షమైనావు పాసె భావంబున
బుట్టినదుఃఖము లుర్వి మహాత్మ। నా నాథు రాఘవుం డతని సోదరుడునునను
బాసి ఘోర కాననములందు। వెదకి పంపాతీర విపులసంభృతమైన యమలర
సాలవృక్షములనడుమ। నున్నసూర్యజుడు సమున్నతిదనరగా నతివినయం
బున నరుగుదెంచి। వంశమును నామధేయంబు పట్టణంబు। యతడువచ్చిన
యాకథలన్ని దెలిసి। మనసునందు సఖ్యసంపన్నుడవయి। వచ్చియిట్లంటి
సుగ్రీవ వానరులకు ॥చ॥ జలజదళాక్షు రామ బుధసన్నుత దివ్యపదారవింద
ముల్। వెదకగకంటి మీ మదినిభీతి యొకింతయు నిల్పవద్దు। భూతలము ర
సాతలంబులును దాటి పయోధినిగాంచి చెచ్చెరన్। మాలయజగంధశేఖరము
వచ్చువిధంబును గాగవచ్చెదన్ ॥క॥ అనిపోయి భానుసూనుని। గనుపడగా
జేసి యతని కపిరాజ్యముకున్। ఘనముగ బలిగానిడియా। జనపతికడవచ్చి
నిలిచి శౌర్యములొదవన్ ॥మ॥ ఘనసత్వంబమరంగ రోషవశతన్ గంగాధ

రు డయ్యెవే । ఘనివడకంగఘూర్ణిలఁగ దిక్కులు నెల్లను మందహాసమిం ।
పానరగనూడియంబరము భోరుకలంగగ నబ్ధినూరుదో । జనములు దాటు
నీవిపులసాహసములెవ్వనుతింపశక్యమే ॥ చ॥ వెఱువకయర్ధరాత్రి బహుభీమ
మహాముఖదైత్యనాథులా । పురమున గాచియుండగను బోయి జనంబునగో
ట లెక్కిగో। పురములయందుఁజొచ్చి యెక్కిప్రాకృతసాధము తేర్వరించి సుం।
దరసుతలంబులన్ వెదకు ధైర్యము నెవ్వరికైన నుండునే ॥చ॥ మసలకరా
తిసిందువిమివచ్చి యశోకము గాంచి నీవు ఁగా। సురులమధ్యయందుమదినా
శలుమానిశరీరమందునా । వసనము దేహగంచుకొను భావముదోచెడి వేళలం
దువా।తసమమరంగ బాణములు దానము చేసినవాడవే కా॥ చ॥ దనుజుని ప
ట్టణంబువుడెదగ్ధము చేసి మహాజవంబుచే। నను వదిజూడఁగోరి జని నాదగు
వార్తలు సెప్ప ప్రీతితో । గోనక ప్రీతిగొల్వగను గోరి ధరాధిపుజూచి
మానస।మ్మున ముదమొందజేయు శుభమూర్తివిగావె త్రిలోకవందితా॥
వ॥ అయినను నేడుమీరలు ప్రసన్నముఖులగుటకు మంచిదయ్యెడ శిఖములు
నివర్తింపగావచ్చును గుశలవకుమారులు హయంబు నెపంబున ధరాధిపుల
ననేకులసాధించి నిలిపింపంగావున వారలే నృపాలకులువారియన్వయనామం
బులు విశదపఱుపుమని ప్రార్థించి సీతామహాదేవికి పునఃపునః ప్రణామంబు
లు జేసినిటలతటఘటితకరకమలుండై యాంజనేయుం డిట్లనియె॥

హనుమంతుండు సీతాదేవితో శ్రీరాముని వృత్తాంతంబు చెప్పుట.

మ॥ మామహనీయవిక్రమము మాజవసత్వములెంతమాత్రిమా। నీమహ
నీయసత్కరుణనిండగ బూర్వము దైత్యకోటిపై । మేము నుదారసిద్ధిమిమిమీ
దయయుప్పుడులేకపోవగా । భీమముతగ్గిభూమిపయిబీదతనంబులుగల్గియుండు
టల్ ॥ఉ॥ నీవెచరాచరంబులకు నేతవుసర్వతమఃప్రధానమై। పవనమైవె
లుంగుదువు పంచమయాత్మప్రపంచమంతయున్ । నీకయినుండ ముగ్గురును
తినెన్నినుతించుచునున్నవారలో । దేవిశుభప్రదాయిశశిదివ్యసరోజ్జ్వలవైభ
వాననా ॥సీ॥ అఖిలంబులకు ప్రథమాధారములునీవెయాధారమునకును నా
దిపీవె। బ్రహ్మాదులకు మహామహిమలేర్పడజేసి మోదించుచుండెడిమూర్తి
వీవె । చంద్రార్కులకు దివ్యసాంద్రతేజంబులు కల్పించుచున్నచిత్కళలువీవె।
సమీరంబునను జవసత్వవిక్రమమును సంధింపగా ధైర్యశక్తివీవె। దేవినిన్నె
న్న శ్రీరామదేవినీవె। యఖిలజనములు లోకాలమైనవిధము బొందియున్నదినీ
మహామూర్తివలన । బ్రదుకవలెకాక వేరెయుపాయమేమి॥క॥ వీరులగునీకుశ
లవకు।మారులునిజగర్భజనితభాసితులుమహా । శూరులువీరినిగెల్వగ । వీరులు
నెవరైనగలరె విశ్వములోనన్ ॥క॥ రాముని ప్రతిబింబ బులు । భూమిసుగుశ
లవులనంగబుట్టిరి మీకున్। ఈమహనీయులగెల్వగ । మేమెంతటివారమమ్మ

రిపుసహాసయనా॥ క॥ శ్రీరాముఁడు మహాయాగమేధము । సారంభ మొనర్చి విడిచె
హయమును వెంటన్ । వీరుండౌ శత్రుఘ్నుఁడు । ధారుణిపై దిప్పియధిక ధైర్యము
తోడన్ ॥ క॥ గంగారణ్యాతటంబుల । శృంగారముకలిగిలపుడు సింహాములుద
మా । తంగంబునోడియువిధమున । నంగంబుహ్వాంగసవనహయమును బట్టెన్ ।
క॥ పట్టిన సైన్యముతనకై । ముట్టడి వేయంగ రుద్రమూర్తి గలవుడుం । జుట్టిన
రథగజహయముల । ధట్టించెను పుష్కలనృపతిదళములు బెదరన్ ॥ వ॥ అంతశత్రు
ఘ్నునినారామనాస్త్రజ్వాలలభస్మంబుచేసి సుమిత్రాపుత్రుని మూర్ఛవిధ
ముగా నేర్పరిచి నిజసహోదరునిం బ్రదికించుకొనయున్నంతదద్వర్తమానం బవ
ధరించి యనేక సైన్యంబుతో లక్ష్మణస్వామియరుదెంచి ఘోరయుద్ధంబు జేసి
మూర్ఛాగతిం దెళ్ళి భరతుండు సన్నద్ధంబునం బోరలెసుషేణమైంద ద్వివిద
గజగంధమాదన దధిముఖాంగన నలనీల విభీషణార్క తనూజాది మహాప్లవగం
బులతో శ్రీరామచంద్రుండు సమరంబుగావించి మహాశరవశత్వంబునం గా
యంబు మరచియున్నవాడతండు ధరియించుకుండలాంగదంబు లీయుగియనిన
సీతామహాదేవి మూర్ఛనొంది మరలం దెలిసి నులికిపడి గడగడ వడంకుచు విభ్రా
మాయత్తచిత్తయై యిట్లనియె॥ పంచచామరము॥ నరాధినాథ నన్ను బాసి పావ
టంచు నెంచియీ । ధరాతలంబు సంస్పృశించి నామముఖ్ వసించిభూ । నరాధినా
థ నన్ను తాఁకిపొవ నాదయాంత శ్రీ వరానురాధినాథ సేను వచ్చి నిన్ను బొం
దెదన్ ॥ తోటకము॥ నిరవద్య సర్వేశ నిత్య నిరం । జనధర్మమతీగుణధామ మ
హా॥ వరవిగ్రహ ధైర్య గుణశ్రీనివసం । భరితచరాచరపద్మదళాతా॥ కవిరాజవి
రాజితము॥ రాజకుల శేఖర విరాజిత వివేశా । భూజలజనేత్రబుధపోషణసము
ద్రా । భ్రాజితసురత్నరుచిభ్రాజితకపోలా । పూజితశుభాంగమణిభూషణవిలా
సా॥ మ॥ అనిదగ్ధుత్రికనొందుచున్ మదిని నానాలోచనత్సేయుచుం । గనులంబా
ష్పము లుప్పతిల్లగను గంగాదేవినిం జూచివో । జనసాఫల్యఫలప్రదాయిక
నాజన్మంబునీలోపలం । గొనిపో నేరవె తల్లి సత్యమిదియో గోదావరీ పావనీ ॥ చ॥
జనకుని యింట బుట్టి జగత్పూజ్య వంశము చొచ్చి రామభూ , జనపతి పెండ్లియై వి
పులసంభవదుఃఖము దీరదాయె నే॥ మనివిలపింతు నేదిదరి యెంచుల తాంగియు
జింతఁ గోడనే । బెనగొనకొప్పు వీడె మఱివేదన నొందుచునున్నయత్తరిన్॥

## సీత వాల్మీకితో రామువృత్తాంతంబు చెప్పుట

సీ॥ వాల్మీకిసంభూత వరతపోధనుఁడైన వాల్మీకి భూరుహ ఫలపుష్ప । ఫలస
మన్వితసింహ భల్లూక శార్దూల కుంజరవిహారణ కొండలందు । ఘోరమహా
తపములు గూర్చి చేయుచునుండి యాత్మవిచారుఁడై యవనిజాత । రోదనం
బులు గుహాల్ భేదిలిగా విని చలనుడై వెన్నున జడలు జార । భూతిపూతలు
చెన్నొందఁ జేతినిండ । జారగట్టిన రుద్రాక్ష సరులు మెఱయ । మండితం బై

న ద ండ కమండలువులు ॥ తగవహిల్లగ నపుడు పరిత్యక్తమయ్యె ॥క॥ ము
నిపభునిజూచి భూసుత । కనులను నశ్రువులురాలగా మ్రొక్కి మహా । ము
నినాథ నామనంబున । ననుగమనంబైన దుఃఖమడపవెతండ్రీ ॥తరల॥ ము
నివిభూషణా బోధితామర ధీజనానసవందితా । ఘనవిరాజిత తేజపంకజగర్భ
సంభవతుల్యనా । దినమునన్విపరీతమైనది దీనజనపరిపాలనా । మన
సుచల్లగజేయవేయుకమాకు దిక్కునీవెగా ॥తరల॥ మనమలున్ బలశిక్రి
మాన్వితమానులై యిహాద్రిభూ । జనులకున్ బతియైన రాముని చం
దమున్ మదిదోచకే । యనుజులిట్ బరిమార్చివచ్చిరి యాకదల్కుడ తేర్ప
వే । వనజసంభవతుల్య మీకదె పద్మము ల్మదినమ్మితిన్ ॥సీ॥ పూర్ణగర్భ
మునేను పూనిగంగారణ్య దేశంబునను నొక్కదిక్కులేక । విపుల దుఃఖ
ముచేత విలపించుచుండగాం బరిత్యక్తమైనారు పద్మగంధి । పుత్రివిమునిని
జ భూమికిగొనిదెచ్చి మునికన్యలను గూర్చిమృశాలసాధుర । ఫలవిశేషము
లతో బాలించుచుండగా సుతులుగల్గగ మహాశుభములనుచు । జాతక
ర్మంబునడిపించి సకలవేద । శాస్త్రములు చెప్పికోదండ పాయకముల । మ
ర్మములుదెల్పి బ్రోచిన మాన్యచరిత । నిమ్మునుతియింప దరమానె మ
లతలకును ॥క॥ అని దగ్గుత్తికతోడను । జనకజ విలపింపదల్లి సంతోషము
తో । మనమలర భరతలక్ష్మణు । లనుజన్ము తోడరాము డానందించున్॥
చ॥ అనినమృగాక్షి యిట్లనియె హామునివల్లభ యేమిచోద్యమే । మనికొని
యాశవచ్చు జననాత్మను నెంచితి దేహమేలయా । తనయులు పోష
ణంబులకు దాపుమురెవ్వరు లేరుతండ్రినీ । వనిమదినెంచి నారమిక నగ్నిని
జొత్తుజనంబులెన్నగాన్ ॥ఉ॥ నాపతిమోముజూచి బహునాళ్లయివచ్చె
ను సంగరంబులో । భూపతితోడ గూడుకొని పోయెదనింకను భూమిమీ
దనా । రూపమదేలనో యాని సరోరుహనేత్రి ప్రియంబు జెందియా । తా
వన శాలలుంగడచి తప్పక పుత్రిల గౌగలించుచున్ ॥

సీతాదేవి రామచంద్రునికడ కరుదెంచుట.

సీ॥ నాతండ్రులార నానాథుని వెంబడి బోయెదమీకును బోషణం
బు । వాల్మీకిమౌనరించు బహుభాగ్యసంపద పొందుడు నెపుడు సమృద్ధి
గాను । ధరణీతలానికి ధవులుమీరయ్యేరు భావంబునను నొక భయము
వలదు । ఆవలన యోధ్యలో నధిపత్యంబుగా సమకూర్తురింక విచారమే
ల । ననుచుజెక్కులు ముద్దాడి యధికమైన । పుత్రమోహంబుచేతను బొ
గిలిలేచి । యచటి మునికన్యలకుజెప్పి యపుడుపర్ణ । శాలలనుమాని చ
నుదెంచె జనకజాత ॥సీ॥ కుసుమవర్షంబులు గురియించిబహువిధ దేవదుం
దుభిధ్వని దిశలునిండ । జేయించినిర్జరుల్సీతామహాత్మ్యంబు గనుగొన వ

లసి శృంగారమమర । బ్రహ్మాది సురలెల్ల నభ్యంతర సీమలఁగొలువు
లై చెలువులమర । చప్పన్న దేశ సంచారజనంబులు గంధర్వకిన్నర ఖచర
గణము । వచ్చి సేవింప సాధ్వులు పక్షిచయము । మేతలనుమాని తరు
వులమీఁద నెక్కి । విస్మయంబంది కనుఁగొన నిహితబంధు । వర్గమెల్లను ను
తియింప వైభవమున ॥వ॥ భాగీరథీప్రవాహినియుండి వీర మోహినిస్సై
సీతామహాదేవి మహోద్యానంబున నేకవస్త్ర పరిధానయగుచు గాజుమె
ట్టుంగు చందంబున నడుచుచు విభ్రమాయత్త చిత్తంబు హత్తుకొని మి
న్నుపైవ్రాలిన చందంబున నేడ్చుచుం దన్నుఁదా దూషించుకొనుచు వా
ల్మీకి జాంబవదాంజనేయ కుశలవమహాముని గణసమేతంబుగా రణరంగం
బు బ్రవేశించి మారుత నమీరనందనులను జాంబవంతుడును జడియు
న్న గజరథతురగ కళేబరంబులు గనుచు మృతినొందినవారి నామాన్వయ
పరాక్రమంబులు వినిపింప నతి త్వరితంబున హంసవిధంబుగా వచ్చి శతయో
జనోన్నత విశాలరణాంగణమందు గనకరత్నప్రభావిరాజిత దివ్యరథంబునం
దు వికచనేత్రుండగుచు మూర్ఛిల్లియున్న జీవితేశ్వరుఁ జేరఁజని భయభ
క్తిం బ్రణమిల్లి రథంబుపై కెక్కి నంత గుశలవకుమారులు కొంతదూరంబు
న జనుదెంచి నవసహాయ రక్షకు లయియున్న సీతామహాదేవి యఖిలలోక
నాయకుండగు శ్రీరాము శిరంబునూరువులపై నిడుకొని భయకంపితాం
గియై యిట్లనియె॥          శ్రీరాముఁగాంచి సీత విలపించుట

సీ॥ హా నాథ హారామ, హాయచ్యుతానాతో బలుకాడవేలనా భా
వమెల్ల । దెలిసినవాడవై దీనదయాకర పరులబుద్ధులువింట మంచిదానె।
మానంబు నన్నవమానంబుచేసి గతిపివె కాకయొక్కఁడనునైన। నీవుచ
ల్లగనున్న నేనెంత యిడుముల బడినైననుమది భయము లేదు। నన్నుగ
నుఁగొనకున్నావు నళిననేత్ర॥ సత్యవర్ధనుఁడని మెచ్చి జనకవిభుఁడు। అగ్ని
సాక్షిగనీకు నర్పణముచేసె। నిన్నమఱచితివా నేటికివకులేశ॥ఉ॥ భా
నుకులుండవయ్యు నరపాలురకెల్లరను భూషణంబవై। దీనులకల్పవృక్షమ
యి ధీరపరాక్రమ వర్ధనీయుడై। మానితతేజుఁడై సతిని బర్వతకంటక వృ
క్షభీషమా। కానలద్రోచినావు జనకాత్మజ చిత్తము నీవెఱుంగవే ॥సీ॥
పాణిపద్మముఁజూచి పల్కవేయొకసారి నిర్జరాధిప మహానిగమవేద్య। కరు
ణవహిల్లగా గన్నులఁజూడవే ఖరదూషణాది రాక్షసవినాశ। కుసుమగం
ధంబులు కొప్పులోముడువవే జలధిగర్వ గ్రహచాపహస్త। గంభీరమమర
గాఁగౌఁగిట జేర్పవే కపిరాజసంహార కాండనిపుణ। నన్ను బరిపాలనము సే
యు నళిననేత్ర। పంతములు నేల నామీఁద బరమపురుష। తప్పులెల్లక్ష
మింపుమీ దానవారి। సంతతము ప్రేమయుంచు ప్రశాంతమూర్తి ॥గీ॥

చిత్రకూటాద్రిపై దొల్లి చేరియుండి । కద్రిబోవంగ గాకము నిలిచి పైట
దొలగ ఫలమని యప్పుడు దోచి పొడువ । శరము సంధించు నాదయ
మఱచినావొ ॥ఉ॥ అత్తలు నిల్వమన్న వెడియందు గృపారస వృత్తిని డ
నే । నత్తరి నిల్వకే వెడల యచ్చటి వన్నెలపైడిజింకపై । జిత్తమునొం
దగా దెలిసి చివ్వున జాపము చేతబట్టునా । చిత్తము గేలనాకయని చేరగ
నీవు ధరాధినాయకా ॥చ॥ ఫలములు లక్ష్మణుండుకొని వచ్చియుఁ నిచ్చినవన
న్న బేరుతో । బిలిచియిదెంతమంచిదని ప్రీతివహిల్లగ జప్పరించవే । యలికు
లవేణి వాదువని యాడిరిసుద్దులు యిప్పుడాసవే । జలరుహవంశ పావనవిశా
లసరోరుహపత్రలోచనా ॥చ॥ అనివిలపించుచున్న యెడ సబ్ధులుఘూర్ణిలదే
వబృందము । ఘనమగుభీతులంగలగ గ్రుక్కఁజుక్కలు రాలభూమిపై జప
ములుతల్లడిల్లరవిచంద్రులుమార్గమదప్పసిద్ధలుఁ । మనులసుఖంబులన్
మెలగభూమిమహాధ్వనితోవడంకగాన్ ॥గీ॥ సమయమును జూచివాల్మీకిచేర

వాల్మీకి రామచంద్రాదుల బ్రికికించుట.

వచ్చి । పల్లవాధరి చింతింపవలదుసకల । జనములకుజూపు నీమదిసత్యమె
ల్ల । బ్రికుకనేరుతు రందఱుబఁకజాక్షి ॥చ॥ అనిపలుకంగ మింటనుమహో
త్సవయంబని దేవసంఘముల్లనుగొన యక్షకింపురుష కాంతలు నృత్యము
సల్ప సోనగా । జెనగొని పుష్పముల్గురియ భేరులుమ్రోయ బధువర్గ
ము । ల్వినుతులు సేయుచుండగను వేగమెజానకిలేచి ధీరయై ॥ఉ॥ స్వామికి
మ్రొక్కి దేవతల సన్నుతిచేసి కిరీటమిప్పుడే । నేమముగా గరంబులనునిల్పిమ
హాపతిభక్తి కగ్గ్రశ్రీరాముడె దైవమంచు దగనాత్మవలంచినదాననై । నీ
భూమిసిదూలినట్టి నృపపుంగవు లందఱు లేతురింతటన్ ॥క॥ అనిచెప్పిదివ్యమ
ణిమయ । కనకకిరీటంబుదెచ్చి కాకుత్స్థునికిన్ । ఘనమమర శిరముజేర్చిన । గ
నులప్పుడు విప్పిలేచి కలవరమమరన్ ॥ఉ॥ హేజలజాక్షి హేరమణిహేజన
కాత్మజ రాజహంస । నీతేజము చూడగంటినని తెల్పుచు నుండగ ధైర్యశీ
లురా । రాజులతోడనాప్లవగ రాజులురాక్షసరాజ వర్యులున్ । మోజు
చెలంగలేచిరి సమూహముతో దిశలెల్లనిండగాన్ ॥గీ॥ భరతలక్ష్మణ శత్రు
ఘ్నవసులుదంతి । రథసమూహంబుతోలేచి రామరామ । జానకీప్రాణ
నాయక సత్యశీల । యనుచు శుభవృత్తి బొందిరియనుజులెల్ల ॥గీ॥ జానకీ
రాములకు మ్రొక్కి సకలసైన్య । రథగజాశ్వ సమేతులై రమ్యముగను ।
భరతలక్ష్మణు లనుజులువచ్చినిలువ । బ్రేమచెన్నొంద సీతతో రాముడను
యె ॥సీ॥ పల్లవాధరి [illegible]బాసితినని మది కోపంబుసేయకే కోమలాంగి ।
నాజీవితేశ్వరినన్ను గటాక్షించి చూడవే మునుపటిచూపులింక । మఱువనే
జనకభూవర పుత్రియుత్తమ సాధ్వియుంచును నిజస్వాంతమందు । దోచి

యుండియులేని మోచనరేసును ఖ్యాతిలోకములందు గలుగుకొనెను ।
విపినదేశంబులో కలవిడుచుటొకటి। గానినీమీద జలములెక్కడను గలదె।
తత్తరంబదేటికిత్త ముహాత్తుకొనగ। మత్తగజయాన రోషముమానుమింక॥
అనిన ।చ॥ పలుకులు నేల రాజనరపాలక నీచులమాటనిక్కమై । పౌ

సీతాదేవి రాముని పూర్వకార్యంబు లుగ్గడించుట.

లుపమరంగ గర్భమును బొందెను వేళలయందు గాంలో । కలవిడనాజ
రమ్మనుచు బంపినధైర్యముచాలదక్కటా । చలమిక వేతెకావలెనె చంపుట
దోసియుట రెడునొక్కటో ॥చ॥ జనకుడు కోరియిచ్చె జలజాప్తకులాశము
వాడు సద్గుణంబులు గలవాడు సంతతవిభూషిత సత్యవచోచువాడుభూ।
జనవినుతుండు భూరితరశౌర్యము గల్గినవాడవంచునే । మనకనిసాగదింక
నభిమాన మనూనము నెన్న నేటికిన్ ॥చ॥ అడవికి నంపగానపుడె యొంగ
మునందలి యాశమానిమీ । వడువున బుచ్చుదామనగ గ్రక్కున నీముని
పుంగవుండు వెం । బడిజనుదెంచి పుత్రివని చాలఁ బ్రియంబులనాడి వేడ్కన।
ప్పుడుతనయాశ్రమంబునను బోషణచేసె ననేకరీతులన్ ॥సీ॥ తలిదండ్రినా
పాలిదైవమై వాల్మీకిపాలించె జనకభూపాలుమాడ్కి । బొందుగానావేళ
బుత్రద్వయముగల్గ సంతోషచిత్తుడై జాతకర్మ । ములుదీర్చి దిన దినములు
వృద్ధిబొందగా సకలవేదంబులు శాస్త్రములును । జదివించి కోదండసాధ
కంబులు దెల్పి కవచంబులిచ్చి సంతిరపహించి। వర్ణితంబైన చారురామా
యణంబు । నేర్పుగలుగంగ జేసెను నిఖిలమందు । మానియనుమతి నిన్నా
త్మమేనిమీద । నాశయుంచితినికజాలు నవనినాథ ॥ఉ॥ రాముని దేవినై
సకలరాజులు నిర్జరులెల్ల మెచ్చగా । భూమికిబుత్రినై జనకభూపతియింట
ను వృద్ధినొంది । శ్రీనామముగల్గుదాననయి నన్నును బాయకవేగ కర్మ
మున్ । భీమముగల్గు కానలకు వెంబడిద్రోచెను నెంచ నేటికిన్॥చ॥ నిను
నెటునమ్మవచ్చు మఱినీచుడు చెప్పిన మాటనిక్కమై । మానసునజేర్చి యిం
తయభిమానము నెంచక మోసగించి పొమ్మనిన మహానుభావుడవు మంచిది
గాదని సంగరంబులో । దనుజులువైచి నారదగద్గదజేతి భీతినొందుచున్॥
క॥ బ్రతికితిరిదేవయత్నము । మతికినిసంతోషమాయె వర్ణితమమరన్ ।
సుతులవయి నిందదొలగెను । క్షితికయిక దనువుడాగ జేతుమహాత్మా॥

శ్రీరామచంద్రుండు సీత నూరార్చుట.

చ॥ నళినదళాక్షితోడ రఘునాథుడువల్కెను జింతలేలలో । పలనిక బా
యలేను వలపతమునీపయిలేదు జానకీ । కలవరమంద నేల బిగకౌగిట జే
ర్చి వినోదమందగా। బలుకవెతేనెలొల్కనెడ భావము లెందుకు భూతనూ
భవా॥చ॥ జనకుని యింటిలో మెలగి సతంగుణంబులు గల్గియుండు నీ ।

మనసు నెఱుంగు వాడ నభిమానముగాదిది నిందగల్గునా। పనినడిపించి లోకు
లకు బాపుదు సంశయ మెల్ల నంచు నీ। వనములనుండ బంచితిని బ్రాణము బా
యగనేల కోమలీ ॥చ॥ ఘనముగ నీనిమిత్తమయి గ్రక్కున భూత హితే
శు చాపము। దునిమితి జిత్రకూటమున మున్మద చిత్తుని గాకరాక్షసుం।
జనితమదంబణంచితిని శౌర్యముతో దశకంఠు బట్టి యా। దినమున సంహ
రించితిని దేవి యిన్ని యు నంచ నైతివా ॥ఉ॥ కాననసీమలందు దివుగాడు
చుం బంచవటీతలంబునన్। మానిత పొంపుగా, విపుల మాయలు గైకొని
హేమవర్ణమౌ। మేను చెలంగు జింక వలె వేషము వేసిన దైత్యు వెంటనే। పూ
నివధించి వైచితిని భూమిజ చేటికి నిగ్రహింపగన్ ॥క॥ ఖరదూషణాదిరా
త్రిచర। వరులం బదునాల్గువేల వరశౌర్యముతో। ధర మీదం గూల్చి వైచి
తి। గరుణ యొకింతయును నీకు గలదే తన్వీ ॥క॥ బాలామణి నీ కొఱకై। యా
లోచన జేసి వేగ ఋక్షజు మైత్రిం। బాలించి వాలి డచితి। గోలా నామీద
నల్ల గూడ నె చెపుమా ॥ చ ॥ కపులను గూర్చి వె బడిగం గట్టితి సేతువు
లంకదాక। నాచపలుని రావణాసురుని జంపితి బంధు సుతాప్తకోటితో।
సఫలత నొందగాను బహుసాహసవృత్తి భరించినానుగా। కపటము లెంచ
గాందగను కల్పిత చాపసమానభ్రూలతా ॥సీ॥ రా వెన్నెలకు పూవేణి రా
కేందునిభయాన రా వెన్ను కోరాక్షి రాజహంస। నా తప్పులెంచకే నన్ను
మన్నింపవే బ్రతికిరి సకలభూపతులు గపులు। తమ్ములు నీమహాత్మ్యం
బుచే నరసీరసీరుహాక్షి కనీచిత్తమందు। శోభితంబుగ నీవు చొచ్చినయిం
టికి బుట్టినయింటికి బొందెగీర్తి। నందనుల బిల్వబంపుము సుందరదవ। పట్ట
ణంబున కేగి సంభ్రమముల నొదవ। నశ్వమేధఫలంబు నన్నను సరించు। విధ
ము చింతింపు మిక లేని భేదమేల ॥క॥ సతియర్ధశరీరిణి యరా। సతి చే ధర్మార్థ
కామసద్గతులకు సం। గతి గాదె పుణ్యగతి మతి। క్రతువులు సతిలేక సాగంగల్గదు
గనుకన్ ॥క॥ కరుణను నా హయమేధము। పరిపాలన చేయవలయుం బద్మాక్షీ
సతీ। పురుషానుమతి వసించుట। మతిపుణ్యంబౌడుగల దె మగువల కెల్లన్॥
క॥ మతియందు నపుడు సీతా సతి రోషావేశమెల్లం జాలించి ధరా। పతి
యాజ్ఞ గడువరాదని। యతిశయభయభక్తిగ గంగ నంజలి సేయన్ ॥క॥ సీ
తారాము లభినవ। ప్రీతి వహిల్లంగ రథము మీద వసింపన్। ఖ్యాతల
మునం దుదివిజులు। ఖ్యాతిగ బువ్వములు గురియంగా సుఖవృత్తిన్ ॥క॥ ప
రమేష్టి యాదిగాగల। సురసంఘము వచ్చి కోటిసూర్యాన్వితుడా। ధరణీ
శు గాంచి దముదిం। బరమానందంబు బొంది పల్కిరి హితులై ॥సీ॥ సక
లాత్ముడవు సర్వసాక్షివై యుందువు నిర్మలుండవు నీవు నిగమవేద్య। యా
ధారములకెల్ల నాదివై యుందువు సతు చిత్ప్రాత్మక సర్వశీల। మూలంబు

ననాది మూలమైయుండువు పరమాత్ముడవు వరబ్రహ్మమూర్తి। వర్వేశు డౌదువు సర్వంబునీయందు జారుకరంబుగా సంభవించు। బరమపావన నీ మహామహిమ యెటుల। తెలియఁగావచ్చు నిర్జరులీనవృత్తిఁ। బొందిప్రార్థింపగా నిలబుట్టినావు। ఆదివిష్ణువునెన్నఁగ నౌనెమాకు॥ చ॥ నినుమతింపంగాదరమె నీవుచరాచర భూతకోటికిన్। ఘనవమరంగ దేవుడవు గర్భము లోపలనుండు లోకముల్। వనజదళాక్షు సీతను రమాసతిగాఁగ దలంచి చూడు। భూంజ ములవృత్తిగాను జలజాక్షి మహాత్మ్యము నెంచ నేటికిన్॥ క॥ ఆనాదుల కలోకుల ఁ మానినియిందాదిసురులు వర్ణనసేయన్। మానిసిమరగ వహ్నిని। మీదిన్ సమకూర్చునట్టి విధములెఱుఁగరో॥ గీ॥ రణములోపలదెగిపడ్డ రాజులెల్ల। బ్రతికిరిప్పుడు నెవ్వరి మహిమచేతఁ। బుత్రులను బిల్వరంపించు పూర్ణముగను। నశ్వమేధంబునొనరింపు మవనినాథ॥ వ॥ అనినభక్తవత్సలుండగు శ్రీరామచంద్రుడు బ్రహ్మాదిసురానుమతుం

శ్రీరామచంద్రుండు కుశలవులం బిలిపించుట

డై సుగ్రీవవిభీషణ ప్రముఖులంజూచి సవనహయంబుం బంధించియున్నపుత్రులంబ్రియంబున బిలుచుకొని రమ్మని పంచిన వారలుపోయి యతుల విపుల పరాక్రమవర్ధనీయులు గుశలవులం గనుంగొని యిట్లనిరి॥ శా॥ బాలకుమారులార నరపాలకులోద్భవులార నిర్జరుల్। చాలఁగ నెంచలేరు బలశౌర్యములట్టిది యింకబ్రీతితోఁ। బాలనసేయగావలయు బంధుసుతాప్తులతోడ రామభూ। పాలుఁడు మ్ముఁవాఁడు మముబంపెను రోషము మానిరావలెన్॥ మ॥ పతిహారుమంబుతోడ నభిమానము నెంచి లతాంగి సీత భూపతులు నుతింపఁగావిభుని మారుకొనంగన లేక చేరె। బూరతిశయవృత్తినొంది యికనాత్మను యోచనలన్ని మాని భూ। సుతతలిదండ్రిమాడ జలజాప్తకులేశుడు మీకుఁజక్కఁగాన్॥ చ॥ జనకునిమీదరోషములు సేయగగూడదు సత్కులంబునన్। జననముఁబొందినారు ఘనశాస్త్రము లెల్లయెఱింగినారు భూ। జనుఁగనై శౌర్యము విశారదరీతి జెలంగినారు మీ। మనసున రామచంద్రుడొక మానవుడంచు దలంపనీతియే॥ సీ॥ తల్లిసీతాదేవితండ్రిశ్రీరాముడు మాకుమీకును మహామహులకెల్ల। బ్రతికిజను లవ్వరివలనబ్రహ్మాండంబు పుట్టియడంతులు భూరివృత్తి। లోకంబులాతని లోపలవిలసిల్లుశత్రుమిత్రులు లేరు సత్యముగను। నఖిలాండనాయకుండైన తేజమునొందు ఘనతపవాసమూ కారణంబు। చేత జెన్నొందియుండు ప్రశాంతమూర్తి। గనుకమీరింకలోపలి కపటముడిగి సవనహయమునుగొనివచ్చి సముఖమునకు। గ్రతువుసాగింపవలయు లోకంబుమెచ్చ॥ మ॥ అనివినిపింపగా గుశుడునాత్మను కోపము హెచ్చుధీరుడై

వనచరనాథమీరిపుడు పల్కినమాటలు సంభ్రమూరఁగ। భూజనపతిగాని నిర్జరులసాఁకిడి వేలుపుగాని యశ్వముం। గొనిదనుసేయుమంచు ననుగన్యముగాగను నెంతదెల్పినన్॥ ఉ॥ తురగముబట్టినాము నిజపౌర్యబలశక్తి చెలంగనాజిలో। బిరుగులు వెట్టిపోగ రణాలుఁడు మమ్మెదిరించి గెల్చిసం। గరమున నశ్వముం గొనగవచ్చునకెక్కుదిగంతరాళముల్। శరణనరాము భూరితరచాపశరంబులు మాకు జాడదే॥ ఉ॥ పెక్కులుబాధలేను మది బ్రీతియొకింతయు లేదు భూమిపై। నక్కఱలేదు భోగములయందున నింపుగనిచ్చలేను। మాదిక్కుకు మీరరావఁదు దేహముమీదను నాశలేదు మా। చక్కనచాలుమాకు శరణ్యముగల్గనె యెంత చెప్పినన్॥ వ॥ అనిన మహాభయాకులిత చిత్తులై సుగ్రీవుండును దనుజాధిపతియగు విభీషణుండును సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేతుండగు నిఖిలముని గణబృందారక బృందకీర్తనీయుండును దారకబ్రహ్మమయుండును నగు శ్రీరాము సన్నిధానంబునకరిగి తాము పోయివచ్చిన వర్తమానంబులు విశదపడంజేసిన విని యూరకుండె సకల లోకనాయకుండగు శ్రీరామచంద్రుచిత్తంబెఱింగి బ్రహ్మములిట్లనిరి. సీ॥ అఖిలాత్మపురుష నీయందున్న తేజంబు మగువగర్భంబులోపలవహించి। తామియైత్తోచును తమమహాతేజంబు వలనబుట్టిరియెల్ల బలములడప। దీరదెమీకును దీపితహయమేధ సవనంబువిఘ్నము సలుపదగదు। తురగంబులేకను దోచదుయజ్ఞంబు కొడుకులురాకనే ఘోటకంబు। తేగగూడను యెవ్వరుచెల్పితేని। విసరుసీతామహాదేవి విభవమమర। బోయితోడ్కొనిరావలెభూరిదయను। ననుచు బింద్రాదులెల్లను నభినుతింప॥

## సీతాదేవి పుత్రుల రోషం బుడగించుట.

క॥ పతిచిత్తమెఱిగి ధాత్రీ। సుతపుత్రులవాఁ ఛతగిలి చూచెడనంచున్। అతిశయముజెంది నడువగ। బతియనుమతి గనకరథము పైబిలసిల్లన్॥ సీ॥ హనుమదంగద సుషేణార్కజాదులు కపివరులెల్ల నిరుగడ బలసికొల్వ। భరతలక్ష్మణమహీపతులు సంధిదలాచి కమనీయ భక్తితోగదిసిరాగ। బ్రహ్మాదిసురలెల్ల బ్రస్తుతించుచు మహా విభవంబురంజిల్ల వెంబడింప। వాల్మీకి మొదలైన వరతపోధనులెల్ల మదముచెన్నొందగా ముందునిలువ। నాతపత్త్రంబులు నమూలమైన। చామరంబులు పైవగాజారునినద। కలితభేరీరవంబులు గడలుకొనగ। జానకీదేవి చనుదెంచె జనులుపొగడ॥ గీ॥ వచ్చుచుండెడి తమతల్లివైభవంబు। చూచిసంతోషమమరగా సుతులునెదురు। వచ్చిభయభక్తితోడను వందనములు। సలిపినిలుచున్న భూజాత సంభ్రమముగ॥ చ॥ కరములబట్టిచేర్చిముది గారవమొప్పగ గౌగలిం

చిరో। నరసురవంద్యులార జననాథతనూభవులార తండ్రిపై। విరసము
సేయఁగాదగునె భేదములేటికి నింక మీరు దసం। గరములు సేయ శత్రువులు
గారు వివేకముతోఁ దలంచినన్॥ ఉ॥ జనకునియాజ్ఞకై ముదుపు చంపఁడె
తల్లిని భార్గవుండు మే। దినిరఘువంశవల్లభుఁడు ధీరతవృత్తిభరించి
పట్టముం। గొనక యనేకఘోరమృగకోటివసించెడి కాననంబులో।
ననుగమనంబు సేయుటలు వన్నియు దండ్రినిమిత్తమే కదా॥ క॥ పతి
యాజ్ఞదలచి బ్రతుకుట। సతులకుధర్మంబు గనుక శైలంబులలో। బ్రతి
కితిమి యిఁకరోషము। మతియందున నిల్పుమ ను మంచిదియగునే॥ సీ॥
మీతాత దశరథ మేదినీధవుఁడయ్యె దండ్రి శ్రీరాఘవ ధరణిధవుఁడు। భరత
లక్ష్మణ ధరాపతులు పిన్నయ్యలు కౌసల్యమొదలుగా గలుగు సతులు।
అవ్వలై యుందురు యమలమౌ భాస్కరవంశంబు సాకేతపట్టణంబు। సిరి
యంబులీ మహా కులసంభవులు తొల్లిపురుకుత్స నగరులు పుణ్యయశులు।
సత్యసంపన్న శీలురు సకలరాజ్య। భారకర్తృత్వములు గలవారు ప్రబల
శౌర్య సాహసవీరులు సత్కులంబు। నందుజన్మించి తండ్రిపై యలుగనగునె।
అని॥ చ॥ జననికి మ్రొక్కి యిట్లనిరి సత్యము తండ్రియతండు మాకు నా।
ఘనములెఱింగియుండి తగుగర్భము పొందెడివేళ యొంటిగా। వనములు పట్టి
పొమ్మనుచు బంపినయాతని మైత్రి చాలదే। మునులముఖీలున్నాసగుభోగము
కావలె నంచు నెంతుమే॥ క॥ లవ నలకు బతులయనుమతి। దలపోయ
గవలయు గనుక ధర్మము కొలదిం। దెలియువలె మాకు నెవ్వరి। బలములు
పనియేమి పురము పనమైయుండున్॥ గీ॥ హితవులేనితండ్రి మతిదలపో
యనా। బ్రతుకుకన్న శైల వనములందు। నాకునలుమదినగ నధిక
ఫలంబులు। మాకునొకరితోడి మైత్రియేల॥ క॥ తురగంబు బట్టివిడుచుట।
మదియాడలుగలవె తల్లి మనవంశములో। నరులెల్లజూచినవ్వరె। పరులను
దోలుదుము నిమిషమాత్రములోనన్॥ ఉ॥ మీపతిమీరునొక్కటయి
మేదినియేలిన మాకుజాలునే। కోపముపుట్టరాదు యికగొండలలో
మునికోటియొప్పుతుం। బాపమువర్ణధర్మములు వర్ణనకెక్కగ జేయుకున్న
మా। పాపుకలంక గాదనెనె ప్రాణములుండినలేక యుండునే॥ క॥
అనునాబాలకుమారులఁ। గనుగొని నాతండ్రిలార కలహమొనర్పం।
బనిగాదు రామచంద్రుఁడు। దినకరవంశజుడు విష్ణుదేవుడుగనుకన్॥ గీ॥ అతని
తేజంబు నను మీర నవతరించి। నారుమీరలు బంధువర్గంబుమీఁద। శాత్రవు
లటంచుఁబోరిన సకలమైన। బుధులు మెచ్చరు తగదిదిభూమియందు॥ గీ॥
అధిపుడొనరించు యాగసంరక్షణంబు। చేసినను బుణ్యయశములు
చేయకున్న। మహిని మూర్ఖత్వమని తోచ బనునుగాన। భూయము

గొనివచ్చి మొక్కిన నధికఫలము॥ క॥ ఇలఁదండ్రికన్న దైవము । గలు
గదు లోకంబులందుఁ గరుణాన్వితులై । పలుకులకు మారు పల్కక । విలసి
ల్లిన మాకు మది బ్రీతివహిల్లున్॥ గీ॥ అన్న నాయన్నలార యింకెన్ని గాని।
చిత్తమందున దలవక చేరవచ్చి । జనకునకు మ్రొక్కినప్పుడే సకలభోగ ।
భాగ్యములు పొందు మీకనుమానమేల॥ క॥ కొట్టితిరి సమరవీరుల। బట్టితిరి
హయంబు శౌర్య పరిపాలకులై । కట్టితిరి సత్యవర్తన। పుట్టితిరినవంశమందు
భూజనసుతులై॥ చ॥ అని వినిపించు తల్లికి నంజలిచేసి నుతించి తల్లిమా ।
మానసన రోషముల్విడువు మాకును దిక్కు నీవెగాక మా । జనకుని తల్లికిన్న
ధికశౌర్య మవశ్యము సంభవించెమా । కనుఁదియేలరాదోయని కుంభినిపై
సమరంబుచేసితిన్॥ క॥ తమవాక్యము జవదాటక। రమణీయంబౌనె యెల్ల
రాజులు మెచ్చన్। దమవెంటవచ్చి నిలుతుము। తమయనుమతికన్న నొండు
ధర్మముగలదే॥ క॥ కట్టిన సవనహయంబును । ముట్టడి విడిపించి త్రిజగ

సీత పుత్రులం దోడ్కొని శ్రీరామచంద్రుకడకువచ్చుట.

ములు నుతియింపం । బుట్టి లోపములన్నియు। మట్టునహరియించి తల్లి
మరువున నిలువన్॥ సీ॥ దేవదుందుభిధ్వను లద్దిశలందుఘూర్ణిల్లె సుమములు
రాల్చిరి యమరవరులు । నడచిరి సుగ్రీవ నగచరముఖ్యులు వినతులైవచ్చె
విభీషణుండు । భరతలక్ష్మణరాజ వరులు నేతెంచిరి ముని సమూహంబులు
ముసరుకొనిరి । బ్రహ్మాదిసురలెల్ల వర్ణింపసాగిరి భల్లూకనాథుఁడు భక్తి
గొలిచి । వచ్చుచుండంగ వీక్షించి వైభవమున । రామచంద్రుఁడు నెదు
రుగా రథము నడప । భూతనూజయు కొడుకుల బుజ్జగించి । కొనుచు బ్రమొ
క్కెఁ బ రాముఁడు కోర్కెలెప్ప॥ చ॥ కరమును చాచియెత్తి మదిగారవ
మొప్పగ బుజ్జగించి యో । పరమపవిత్రులార యినవంశవిభాసిత జన్మ
లారసం । గరజయశీలులార మది కాంచలు నేటికిఁదీరె మీపయిన్ । విర
సము చేసినానచు । వేదనలొందుట మీకుఁ బాడియే॥ చ॥ తనయులమీద
దండ్రికినిదక్కెను లోకములందు గోపమున్ । జనములకెల్ల మీయధిక
శౌర్యము జూపదలంచి కాననం । బునవిడవాడ బుచ్చి మఱిపూనితినే
హయమేధయాగమున్ । ఘనముగ మీపరాక్రమము గన్గొని మోదము
లాయె నిప్పుడే॥ చ॥ అనికొనియాడు తండ్రికిని నంజలిసేసి శతాపరాధము ।
ల్మానయగ జేసినాము తగబుద్ధిని యోచనలేక యిన్నియున్ । ఘనముగ
ద్రోచిపుచ్చుసనకాదులు మిమ్ము నుతింపఁజేరుమే। మునుగొనియాడ గాదరము
పూజితభక్తయఖండవైభవా॥ వ॥ అని నుతించిన యనంతరంబ॥ సీ॥ సలలి

అయోధ్యాపురప్రదేశము.

తంబుగ భరత లక్ష్మణ శత్రుఘ్న వరులకు భయభక్తి వందన

ములు । చేసి బ్రిహ్మాదులసేవించి దైత్యాధిపతినిదరికిన మహాప్లవగ విభుల । మిత్రితలనుబొంది మేలైనమణిమయ కనకకిరీటము ల్కాంకణ ములు । రంజితంబొనరించి రథములపయినెక్క పుత్రులుచనుదేర భూత నూజ । తోడశ్రీరాముడపుడు సంతోషమునను । గోత్రసూర్యప్రికాశుడై సాటిలేని । యమరవర్ణితమైయొప్పు రథమందు। మోదమిగురొత్తవెంచేసె బురమునకును॥ చ॥ అనుజులు బంధువుల్సచివులాప్తులు దైత్యనృపాలశే ఖరుల్ । వనచరనాయకుల్గొలువ వందిజనంబులు సన్నుతింపమే। దినినవ పుష్పవర్షములు దేవతలుం గురిపింపదుందుభి । స్వనముచెలంగ రాముడు ముదంబునజేరెను యజ్ఞవాటికిన్॥ సీ॥ అత్రిభరద్వాజులాంగీరసవసిష్ఠ జమ దగ్నిసంయమిశ్వరులు సభిక । యానందులై శ్రౌతమనుసరించుచు జతు ర్వేదపారీణులై విహితమార్గ। సరణిగా జనకజసహితుడై శ్రీరామచంద్రుండు హయమేధ సవనమంత । సంపూర్ణమొనరించి స్వర్ణకోటులుబుధ వరులకు వేశ్వరవలసినంత । యిచ్చిసీతాసమేతుడై యింద్రవిభవ । మలర సాకేత పట్టణమందుజేర । నచటిపురకాంతలెల్లను నమలరత్న । సేసలొసగంగ

పట్టాభిషేక మహోత్సవ వర్ణనము.

జనములు చెలంగుచుండ॥ సీ॥ భూసురాశీర్వాద ములుకవిగాయక వంది మాగధులు కైవారమొసగ । కుంభజముఖముని కోట్లుసందర్శింప సామం తులావేళ నందడింప । వంగాంగమత్స్యకళింగదేశాధీశ వరులెల్ల నెడనెడ వచ్చినిలువ । బుణ్యాంగనామణు లొప్పసగనారతులీయ బంధువర్గంబులు బలసికొలువ । రత్ననిర్మితకనకవిరాజితంబు । మహిమమెన్నొందు నాస్థాన మంటపంబు । నతులవిభవంబు హేమసింహాసనంబు । మీదగూర్చుండె సీతాసమేతుడగుచు॥ చ॥ మునులు మహాత్ములెల్ల గడుమోదమునొంద విభీషణాదులున్ । మనసున దేజమొంద బుధవర్యులు సన్నుతిజేయభానునం। దనహనుమత్సుషేణ వినతాంగదవానరు లుత్సహింపబూ । జనములు బంధులుంగొలువ సంతతరాజ్యవిలాసమొప్పగా॥ సీ॥ శ్వేతాతపత్రంబు జేబట్టిభరతుండు భయభక్తిసేవింప పాదుకములు । మారుతాత్మజుడును బట్టరాతసవీర వరులుచామరములు వైవగాను । జలజాప్తపుత్రుడు మత్సేవ మందియంజలి బద్ధుడైముందుగా వచ్చినిలువ । భీమదైతేయ విభీషణ సామంత వరులునుమంత్రాదివరులుగొలువ । గపులునటవిటగాయక గణ ముచేర । వదనములయందు మురిపముగునదురుకొనగ । వారకాంతలు మంగళవాద్యభేద । నినదములుసేయ దిక్కులునిండజనులు॥ గీ॥ కశ్యపాత్రి భరద్వాజకణ్వచ్యవన । వామదేవవసిష్ఠులు వార్ధితోయ । హేమకుంభాభి షేక సంహితవిశిష్ట । మంత్రములుచెప్ప నిర్జర వరులువొగడ॥ ఉ॥ తల్లులు

బాంధవుల్మున్నతులు దగ్గరహాటకరత్నపీఠమం । దల్లము మోదమందుచును
నుండగ నీలసరోజమాలికా । ఫుల్లసమానవేణులు సముచ్ఛ్రితితో జనుదేర
నూత్నహా । పల్లవపాణివైభవ విభాసితవీవన లిచ్చుచుండగాన్॥ ఉ॥
పట్టముగట్టిరా సకలపావనమూర్తికి నెల్లలోకముల్ । పొట్టనుకల్గు దేవునకు
భూరి కృపారస శాంతమూర్తికిం జట్టిన సత్యశీలునకు బావవిభేదికి
దైత్యనాథులం । గొట్టినదేవదేవరఘుగోత్ర శ్రీవిక్రమపత్రిమూర్తికిన్॥
క॥ సీతారాములకప్పుడు । ప్రీతివహిల్లంగ మునులువిశదంబలరన్। ఖ్యాతిగ
గట్టిరిపట్టము । భూతాధిపబ్రహ్మదేవ ముఖ్యులుపొగడన్॥ వ॥ ఇవ్విధం
బున సకలక్షోణిపరిపాలకత్వం బంగీకరించి పెక్కుదినంబులు మిత్రకళత్ర
సోదరాప్తసహితుండై శ్రీరామచంద్రుండు సర్వసద్గుణశీలుండై మాయా
సమన్విత లీలామానుషవిగ్రహ విలాసతారక బ్రహ్మనామాన్విత తేజో
విరాజితుండై శతాశ్వమేధ వాజపేయాగ్నిష్టోమ సవనంబులు గావించుచు
నిత్యతృప్తుండై హ్రస్వదీర్ఘ స్వేత రక్తనీలపీత వికారవిషయాతీత నిర్గుణ
పరిపూర్ణుండై ప్రకాశించుచు ప్రజలంగాపాడుచు బరిశాంతవర్ధనీయుండై
సాకేతపట్టణాధీశ్వరత్వంబున భక్తజనవరదుండగుచు శుభంబుననుండెనంత॥
గీ॥ మొదలతుదలయందు గదియుట పట్టాభి । షేకకథలునతివిశేషవృత్తి ।
జెప్పంబడియెగాన శ్రీరామపట్టాభి । రామయనెడునంత్ర నామమయ్యె॥
గీ॥ ఈమహాకావ్యమతిభక్తి నెవ్వడేని । వినునతండునిహంబున విపుల
సౌఖ్య । ములువడసి నిత్యవైభవములనొసంగు । శాశ్వతబ్రహ్మలోక
వాసంబుబడయు॥ సీ॥ ఇదిత్రిలోకస్తవ్య మిదిబుధశ్రావ్య మిదిదివ్యమిది
భవ్య మిదియనర్ఘ్య । మఖిలామరవినోద మాదికావ్యము ద్విజు డుచ్చ
రింపంగ వాగ్విదుడనానుత్కృష్టియుండపఠింప సర్వాసహాభర్త । యగువై
శ్యుడు పఠింప నమితపుణ్య । లలితసౌరభ శూద్రకులజుండు పఠియింప
వ శంబులోవన్నివాసిగాంచు। నఖిలనిగమముల్ పఠియింపనగుఫలంబు। నఖిల
సవనంబులొనరింప నగుఫలబు। నఖిలదానంబులొనరింప నగుఫలంబు ।
లొదవునీకథ నొక్కింత చదివినంత। క॥ ఎందాకచెలగువేదము । లెందా
కను దిగ్గజంబులుందు రిందుడుభానుం । డెందాక జలధులుండునొ। యందాకం
బొసగునిమ్మహాకావ్యమిలన్ మ। ధరణీకన్యాకకుంకుమాంకితసదానానందయో
గీశ సుంద్రరహాసాననపద్మనేత్ర జనకకర్మాధర్మసాక్షీస్వరూప పరమానాయక
మోక్షదాయక హరీ పాపౌఘవిధ్వంస భూ । వరవంశోత్తమ నిత్య
మంగళకరా వైదేహిచిత్తేశ్వరా॥ ఉ॥ పావననామపల్లవ నిభాంఘ్రిసమా
న్విత రామభూవరా । దేవసురేంద్రపోషణమదేభసురక్షణ వేదవేద్య నం।

భావితకీర్తివర్ణిత విభాకరకోటిసమానసుశ్రీ। పావనమానిపోషణవిభూ
షణ రామ నృపాలభూషణా।

మాలిని॥ సరసగుణవిహారా సర్వలోకోపకారా । పరమసుకృత
నామా పద్మనేత్రాభిరామా। నిరతిశయవినోదా నిత్యసంవేద్యబోధా
భరితగుణసముద్రా పాహిమాం రామభద్రా॥

గద్య॥ ఇది శ్రీమద్భ్రమరాంబికా నిజమనోల్లాస కరుణాకటాక్ష
వీక్షణాలంకారసరసరసామృత కవిత్వతత్త్వాతిశయానందభరిత సాంఖ్య
తారకా మనస్క-శ్రీరాజయోగ సామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర గట్టు
వంశపయః పారావారసుధాకర కాశ్యపగోత్ర కాత్యాయనసూత్ర శ్రీ
వేంకటార్యపుత్ర లలితపాండిత్య వేంకటరామకృష్ణ ప్రణీతంబైన శ్రీ
పట్టాభిరామాయణంబను మహాకావ్యంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీ ప ట్టా భి రా మా య ణ ము

సం పూ ర్ణ ము.



మా పుస్తకము—

చేతిపనుల విధానము

అను

# వర్తక రహస్యము

రచన:—ఆర్, బంగారయ్యగారు

సుమారు 200 విధానములు గలవు. వెల 0-12-0



వెలువడినది! త్వరపడుడు!

స్కాందపురాణము నాధారముగా గొని బ్రహ్మశ్రీ అమ్మనబ్రోలు సుబ్బారాయ శర్మగారిచే తాత్పర్యములు వ్రాయబడిన.

# శ్రీ శివగీతలు

అను సకల వేదాంతసారమైనదియు, ముముక్షువులకు ఆనందమునిచ్చు నదియునై అలరారుచున్నది.

250 పుటలు: చక్కని బైండు.

వెల రు|—8—0



పాఠకులకు! పద్యప్రియులకు!!

## స్వర్గభూమి

(7 అం. నాటకము) వెల 1-0-0

వలయువారు:—

చందా నారాయణ శ్రేష్ఠి,
పుస్తకములవ్యాపారము
జనరల్ బజార్ శికింద్రాబాద్.

# గొప్ప రాజకీయ బుర్రకథలు.

1. డాక్టరు పట్టాభి. వెల 0 3-0
2. హైద్రాబాదు ప్రజావిప్లవం ,,
3. రాణీ రజాకార్లు. ,,
4. ఆంధ్రకేసరి ప్రకాశం. ,,
5. కాంగ్రెసు విజయం. ,,
6. గాంధీ నిర్యాణం. ,,
7. జమీన్ రైతు ,,
8. ఆంధ్ర రాష్ట్రం ,,
9. హిందుస్థాన్ స్కౌట్ ,,
10. కొండభోజరాజు ,,
11. ఆజాద్ హింద్ ఫౌజు. ,,
12. సుభాస్ చంద్రబోస్. ,,
13. సర్దార్ పటేల్. ,,
14. జవహర్ లాల్ నెహూర్. ,,
15. కాశిం రజ్వి ,,
16. ఆంధ్రనాయకులజీవితము. ,,
17. కొల్లేటి రైతు ,,
18. బాపూజీ ,,
19. నేతాజీ (జైహింద్) ,,
20. పండిట్ నెహ్రూ ,,
21. రజ్వి రజాకార్లు ,,
22. బాలరాజు ,,
23. రజాకార్ల మరంతములు ,,
24. సంస్థానదుండగాలు ,,

శ్రీబాలా త్రిపురసుందరీ ముద్రాక్షరశాల. జనరల్ బజారు—సికింద్రాబాదు.